శ్రీరస్తు.



శ్రీలీలాశుకయోగీంద్రవిరచితంబగు

# శ్రీకృష్ణకర్ణామృతము.



ఇయ్యది.

వెలగపూడి - వెంగనామాత్యరచితాంధ్ర

పద్యములతోడం జేర్చిటీకాతాత్పర్యసహితంబుగ-

శ్రీమాన్-వై శ్రీనివాసాచార్యగురువర్యశిష్యుండగు-

కార్మంచి- సుబ్బరాయలునాయనిచేం బరిష్కరింపంబడి

—(*)—

అల్లాడి - నారాయణశాస్త్రి

వారిచే.

శ్రీరామానందముద్రాక్షరశాలయందు

ముద్రింపించిప్రకటింపంబడియె.

చెన్నపట్టణం.

1910

# అవతారిక.

ఆంధ్రదేశంబున శ్రీకాకుళంబనుదివ్య దేశంబునందు నివసించ
శైవబ్రాహ్మణకులోద్భవుండైన శ్రీలీలాశుకుండను కవీశ్వరుండా నగ
మున నుండు చింతామణియను దేవదాసియందాసక్తుండై కృత్యా
కృత్యవివేకశూన్యుండై యుండఁగా జూచి యావేశ్యవీరి విద్యా ప్రౌ
మయునాక్పటిమయు నిరర్థకంబయ్యెనని యను తాపంబునొంది సోమ
రియను యోగీంద్రునాశ్రయంబుగలుగునటులఁజేసె - ఇట్లాలీలాశుకు
డు పూర్వజన్మ సంచిత సుకృత పరిపాకంబున నట్టిసదాచార్యానుగ్ర
హంబువడసీ విషయవైరాగ్య భగవద్భక్త్యాదులు గలవాఁడై యాచా
ర్యోపదేశ ప్రకారయోగంబున శ్రీకృష్ణమూర్తిని గనుంగొని బ్ర
నందపరవశుఁడై తానుగనుంగొనిన స్వరూపంబులను స్తోత్ర రూపంబు
గఁ గర్ణామృతంబను నీగ్రంథముగా విరచించి భగవంతునికి సమర్పిం
చెను. పిదప వెలగపూడి- వెంగనామాత్యుండా శ్లోకంబులకు నాంధ్రవృ
త్తాంబులరచించె అట్టి యాగ్రంథము టీకా తాత్పర్యసహితంబుగమున్ను
కొందఱిచే ముద్రితంబయ్యె సకలజన మనోరంజకముగను శుద్ధప్రతిగ
నునుండమింజేసి శ్రీమాన్- వైయాకరణ - శ్రీనివాసాచార్య గురువర్యశి
ష్యుండగు- కాఙ్చి - సుబ్బరాయలునాయనిచేఁ దిరుమలభట్టాచార
వేంకటేశ్వరుల వ్యాఖ్యానాను సారంబుగఁ బరిశోధింపఁబడి ముద్రింప
బడియె.

* * * *

ల్లవ శేఖరేషు. అనుచోట - యత్పాదకల్పతరుపల్లవములు. శేఖరేషు - శిరోభూషణములుగా గలిగినవారలయందు అనియునర్థముగలదు.

శా॥ శ్రీచింతామణియోగిసోమగిరియుక్ శ్రీకృష్ణదేవుండు దా
రాచార్యస్థితిఁ జెందఁదచ్చరణకల్పాంకూరముల్ మౌళిపై । వాఁ
చంగల్గినవారిఁ జూచితనయంతం దానలీలక్ శుభ । శ్రీచాతుర్యముతో
వరించుజయలక్ష్మీకన్య ప్రౌఢాకృతిక్॥ ౧

తాత్పర్యము. కవి- తానారంభించినగ్రంథము నిర్విఘ్నముగా నెఱవేఱుట కొఱకు ఈశ్లోకముచేత మంగళము నాచరించుచున్నాడు. అదియెట్లన్నను- తనకు సద్విషయమందు నుపయోగింపదగినవిద్యను గలుగ జేసిన చింతామణి యను మంత్రమును కేవల విషయప్రవణుఁడగు తన్ను భగద్విషయమందుఁ బ్రవర్తింపజేసిన చింతామణి యను వేశ్యయు భగవత్సాక్షాత్కార సాధనమగు నుపదేశంబు నొసంగి తన కోరికల నన్ని యీడేర్చిన సోమగిరి యను నాచార్యుండును సదాచారానుగ్రహము వడసిన తనయొక్క హృదయంబున వసించి సత్కార్యములఁ బ్రవర్తింపఁజేయుటం బట్టియు దుష్కార్యములని వర్తింపఁజేయుటంబట్టియు బరమగురుఁడై సకలజనులచేత నుపాసింప దగిన బ్రహ్మను వానేయనుటకు నిరూపకంబులైనట్టి జ్ఞానవీర్యవైరాగ్యైశ్వర్య యశశ్శ్రీలను షడ్గుణంబులుం గలిగి యస్మదాదిదీనులు జీవించుటకు మూలమైన సౌలభ్యంబను మహాగుణంబునకు సూచకమైన శిఖిపింఛాద్యలంకారములతోడం గూడి గోపవేషముతోడ విలసిల్లు శ్రీకృష్ణమూర్తియు సర్వోత్కృష్టులై వర్తింతురుగాక యని వారియందలి ప్రేమాతిశయము చే వచించుటవలన నిదియాశీస్సను మంగళమాయెను- కల్పతరుపల్లవమువలె సకలార్థములనివ్వఁజాలినట్టివారి పాదములను. జయలక్ష్మి తనంతఁగోరివరించుచున్నది అనగా ఆపాదముల నుపాసించువారికి సర్వకార్యములయందు జయముగలుగునని ముఖ్యతాత్పర్యము- ఇదియునుంగాక ఈ శ్లోకమందు ఉత్తరార్థపదముల స్వారస్యముచేత లోకమందు చక్కనిభూషణములుగల పురుషులయందు కన్యకలాశపడునట్టుగా నీజయలక్ష్మియనుకన్య పల్లవములను శిరోభూషణములుగల వారలయందభిలషించెననియు తాత్పర్యము. ఈలాగున నీశ్లోకమందుగాని తక్కిన శ్లోకములయందుగా నితరుచుగాఁదాత్పర్యవర్ణనము సేయదగును- అయినను గ్రంథవిస్తర భీతిచేత బాలురకుదురూహమవుననుభీతిచేతను నిష్కృష్టతాత్పర్యమే చెప్పఁబూనితిమి [illegible]యుగాక కొందఱు ఈశ్లోకమందు మఱికొన్ని యర్థముల వర్ణనము

జేయుచున్నారు అయితే అది క్లిష్టకల్పనముగాన నుపేక్షింపంబడియె. *

శ్లో॥ అస్తిస్వస్తరుణీకరాగ్రవిగళత్కల్పప్రసూనాప్లుతం।
వస్తుప్రస్తుతవేణునాదలహరీనిర్వాణనిర్వ్యాకులం। స్రస్తస్రస్తనిరు
ద్ధనీవివిలసద్గోపీసహస్రావృతం । హస్తన్యస్తనతాపవర్గమఖిలోదా
రంకిశోరాకృతి ॥ ... ... ... ... ... ... ... ... ౨

టీక. ప్రస్తుతవేణునాదలహరీ నిర్వాణనిర్వ్యాకులం- ప్రస్తుత- కొని యాడఁబడిన, వేణు- పిల్లనఁగ్రోవియొక్క, నాద - ధ్వనియొక్క, లహరీ- ప్రవాహముచేతనైన, నిర్వాణ, సుఖముచేతను, నిర్వ్యాకులం - నిశ్చలమైన, స్వస్తరుణీకరాగ్రవిగళత్కల్పప్రసూనాప్లుతం - స్వస్తరుణీ - దేవతాస్త్రీలయొక్క, కరాగ్ర- చేతికొనలనుండి, విగళత్ - జాఱుచున్న, కల్పప్రసూన- కల్పవృక్ష పుష్పములచేత, ఆప్లుతమ్ - వ్యాపింపబడినట్టి, స్రస్తస్రస్తనిరుద్ధనీవివిలసద్గోపీసహస్రావృతమ్ స్రస్తస్రస్త - అపుడపుడుకుజాఱుచున్న వానితో సమానమగుచు, నిరుద్ధ- నిరోధింపఁబడిన, నీవి. పోకముళ్ళచే, విలసత్- ప్రకాశించుచున్నట్టి, గోపీ- గోపికలయొక్క, సహస్ర- వేలచేత, ఆవృతమ్- చుట్టుకొబడినట్టి, హస్తన్యస్తనతాపవర్గమ్ - హస్త - చేతిలో, న్యస్త-ఉంచబడిన, నత- శరణాగతులయొక్క, అపవర్గమ్- మోక్షముగలిగినట్టి, అఖిలోదారం - అఖిల - సకలదేవతలకంటె, ఉదారం - మహోదాత్తమైనట్టి, కిశోరాకృతి - కిశోర - బాలునియొక్క, ఆకృతి- ఆకారముగలిగిన, వస్తు- వస్తువు, అస్తి ఉన్నది, ఈశ్లోకముచేత కవిపూర్వముగురు పూర్వకముగాఁబ్రార్థింపఁబడినదైవములేదను వారలనుధిక్కరించి శ్రీకృష్ణరూపంబై బ్రహ్మము విలసిల్లుచున్నదియని చెప్పినందున వస్తునిర్దేశమంగళంబు నాచరించిన వాఁడాయెను.

శా॥ క్రొక్కల్జాఱఁగఁ గేలఁబూని గుముఃలై గోపాంగనల్గోల్వనా।ళీ
కాస్యాగ్నివినుండి కల్పసుమములిం డారవర్షింపఁగా।నోకస్వేణువినో
దనాద లహరిం జొక్కించుచుం జొక్కుచున్। శ్రీకైశోరముఁ బూనుదే
వుఁనితత్రేము త్రిమం గొల్చెదన్ ॥... ... ... ... ... ... ౨

తా. సకలవ్యామోహకమయిన వేణుగానముఁ జేయుచుఆనాదవైఖరిచేతానునానందనిర్భరుండయి ఆకాశమందు ప్రేమపరశవలై దేవస్త్రీలు కల్పకకుసుమములను వర్షింపఁగా గోపికలు కామాతిశయముచే వీడెడిపోకముల్లను చేతులనడఁచి పట్టుకొని చుట్టుకొనియుండ నీలాగున జగమును తనచరణారవిందప్రవణముజేసి అపవర్గమునిచ్చుటవలన సకలదేవతాశ్రేష్ఠుండైన

కలాశ్రియణీయత్వ హేతువగుసౌలభ్యంబునకు నిరూపకంబగు బాలభావంబుచేవిలసిల్లుచు పరత్వముచేనిట్టిది యనినిరూపింపఁగూడక కేవలవస్తువనిమాత్రముచెప్పఁదగిన శ్రీకృష్ణరూపబ్రహ్మంబు వ్రేపల్లెయందున్నది యనుట॥ స్మృతిః ఏవంవిన్యస్తదేహస్సన్ । ధ్యాయేత్కృష్ణంహృదంబుజే। కళాయకుసుమశ్యామమంభోరుహానిభేక్షణమ్। వేణుగానరతం దేవంబర్హిబర్హావతంసకం। దివ్యపీతాంబరధరం పూర్ణచంద్రనిభాననమ్। వన్యైస్తమాలపుష్పైశ్చశోభితంవనమాలయా। నేత్రోత్పలైశ్చగోపీనా మర్చితంసుందరాకృతిమ్ । హారకేయూరమకుటకుండలోదరబంధనైః। విరాజమానంశ్రీవత్సకౌస్తుభోద్భాసితోరసం గోపాంగనాపరివృతం మూలేకల్పతరోస్థితమ్ । హేమపీఠేసువిమలె సర్వరత్నోపశోభితే। రుక్మిణీసత్యభామాభ్యాం పార్శ్వస్థాభ్యాం విరాజితే। గోపాలైర్గోసమూహైశ్చవన్యసత్త్వైరమత్సరైః ఆవృతం దేవతాబృందైః పుష్పవృష్టికరైర్దివి। వేణునాదసమాకృష్టచిత్తవృత్తిభిరర్చితమ్। దివ్యేనవేణునాదేనన యంతంస్వవశంజగత్ । ఏవంగోపాంగనానాథం ధ్యాత్వాహృదయపఙ్కజే। సమాహితమనాభూత్వా జపేన్మన్త్రమనుత్తమమ్॥

శ్లో॥ చాతుర్యైకనిధానసీమచపలాపాఙ్గచ్ఛటామంథరం। లావణ్యామృతవీచిలాలితదృశంలక్ష్మీకటాక్షాదృతం। కాళిందీపులినాఙ్గణప్రణయినఙ్కామావతారాఙ్కురం బాలంనీలమమీవయంమధురిమస్వారాజ్యమారాధ్నుమః॥ 3

టీక. చాతుర్యైకనిధానసీమచపలాపాఙ్గచ్ఛటామన్థరమ్- చాతుర్య- చమత్కారమునకు- ఏక- అద్వితీయమయిన, నిధాన - నిక్షేపముయొక్క, సీమ- మేరలయినట్టి- చపల- చంచలములైన- అపాఙ్గ- కడగన్నులయొక్క, ఛటా- సమూహముచే - మన్థరమ్-భారముఁగలిగినవాఁడగు, లావణ్యామృతవీచిలాలితదృశమ్- లావణ్య- ముత్యపుతేటవంటి కాంతియను, అమృత - అమృతముయొక్క, వీచి- అలలచేత- లాలిత- కొనియాడఁబడిన, దృశమ్- చూపుగలవాఁడగు. లక్ష్మీకటాక్షాదృతమ్, లక్ష్మీ- శ్రీమహాలక్ష్మియొక్క, కటాక్ష - కడగంటిచూపులచే, ఆదృతం- ఆదరింపబడినవాఁడగు, కాళిందీపులినాఙ్గణప్రణయినమ్- కాళిందీ- యమునానదియొక్క, పులిన- ఇసుకదిన్నెలయొక్క, అంగణ- ప్రదేశములయందు, ప్రణయినమ్ - ప్రేమగలవాఁడగు, కామావతారాఙ్కురమ్ కామ- మన్మథునియొక్క, అవతార- అవతారమునకు , అఙ్కురమ్ - మొలకయైనవాఁడగు, మధురిమస్వారాజ్యమ్ - మధురిమ - సౌందర్య

మనకు, స్వారాజ్యమ్ - స్వర్గరాజ్యమువలె నతిశయాస్పదుండయినవాఁడ గు, నీలమ్-నీలవర్ణుఁడునగు, బాలమ్ చిన్నవానిని, అమీ- ఈ సంసారులగు, వయం-మేము, ఆరాధ్నుమః- ఆరాధింతుముగాక. *

శా॥ బాలున్నంబుజుల తాలవాల చపలాపాంగోల్లసల్లీలునిం । గా
ళిందీపులినాంగణ ప్రణయి శృంగారైక ఖేలుఙ్గశుభ । శ్రీలోలంగరు
ణావలోకనసుధాశీలున్వినీలప్రభా । జాలుంగొల్చెద రామణీయకరస
స్వారాజ్యపాలున్ సదా॥ 3

తాత్పర్యము. పూర్వంబుకలదని ప్రతిపాదించిన బ్రహ్మానగు శ్రీకృష్ణుఁడనుబాలుఁడే సంసారనివృత్తికాములకుపాస్యుఁడుగనుకవాని నారాధించెదము- వాఁడు ఎట్టివాఁడంటే- దీనికతిశయించిన చాతుర్యము లేదని చెప్పదగిన చాతుర్యముతో చంచలించుచున్న కడగన్నులును సిగనిగమెఱయుతెలుకుఁ పర ను చూపులునుగలిగి యమునాపులినములో కామోద్రేకము గలుగునట్టుగానీల మణివన్నెతోవర్తించుచు శ్రీదేవిచేప్రేమతోఁ విలోకితుఁడై దర్శనమాత్రంబునసకలజనులకు విశ్వాసంబు బుట్టించునట్టిసౌందర్యాతిశయంబును బాల్యంబు నంబూని యుండువాఁడనుట. *

శ్లో॥ బర్హోత్తంస విలాసికుంతలభరం మాధుర్య మగ్నాననం ప్రో
న్మీల న్నవయౌవనం ప్రవిలసద్వేణుప్రణాదామృతమ్।ఆపీన స్తనకుట్మ
లాభిరభితో గోపీభిరారాధితం జ్యోతిశ్చేత సినశ్చకాస్తిజగతామేకా
భిరామాద్భుతమ్ ॥ ౪

టీక. బర్హోత్తంసవిలాసికుంతలభరం _ బర్హ- శిఖిపింఛములను, ఉత్తంస- శిరోభూషణములచేత, విలాసి- ప్రకాశించుచున్నట్టి, కుంతల- ముంగురులయొక్క, భరమ్-భారముగలిగినట్టి,మాధుర్య- సౌందర్య విశేషమందు, మగ్న- మునిఁగిన, ఆననం- ముఖముగలిగిన, ప్రోన్మీలన్నవ యౌవనమ్ - ప్రోన్మీలత్ - వర్ధిల్లుచున్న, నవ - నూతనమైన, యౌవనం - యౌవనముగలిగిన, ప్రవిలసద్వేణు ప్రణాదామృతం - ప్రవిలసత్ - మిక్కిలి విలసిల్లుచున్నట్టి, వేణు - వేణువుయొక్క, ప్రణాద - ధ్వనియను, అమృతమ్ - అమృతముగలిగిన, ఆపీన స్తనకుట్మలాభిః - ఆపీన- పొంగిన- స్తనకుట్మలాభిః - మొగ్గలంటి స్తనములుగల, గోపీభిః - గోపికలచేత, అభితః - నలుప్రక్కలను, ఆరాధితం-ఉపచారము చేయబడిన, జగతామ్ - లోకములకు,ఏకాభిరామాద్భుతమ్-ఏక-అద్వితీయమయిన,అభిరామ - సుందరవస్తువ్రాతమున, అద్భుతమ్- ఆశ్చర్యకరమౌ

యున, జ్యోతిః - తేజస్సు, నః-మాయొక్క, చేతసి - చిత్తమందు, చకాస్తి - ప్రకాశించుచున్నది.

ఉ॥ చక్కనిముద్దునెమ్మొగముచందమునందపు మందహాసముం ।
జొక్కపుజవ్వనంబు సిగఁజుట్టినబర్హము వేణుగానము । నెక్కొనఁ
జొక్కగోపికలునింపు మిన్నుచకుట్మలాలిచే । నొక్కచుఁగారవించిన
మనోహరతేజము వొల్చెనామదిన్॥ ౪

తా. కవి- పూర్వశ్లోకముచే నారాధింపు గోరినదేవుండు - ధ్యాన రూపంబగు నారాధనంబుచేయు హృదయంబున సాక్షాత్కరించిన ప్రకారము ననుసంధించుచున్నాడు - శిఖి పింఛాలంకృతంబైన కేశ భారముతోడ సౌందర్య పూర్ణంబగు మొగముతోడ ప్రతిక్షణ విలక్షణ మయిన యౌవనము తోడగూడి అమృతమువలె నత్యంతమధురముగా వేణుగానముజేయ - తదాకారరసంబునంబొడము కామముచే నొప్పెడి స్తనములతో గోపికలుచుట్టుకొని తమకోరికలు నేరవేచుకొన నుపచారములుసేయగా లోకము నాశ్చర్యమగ్నం బగునట్లు మనోహరుండై భగవంతుఁడు తేజోరాశిగా తోచెనుట.

మూ॥ మధురతరస్మితామృత విముగ్ధముఖామ్బురుహం మ
దశిఖిపిఞ్ఛలాఞ్ఛిత మనోజ్ఞకచప్రచయమ్ । విషయవిషామిష గ్రసన
గృధ్నుని చేతసి మే విపుల విలోచనం కిమపిధామ చకాస్తి చిరమ్॥ ౫

టీక. మధురతరస్మితామృతవిముగ్ధముఖామ్బురుహం - మధురతర - అత్యంత మనోహరమయినట్టి, స్మిత -చిరునవ్వను, అమృత - అమృతముచేత, విముగ్ధ- మిక్కిలిసుందరమయిన, ముఖామ్బురుహం- కమలమువంటిముఖముగలిగిన, మదశిఖిపిఞ్ఛలాఞ్ఛితమనోజ్ఞకచప్రచయం- మద-మదముగలిన, శిఖి-నెమలి యొక్క, పిఞ్ఛ-బర్హముచేత, లాఞ్ఛిత-గురుతుగలదిగాఁజేయబడిన, మనోజ్ఞ - మనోరంజకంబైన, కచప్రచయమ్ - కేశపాశముగలిగిన, విపులవిలోచనం - విపుల - విశాలములైన, విలోచనమ్ - నేత్రములుగలిగిన, కిమపి- అనిర్వచనీయమయిన, ధామ - తేజస్సు, విషయవిషామిషగ్రసనగృధ్నుని, విషయ- శబ్దాదివిషయములనెడి, విష- విషముగలసిన, ఆమిష - మాంసముయొక్క, గ్రసన - మ్రింగుటయందు, గృధ్నుని - ఆశపడియున్న, మే- నాయొక్క, చేతసి - హృదయమందు, చిరమ్ - చిరకాలముగా, చకాస్తి-ప్రకాశించుచున్నది.

చ॥ వదలక సహ్యమౌ విషయవాంఛకులోఁగయి సంచరించు నా।
మదిశిఖిపింఛభూషణసమంచితకుంతలభవ్యవేషముం । మృదుమధుర
స్మితామృతసమృద్ధముఖాబ్జము లోలదృష్టులిం । పొదవినదివ్యతేజము స
మున్నతినున్నది నిత్యసిద్ధమై॥ ౪

తా॥ సుఖమునకుం బోలే దుఃఖమునకుఁ గారణము లగుటవలన విషముతో డఁగూడిన మాంసముతో సమానంబులగు శబ్దాదివిషయంబుల నింద్రియముల తెరువునం దగులునడిన నాదుహృదయమందు విలక్షణము లయిన యప్రాకృతవిషయముల కాస్పదమయిన భగవంతుని దివ్యమూర్తి నాదు భాగ్యవశమున దోఁచుచున్నది- తన్మూర్తి యెట్టిది యంటే సేవించువారిచిత్తము రంజిలంజేయుదరస్మితంబుగల మొగంబుతో- పలువన్నెలుగల నెమలిపురిచేత నలంకరింపఁబడిన నల్లనికురులతో - మోమంతయు నెఱయంబోలసి మెఱయుకన్నులతో డంగూడి - యిట్టిదియట్టిదియని నిరూపింపంగూడని పొలుపుమీఱిన తేజోమయమయి విలసిల్లుచున్నదియనుట - యిచ్చటఁ గొన్ని విశేషణములు పూర్వోక్తములయినను భక్తిపారవశ్యముచేత వేఱువేఱుగాఁ జెప్పుటచేతఁ బౌనరుక్త్యశంకకు అవకాశంబు లేదు ॥

మూ॥ ముకుళాయమాననయనామ్బుజం విభోర్మురళీనినాద మక
రన్ద నిర్భరమ్ । ముకురాయమాణ మృదుగణ్డమణ్డలం ముఖపఙ్కజం
మనసి మే విజృమ్భతామ్॥ ౬

టీక॥ ముకుళాయమాన నయనామ్బుజమ్ - ముకుళాయమాన- మోడ్చినట్లున్న - అనగా ముకుళించినవానివలె నాచరించుచున్న - నయనామ్బుజమ్ . తామరలవంటి కన్నులుగలిగిన - మురళీనినాదమకరన్ద నిర్భరమ్ - మురళీ - వేణువుయొక్క - నినాద, ధ్వనియనెడి - మకరన్ద - తేనెచేత - నిర్భరం - సంపూర్ణమయిన - ముకురాయమాణ మృదుగణ్డమణ్డలమ్ - ముకురాయమాణ- అద్దములవలె నాచరించుచున్న- మృదు- మెత్తనయిన- గణ్డమణ్డలమ్- చెక్కిలితావులుకలిగిన- విభోః- శ్రీకృష్ణదేవునియొక్క- ముఖపఙ్కజమ్- మోముదామర- మే- నాయొక్క- మనసి- హృదయమందు- విజృమ్భతామ్- ప్రకాశించుగాక॥

మ॥ మురళీనాదమరందబిందులహరీమోదంబుచే లోచనాం । బు
రుహంబుల్ముకుళింపనోష్ఠమణి సొంపుల్మీఱ నాదర్శభా । సురగండస్థలి
యొప్పఁ బ్రసృతచికురస్తోమంబు ఫాలంబుపై। మురువుల్చూపఁ జెలంగుకృ
ష్ణవదనాంభోజంబు భావించెదన్॥

తా ॥ ముందు - ప్రకాశించిన వస్తువు మఱియుం బ్రకాశించుగాకయని ప్రార్థించుచున్నాఁడు- వేణుగానముచేయునపుడు తామరరేకులవంటికన్నులకొంచెమువూసుకొని వేణువునూదుటచేతనుబ్బి యద్దములవలెనున్న గామె అయిచున్న చెక్కిళ్ళతోఁగూడి మకరందమువంటి తియ్యనిధ్వనిగలిగిన శ్రీకృష్ణుని ముఖారవిందము నాహృదయంబునం దోఁచుచున్నదనుట.

శ్లో ॥ కమనీయకిశోరముగ్ధమూర్తేః కలవేణుక్వణితాదృతాననేన్దోః । మమవాచివిజృంభతాంమురారేర్మధురిమ్ణఃకణికాపికాపికాపి॥

టీక. కమనీయకిశోరముగ్ధమూర్తేః కమనీయ - యిచ్ఛగింపదగినట్టికిశోర - బాల్యముతోఁగూడిన - ముగ్ధ-సుందరమైన - మూర్తేః - దేహముగలిగిన- కలవేణుక్వణితాదృతాననేన్దోః - కల - అవ్యక్తమధురమైన - వేణుక్వణిత- వేణుధ్వనిచేత, ఆదృత - ఆదరింపఁబడిన - ఆననేన్దోః- చంద్రునివంటి ముఖముగలిగిన-మురారేః- శ్రీకృష్ణునియొక్క- మధురిమ్ణః-సౌందర్యముయొక్క- కాపికాపి.- అతిసూక్ష్మమైన- కణికాపి- లేశమయినను-మమ- నాయొక్క--వాచి- వాక్కునందు విజృంభతాం- ప్రకాశించుగాక-

మ ॥ కలవేణుక్వణితాదృతాననము రాకాచంద్రసాంద్రద్యుతిఁ । బలకింపంగమనీయముగ్ధశిశుమూర్తిస్ఫూర్తివర్తిల్లునుత్పలపత్రోజ్జ్వలనీలవర్ణగుణసంధామాధురీసాధురీ। తులలోనించుకమైననావచనసందోహంబులన్నెంజెడిఁ॥ ౭

తా. యెల్లవారునుమాటిమాటికిఁజూడనాశపడునట్టి చక్కఁదనమునుం బాల్యమునుంగలదివ్యదేహముఁగలవాఁడై చంద్రునివంటిముఖమందు అమృతమువంటివేణునాదము విలసిల్లుచున్నట్టికృష్ణునియొక్క తాత్కాలికవిలక్షణసౌందర్యమును తేనెయొక్కచిన్నబిందువైనను నా నాలికయందు పడగాకలనగా ఆసౌందర్యము నుయించుకమైన నేనువర్ణింతునుగాకయనుట.

శ్లో ॥ మదశిఖణ్డిశిఖణ్డవిభూషణంమదనమన్థరముగ్ధముఖామ్బుజమ్ । వ్రజవధూనయనాఞ్చలవఞ్చితమ్ విజయతాం మమవాఙ్మయజీవితమ్॥ ౯

టీక. మదనమన్థరముగ్ధముఖామ్బుజమ్-మదన- మన్మథునిచేత, మన్థర- మాంద్యముగలిగిన, ముగ్ధ-సుందరమయినట్టి - ముఖామ్బుజమ్- ముఖకమలము గలిగిన, వ్రజవధూనయనాఞ్చలవఞ్చితమ్-వ్రజవధూ- గోపికలయొక్క- నయన- కన్నులయొక్క-, అంచల- కొనలచేత, వఞ్చితమ్- వంచింపఁబడిన- మదశిఖ

ణ్డశిఖణ్డవిభూషణమ్- మదశిఖండి- మదముగల నెమలి యొక్క, శిఖణ్డ - పింఛము, విభూషణమ్-భూషణముగలిగినవస్తువు, మమ-నాయొక్క, వాఙ్మయ జీవితం- వాఙ్మయ- కవితకు. జీవితం- జీవనమై, విజయతాం- సర్వోత్కర్షముగానుండుగాక.

ఉ॥ చక్కనిముద్దుమోము సుమసాయకు పెక్కుల ధిక్కరింపగాఁ । జొక్కపునెమ్మిబోదనునుసోగరసంబుశిరంబునందుఁబెం । పెక్క వ్రజాంగనాజననిరీక్షణవంచితమైననాదుస । ద్వ్యక్కృతవాక్యజీవితమజాండకటాహమునిండియుండెడిన్॥

తా. మన్మథావేశముచేతవిలాసముబొంది మనోహరమైనముఖముతోఁగూడి గోపికలకడకంటిచూపులచే- తద్వశమయితిరుగుచున్న ట్టిశిఖిపింఛభూషణముగువస్తువు- అనగా- శ్రీకృష్ణుండు నాకవిత్వమునకు జీవనమయి - అనగా నాచేతస్తుతింపఁబడువాడై వర్ధిల్లుగాకయనుట.

శ్లో॥ పల్లవారుణపాణి పఙ్కజ సఙ్గి వేణురవాకులమ్ । ఫుల్లపాటలపాటలీ పరివాదిపాద సరోరుహమ్ । ఉల్లసన్మధురాధరద్యుతిమఞ్జరీ సరసాననం । వల్లవీకుచకుమ్భ కుఙ్కుమ పఙ్కిలం ప్రభుమాశ్రయే॥

టీక. పల్లవారుణపాణిపఙ్కసఙ్గి వేణురవాకులం -పల్లవ- చిగుళ్లవలె, అరుణ- యెఱ్ఱనైన, పాణి- హస్తములనియెడి- పఙ్కజ- కమలములతో-సఙ్గి చేరియున్న- వేణు- వేణువుయొక్క- రవ- నాదమందు- ఆకులమ్- ఆసక్తిగలిగిన - ఫుల్లపాటల పాటలీ పరివాదిపాద సరోరుహమ్ - ఫుల్ల - వికసించిన- పాటల- కలుగొట్టుపూవుయొక్క- పాటలీ- సమూహమును- పరివాది- దూషించుచున్న- పాద- పాదములనియెడి- సరోరుహం- తామరలుగలిగిన-ఉల్లసన్మధురాధరద్యుతి మఞ్జరీసరసాననం - ఉల్లసత్ - ప్రకాశించుచున్నట్టి- మధుర- మాధుర్యముగల, అధర- మోవియొక్క - మఞ్జరీ-సమూహముచేత-సరస- సరసమైన- ఆననం-ముఖముగలిగిన, వల్లవీకుచకుమ్భ కుంకుమపఙ్కిలం- వల్లవీ- గోపికలయొక్క-కుచకుమ్భ కుంభములవంటి స్తనములయొక్క,కుఙ్కుమ- కుంకుమచేత, పఙ్కిలమ్- మలినమయిన- ప్రభుమ్- ప్రభువైనకృష్ణుని-ఆశ్రయే- సేవించుచున్నాను.

ఉ॥ పల్లవకోమలంబయినపాణితలంబునఁదేనెమోవిరం। జిల్లెడు మోముఁదమ్మిపయిఁజేర్చినవేణువుమ్రోయఁ జొక్కుచు । నవ్వల్లవ

కామినీజనఘన స్తనకుంకుమపంకభాసీయశా । వేణ్లితపాటలారుణనవీన
—పదాబ్జువిభుందలంచేదక్॥

తా. కలుగొట్టుచిగురులవంటి పాదములతోనిలిచి వేణువునుచిగురువం టిచేతుల చేపట్టివాయించునప్పుడు పువ్వుగుత్తువలె నెఱయు మోవికాంతులు ముఖమందు ప్రసరింపఁగా ఇట్టి సొంపుజూచి కామపే్రమ పరవశలై గోపిక లు ఆలింగనము సేయ వారిచన్నుల యందుంజెడి కుంకుమపంకము మేనెల్ల వ్యాపించివిలసిల్లు నాశ్రితరక్షణ సమర్థుడైనట్టి కృష్ణుని యాశ్రయించెద నను ట- ఇదిగాక నీనాలుగువిశేషణములచేతను వేణుగానముజేయు నొకసమయం బునుభగవంతుడు మెట్టనిపువ్వులుపూచి నల్లనిమ్రానువలె తోఁచెనని యు తా త్పర్యమవుచున్నది.

షూ॥ అపాఙ్గ రేఖాభిరభఙ్గురాభిరనఙ్గలేఖారసరఞ్జితాభిః। అనుక్ష ణంవల్లవసున్దరీభిరభ్యర్చ్యమానంవిభుమాశ్రయామః॥ ౧౦

టీక. వల్లవసున్దరీభిః-గోపస్త్రీలచేత,అనఙ్గలేఖారసరఞ్జితాభిః-అనఙ్గ- మన్మథునియొక్క, లేఖా - పత్రికలయొక్క, రస - రసభూతమైనసామర్థ్యా ముచేత- రఞ్జితాభిః - ప్రకాశింపఁజేయఁబడినట్టి, అభఙ్గురాభిః, దీర్ఘములై నట్టి, అపాఙ్గరేఖాభిః - కడకంటి చూపులపఙ్క్తులచేత, అనుక్షణమ్ - మాటి మాటికి, అభ్యర్చ్యమానమ్-పూజింపఁబడుచున్న, విభుమ్- విభుడైనకృష్ణుని, ఆశ్రయామః- ఆశ్రయించుచున్నాము.

ఉ॥ ఇంచుకనైనఁజాలునని యేంచక ప్రేయలమించు బోండ్ల గ్రాల్మించులమించులీనెడునమేయమనోభవమాధురీరసో । దంచిత చారుచంచలదృగంచలధారలసారెపూజఁగా । వించఁగఁజెల్వుమీఱు విభువేణునినాదవినోదుఁగొల్చెదక్॥ ౧౦

తా. వేణుగానావసరమందు గోపస్త్రీలు కామాతిశయముచే కడ కన్నులతో జూచునట్టి సర్వలోకేశ్వరుడయిన - శ్రీకృష్ణస్వామి నాశ్రయిం చెదము - ఆక్రేగంటిచూపు లెట్టివన్నను - మన్మథుడు పంపించిన చీటివలె కామోద్రేకము గలుగఁ జేయునట్టి సామర్థ్యముతోఁ గూడి దీర్ఘములై వె లుగుచున్నవియనుట-వీనిచేతనర్చింపఁ బడుచున్న విభుని అనగా అట్లుచూచుట యు భగవంతునికారాధనమౌనని తాత్పర్యమవుచున్నది.

మహా॥ హృదయేమమహృద్య విభ్రమాణాంహృదయంహర్షవి

శాలలోలనేత్రమ్ । తరుణంవ్రజ బాలసున్దరీణాం తరళజిహ్వానధామసన్ని ధత్తామ్ ॥

టీక-తరుణం- యౌవనములోఁ గూడినదిగనుకనే- తరళం-చంచలమైన యట్టి, హర్షవిశాలలోలనేత్రం - హర్ష- సంతోషముచేత, విశాల, వెడల్పులయినట్టి - లోల - చంచలములైన - నేత్రమ్ - నేత్రములు గలయట్టి - హృద్యవిభ్రమాణాం- హృద్య -మనోహరములైన,విభ్రమాణాం-విలాసములుగల - వ్రజబాలసున్దరీణాం - వ్రజ- వ్రేపల్లెయందుండిన- బాల-లేఁబ్రాయముగల, సున్దరీణాం- స్త్రీలయొక్క- హృదయం- హృదయమందున్న-కళ్యాన, చెప్పనలవిగాని- ధామ - తేజము- మమ - నాయొక్క, హృదయె - చిత్తమందు, సన్నిధత్తామ్ , ఉండుగాక.

ఉ॥మంజువిలాస విభ్రమసమాశ్రయ మున్వ్రజభామినీమనో।
రంజకయౌవనాకరము రాజితహర్షవిలాసదృక్ప్రభా। పుంజముపింఛభూషణ విభూషితధామము నెమ్మి నామనః। కంజనివాసమై యనుచుఁగావుతసత్కరుణాధురీణమై ॥                    ౧౧

తా. తేజవ్వనంబు గల్గియుండుఁ గావునచపలంబై సంతోషంబుచే వెడలుపగు కన్నుఁదోయిగలిగి మనోహరంబులగు విలాసంబులుగల లేప్రాయంపుగోపికల- హృదయంబుల వెలుంగుచు- యిట్టిదియని యెఱుంగరాకయుండు నొక తేజంబు నామనంబున వెలయుఁగాకయనుట.

శ్లో॥నిఖిలభువనలక్ష్మీనిత్యలీలాస్పదాభ్యాం జలనుకలవిపిన వీధిగర్వసర్వఙ్కషాభ్యామ్ । ప్రణమదభయదాన ప్రౌఢిగాఢోద్ధతాభ్యాం జ్ఞి-మపివహతు చేతః కృష్ణపాదాంబుజాభ్యామ్॥                    ౧౨

టీక.నిఖిగభువనలక్ష్మీ నిత్యలీలాస్పదాభ్యాం-నిఖిల - సమస్తమైనభువన- లోకములయందలిలక్ష్మీ- కాంత్యధిదేవతకు-నిత్య-నిరంతరమును- లీలాస్పదాభ్యాం- విహారస్థానములైనట్టివియు కలమువిపిన వీధిగర్వసర్వఙ్కషాభ్యాం కమలవిపిన - పద్మవనములయొక్క- వీధి- సమూహముయొక్క- గర్వ- అహంకారముయొక్క-సర్వఙ్కషాభ్యాం-నిర్మూలకములైనట్టివియు- ప్రణమదభయదానప్రౌఢిగాఢోద్ధతాభ్యాం- ప్రణమత్ సన్నములైనవారలకు- అభయదానఅభయంబునిచ్చుటచేతనైన ప్రౌఢి - ఆధిక్యముచేత గాఢ - దట్టమానట్టుగాను ఉద్ధతాభ్యాం - అతిశయించిన కృష్ణపాదాంబుజాభ్యాం - కృష్ణ శ్రీకృష్ణమూర్తియొక్క- పాదాంబుజాభ్యాం- పాదకమలములవల్లను, మమ- నా.

యొక్క, చేతః - చిత్తము, కమపి - చెప్పనలవిగాని సంతోషమును, వహతు వహించుఁగాక.

మ॥ లలితాశేష దిశాధినాధనగరీలక్ష్మీవిలాసాస్పదం । బులునిరే
రుహగర్వసర్వవిభవప్రోన్మూలనశ్రీపదం । బులువందారువనోరధా
ర్థఘటనాపూర్ణానుకంపాస్పదం । బులు శ్రీకృష్ణపదంబులూని మనమా
మోదంబునంబొందెడుఁ॥ ౧౨

తా- నిఖిలలోకంబులందుండెడి శ్రీకాంతదేవతకు విహారస్థానంబులై సేవించెడివారల భయంబులుమపంజాలి, తామరపువ్వులం దెగడుచున్న శ్రీకృష్ణునిచరణంబులవలన నాచిత్తంబు సెప్పనలవిగాని సంతసంబునొందుఁగాతయనుట.

శ్లో॥ ప్రణయపరిణతాభ్యాం ప్రాభవాలమ్బనాభ్యాం ప్రతిప
దలలితాభ్యాం ప్రత్యహం నూతనాభ్యామ్ । ప్రతిముహురధికాభ్యా
మ్ప్రస్నువల్లోచనాభ్యాం ప్రభవతుహృదయేనః ప్రాణనాథఃకిశోరః॥

టీక • ప్రణయపరిణతాభ్యాం - స్నేహమయములైనట్టి, ప్రాభవాలమ్బనాభ్యామ్, ప్రాభవ ప్రభుత్వమునకు, ఆలమ్బనాభ్యామ్- ఆశ్రయములైనట్టి, ప్రతిపదలలితాభ్యాం, ప్రతిపద - ప్రతిక్షణమును, లలితాభ్యాం, సుందరములైనట్టి, ప్రత్యహమ్ ప్రతిదినమును, నూతనాభ్యామ్ క్రొత్తలైనట్టి, ప్రతిముహుః మాటిమాటికి, అధికాభ్యాం విశాలములగుచున్న ప్రస్నువల్లోచనాభ్యామ్ ప్రస్నువత్ ఆశ్రితాభీష్టముల వర్షించుచున్న, లోచనాభ్యాం నేత్రములతోడ, కిశోరః బాలుఁడైన ప్రాణనాథః ప్రాణనాథుఁడైన కృష్ణుఁడు, నః నాయొక్క, హృదయే చిత్తమందు, ప్రభవతు తోఁచుగాక.

చ॥ ప్రతిదినసుస్విలాస రసభాసురమైనిరతంబుఁజూచినఁ ।మ
తిహితమై ప్రభుత్వమహిమంబున కెల్లనుఁబట్టుగొమ్మనై । యతులద
యాకళోదితములై విలసిల్లెడుకన్నుఁదోయితో । సతతముఁబ్రాణబం
ధుఁడగుచెక్కునిబాలుఁడు దోఁచుఁగావుతఁ॥ ౧౩

తా॥ స్నేహమయములై దొరతనంబునకెల్లఁబట్టుగొమ్మలై ప్రతిదినమును క్రొత్తలై ప్రతిక్షణమును విలాసంబులచే నెక్కువలై యాశ్రయించిన వారల కభీష్టార్థంబుల నొసగుకన్నులతోఁ బ్రాణబంధుఁడగు బాలుఁడు నామనంబునఁ దోఁచుగావుతయనుట.

మూ ॥ మాధుర్యవారిధి మదాన్ధతరఙ్గ భఙ్గీశృఙ్గారసఙ్కలితశీత
కిశోరవేషమ్ । ఆమన్దహాస లలితాననచన్ద్రబిమ్బ మానన్దసంప్లవమను-
ప్లవతాంమనోమే ॥ ౧౪

టీక. ఆమన్దహాస లలితానన చన్ద్రబిమ్బమ్ . ఆమన్దహాస - చిఱునగవుచేత, లలిత - మనోహరమైన, ఆనన - ముఖమును - చన్ద్రబిమ్బమ్ - ఇందుబింబము గలయట్టి, మాధుర్యవారిధి మదాన్ధతరఙ్గ భఙ్గీశృఙ్గార సఙ్కలిత శీతకిశోరవేషమ్ - మాధుర్య - సౌందర్యమను, వారిధి - సముద్రముయొక్క, మదాన్ధ - మదప్రయుక్తములైన, తరఙ్గ - అలలయొక్క, భఙ్గీ - పఙ్క్తులచేత నైన, శృఙ్గార - శృంగార రసముతోడ, సఙ్కలిత - కూడినట్టి, శీత - చూచెడివారల కన్నులకు సుఖకరమయిన, కిశోరవేషమ్ - బాలునియాకృతిగల, ఆనన్దసంప్లవమ్ - ఆనందస్వరూపుఁడగు కృష్ణుని, మె - నాయొక్క, మనః - మనస్సు, అనుప్లవతాం - అనుసరించుగావుత . ❊

చ ॥ కందళితస్మితామృత వికాసముఖాబ్జము మాధురీఝరి ని ।
ష్యందతరంగభంగి నవయౌవన విభ్రమగోపవేషమూ । నందరసైక
రూపమగు నందకుమార సుధాబ్ధిలోననా । డెందముదేలి యాడఁగఁ
గడింది యఘంబను పంకమంటునే ॥ ❊

తా . చిఱునగవుచేసొగసునెమ్మోము చందురుంగలిగి -సౌందర్యంబనియెడి సముద్రమునలలచే నయినసింగారంబుతోఁగూడి- సేవించెడివారలకన్నులకుసుఖంబుఁ జేయుచుబాలభావంబులచేఁ దేజరిల్లుసత్యజ్ఞానానందస్వరూపుఁడగు శ్రీకృష్ణుని నామనంబనుసరించు గాకయనుట . ❊

మూ॥ అవ్యాజమంజులముఖామ్బుజముగ్ధభావై రాస్వాద్యమా
ననిజవేణు వినోదనాదం । ఆక్రీడతామరుణ పాదసరోరుహాభ్యామా
ర్ద్రేమదీయహృదయే భువనార్ద్రమోజః ॥ ౧౫

టీక . అవ్యాజమఞ్జులముఖామ్బుజముగ్ధభావైః - అవ్యాజ- నిరుపాధికమైన, మంజుల- సౌందర్యముగల. ముఖామ్బుజ-ముఖకమలములయొక్క,ముగ్ధ- సుందరమయిన, భావైః చేష్టలచేత, ఆస్వాద్యమాననిజవేణువినోదనాదమ్ ఆస్వాద్యమాన అనుభవింపబడుచున్న , నిజ స్వకీయమయిన, వేణు పిల్లఁగ్రోవియొక్క , వినోద వినోదార్థమయిన , నాదం ధ్వనిగలయట్టి, భువనార్ద్రమ్ భువన లోకములయందు, ఆర్ద్రమ్ (చూచువారలచూపులకు)సుఖమును జేయుచున్న, ఓజః తేజము, అరుణ పాదసరోరుహాభ్యాం అరుణ

ఎట్టిస యిన, పాదసరోరుహాభ్యామ్ పాదకమలములచేత, ఆర్ద్రే ఆర్ద్రమయిన, మదీయహృదయే మదీయ నాసంబంధియయిన, హృదయే చిత్తమందు, ఆక్రీడతామ్, విహరించుగాకుత.

మ॥ హాసదవ్యాజ మనోహరాననముతో నాలోలదృక్పాళితో। నస కృల్లీనని రాధ వేణువుతో నాతామ్రకమాంఘ్రిసా। రసయుక్సంబున నింపుసొంపులు దలిర్పం దాండవంబాడుచు। న్వసియించుచున్ భువనార్ద్ర తేజము మహానందంబు నన్మానసిన్ ॥ ౧౫

తా. స్వతస్సిద్ధసౌందర్యంబుచే నమరియున్న ముఖకమల సంబంధమైన భ్రూవిక్షేపాది శృంగారచేష్టలచేతను సేయుచున్న వేణుగానమును మెచ్చుచునులోకంబులవారల చూపులకు సుఖముం జేయుచున్న తేజంబు ఎట్టినగునదు గుంచాదరలచేత, భక్త్యతిశయముచే గరగుచున్న నామనంబందు విహరించు గాతయనుట॥

శ్లో॥ మణినూపురవాచాలం వన్దే తచ్చరణంవిభోః।
లలితాని యదీయానిలక్ష్మాణి వ్రజవీధిషు॥ ౧౬

టీక. యదీయాని- నీపాదసంబంధులైన, లక్ష్మాణి (పద్మాంకుశాది రేఖారూపములైన,) చిహ్నములు వ్రజవీధిషు, వ్రజ వ్రేపల్లియ యొక్క వీధిషు వీధులయందు, లలితాని మనోజ్ఞములయినవో, విభోః, వ్యాపకుండైన శ్రీ కృష్ణస్వామియొక్క, మణినూపురవాచాలమ్, మణి పద్మరాగాది మణులతోగూడిన, నూపుర కాలియందియలచేత, వాచాలమ్ మ్రోయుచున్న, తచ్చరణమ్, తత్, ప్రసిద్ధమైన, చరణమ్ పాదమునుగూర్చి, వన్దే నమస్కరించుచున్నాను॥

చ॥ హలకులిశాదిలక్షణ సమాహితముద్రిన చంచలస్థితిన్। వెలసిసిరింజెలంగువ్రజ వీధులనూపుర రత్నకింకిణీ। లలితఝుళంఝుళారవములన్నియు దిక్కులు పిక్కటిల్లఁగాఁ। దలవరినాఁబ్రవర్తిలు పదద్వయుగ్మముహర్నిశ్శజించెదన్॥ ౧౬

తా. హలకులిశాంకుశాది రేఖాలక్షణంబులచే వ్రేపల్లియవీధులనలంకరించుచు నందియలమ్రోత నలుగడల నిండంజేయు శ్రీకృష్ణుని చరణంబులు భజియించెదననుట॥

మూ॥ మనుచేతసిస్ఫురతువల్లవీవిభోర్మణినూపురప్రణయిమంజు

శింజితమ్ ।కమలావనే చరకళిందకన్యకా కలహంసకణ్ఠకల కూజితా దృతమ్॥ ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ౧౭

టీక. కమలావనేచరకళిన్దకన్యకాకలహంసకణ్ఠకలకూజితా దృతమ్ - కమలా- లక్ష్మీదేవియొక్క, వనే, విహారవనమైనపద్మవనమందు, చర చంచరించుచున్నయట్టి, కళిన్దకన్యకా-యమునానదియందుండెడి, కలహంస - హంసములయొక్క, కణ్ఠ- కంఠములయందలి, కల- అవ్యక్తమధురమగు, కూజిత-ధ్వనిచేత,ఆదృతమ్-ఆదరింపఁబడుచున్న (ఇక్కడ-ఆశ్రుతం- అని పాఠాంతరము గలదు ఈపక్షమందు- కూజితముతో- ఆశ్రుతం- సమమైనదియనియర్థము- ఇట్లని వ్యాఖ్యాకృదభిప్రాయము)విభోః-శ్రీకృష్ణమూర్తి యొక్క,పదను పురప్రణయిమంజుశింజితమ్, మణి - రత్నమయములైన, నూపుర, కాలియందియలయొక్క,ప్రణయి- స్నేహయుతమయినట్టి, మంజు- మనోజ్ఞమైన, శింజితమ్-ధ్వని, మమ- నాయొక్క, చేతసి- చిత్తమందు, స్ఫురతు- తోచుగాక.

మ॥ దినమున్నాదు హృదంతరాళమునవ ప్రిఙ్గళిందాత్మజా। వనజాళిన్విహరించునంచకలరావంబున్విడంబించు న । వ్వనజాక్షుని పాదనూపురమణిధ్వానంబుగోపాంగనా । జనరాసోత్సవనృత్తగీత కలనాసాచివ్యధారేయమై॥ ౧౭

తా. యమునానదీ కమలవనమందు విహరించునంచలయొక్క అవ్యక్త మధురములగుకంఠధ్వనులకు సమానమైన శ్రీకృష్ణునికాలియందియలమనోజ్ఞంబగుమ్రోఁతయింపగుచు నామనంబునఁ దోచుగావుతయనుట.

శ్లో॥ తరుణారుణ కరుణామయ విపులాయతనయనం కమల కుచకలశీభరపులకీ కృతపులకమ్ । మురళీరవతరళీకృత మునిమానసనలినం మమఖేలతి మదచేతసిమధురాధర మమృతమ్॥ ౧౮

టీక. తరుణారుణ కరుణామయ విపులాయత నయనమ్- తరుణారుణ- కెంపుగానెఱ్ఱనైనట్టి, కరుణామయ-దయాస్వరూపములైనట్టి, విపుల వెడలుపులైనట్టి, ఆయత- పొడవులైనట్టి, నయనం- నేత్రములుగలయట్టి, కమలాకుచకలశీభరపులకీ కృతపులకం కమలా - లక్ష్మీదేవియొక్క, కుచకలశీ కలశములవంటి స్తనములయొక్క, భర భారమందలి పులకీ గగ్గురుచేత, కృత చేయపడిన, పులకం గగురుపోటుగలయట్టి, మురళీరవతరళీకృత మునిమానసనలినం మురళీరవ వేణునాదముచేత, తరళీకృత, చంచలముగాఁ జేయఁబడిన, ముని మునులయొక్క, మానస మనస్సులను, కమ

లం-కమలములుబుగలఁయట్టి, మధురాధరం-మధుర, మనోజ్ఞమైన.అధరం-అధ రోష్ఠముగల, అమృతం- మోక్షస్వరూపమగు శ్రీకృష్ణాఖ్యవస్తువు, మమ- నా యొక్క, మదచేతసి- మత్తచిత్తమందు, ఖేలతి- క్రీడించుచున్నది.

మ॥ తరుణాబ్జారుణలోచనద్వయిఁ గృపాధారేయమైయొప్పసా।
గరకన్యాకుచకుంభపాళిఁబులకల్లన్పట్ట మానీంద్రహ్యా। త్సరసీజంబు
లుసంచరింపమురళీసంజాతగీతామృత। స్ఫురణన్ హల్లరిఁగంజరించు
హరిక్రైశోరంబుభావించెదన్॥ ౧౮

తా. లేతతామరసవనంబమరవెడలుపులై నిషఘలై కృపారసంబు గురి యుకన్నులచేఁ దేజరిల్లి బంగరుకుండలంబోలిన భరంబులగు మెఱుఁగు చన్ను లుగగుగోపికవ ననురాగంబుచేయుచున్న సిరింగాంచియప్పుడ మొలకలొత్తు ననురాగంబు నందోఁచు గగుగుపాటుచే నొప్పెడి నెమ్మనుఁగల్గి మనోహరం బగునధరంబు మోక్షస్వరూపంబగు శ్రీకృష్ణాఖ్యమైనవస్తువు నామదించిన చి త్తంబునం గ్రీడించుఁగాతయనుట.

శ్లో॥ అముగ్ధమర్ధనయనాంబుజచుంబ్యమానహర్షాకులవ్రజ
వధూమధురాననేన్దోః। ఆరబ్ధవేణురవమాదికిశోరమూర్తేరావిర్భవ
న్తిమమచేతసి కేపిభావాః॥ ౧౯

టీక. అర్ధనయమ్బుజచుమ్బ్యమానహర్షాకుల వ్రజవధూ మధూరా ననేన్దోః అర్ధ అర్ధనిమీలితములైన, నయనామ్బుజ కమలములవంటికన్నుల చేత, చుమ్బ్యమాన చుంబనముఁ జేయబడుచున్నట్టి, హర్ష సంతోషముచేత, ఆకుల - వ్యాకులమైనట్టి, వ్రజవధూ గోపస్త్రీలయొక్క, మధుర మనోజ్ఞ మయిన, ఆననేన్దోః ముఖచంద్రుఁడుగలిగిన, ఆదికిశోరమూర్తేః బాలకృష్ణ మూర్తియొక్క, కేపి యిట్టివియని చెప్పనలవిగాని, భావాః చేష్టలు అము గ్ధం అంతటను సుండరమానట్టుగాను, ఆరబ్ధవేణురవం ఆరబ్ధ ఆరంభింపఁ బడిన, వేణురవం వేణునాదము గల్గునట్టుగాను ఆవిర్భవంతిః స్ఫు రించుచున్నవి.

మ॥మురళీగానసుధాపయోనిధిమదిన్ బొంగన్ దరంగావళుల్ల
రికిన్ మీఱెననంగటీతటదుకూలంబుల్వడిన్ జాఱున। బ్బురపుంగొల్లమి
టారిసీటులర మోడ్పుంగన్నులంగాంచుచి। త్తరపున్ముద్దులగోపబా
లకువినోదప్రౌఢిభావించెదన్॥

తా. వేణుగానంబునువినినయంతనసంతోషంబు పికకటిలమనోజ్ఞంబు

లగుచుఁజందురుంబోలి వెలుంగు గోపికలనెమ్మొగంబుల నరమోడ్చిన కన్ను దామరలచేఁజూచుచుండు బాలకృష్ణునిచెప్పనలవిగాని మనోహరంబులైనచేష్ట లునామదిందోచుచున్నవియనుట.

శ్లో॥ కలక్వణితకఙ్కణం కరనిరుద్ధపీతాంబరం క్రమప్రసృతకు
న్తలం గళితబర్హభూషంవిభోః । పునఃప్రసృతిచాపలమ్ప్రణయినీ భు
జాయన్త్రితం మమస్ఫురతుమానసే మదనకేళిశయ్యోత్థితమ్॥ ౨౦

టీక. కలక్వణితకఙ్కణమ్-కల-అవ్యక్తమధురమైన, క్వణిత-ధ్వనిగలి గిన, కఙ్కణమ్-కడియములుఁగలయట్టి, కరనిరుద్ధపీతామ్బరమ్-కర - హస్తము చేత, నిరుద్ధ- అడ్డగింపబడుచున్న, పీతాంబరమ్- పీతాంబరముఁ గలయట్టి,క్ర మప్రసృతకుంతలమ్- క్రమ-క్రమముగాను, ప్రసృత- జాఱుచున్న, కుంతలం కేశములుగలయట్టి, గళితబర్హభూషమ్. గళిత - వీడిన, బర్హభూషమ్- పింఛభూషణముఁ గలయట్టి, పునఃప్రసృతిచాపలమ్ - పునః - తిరిగి, ప్రసృ తి- జారినకేశాదుల నమర్చుటయందు, చాపలమ్ - ఇచ్ఛావిశేషముగలయట్టి, ప్రణయినీభుజాయంత్రితమ్- ప్రణయినీ - ప్రియురాలియొక్క, భుజా - బా హువుల చేత, యంత్రితమ్- ఆలింగనము సేయబడుచున్న, విభోః-కృష్ణమూర్తి యొక్క, మదనకేళిశయ్యోత్థితమ్- మదనకేళి- రత్యర్థమయిన- శయ్యా-శయ్య నుండి, ఉత్థితమ్- లేచుచున్నశరీరము, మమ- నాయొక్క, మానసే-చిత్తమం దు, స్ఫురతు-ప్రకాశించుగాత.

చ॥ అరవిరిజాఱుకుంతలముల్లట్టిటు వీడినపీలుదండయుం। గరవల
యంబుఘల్లురనఁ గైకొనునట్టి సువర్ణచేలముఁ । బరగఁగ సెజ్జడిగ్గుతఱిఁ
బద్మవిలోచనగౌఁగిలించుచోఁ । దిరుగరమింపఁగాదిరుగు దేవునినామ
దినాశ్రయించెదన్॥ ౨౦

తా. అవ్యక్తమధురంబగు కడియంబుల రవళిచేఁ గనుపట్టుకరంబునజా ఱుచున్నపీతాంబరము నడ్డగించుచు క్రమంబున జాఱుచుండెడు కుంతలంబుల ను-వీడిననెమలిపురి దండలనెప్పటి యట్లసవరింపబూనుచు- పునారతంబుకొఱ కుప్రియురాలిచేఁ గౌఁగిలింపంబడుచు శయ్యనుండి లేచుచున్న శ్రీకృష్ణునిదివ్య విగ్రహంబునామనంబునం బ్రకాశించుఁగాతయనుట.

శ్లో॥ స్తోకస్తోకనిరుధ్య మానమృదుల ప్రస్యన్దిమన్దస్మితమ్ప్రేమో
ద్భేద నిరర్గళ ప్రసృమర ప్రవ్యక్త రోమోద్గమమ్ । శ్రోతృశ్రోత్రమ

నోహర వ్రజవధూలీలామిథోజల్పితం మిథ్యాస్వాప ముపాస్మహే భగవతః క్రీడానిమీలద్దృశః॥

టీక. స్తోకస్తోక- కొంచెముతో సమమగునట్టుగాను, నిరుధ్యమాన- నిరోధింపఁబడుచున్నట్టి, మృదుల-కోమలమగునట్టుగాను, ప్రస్యన్ది- ప్రవర్తించుచున్న, మందస్మితమ్- చిరునగవుగలయట్టి, ప్రేమోద్భేదనిరర్గళ ప్రసృమర ప్రవ్యక్తరోమోద్గమమ్- ప్రేమ-ప్రేమయొక్క, ఉద్భేద- ఆవిర్భావముచేత, నిరర్గళ- అడ్డములేనట్టుగాను, ప్రసృమర- ప్రవర్తించుచున్నయట్టి, ప్రవ్యక్త-మిక్కిలి తెలియుచున్న, రోమోద్గమమ్ - గగుర్పాటుకలయట్టి, శ్రోతృశ్రోత్రమనోహర వ్రజవధూలీలా మిథోజల్పితమ్- శ్రోతృ- వినువారలయొక్క- శ్రోత్ర-కర్ణములకు, మనోహర, మిక్కిలివినదగిన, వ్రజవధూ - గోపస్త్రీలయొక్క, లీలా- విలాసములతోఁగూడిన, మిథోజల్పితమ్ - అన్యోన్యవచనములు గలయట్టి- భగవతః - శ్రీకృష్ణమూర్తియొక్క, క్రీడానిమీలద్దృశోః - క్రీడా- విలాసార్థమయి - నిమీలత్ - మూసికొను, దృశోః- నేత్రములయొక్క, మిథ్యాస్వాపమ్ - కపటనిద్రను, ఉపాస్మహే - ఉపాసించుచున్నాను, క్రీడానిమీలద్దృశః - అనిపాఠాంతరముంగలదు - ఈపక్షమున నీపదము, భగవతః_ అను శబ్దమునకు విశేషణముఁ జేయవలెను, క్రీడానిమీలద్దృశః - క్రీడాపరిహాసార్థము - నిమీలత్ - మూసికొను, దృశః - నేత్రములుఁగల, భగవతః- శ్రీకృష్ణమూర్తియొక్క, అనియన్వయము.

చ॥ వలపులఁగుల్కు-గోపికల వారణనొందారు తోడనాడ మా।
టలఁజెవికింపుగాఁపినఁ దోడంగితెనర్చిన మందహాసముఁ ! బలుమఱు
నాగిపోనుగరుపాటుఁ గనూరకకన్ను మోడ్చున। జ్జలరుహపత్రనేత్రు
నియసత్యపునిద్దుర కేను ప్రమొక్కెదన్॥ ౨౧

తా. కొంచెముతో సమమగునట్టుగా నడ్డగింపఁబడుచు గోమలంబుగనుం జెడిచిరునగవును-ప్రేమావిర్భావంబుచేఁ బొడమియెల్లరకుం దెలియు కగ్గురుపాటును- వినియెడివారలచెవులకింపగు గోపికలయుపాలంభవచనంబులుం గలిగివెలయు నరమోడ్పుగన్నుదోయిగల శ్రీకృష్ణుని కపటపునిద్దుర నుపాసించుచున్నానుట.

శ్లో॥ విచిత్రపత్రాఙ్కురశాలి బాలాస్తనాన్తరం మానివనోన్తరం వా। అపాస్యబృన్దావనపాదపాస్యముపాస్య మన్యన్నవిలోకయామః॥

టీక. విచిత్రపత్త్రాంకురశాలిబాలాస్తనాంతరం - విచిత్ర-నానావిధములయిన, పత్త్రాంకుర - మకరికాపత్త్రవిశేషములచేత, శాలి - ఒప్పుచున్న, బాలా- లేప్రాయపు నెలతయొక్క, స్తన - చన్నుల యొక్క, అన్తరం- మధ్యప్రదేశమును, మౌనిమనోన్తరంవా- మౌని- మునులయొక్క, మనః- మనస్సుయొక్క, అన్తరంవా- మధ్యమును, బృందావనపాదపాస్యమ్-బృందావన- బృందావనమండలి - పాదప - వృక్షముయొక్క, ఆస్యం - ఉనికిపట్టును, అపాస్య- విడిచి, ఉపాస్యం-శ్రీకృష్ణనివాసస్థానమును, అన్యత్-ఇతరమును, నవిలోకయామః- చూడము.

చ॥ లలితవిచిత్రపత్త్రమహిళాకుచపాళిగళిందజావన । స్థలల
వలీలతాగృహవితర్దికలుం దమునిమానసాబ్జముల్ । జలరుహపత్త్రనే
త్రుని విలాసనివాసములిందుఁ దక్క నే। నెలవున నైనఁ గన్గొనఁగ నేతుఁగా
మేఘమూర్తశిఖావతంసునిన్॥ ౨౨

తా. నానావిధంబులగు మకరికాపత్త్రవిశేషంబులచే నొప్పు లేజవ్వనంపు చేడియల కుచమధ్యంబులను - మౌనుల మనంబులను - బృందావనంబు తరువుల చేరువలనుండక్క దక్కిన నెలవులం గృష్ణమూర్తిని గనుంగొన నరిది యనుట.... ... ... ... ... ... ... ... ... ... ... ※

శ్లో॥ సార్ధం సమృద్ధై రమృతాయమానై రాధ్మాయమానై ర్ముర
ళీనినాదైః । మూర్ధాభిషిక్తం మధురాకృతీనాం బాలం కదా నామ వి
లోకయిష్యే॥ ౨౩

టీక. ఈశ్లోకంబు మొదలు నాలుగు శ్లోకముల చేత మనంబునం దోఁచిన శ్రీకృష్ణమూర్తిని గన్నులఁ గనుఁగొనఁ గోరి ప్రార్థించుచున్నాఁడు- ఆధ్మాయమానైః-ముఖవాయువుచే సంపాదింపబడుచున్నట్టి, సమృద్ధైః- సంపూర్ణములైనవి గనుకనే, అమృతాయమానైః - అమృతమువలె నాచరించుచున్న, మురళీనినాదైస్సార్ధమ్- వేణునాదములతోఁ గూడి, మధురాకృతీనాం, సుందరులలోపల, మూర్ధాభిషిక్తం- సార్వభౌముఁడగు, బాలం - బాలుఁడైన, శ్రీకృష్ణమూర్తిని, కదానామ- ఏసమయమునందు- విలోకయిష్యే-చూడగలను.

ఉ॥ చక్కనివారి నెల్ల నెకసక్కెములాడెడు చక్కనయ్యనై ।
చొక్కుచుఁ దానమానలయ శోభితగానరసామృతంబున । ప్రక్కలఁబి
క్కటిల్ల మురళింబలికించెడి బాలు నెన్నఁడో । గ్రక్కునఁ గాంచి వ్రేత్తు
కొని కన్నుల నొత్తునఁ దత్పదాబ్జముల్॥ ౨౪

తా. వేణువునందుండు నెల్లగుణంబులచే నతిశయిల్లినకతంబున నమృతంబువలె నాచరించుచున్నవియై ముఖమారుతంబున సంపాదింపబడియెడి వేణుధ్వనులతోడ వన్నెకాండ్రకెల్లం దొరయైన వెలుంగుబాలుండైన కృష్ణమూర్తినేతఱింగాంచెదననుట.

శ్లో॥ శిశిరీకురుతేకదానుసశ్శిఖిపిఞ్ఛాభరణశ్శిశుర్దృశోః। యుగళంవిగళన్మధుద్రవస్మితముద్రామృదునాముఖేన్దునా॥ ౨౪

టీక. శిఖిపిఞ్ఛాభరణః- శిఖిపిఞ్ఛ- నెమలిపురిని-ఆభరణః-భూషణముగ గలిగిన, శిశుః- బాలుడగుకృష్ణుడు, విగళన్మధుద్రవస్మిత ముద్రామృదునా-విగళత్- జాఱుచున్న, మధుద్రవ - తేనియవాకగల, స్మిత, చిఱునగవుయొక్క, ముద్రా- ముద్రచేత, మృదునా- కోమలమయిన- ముఖేందునా-చంద్రుని వంటిముఖముతోడ, నః - మాయొక్క, దృశోః - నేత్రములయొక్క - యుగళం - ద్వంద్వమును, కదాను - ఏసమయమందు, శిశిరీకురుతే - చల్లగాజేయుచున్నాడు.

మ ॥ తలుకుంగన్నులచూపుకోపుసుధఁజిందన్ మందహాసంబువే । న్నెలనిగ్గుల్వెదఁజల్లనెమ్మొపురి వన్నెచ్చి న్నెమైమీఱనిగ్గులవక్త్రేందుకళావిలాసమునఁ జేరన్వచ్చికందోయిశీ। తలముం జేయఁగనందనంనునియాన్యంగాంచుటెం కెన్నఁడో॥ ౨౫

తా. నెమలిపురి భూషణంబుగఁగల శ్రీకృష్ణమూర్తి మకరంద ప్రవాహంబుగల లేనగవుగుఱుతుచేతం గోమలంబై చందురుంబోలెన నెమ్మొగంబులోడం గానుపించినాకన్నుగవ నెత్తఱిచల్లజేయుననుట.

శ్లో॥ కారుణ్యకర్బురకటాక్షనిరీక్షణేన తారుణ్యసంవళిత శైశవ వైభవేన । ఆపుష్ణతాభువనమద్భుతవిభ్రమేణ శ్రీకృష్ణచంద్రశిశిరీకురులోచనంమే॥ ౨౫

టీక. అద్భుతవిభ్రమేణ- అద్భుత- గోవర్ధనోద్ధరణాదికార్యములచేత ఆశ్చర్యభూతములైన, విభ్రమేణ - విలాసముగలది గనుకనే, భువనం - లోకమును, ఆపుష్ణతా- పోషించుచున్నట్టి, కారుణ్యకర్బురకటాక్షనిరీక్షణేన-కారుణ్య-దయచేత, కర్బుర - చిత్రవర్ణముతోఁగూడిన, కటాక్ష- కడకన్నులయొక్క - నిరీక్షణేన- చూపులుగల, తారుణ్యసంవళితశైశవవైభవేన, తారుణ్యయౌవనముతోడ, సంవళిత- కూడుకొన్న, శైశవ- బాల్యముయొక్క, వైభవేన, సంపదచేత, శ్రీకృష్ణచన్ద్ర - చంద్రసదృశుడవైన యో శ్రీకృష్ణస్వామి,

మే- నాయొక్క, లోచనం-నేత్రమును, శిశిరీకురు- చల్లగాఁజేయుము.

శా ॥ కూడింగూడని ప్రాయపున్నొసగను పెక్కుల్పిక్కిలై పెం
కొంగా । నీమం జోషము లేని వీక్షణసుధావృష్టిన్ జగత్సృష్టికిన్ । దో
షమ్మీడగు గోకులాంబునిధిచంద్రుంగాంత సాంద్రపదమిన్ । జూడం
జూడఁగ దృక్కు కోరికలు గాంచున్ సంతతానందమున్॥ ౨౫

తా. గోవర్ధనోద్ధరణంబు మొదలగునాశ్చర్య కరంబులగు విలాసంబు లం గలిగి,జగంబు నెల్లఁబోషించెడిపై-కృపారసంబుచేనైన చిత్రపర్ణంబులోఁ గూడినకడకంటి చూపులుఁగలిగి- జవ్వనంబులోడం గూడినబాల్యంబుగలిగి, తేజరిల్లు దివ్యమంగళ విగ్రహంబుచేత ఓ శ్రీకృష్ణస్వామి,నాకన్నులం గానంబడు మనుట.

మా ॥ కదానాకాళిందీకువలయ దళశ్యామలతరాఃకటాక్షాలక్ష్యే
న్తేకిమపికరుణావీచినిచితాః । కదానాకన్దర్పప్రతి భటజటాచంద్రశిశి
రాఃకమప్యన్తస్తోష న్దదతిమురళీకేళినినదాః॥ ౨౬

టీక॥ కాళిందీకువలయదళశ్యామలతరాః - కాళిందీ - యమునయందలి,కువలయ- నల్లకలువలయొక్క - దళ- రేకులవలెను, శ్యామలతరాః- మిక్కిలి శ్యామల వర్ణముగల, కటాక్షాః - కడకన్నులు,కిమపికరుణావీచినిచితాః, కిమపి - చెప్ప నలవిగాని, కరుణా - దయయొక్క, వీచి - అలలచేత, నిచితాః - వ్యాపింపంబడినవియైు, కదానా - ఎప్పుడు, మయా - నాచేత - లక్ష్యన్తే - చూడబడుచున్నవి, కందర్పప్రతిభటజటాచంద్రశిశిరాః - కందర్ప - మన్మథునియొక్క - ప్రతిభట - శత్రుఁడగు హరునియొక్క, జటా - జడలయందుండెడి, చంద్ర - చంద్రునివలె, శిశిరాః - ఆహ్లాదకరములగు, మురళీకేళినినదాః - మురళి - వేణువుయొక్క - కేళి - క్రీడార్థమయిన, నినదాః - నాదములు, కిమపి-చెప్పనలవిగాని,అంతస్తోషమ్-అంతఃకరణాహ్లాదమును,కదానా, ఎప్పుడు, దదతి- యిచ్చుచున్నవి॥

ఉ॥ఎన్నఁడొయామునోత్పలసితేతరలోలదయార్ద్రదృగ్విలా ।
సోన్నతినాపయిన్ నిగుడియుండుట శంభుజటాటవీతటా । సన్నసుధాం
శుశీతలలసన్మురళీనినదామృతంబుచే! వెన్నుఁడు నాచుమీనుఁకపిం దోస
రింపఁదలంచు టెన్నఁడో॥ ౨౭

తా. యమునయందలి నల్లకలువ రేకులకైవడినల్లనగుచు జెప్పనలవిగాని కరుణాతరంగంబుల నింపింపంబడు కడకన్నులు నాచే నెన్నఁడు గానంబడును-

శిశువికడయందలి చంద్రునికరణి నాస్వాదంబు నొసంగంజాలిన వేణువినోదనాదంబు లెన్నడు నామనంబునకు సంతోషంబు జేయునోయనుట.

శ్లో॥ అధీరమాలోకిత మార్ద్రజల్పితం గతఞ్చ గమ్భీరవిలాసమన్థరమ్। అమన్దమాలిఙ్గిత మాకులోన్మదస్మితఞ్చ తే నాథ వదన్తి గోపికాః॥

టీక. హేనాథ ఓ శ్రీకృష్ణస్వామి, తే- నీయొక్క, ఆలోకితం- చూచుటను, అధీరమ్- చపలమునుగాను, గతం- నడచుటను, గమ్భీరవిలాసమన్థరమ్- గమ్భీర- తెలియనశక్యమైన, విలాస- విలాసములచేత, మన్థరమ్, మందమునుగాను, ఆర్ద్రజల్పితం సరసంబుగా మాటాడుటను, ఆకులోన్మదస్మితం- ఆకుల, వ్యాప్తము గు, ఉన్మద - మిక్కిలిమదముతోగూడిన, స్మితం - నగవునుగలదానిగాను, ఆలిఙ్గితం- కౌఁగిలించుటను, అమన్దమ్- గాఢమయినదానిగాను, గోపికాః, గోపికలు వదంతి- చెప్పుచున్నారు॥

ఉ॥ అందముగులుకు నీయలసయానము మాటల తేనెసోనమే। లైందుచ్చు చిఱునవ్వు సుధఁజెందుఁ గటాక్షములారమించుకుఁ। విందులుగాఁగిలింతకను వింతయటంచును గోపకాంతలా। నందముతోడఁబలుకరు నాథ భవన్మహిమానుభావముఁ॥ ౨౭

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తి, నీచూపునతిచపలంబుగను, గమనంబునతిమందంబుగ, నాలింగనంబునతిగాఢంబుగను, వచనంబునతివిలాసరస దరహాసంబుగ నెల్లగోపికలుం బలుకుదురుగావున నాకన్నుఁగవ నీదర్శనంబుగోరుచున్నదియనుట॥

శ్లో। అస్తోకస్మితభరమాయతాయతాక్షం నిశ్శేషస్తనమృదితం వ్రజాఙ్గనాభిః। నిస్సీమస్తబకితనీలకాన్తిధారం దృశ్యాసం త్రిభువనసున్దరం మహస్తే॥ ౨౮

టీక॥ అస్తోకస్మితభరం అస్తోక అధికమయిన, స్మిత చిఱునగవనియెడి, భరమ్, భారముగలయట్టి, ఆయతాయతాక్షం ఆయతాయత దీర్ఘములైనవానితో సమములయిన, అక్షమ్ నేత్రములుఁగలయట్టి, వ్రజాఙ్గనాభిః గోపస్త్రీలచేత, నిశ్శేష స్తనమృదితం నిశ్శేష మిగులనట్టుగాను, స్తన స్తనములచేత, మృదితం పీడింపఁబడినయట్టి, నిస్సీమ స్తబకిత నీలకాంతిధారమ్ నిస్సీమ మేరలేనట్టుగాను, స్తబకిత, సంజాతగుచ్ఛములుగాఁ జేయబడిన నీల నల్లనివియైన కాంతి కాంతులయొక్క ధారం ధారలగలయట్టి. త్రిభువనసుందరమ్, త్రిభువన, మూఁడులోకములయందుం జెడివారలకంటెను సుందరం,

సుందరమయిన, తే - నీయొక్క, మహః - తేజస్వీశరీరము, ద్రష్టవ్యసమ్ చూచెదఁగాత.

ఉ॥ మబ్బుజిగిన్ నగెడగు నంచితకోమల నీలదేహముం గు
బ్బ మిటారిచన్నవల క్రొద్దిని వ్రేతలు గౌఁగలింపఁగా। నుబ్బుచు మందహా
సరుచి యొప్పఁగఁ గొప్పగు కన్నుదోయిచే। నబ్బుర మైన చక్కని నీయొ
యారపు తేజముఁ గాంచెద న్మదిన్॥ ౭౮

తా. అతిశయంబగు మందహాసంబును- మిక్కిలి గొప్పలగు కన్నులంగ లిగి గోపికల పాలిండ్లచే నధికంబుగ బీడింపంబడుచు వేఱలేని నల్లనైన కాంతి ప్రవాహంబు గలిగి లోకత్రయంబు నందుండు సోయగంబుల కుంపుకయి వడి వెలుంగు నీ తేజశ్శరీరంబు జూచెదం గాతయనుట.

శ్లో॥ మయి ప్రసాదం మధురైః కటాక్షై ర్వంశీనినాదానుచరై ర్విధేహి।
త్వయి ప్రసన్నే కిమిహాపరై స్న స్త్వయ్యప్రసన్నే కిమిహాపరైర్నః॥

టీక. వంశీనినాదానుచరైః - వంశీనినాద-వేణునాదమును, అనుచరైః అనుసరించుచున్నయట్టి, మధురైః-మనోజ్ఞములైన, కటాక్షైః - కడకంటిచూపులచేత, మయి - సంసారబద్ధుడనైన నాయందు, ప్రసాదమ్- అనుగ్రహమును, విధేహి - చేయుము, త్వయి - (సర్వేశ్వరుఁడవైన నీవు) ప్రసన్నే సతి - ప్రసన్నుఁడవగుచుండ, ఇహ-ఈలోకమందు, అపరైః- ఇతరులతోడ, నః-మాకు, కిమ్- ఏమిప్రయోజనము, త్వయి- నీవు, అప్రసన్నే సతి - ప్రసన్నుడవు గాకుండ, ఇహ- ఈలోకమందు, అపరైః- ఇతరులతోడ, కిమ్- యేమిప్రయోజనము.

ఉ॥ నీవు ప్రసన్నదృష్టిఁ గరుణించిన నాగుణ మెట్టిదేనియున్। చావ
నమానునీకృపకు భాత్రముగాక చరించువేళన। న్నావగఁజాల రెవ్వ
రునుఁ గావున వేణురవానుసారిలీ। లావహమాకటాక్షమున లాలనఁ
జేయుము నందనందనా॥ ౭౯

తా. నీవు ప్రసన్నుండవై సప్పుడీలోకంబున బరులతో నేమి ప్రయోజనంబు - నీవు ప్రసన్నుండవు గాకయుండిన నీలోకంబున నితరులతోడ నేమికార్యంబు కావున సంసారబద్ధుండనగు నాయందు వేణుగానంబు ననుసరించు మనోహరంబులగు కడకంటిచూపులచే ననుగ్రహంబు జేయుమనుట॥

శ్లో॥ నిబద్ధమూర్ధాంజలి రేష యాచే నీరంధ్రదైన్యోన్నతముక్తకణ్ఠమ్। దయాంబుధే దేవ భవత్కటాక్ష దాక్షిణ్యలేశేన సకృన్నిషిఞ్చ॥

టీక. ఏషః- ఈనేను-నిబద్ధముగ్ధాంజలిస్సన్- నిబద్ధ కూర్పఁబడినయట్టి ముగ్ధ- మూఢమయిన, అంజలిస్సన్- కేలుమోడ్పుఁగలవాఁడనై-నిరస్త్రదైన్యోన్నతముగ్ధకణ్ఠమ్ - నిరస్త్ర-దట్టమయిన- దైన్య- దీనతచేత, ఉన్నత-ఎత్తఁబడిన-ముగ్ధ - గద్గదముగాఁజేయఁబడిన, కణ్ఠమ్ - కుత్తుకఁ గల్గునట్టుగాను, యాచే - యాచించుచున్నాను, దయామ్బుధే - దయాసముద్రుఁడవైన, హేదేవ-ఓ శ్రీకృష్ణస్వామి - భవత్కటాక్షదాక్షిణ్యలేశేన, భవత్ - నీయొక్క, కటాక్ష-కడకన్నులయొక్క, దాక్షిణ్య- వితరణముయొక్క, లేశేన-కొంచెముచేత, సకృత్ - ఒకమాఱు నిషిఞ్చ తడుపుము.

ఉ॥ వేమఱుఁ గేలుమోడ్చి నినువేఁడెద నేనెలుఁగెత్తి యెత్తితిన్।
నామొఱ యాలకింపు కరుణానిధి దీనశరణ్య సంతతో। ద్దామభవత్కృ
పారససుధామధురార్ద్రతరంగపాళిలో। నేనికొంచెంత నాపయినొకిం
చుక నించిననందనందనా॥
౩౦

తా॥ ఓయిదయాసముద్రుఁడవైన శ్రీకృష్ణ. కృపారసంబుఁదొలుకుకడకంటిచూపులచేనన్నొకసరి చూడుమనుచునీ సంసారబద్ధుండయిన యేను దైన్యంబున నెలుంగురాల్పడం బ్రార్థించెదననుట- అనగా నీకటాక్ష దర్శనంబున శరభంగుఁడు మొదలగు వారలవలెఁ గృతార్థుఁడనగుదుననుట.

శ్లో॥ పిఞ్ఛావతంసరచనోచిత కేశపాశే పీనస్తనీనయనపఙ్కజ
పూజనీయే। చన్ద్రారవిన్దవిజయోద్యతవక్త్రబిమ్బే చాపల్యమేతినయన
న్తవ శైశవేనః॥
౩౧

టీక. పిఞ్ఛావతంసరచనోచిత కేశపాశే-పిఞ్ఛ నెమలిపురియొక్క- అవతంస భూషణముయొక్క, రచనాఅలంకారక్రియకు, ఉచిత, తగిన, కేశపాశే- సిగగలయట్టి, పీనస్తనీనయనపఙ్కజపూజనీయే- పీనస్తనీ-జవ్వనులయొక్క నయన, నేత్రములనియెడు, పఙ్కజ- కమలములచేత, పూజనీయే - పూజింపఁదగినయట్టి, చన్ద్రారవిన్ద విజయోద్యత వక్త్రబిమ్బే- చన్ద్ర- చంద్రునియొక్క, అరవిన్ద, కమలమునయొక్కయు, విజయ జయించుటయందు, ఉద్యత- ఉద్యుక్తమయిన, వక్త్రబిమ్బే- ముఖమండలముఁగల, తవ నీయొక్క, శైశవే బాల్యమందు, నః మాయొక్క, నయనమ్ నేత్రము, చాపల్యమ్, చపలత్వమును, ఏతి, పొందుచున్నది.

మ॥ పొగరుల్ సిబ్బెపు గుబ్బలుబ్బఁగదమిన్ బూబోఁడ్లు గందోయి
యన్ వ్రిగమిన్ బూజలొనర్ప నెమ్మిపురిక్రొమ్ముంచుల్ సిగన్ దట్టమై।

నిగుడన్ జందురుఁజొక్క సేయుముఖకాంతిన్వింతనైమెఱుపు నీసొగసుం
బ్రాయముఁజూచినానయనముల్ సొంపొందఁగాఁ గోరెడిన్॥ ౧౩

తా. నెమలిపురియనుభూషణంబుచేఁ గైసేయందగినసిగగలిగి - జవరాండ్రకన్నుఁ దామరలచేఁ బూజింపందగి- చంద్రుని- కమలంబును- జయింపనున్యుక్తంబగుచున్న ముఖమండలంబునుం గలిగిన నీబాల్యంబందు నామనసు బాసఁజేయుచున్నదియనుట.

శ్లో॥ త్వచ్ఛైశవన్త్రిభువనాద్భుతమిత్యవైమియచ్చాపలఞ్చమమవాగవివాదగమ్యమ్ । తత్కిం కరోమి విరణన్మురళీవిలాస ముగ్ధం ముఖాంబుజముదీక్షితుమీక్షణాభ్యామ్॥ ౩౨

టీక. త్వచ్ఛైశవమ్- త్వత్ - నీయొక్క, శైశవమ్- బాల్యము, త్రిభువనాద్భుతమ్- త్రిభువన- మూఁడులోకములకును, అద్భుతమ్-ఆశ్చర్యసంపాదకమని, అవైమి- ఎఱుంగుదును, మమ- నాయొక్క, చాపలమ్- చపలమనునది, యత్- ఏదిగలదో, తత్- అది, అద్భుతమ్- ఆశ్చర్య సంపాదకమని, అవైమి- ఎఱుంగుదును, వాగవివాదగమ్యమ్, వాక్- వాక్కులచేత, అవివాద- వివాదములేనట్టుగాను, గమ్యమ్- తెలుసుకోబడినయట్టి, విరణన్మురళీవిలాసముగ్ధమ్- విరణత్ - మిక్కిలి మ్రోయుచున్న, మురళీ - వేణువుయొక్క, విలాస - గానవిశేషములచేత, ముగ్ధమ్- సుందరమైన, ముఖాంబుజమ్- ముఖకమలమును, ఉదీక్షితుమ్- చూచెడికొఱకు, కింకరోమి- ఏమిచేయుదును.

మ॥ పరమాశ్చర్యమునీదుశైశవము సెప్పన్ రాదులోకంబునన్। వరుసన్నా చపలత్వమట్టిదయనిర్వాచ్యంబు చర్చింపుమా। మురళీనాదసుధామనోహరముఖాంభోజాతమీకన్నులన్ । బరిశీలింపఁగఁగోరితినా డసులభంబాతారతమ్యజ్ఞతల్॥ ౩౨

తా. నీబాల్యంబుముల్లోకంబులకునాశ్చర్యంబుఁబుట్టించెడిదియని యెఱుంగుదు- విషయంబులవెంటనంటునాచాపల్యంబునట్టిదయని యెఱుంగుదు నెఱింగియు నిర్వివాదంబుగ నావాక్కులకు విషయమై వేణుగానామృతంబుచే సుందరంబగు నీనెమ్మోముఁదామరం జూడగోరియు నెవ్వాడ నేమిసేయుదునను ట.

శ్లో॥ పర్యాచితామృతరసాని పదార్థభఙ్గీ వల్గూనివల్గితవిశాలవిలోచనాని। బాల్యాధికాని మదవల్లవభావితాని భావేలుఠన్తిసుదృశాన్తవజల్పితాని॥ ౩౩

టీ. పర్యాచితామృతరసాని-పర్యాచిత-స్రవించుచున్న, అమృతరసాని- సుధారసముగలయట్టి, పదార్థభఙ్గీఫల్గూని-పదార్థ-మణిసువర్ణాదులయొక్క, భఙ్గీ- పఙ్క్తులయొక్క, ఫల్గూని- అసారముఁగలయట్టి, వల్గితవిశాలవిలోచనాని- వల్గిత- రతమొదలగువానిసూచించుచేష్టలతోఁగూడినట్టి, విశాల-విశాలములయిన, విలోచనాని- నేత్రములఁగలయట్టి, బాల్యాధికాని- బాల్యాతిరిక్తములయినట్టి, మదవల్లవభావితాని- మద-యౌవనవంతులైన, వల్లవ-గోపకులచేత, భావితాని- చెప్పఁదగిన, తవ, నీయొక్క. జల్పితాని- వచనములు సుదృశామ్- విద్వాంసులయొక్క, (గోపికలయొక్క యనియర్థాంతరము) భావే- మనస్సునందు, లుఠన్తి- వర్తించుచున్నవి.

ఉ॥ కమ్మనితేనియల్గులుకఁగా వెలదేఱనిమానికమ్ములన్। జిమ్మ
చుఁబెళ్కుఁజూపువిలసిల్లి గవల్లవభావితమ్ములై। యిమ్మగుబాల్యరీతి
కేనయింపఁగరానినిజోక్తిబాలిక। ల్నెమ్మదినెంచియెంచితమిసెక్కొ ౩౩
నఁజేర్చినశౌరిఁగాంచెదన్॥

తా. స్రవించుచుండు నమృతంబుఁగల్గి మణిసువర్ణాదులయందసారత్వంబుఁదెలుపునవియై రతిమొదలగువాని సూచించు చేష్టలంగలకన్నులంగలిగి బాల్యంబు నతిక్రమించినవై యౌవనవంతులగు గోపాలకులచే సంభావింపంబడిన నీవచనంబులు విద్వాంసుల మనంబులయందుఁ దిరుగుడుపడుచున్నవియనుట.

మూ॥ పునఃప్రసన్నేనముఖేన్దుతేజసా పురోవతీర్ణస్య కృపామ
హామ్బుధేః। తదేవలీలామురళీరవామృతం సమాధివిఘ్నాయ కదాను ౩౪
మే భవేత్॥

టీక. పునఃప్రసన్నేన- మిక్కిలిస్వచ్ఛమైన, ముఖేన్దుతేజసా- ముఖేన్దు- ముఖచంద్రునియొక్క, తేజసా- తేజస్సుతోఁగూడ, పురోవతీర్ణస్య- పురః, పురోభాగమందు, అవతీర్ణస్య - అవతరించిన, కృపామహామ్బుధేః - దయా సముద్రుండైన శ్రీకృష్ణస్వామియొక్క, తత్- ఆప్రసిద్ధమయిన, లీలామురళీరవామృతమ్-లీలా- విలాసముతోగూడిన,మురళీరవామృతమేవ-అమృతమువంటి వేణునాదమే, మే- నాయొక్క, సమాధివిఘ్నాయ- సమాధి-ధ్యానముయొక్క, విఘ్నాయ- విఘ్నముకొఱకు, కదాను- ఎప్పుడు- భవేత్ - అగును,

ఉ॥ అందెలుఘల్లుఘల్లురననాడుచు వేణువునందుగీతమానంద
ముతోడఁబాడుచును నాటితెఱంగునఁ గన్నుదోయికి। న్విందుఘటిల్లఁ

గన్నైపటనిల్చి ప్రసన్నముఖాంబుజంబుతో । నందకుమారుఁడెన్నఁటికొనరుచునోనాదుసమాధిభంగముల్॥ ౩౪.

తా. మిక్కిలిస్వచ్ఛంబగు నెమ్మొగంబను చందురుని తేజంబులోదయా సముద్రుండై నామ్రుందటం గానుపించిన శ్రీకృష్ణమూర్తియొక్క విలాసంబుతోఁ గూడినవేణుగానంబు నాసమాధినెప్పుడు సెఱుచుఁగాతయనుట, ※

మూ॥ భావేనముగ్ధచపలేనవిలోకనేన మన్మానసేకిమపిచాపలము ద్వహన్తమ్। లోలేనలోచనరసాయన మీక్షణేనలీలాకిశోరముపగూహితుముత్సుకాస్మః॥ ౩౫

టీక. ముగ్ధచపలేన - ముగ్ధ - సుందరమైన, చపలేన- చంచలమైనట్టి, విలోకనేన-చూపుచేత, భావేన- చేష్టచేతను, మన్మానసే- మత్- నాయొక్క, మానసే- చిత్తమందు, కిమపి- అనిర్వాచ్యమైన, చాపలమ్- చపలత్వమును,ఉద్వహన్తమ్- చేయుచున్నట్టి, ఈక్షణరసాయనమ్ - ఈక్షణ- చూపులకు, రసాయనమ్- లేహ్యావిశేషణమైన, లీలాకిశోరమ్- లీలా- విలాసముతోఁగూడిన, కిశోరమ్- బాలుఁడైన శ్రీకృష్ణుని, లోలేన- శ్రీకృష్ణదర్శనాకాంక్షియగు, ఈక్షణేన చూపుచేత, ఉపగూహితుం- ఆలింగనముజేయుకొఱకు, ఉత్సుకాస్మః- ఉద్యుక్తుఁడనైతిని. ※

ఉ॥ చక్కనిమోముతోఁజెలిమిఁసల్పెడుముద్దుల కోడిగంబుతోఁ। జొక్కపు నవ్వుతోఁబెళుకుచూపులతోఁదమిఁగొల్పుబాలకుం। గ్రక్కననక్కుఁజేర్చుకొని కన్నులపండువుగామనంబులో। నక్కఱదీరఁగాం చెదనహర్నిశముల్ వసుదేవభాగ్యముల్॥ ౩౫

తా. సుందరంబగు చూపుచే జెప్పనలవిగాని చపలంబగు చేష్టచేతను నామనంబు జలింపంజేయుచున్న కన్నులపండువగు బాలకృష్ణమూర్తినిమిక్కిలియాసక్తింజేయు చూపుచే గౌగిలింప నుద్యుక్తుండనైతిననుట. ※

మూ॥ అధీరబిమ్బాధరవిభ్రమేణ హర్షార్ద్రవేణుస్వరసమ్పదా చ। అనేనకేనాపి మనోహరేణ హాహన్తహాహన్తమనోధునోతి॥ ౩౬

టీక. కేనాపి- విర్వచింప నశక్యమయినట్టి, మనోహరేణ - మిక్కిలిమనోజ్ఞమైన, అనేన- ఈలోచుచున్న, అధీరబిమ్బాధరవిభ్రమేణ - అధీర - చపలమైన, బిమ్బ-దొండపండువంటి- అధర - అధరోష్ఠముయొక్క, విభ్రమేణ-విలాసచేత,హర్షార్ద్రవేణుస్వరసమ్పదాచ-హర్ష-మనోజ్ఞములుగాజేయుం బడిన, ఆర్ద్ర- సుఖకరములైనట్టి, వేణుస్వర -పిల్లనఁగ్రోవియందలిషడ్జస్వరము

లయొక్క, సమృద్ధా చ- సమృద్ధిచేతను, మనః-మనస్సు, ధనోతి- చలించుచు న్నది, హాహా న్త- అన్యాయము, హాహా న్త- అన్యాయము. ※

మ ॥ చలవింబాధరలీల గ్రొమ్మొలకగాఁ శారీరకాంతిచ్ఛటల్।
జలదానీకముగారణస్మరళిగ జ్జాక్రీతగానెంచిని । చ్ఛలునాట్యంబుమనో
మయూరమొనరించ స్నెచ్ఛకండోయికీ । ఘలమీమోహనరూపముం
గనెడు సౌభాగ్యంబు చింతింపఁగన్॥ ౩౬

తా. మనోహరంబగుచుఁ జెప్పనలవిగాకయుండి యీ ముందటఁ దోచుచున్న చలించుచున్న కెమ్మోవిలీలచేతను మనోహరంబుగాఁ జేయబడిన వేణునాద సంపదచేత నామనంబు చలించుచున్నది యనుట. ※

మూ॥ యావన్నమేనిఖిలమర్మదృఢాభిఘాత, స్సంధిబన్ధన ముదేతిన
వోపతాపః।తావద్విభోభవతుతావకవక్త్రచన్ద్రచన్ద్రాతపద్విగుణి
తామమచిత్తధారా॥ ౩౭

టీక. హేవిభో - ఓయిశ్రీకృష్ణ- నవోపతాపః - మరణ వేదనావిశేషము, మే- నాయొక్క, నిఖిలమర్మదృఢాభిఘాతనిస్సన్ధిబన్ధనమ్- నిఖిల- సమస్తమైన, మర్మ- నెలవులయందు, దృఢ- మిక్కిలి, అభిఘాత- కొట్టుటచేత-నిస్సన్ధిబన్ధనమ్ - పోగొట్టఁబడిన అవయవవిశేషములు గలుగునట్టుగాను, యావత్ - ఎంతకాలము, నోదేతి-పుట్టకయుండునో, తావత్ - అంతపర్యంతము, మమ- నాయొక్క, చిత్తధారా,చిత్తపరంపర- తావకవక్త్రచన్ద్రచన్ద్రాతపద్విగుణితా, తావక- నీసంబంధియైన,వక్త్రచన్ద్ర-ముఖచంద్రునియొక్క,చన్ద్రాతప. వెన్నెలచేత, ద్విగుణితా- రెండింతలుగా చేయఁబడినది, భవతు-అగుగాత.

మ ॥ శతవర్షంబులమీఁదనొందుదు రవస్థన్ జెందిలోఁగుందిబా ।
ధితమైయింద్రియగోళముల్మిగులనంధీభూతమగ్గాకముం । దతిసుప్పొం
గెడుఁగాత దావకసుధాధారాళవేణుస్వనో। న్నతలావణ్యరమానివా
సముఖచంద్రజ్యోత్స్నచేనామనంబిటన్॥ ౩౭

తా. ఓయిశ్రీకృష్ణమూర్తీ యెంతకాలంబు సమస్తమర్మస్థానఘాతంబున బ్రిదిలునవయవంబులుగలుగునట్లు నాకుమరణంబు దోపకయుండునో అంతపర్యంతంబును నేత్రమార్గంబున వెడలునాచిత్తపరంపరనీ నెమ్మోముచందురువలనం బొడము వెన్నెలచేసుప్పొంగుగాతయనుట.

మూ॥ యావన్నమేనరదశాదశమీదృశోపిరన్ధ్రాదుదేతితిమిరీకృతస

ర్వభావా । లావణ్యకేళిసదనం తవ తావదేవ లక్ష్మ్యా సముత్క్వణితవే
ణుముఖేన్దుబిమ్బమ్॥

టీక. తిమిరీకృతసర్వభావా- తిమిరీకృత - చీకటులుగాఁజేయఁబడిన, సర్వ-సమస్తమైన, భావా- పదార్థములుగలిగిన, దశమీ- పదియవదైన, నరదశా-నర-మనుష్యులయొక్క- దశా-అవస్థ, మే-నాయొక్క, దృశః-నేత్రములయొక్క, రన్ధ్రాత్- రంధ్రమువల్లను, యావత్- యెంతకాలము,నోదేతి-పుట్టదో, తావత్- అంతపర్యంతము, లక్ష్మ్యా- సౌందర్యముచేత, లావణ్యకేళిసదనం- లావణ్య- కాంతివిశేషమునకు, కేళీసదనం- క్రీడాగృహమైనట్టి, తవ- నీయొక్క, సముత్క్వణితవేణుముఖేన్దుబిమ్బమ్ - సముత్క్వణిత - మిక్కిలి యుత్పత్తియగుచున్నధ్వని విశేషముగల, వేణు- పిల్లఁగ్రోవిగలిగిన, ముఖ- ముఖమనియెడి, ఇన్దుబిమ్బమ్ - చంద్రబింబమును, చిత్తధారా - చిత్తపరంపర, యేతు-పొందునుగాత, ఈరెండుశ్లోకంబులకును తాత్పర్యంబొక్కటియగాన నాంధ్రికపద్యంబొక్కటియె సెప్పఁబడియెడియనది.

శ్లో॥ ఆలోలలోచనవిలోకన కేళిధారా నీరాజితాగ్రసరణేః కరుణామ్బురాశేః। ఆర్ద్రాణి వేణునినదైః ప్రతినాదపూర్ణై రాకర్ణయామి మణినూపురశిఞ్జితాని॥ ౩౯

టీక. ఆలోలలోచన విలోకనకేళిధారానీ రాజితాగ్రసరణేః- ఆలోల-చంచలములైన,లోచన- నేత్రములు గలగోపస్త్రీలయొక్క,విలోకన- చూపులయొక్క, కేళి-విలాసములతోఁగూడిన, ధారా-పఙ్క్తులచేత, నీరాజిత-నివాళింపఁబడిన, అగ్రసరణేః- పురోభాగముగల, కరుణామ్బురాశేః-దయాసముద్రుఁడైన శ్రీకృష్ణమూర్తియొక్క, ప్రతినాదపూర్ణైః- ప్రతినాద-ప్రతిధ్వనులచేత, పూర్ణైః- సంపూర్ణములైన, వేణునినదైః - వేణుధ్వనులతోఁగూడి, ఆర్ద్రాణి- రసవంతములైన, మణినూపురశింజితాని- మణి-రత్నమయములైన, నూపుర- కాలియందియలయొక్క, శింజితాని-ధ్వనులను, ఆకర్ణయామి-వినుచున్నాను.

మ॥ ననురక్షింపు కృపాపయోధియగు కృష్ణస్వామిలోలావలో
కనధారారుచిత్రోవకారతు లాసంగంజూచుచున్వేకమై జనుఁజేరఁగ
బ్రతినాదపూరమురళీ సంగీతతాళానురం। జనమంజీరరవామృతంబు
చెవినించఁగ విందునింపొందఁగన్॥ ౩౯

తా. చంచలంబులగు తనచూపులయందలి విలాసంబులచేఁ నివాళింపఁబ

నుచున్న వృషోభాగంబుగల దయాసముద్రుడైన శ్రీకృష్ణునియొక్క ప్రతిధ్వనులచే నెగడు వేణునాదంబులతోఁ గూడిన రత్నమయంబులైన కాలియందె యలనాదంబు వినుచున్నాననుట,

శ్లో॥ హేదేవ హేదయిత హేజగదేకబన్ధో హేకృష్ణ హేచపల
హేకరుణైకసిన్ధో హేనాథ హేరమణ హేనయనాభిరామ హాహా
కదానుభవితాసిపదందృశోర్మే॥ ౪౦

టీక. హేదేవ - ఓయిదేవ, హేదయిత-ఓప్రియుఁడ, హేజగదేకబంధో - ఓయిజగద్బంధుఁడ, హేచపల-ఓయిచపలుఁడ, హేకరుణైకసిన్ధో ఓయిదయాసముద్రుఁడ, హేనాథ- ఓనా నాథుఁడ, హేరమణ - ఓయిరమణుఁడా, హేనయనాభిరామ- ఓయి నేత్రమనోహరుఁడ, హేకృష్ణ-ఓయికృష్ణుఁడ, మే, నాయొక్క, దృశోః, నేత్రములయొక్క, పదమ్. విషయము, హాహా-అకటా, కదాను- ఎప్పుడు, భవితాసి-అగుచున్నావు.

శా॥ ఓదేవోత్తమ యోరమేశ దయితా యోలోకరక్షామణీ।
యోదామోదరకృష్ణచంచలహరీ యోసత్కృపాంభోనిధీ। యోదీనా
వననాథయోరమణ నిన్నెప్పారురమ్యాకృతిన్ । మోదంబొప్పఁగఁ
జూతునెన్నటికి నామోహంబుసంధిల్లఁగన్॥ ౪౧

తా. లీలాశుకుండు ప్రత్యక్షుండగు శ్రీకృష్ణునిఁ గనంగోరి యతఁడీయు కారణంబులనగపడకుండునోయని యూహించి తదనుకూలంబులగు స్తోత్రంబుల శ్రీకృష్ణమూర్తినిఁ గూర్చి విన్నపంబుఁ జేయుచున్నాఁడదియెట్లనిన హో కృష్ణమూర్తీ అకటా నాకన్నులకెన్నటికిం దోచెదవోయని ప్రార్థించి అప్రకాశమానుండనగు నేను నీకెటుల ప్రత్యక్షంబుగా నేర్తునని శ్రీకృష్ణుండు పలుకునోయని శంకించి, దేవుండవుగాన స్వతస్సిద్ధప్రకాశభావంబు నీయందయునికిం జేసి నాకగపడుటకేమి కొఱతయని విజ్ఞాపనంబొనరించి స్వతస్సిద్ధప్రకాశభావంబు నాయందు గలిగియుండినను, నాకు నీవు ప్రేమాస్పదుండవుగావు గాన నీకు నేఁ గానుపించననునోయని శంకించి, హోయికృష్ణ నీవు నాకు దయితుండవుగావున నీకు నే బ్రేమాస్పదుండఁ గాకపోవు. ఎట్లనివివరించి, హోయి నాకు నీవు ప్రేమాస్పదుండవైనను నీయట్టివానికి మఱియెవ్వనికైన నగపడుదుంగాక, నీకగపడనోపననునోయని యూహించి చపలుండవుగావున చాపల్యంబునం జేసి నాకన్నులకగపడెదవని వచ్రించి చాపల్యంబునం జేసి నీకు నేనగపడకయుండెదననునోయని యెంచి. కరుణైకసింధుండవుగానఁ జాపల్యంబుకన్న దయ

యధికంబుగనీయందుండుటంజేసి యవశ్యంబునునీవునాకుం గానంబడవలయునని విన్నపంబాచరించి దయాసముద్రుండనయ్యునీకునేను నేమివిశేష సంబంధంబుగల్గినప్రత్యక్షుంబగుదుననునోయనియాలోచించి - నాకునీవునాథుండవుగావునస్వస్వామిభావరూపవిశేషసంబంధంబునీకునాకుంగలిగియుండ నది కారణంబుగనాముందటందోచుట నీకవశ్యకర్తవ్యంబనివేడుకొని - ఇట్టివిశేషసంబంధంబునాకెల్లరయందుండుటంజేసి బహుస్త్రీనాయకుండగు వాఁడొకర్తెయందవిశేషానురాగంబుజేయుపగిదియే నొకానొకనికిం గానంబడిమెద - ననునోయనితలంచి- రమణుండవైనకతంబున నెల్లరయందు నిరుపాధికుండవై సమంబుగరమియించుటనీకుస్వభావంబకదా- దానంజేసియైనను ప్రత్యక్షుండవుగావలయునని ప్రార్థించి - రమణుండవైనను నీమనంబునందు రమియించెదంగాక కన్నులకెటుల గానంబడిమెదననునో యనితలంచి - నయనాభిరాముండవుగావున నాకన్నులకుం బండువుగ బ్రత్యక్షుంబొసంగుట యెన్నఁడొకోయని ప్రార్థింతుననుట.

మూ॥ అమూన్యధన్యాని దినాన్తరాణి హరే త్వదాలోకనమన్తరేణ।
అనాథబన్ధో కరుణైకసిన్ధో హాహన్తహాహన్తకథంనమామి॥ ౧౪

టీక. కరుణైకసిన్ధో - దయాసముద్రుఁడవైనయట్టి, అనాథబన్ధో- దీనబంధుండవైన, హేహరే -ఓకృష్ణ, త్వదాలోకనమన్తరేణ-నీదర్శనంబుమాని, అధన్యాని- కృతార్థములుగాని, అమూని - ఈనీదర్శనరహితములైన, దినాన్తరాణి- దినములను, హాహన్తహాహన్త, అకటకటా, కథమ్, ఏప్రకారము, నమామి, గడవుచున్నాను-

శా॥ నిన్నుంగానక నీకథల్వినక నిన్నేమాటుఁజిత్తంబులో। నె
న్నంజాలకనిన్నుఁజేరకనిన్నేవేళఁబూజింపలే। కన్నాయార్త
నికేతనాంగణనిధీ యయ్యోదయావారధీ। యెన్నేనిందినముల్ గ్రమిం
చితివృథా యేమందునాదుర్దశన్॥ ౧౪

తా. దయాసముద్రుండవై దీనబంధుండవైన యోకృష్ణ నీదర్శనంబు లేక కృతార్థంబులుగాని యీదినంబుల నకటకటా యెవ్విధంబునంగడపంజాలుదుననుట.

మూ॥ కిమిహకృణుమః కస్యబ్రూమః కథఙ్కృతమాశయా కథయత కథామన్యాంధన్యామహో హృదయేశయః। మధురమధురస్మే

రాకారే మనోనయనోత్సవే కృపణకృపణా కృష్ణే తృష్ణా చిరమ్బ
తలమ్బతే॥ ౪౨

టీక. బత- ఓజనులార, మధురమధురస్మేరాకారే- మధురమధుర-సుందరసదృశమైనయట్టి, స్మేర- కాంతియుతమైన, ఆకారే- ఆకృతిగలయట్టి, మనోనయనోత్సవే- మనః- మనస్సునకు, నయన- నేత్రములకు, ఉత్సవే-సంతోషకారణుఁడైన, కృష్ణే-శ్రీకృష్ణమూర్తియందు, కృపణకృపణా- కృపణసదృశమైన, తృష్ణా-ఆశ, చిరమ్-బహుకాలమునుండి, లమ్బతే- అవలంబించుచున్నది, ఆశయా-ఆసచేత, కథమ్- ఏప్రకారము, కృతమ్-చేయబడెను, కస్య- ఎవ్వనికి, బ్రూమః- చెప్పుదును, కిం-ఏమి, శృణుమః- విందును. కృష్ణః-కృష్ణుఁడు, హృదయేశయః - హృదయమందున్నాఁడు, అహో - ఆశ్చర్యము. అన్యామ్- మఱియొకటియైన, ధన్యామ్- కృతార్థమైన, కథామ్ - కథను, కథయత- నుడువుఁడు,

శా॥ ఏశాస్త్రంబులవిందు నేగురునితో నేమందు నెట్లవ్వనాకో।
యానేఁ ధన్యులు దెల్ప లేరకద ప్రత్యక్షుఁబుగా నద్దయా। రాజీవనే
త్రమనోభిరాము స్మితవక్త్రప్రాభవుం యాదవా। ధీశుఁ గోరిమదీ
యతృష్ణ యకటా హీనత్వముఁ జెందెడిఁ॥ ౪౧

తా. అధిక సౌందర్య సంపన్నంబగు నాకారంబుఁగల్గి మనంబునకును నేత్రంబులకును సంతోషంబుఁ జేయనోపు శ్రీకృష్ణునియందు చిరకాలంబునుండియధికంబయినయాస యవలంబించుచున్నది, యిట్టియాసచే నేమి సేయువాఁడ నెవ్వనివలన నేమివిందునో జనులారా కృష్ణుఁడు హృదయంబుననున్నవాఁడతనిం గాంచుట కుపాయంబును నుడువుఁడనుట.

మూ॥ ఆభ్యాంవిలోచనాభ్యా మమ్బుజదళలలితలోచనమ్బాలమ్।
ద్వాభ్యామపిపరిరబ్ధుం దూరే మమహన్త దైవసామగ్రీ॥ ౪౩

టీక. ఆభ్యామ్- ఈపర్వతాది మహద్వస్తువులంజూడ సమర్థములైనయట్టి, ద్వాభ్యామ్- రెండైన, విలోచనాభ్యామ్- మిక్కిలియుఁజూడ సమర్థములైనకన్నులచేత, అమ్బుజదళలలితలోచనమ్. అమ్బుజదళ- తామరరేకులవలెను, లలిత- సుందరములైన, లోచనమ్- నేత్రములుఁగల, బాలమ్- అర్భకుఁడైనశ్రీకృష్ణుని, పరిరబ్ధుమ్- ఆలింగనము, జేయుటకు, దైవసామగ్రీ- అదృష్టము-దూరే- దూరమగుచున్నది, హన్త- అన్యాయము.

ఉ॥ ముద్దుల గుల్కు బాలుఁడని ముచ్చటఁ గౌఁగిటఁ గ్రుచ్చి యె
త్తఁగా। నొద్దికనైమెమెలంగెడు భుజోన్నతికం బురుహాక్షుఁడంచునే।
ప్రొద్దును వేడ్కఁజూడఁదలపోసినఁ జిక్కఁడు గన్నుదోయికిన్। గొద్దికి
మీఱునైదైవమనుకూలముగామికి నేమి సేయుదున్॥ ౪౩

తా. సర్వతాదిమహద్వస్తువులం గాంచనోపినవనైమె నిదోషంబులగు
నీరెండు కన్నులచే నస్ఫుటుండగు పుండరీకాక్షు నొకనింజూడంగోరు నాకు దై
వంబనుకూలింపదయ్యె నకటా యనుట.

శ్లో॥ అశ్రాన్తస్మిత మరుణారుణాధరోష్ఠం హర్షార్ద్ర ద్విగుణ
మనోజ్ఞ వేణుగీతమ్। విభ్రామ్యద్విపులవిలోచనార్ధ ముగ్ధంవీక్షిష్యేత
వవదనామ్బుజంకదాను॥ ౪౪

టీక. అశ్రాన్తస్మితమ్- అశ్రాన్త - ఎడతెగని, స్మితమ్- చిఱునగవుగ
లయట్టి, అరుణారుణాధరోష్ఠమ్- అరుణారుణ - ఎఱ్ఱనగుదానితోసమానమైన, అ
ధరోష్ఠమ్ - అధరముగలయట్టి, హర్షార్ద్రద్విగుణమనోజ్ఞ వేణుగీతమ్ - హ
ర్షార్ద్ర - సంతోషంబుతోఁగూడి, ద్విగుణ- రెండంతలై, మనోజ్ఞ-మనోహ
రంబగు, వేణుగీతమ్ - వేణుగానముగలయట్టి, విభ్రామ్యద్విపుల విలోచనార్ధ
ముగ్ధమ్- విభ్రామ్యత్ - చలించుచున్న, విపుల - వెడల్పులగు, విలోచన- క
న్నులయొక్క, అర్ధ- ఏకదేశముచేత, ముగ్ధమ్-సుందరమైన, తవ- నీయొక్క,
వదనామ్బుజం- ముఖకమలమును, కదాను-ఎప్పుడు, వీక్షిష్యే-చూచుచున్నాను.

మ॥ మురళీగానసుధాధునీకలిత సమ్మోదంబునిండారఁగా। నర
మోడ్పుంగనుదోయి బెళ్కుమరఁగా నాతామ్రబింబాధర। స్ఫురణన్వె
న్నెలతేటలేనగవులన్ సొంపొందునెమ్మోముఁదా। మరసేవింపఁగఁగఁ
ల్గునుత్సవము సంభావించుటింకెన్నఁడో॥ ౪౪

తా. ఎడతెగనిచిఱునగవుగలిగి- మిక్కిలియెఱ్ఱనగునధరోష్ఠంబుగలిగి-
సంతోషంబునంజేసిద్విగుణంబై మనోహరంబైన వేణుగానంబుఁగలిగి చలించు
చున్న నేత్రైకదేశంబుచే సుందరంబై వెలుంగు నీముమ్మోముఁ దామర నెన్న
టికిఁగాంచుచున్నానసుట.

మూ॥ లీలాయతాభ్యాం రసశీతలాభ్యాం నీలారుణాభ్యాం నయ
నామ్బుజాభ్యాం। ఆలోకయేదద్భుతవిభ్రమాభ్యాం కాలేకదాకా
రుణికఃకిశోరః॥ ౪౫

టీక. కారుణికః-దయాప్రధానుఁడగు, కిశోరః-బాలకృష్ణమూర్తి, లీ

లాయతాభ్యామ్- లీలా - విలాసములచేత, ఆయతాభ్యామ్-పొడవులయినట్టి, రసశీతలాభ్యామ్- రస- శృంగారరసముచే, శీతలాభ్యామ్ - మనోహరముల యినయట్టి, నీలారుణాభ్యామ్_ నీల-నల్లనైనట్టి, అరుణాభ్యాం- ఎఱ్ఱనైనయట్టి, అద్భుతవిభ్రమాభ్యామ్ - అద్భుత - ఆశ్చర్య సంపాదకము లైన, విభ్రమాభ్యామ్- విలాసములుగల, నయనామ్బుజాభ్యామ్- నేత్రకమలములచేత, కాలేకదా- ఏక్షణమందు, మామ్-నన్ను, ఆలోకయేత్ -చూచును.

ఉ ॥ తిన్ననికల్వచెల్వు లోకడికుఁనన నొక్కెడఁ గమ్మదమ్మికొ్రా
మ్మిన్నలఁగుమ్మరించు నవమేచకశోణితమిందుమించులీ । లన్నిరసించు
నిస్తుల విలాసరసాయతశీతలంబులౌ । కన్నులనన్నెన్నటికి గాంచునో
బాలకుఁడాపరంబునన్ ॥ ౪౫

తా, విలాసంబులచే నతిశయిల్లి శృంగార రసంబునం జేసి యతిమనోహరంబులై నీలారుణ కాంతులం దేజరిల్లి యాశ్చర్య కరంబులగు విలాసంబులంగలిగి వెలయుకన్నుఁ దామరలచే దయాపరిధానుండగు బాలకృష్ణుం డెన్నటికినన్నుఁజూచునోయనుట.

మా॥ బహుళ చికురభార మ్బద్ధపిఞ్ఛావతంసఞ్చపల చపలనేత్ర
ఞ్చారుబిమ్బాధరోష్ఠమ్ । మధురమృదులహాసం మన్దరోదారలీలమ్మృ
గయతినయనం మేముగ్ధవేషంమురారేః॥ ౪౬

టీక. బహుళచికురభారమ్-బహుళ - గొప్పదైన, చికురభారమ్- కేశసమూహముఁగలయట్టి, బద్ధపిఞ్ఛావతంసం - బద్ధ-కూర్పబడిన, పిఞ్ఛ-నెమలిపురి, అవతంసమ్ - శిరోభూషణముగాఁగలయట్టి, చపలచపలనేత్రమ్- చపలచపల- చంచలసదృశములైన, నేత్రం - కన్నులుఁగలయట్టి, మధురమృదులహాసం- మధుర-మనోజ్ఞమైన, మృదుల-కోమలమైన, హాసం - నవ్వుగలయట్టి, మన్దరోదారలీలం - మన్దర - మందరపర్వతముయొక్క, ఉదార - గంభీరములగు, లీలం- విలాసముగలయట్టి, మురారేః- శ్రీకృష్ణునియొక్క, ముగ్ధవేషం, ముగ్ధ- సుందరమైన, వేషమ్-వేషమును, మే- నాయొక్క, నయనమ్-నేత్రము మృగయతి- వెదకుచున్నది.

చ॥ లలితపుఁగెంపుసొంపుఁ గళలన్విలసిల్లెడు మోవినవ్వుఁదే । ట
లునుగొప్పకొప్పునఁ బెడంగగుపింఛము బెళుకుఁచూపులున్ । సలలిత
మందరాద్రి ధృతిసంపదయుం జెలువారుశౌరిమం।జులతర వేషమున్వె
దకీనాఁడఁగొ నాకనుఁదోయి గోరెడిన్॥ ౪౭

తా. గొప్పయగు కొప్పుపైనలంకరించిన నెమలిపురి దండలనుచంచలంబు లగునేత్రంబులను - సుందరంబైన దొండపండువంటి యధరంబును మనోజ్ఞంబై కోమలంబైననగవును - మందరసమానంబగు ధైర్యంబునుంగల్గిన శ్రీకృష్ణునిసుందరవేషంబును నాకన్నుదోయి చూడంగోరియున్నదనుట.

శ్లో॥ బహులజలదచ్ఛాయాచోరంవిలాసభరాలసంమదశిఖిశిఖాలీలోత్తంసం మనోజ్ఞముఖాంబుజమ్। కమపికమలాపాంగోదగ్రప్రసన్నజగజ్జితం మధురిమపరీపాకోద్రేకంవయం మృగయామహే॥

టీక. బహులజలదచ్ఛాయాచోరం-బహుల- అధికమగు, జలద-ఉదకమును ఇచ్చుచున్న మేఘముయొక్క, ఛాయా- కాంతిని, చోరం- దొంగలించుచున్నయట్టి, విలాసభరాలసం- విలాసభర- విలాసములచేత, అలసం-అలసుండైనట్టి, మదశిఖిశిఖాలీలోత్తంసం- మదశిఖి- మత్తమయూరముయొక్క, శిఖా- పింఛమె-లీలా- విలాసార్థమయిన,ఉత్తంసం- భూషణముగాగలయట్టి,మనోజ్ఞముఖాంబుజం- మనోజ్ఞ- సుందరమయిన,ముఖాంబుజమ్- ముఖకమలముంగలయట్టి, కమలాపాంగోదగ్రప్రసన్నజగజ్జితం- కమల- తామరరేకులవంటి, అపాఙ్గ- కడకన్నులయొక్క, ఉదగ్ర- లేశములచేత, ప్రసన్న - కృతార్థముగాఁజేయబడిన,జగత్- లోకములందలి, జితం-తుచ్ఛపదార్థములగలయట్టి, కమపి- అనిర్వాచ్యమయిన, మధురిమపరీపాకోద్రేకం- మధురిమ- సౌందర్యములయొక్క, పరీపాక - పరిపాకముయొక్క, ఉద్రేకం - అతిశయముగలకృష్ణుని, వయం- నేను, మృగయామహే- వెదకుచున్నాను.

మ॥ తనకారుణ్యకటాక్షవీక్షణముచేఁ ద్రైలోక్యజాడ్యంబులె। ల్లనివర్తింపమనోహరాననములోలావణ్యావేషంబులో। ఘనధారాధరకాంతితోశిఖిశిఖాకర్ణావతంసంబుతో! ననువైయుండెడు వానినారయుచుసుద్యత్ప్రీతి సేవించెదన్॥ ౪౭

తా. నీలమేఘంబుబోలెనల్లనగు శరీరకాంతి గల్గి యొయ్యారంబులన -సుందైడ నెమలిపురికర్ణావతంసంబుగల్గి మనోజ్ఞంబగు ముఖకమలంబుఁగల్గితామరరేకులవంటి కడకన్నులచేనెల్లలోకంబుల పదార్థంబులను పవిత్రంబులుగాఁజేయుచు సౌందర్యాతిశయంబుచే దేజరిల్లి వెలయు శ్రీకృష్ణదేవునినే వెదకుచున్నాననుట.

శ్లో॥ పరామృశ్యస్సూరే పరిషదిమునీనాం వ్రజవధూదృశాన్నృశ్యంశశ్వత్త్రిభువనమనోహారి వదనమ్। అన్వామృశ్యంవాచామనిదమునిదయానామపికదాదరీదృశ్యేజేపన్దరదళితనీలోత్పలనిభమ్॥ ౪౮

టీక. అనిదముపయానాం- ఇట్టిదేశకాలంబుల నుదయించినవని తెలియనలవిగాని, వాచాం - వేదాంతవాక్యములచేత, అనామృశ్యం- ప్రతిపాదింపనలవిగానివాఁడు గనుకనే, పరిషది- పుణ్యస్థలవిశేషమందు, మునీనాం-వేదాంతవిదులైనమునులకు, పరామృశ్యమపి - మనోగమ్యుఁడయినప్పటికిని, దూరే- దూరుఁడగును, వ్రజవధూదృశాం- వ్రజవధూ - గోపస్త్రీలయొక్క, దృశాం - నేత్రములచేత, దృశ్యంచూడదగినట్టి, శశ్వత్ - వాలాయముగాను, త్రిభువనమనోహారివదనం - త్రిభువన - ముల్లోకములకును, మనోహారి - మనోజ్ఞంబగు, వదనం- ముఖముగలయట్టి, దరదళితనీలోత్పలరుచిం- దరదళిత- కొంచెముగావిరిసిన, నీలోత్పల - నల్లకలువలయొక్క - రుచిం- కాంతివంటి కాంతిగల, దేవం- దేవుఁడయినకృష్ణుని, కదా - ఏసమయమందు, దరీదృశ్యే- లెస్సగాఁజూచుచున్నాను.

మ॥ మదిలోనిల్పెదఁ గోపికానయనపద్మశ్రేణి కెల్లప్పుడున్। వి
దితంబై మునినాయకాగ్రసభకన్వేషింపఁగాదూరమై। యిదమిద్ధంబ
నివేదపాళికనువై యెంచన్‌బఠించన్‌మొద। ల్తునలేనట్టినవోత్పలాభ
మగువస్తున్మోహనాకారమున్॥ ౪౮

తా- ఇట్టిదేశకాలంబులం బొడమినవియని తెలియనలవిగానివేదాంతవాక్యంబుచేఁ బ్రతిపాదింప నశక్యుండు గనుకనే నైమిశారణ్యాది పుణ్యస్థలంబులందుండునధీతవేదాంతులైనమునులమనంబులకు గమ్యుండయ్యును దూరుండగుచు గోపస్త్రీనేత్రంబులచేఁ జూడదగిముల్లోకంబుల వారలకును మనోజ్ఞంబగుముఖంబుచే దేజరిల్లి యరవిరిసిననల్లకలువలకాంతిఁబోలి కాంతిచే వెలయుశరీరంబుఁ గలిగివెలుంగుదేవుని నెప్పుడుచూచుచున్నాననుట.

మూ॥ లీలాంబుజాననమధీరముదీక్షమాణం నర్మాణి వేణువివరే
షునివేశయన్తమ్। లోలాయమాననయనం నయనాభిరామం దేవం కదా
నుదయితం వ్రతలోకయిష్యే॥ ౪౯

టీక. లీలాంబుజాననం-లీల - విలాసముతోఁగూడిన, అంబుజ - కమలమువంటి, ఆననం - ముఖముగలయట్టి, అధీరమ్ - చంచలమగునట్లుగాను, ఉదీక్షమాణమ్- చూచుచున్నయట్టి, వేణువివరేషు - వేణు- పిల్లనగ్రోవియొక్క, వివరేషు- రంధ్రములయందు, నర్మాణి- సంకేతములను, నివేశయన్తమ్- ప్రవేశింపఁజేయుచున్నట్టి, లోలాయమాననయనం - లోలాయమాన- ఈషచ్చంచలములైన, నయనం - నేత్రములుగలయట్టి, నయనాభిరామమ్ - నయన -

నేత్రములకు, అభిరామమ్- ఆహ్లాదమునుఁ జేయుచున్న, దయితం- ప్రియుఁడైన కృష్ణుని, కదాను-ఎప్పుడు, వ్యతిలోకయిష్యే- చూచుచున్నాను, కదాను- ఎప్పుడు, వన్దే- నమస్కరించుచున్నాను. ※

ఉ॥ ఏతఱిఁజూచి మ్రొక్కఁగల నేతఱిఁ జూచునతండ్రు నన్నరో, జాతమృదుస్మితానను నిఁ జంచలలోచను వేణుగీతసం। కేతము చేతఁ గోపికలఁ గేళికి నైజతఁ గూర్చు నేర్పరిన్ । నూతన పంచసాయక మనోహర మూర్తినిఁ గంటికింపుగన్॥ ౪౯

తా. విలాసయుతంబగు కమలంబు బోలియున్న నెమ్మొగంబుఁ గల్గి చంచలంబగునటు జూచుచు వేణురంధ్రంబుల యందు గోపికల సంకేతంబుల దెలుపుచు నీషచ్చంచలంబులగు నేత్రంబులుఁ గలిగి చూచువారల చూపులకు నాహ్లాదంబు బుట్టించుచు వెలుంగు ప్రియుండగు కృష్ణునే సమయంబున గాంచుదు నెత్తఱిని నమస్కరింతుననుట.

మూ॥ లగ్నం ముహుర్మనసి లమ్పటసమ్ప్రదాయం రేఖావలేఖిని రసజ్ఞమనోజ్ఞవేషమ్ । లజ్జన్మృదుస్మితమధుస్నపితాధరాంశు రాకేన్దులాలితముఖేన్దుముకున్దబాల్యమ్॥ ౫౦

టీక. రసజ్ఞమనోజ్ఞవేషమ్ - రసజ్ఞ - సారగ్రాహులైనట్టి, మనోజ్ఞ- సుందరమయిన, వేషమ్ - అలంకారముం గల, లజ్జన్మృదుస్మితమధుస్నపితాధరాంశురాకేన్దులాలితముఖేన్దుముకున్దబాల్యమ్ - లజ్జత్- లజ్జించుచున్నట్టి, మృదు- కోమలమైన, స్మిత- మందహాసమనియెడి, మధు - తేనియచేత, స్నపిత-తడుపఁబడిన, అధర-అధరోష్ఠము యొక్క, అంశు-కాంతులు గలిగినట్టి, రాకేన్దు- పూర్ణిమాచంద్రునిచేత, లాలిత-సమ్మానింపఁబడిన-ముఖ-ముఖమనెడు-ఇన్దు- చంద్రునిఁ గలిగిన- ముకున్ద- శ్రీకృష్ణమూర్తి యొక్క-బాల్యమ్- శైశవము, రేఖావలేఖిని- రేఖా- శ్రీకృష్ణసౌందర్యమనియెడి- అవలేఖిని - చిత్తరువుఁ గల- మే- నా యొక్క - మనసి- మనమందు- ముహుః-మాటిమాటికిని- లగ్నమ్-కూడుచున్నదియై- లమ్పటసమ్ప్రదాయమ్ - ఆయాసము నిచ్చెడిది - భవతి- అగుచున్నది.

ఉ॥ సన్నపు నవ్వు నివ్వటిలు చందురు కావి మెఱుంగు మోవియుం। బున్నమ చందమామ యొఱపున్నగు మోము సుముద్దు గుల్కెడిన్ । అన్నెలవైన మోహన విలాసముఁ గాంచిన గోపవేషసం। పన్నునిఁ జిన్ని ప్రాయము మెడఁబాయక వ్రాసినయట్టు లుండెడున్॥ ౫౦

తా. సారవంతంబై మనోహరంబగునలంకారంబుగలిగిలజ్జించుచున్న కోమలంబగుచిఱునగవను తేనియచేఁ దడపంబడినయధరోష్ఠంబు కాంతులగలిగి పూర్ణచంద్రునిచే లాలింపఁబడుచున్న ముఖచంద్రునిగల శ్రీకృష్ణబాల్యము నామనంబున వ్రాసినయటులుండి కన్నులకగబడక యాయాసంబుం జేయుచున్నదియనుట.

మూ। అహిమకరకరనికరమృదుమృదితలక్ష్మీసరసతరసరసిరుహ
సదృశదృశిదేవే। వ్రజయువతిరతికలహవిజయనిజలీలా మదముదితవ
దనశశిమధురిమణిలియే॥ ౫౧

టీక. అహిమకరకరనికరమృదుమృదితలక్ష్మీసరసతరసరసిరుహసదృశదృశి - అహిమకర - సూర్యునియొక్క, కర-కిరణములయొక్క, నికర- సమూహముచేత, మృదు- కోమలమగునట్టుగాను, మృదిత - కొంచెముగాస్పృశింపబడిన, లక్ష్మీ-కాంతిచేత,సరసతర - మిక్కిలిసరసమయిన, సరసిరుహ- కమలములకు, సదృశ- సమానమైన, దృశి- నేత్రములుగల, దేవే-శ్రీకృష్ణునియందు, వ్రజయువతిరతికలహ విజయనిజలీలా మదముదితవదనశశి మధురిమణి- వ్రజయువతి- గోపికలయొక్క, రతి-రతమనియెడి, కలహ-కలహమందు, విజయ- జయముచేతనైన, లీలామద- విలాసమదముచేత, ముదిత- సందోషించుచున్న, వదనశశి- ముఖచంద్రునిగల, మధురిమణి- సౌందర్యమందు, లియే- లీనుఁడనగుచున్నాను.

చ॥ రతికలహమ్మునన్ సతులరాయిడిఁ జేసిజయించి-నిమించునుద్ధ
తిగనుపించుతేన గవునందముగులేఁడు మోముఁదన్నిచే। నతులవిఘాత
ఘానుకిరణాప్తినికస్వరభాస్వరాంబుజా। యతనయనద్వయిం జెలఁ
గునామధురద్యుతిలీనమయ్యెదన్ ౫౧

తా- సూర్యకిరణ సమూహంబుచే మృదువగునటులస్పృశింపంబడిన కాంతిచేసుందరంబులగు కమలంబులకు సమానంబులైన నేత్రంబులగలిగిగోపస్త్రీలతోడనసలుప్రరతులనియెడి యుద్ధంబులనైన జయంబునంబొడమ స్వకీయంబగు లీలామదంబున సంతసిలు ముఖచంద్రునిఁ గలిగవెలుఁగు శ్రీకృష్ణదేవుని సౌందర్యంబునందులీనుండనగు చున్నాననుట.

మూ॥ కరకమలదళదళితలలితతరవంశీ కలనినదగళదమృతఘనసర
సిదేవే। సహజరసభరభరితదరహాసితవీధీ సతతవహందధరమణిమధు
రిమణిలియే॥ ౫౨

టీక. కరకమలదళదళిత లలితతరవంశీకలని నదగళదమృత ఘనసరసి- కరకమల, హస్తకమలములయొక్క - దళ - వ్రేళ్ళచేత - దళిత - స్వరభేదములనుం బోధింపంబడినయట్టి లలితతర, మిక్కిలి శ్రావ్యమైన -వంశీ- వేణువుయొక్క -కల- అవ్యక్తమధురమగు, నినవ - ధ్వనిచేత, గళత్ జాఱుచున్న, అమృత - అమృతముయొక్క, ఘన - అధికమయిన, సరసి- సరస్సుగలయట్టి, సహజరసభరభరితదరహాసితవీథీసతత వహదధరమణిమధురిమణి - సహజ, స్వాభావికమైన-రస భర -రసముచేత- భరిత- నిండింపబడిన- దరహసిత- మందహాసములయొక్క- వీథీ -పఙ్క్తులను, సతత-ఎప్పుడును, వహత్- వహించుచున్న, అధరమణి_అధర రత్నముయొక్క, మధురిమణి - సౌందర్యముంగల, దేవే - శ్రీకృష్ణనియందు- లిమ్యే - లీనుఁడ నగుచున్నాను. ... ... ... ❋

చ॥ లలితకరాంగుళీదళదళ స్మరళీమధురస్వరామృతో। జ్వలసరసీ మనోజ్ఞసహజస్మితకందళచంద్ర చంద్రికా। వలదరుణాధరోష్ఠమధునాసితచారు ముఖాంబుజంబునన్। దొలఁగక నాదుమానస మధువ్రతమియ్యెడలీన మయ్యెడిన్ ... ... ౫౨

తా. కరాంగుళులచే స్వరభేదంబులఁ బొందింపఁ బడుచు మనోహరంబగు వేణురవంబనియెడి యమృతంబుకొలను గలిగి స్వాభావసిద్ధంబుగ రసవంతంబులగు చిఱునగవులగుంపులభరియించునధరంబు సౌందర్యముంగల శ్రీకృష్ణ దేవునియందు లీనుఁడనగుచున్నా ననుట. ... ... ❋

శ్లో॥ కుసుమశరశర సమరకుపిత మదగోపీ కుచకలశఘుసృణరసలసదురసిదేవే। మదలులిత మృదుహసిత ముషితశశి శోభాముహురధికముఖ కమలమధురిమణిలిమ్యే॥ ... ... ౫౩

టీ. కుసుమశరశర సమరకుపితమద గోపీకుచకలశ ఘుసృణరసలసదురసి- కుసుమశర- మన్మథునియొక్క, శర- బాణములైనపుష్పములచేతనైన, సమర - యుద్ధమందు, కుపిత - కోపయుక్తలైన, మద-మత్తలైన, గోపీ-గోపికలయొక్క, కుచకలశ - కలశములవంటి స్తనములయందలి, ఘుసృణ- అంగరాగవిశేషముయొక్క, రస-రక్తిమచేత, లసత్- ప్రకాశించుచున్న, ఉరసి-వక్షముఁగలయట్టి, మద - మదముతోడ, లులిత - కలసియున్న, మృదుహసిత -మందహాసముచేత, ముషిత - అపహరింపఁబడిన, శశి- చంద్రునియొక్క, శోభా-కాంతిచేత, ముహుః -అధికమైన, ముఖకమల -నెమ్మోముఁ దామరయొక్క, మధురి

మణీ - సౌందర్యముఁగల, దేవే - శ్రీకృష్ణమూర్తియందు, లిప్యే - లీనుఁడగుచున్నాను. ... ... ... ❋

ఉ॥ పువ్వులుఱువ్వఁగానలుకఁ బూనినవల్లవ పల్లవాధరల్ । గ్రొ
వ్వనఱవ్వసీఁకుఁ జనుగుత్తులనాన్తిన కుంకుమం బెదక్ । నివ్వటిలక్ శ
శాంకుజిగినీటుల తేటల, గ్రాల్లలాడు లే । నవ్వులగోము మోమున గనం
దగు నందకుమారుఁ జెంజెదక్॥ ౫౩

తా. పుష్పులచల్లులాటయందోటుపడి కోపంబు సేయుగోపికలబంగ
రుకుండలం బోనిచన్నుల రాయుడి నంటిన కుంకుమ పూఁతచే వెలుఁగువక్షంబు
ను, మదంబుతోఁ గూడినకోమలంబగు చిఱునగవుచే వెన్నెలం గ్రాల్లలాడు నె
మ్మోముచక్కఁదనంబును గలిగి తేజరిల్లు దేవునందలి లీనుండగుచున్నాననుట.

శ్లో॥ అసమాప్రచుసి తసుప్రరోరుపచితామక్షీణ పక్ష్మాంకురే ష్వా
లోలామనురాగిణోర్నయన యోరార్ద్రాంమృదౌజల్పితే।ఆతామ్రామ
మధరామృతే మదకలామమ్లానవంశీరవే ష్వాశాస్తేమమలోచనం వ్ర
జశిశోర్మూర్తింజగన్మోహినీమ్॥ ౫౪

టీక. అసితభ్రువోః-అసిత-నల్లనైన, భ్రువోః - కను బొమలయందు, అసమాప్తమ్- కొంచెమువక్రమైనట్టి,అక్షీణపక్ష్మాంకురేషు- అక్షీణ- దట్టమైన పక్ష్మ- ఱెప్పలయొక్క, అంకురేషు- రోమాంకురములయందు, ఉపచితాం- వృద్ధినొందినయట్టి, అనురాగిణోః- దయగలిగిన,నయనయోః- నేత్రములయందు, ఆలోలామ్-చంచలమైనట్టి, మృదౌ- మృదువైన, జల్పితే - మాటలయందు, ఆర్ద్రామ్-సరసమైనట్టి, అధరామృతే - అమృతమువంటియధరమందు, ఆతామ్రామ్- అరుణమైనట్టి, అమ్లానవంశీరవేషు - అమ్లాన - గంభీరమైన, వంశీరవేషు - వేణునాదములయందు, మదకలామ్ - మద- మదముచేత, కలామ్ - అవ్యక్త మధురమైనట్టి, జగన్మోహినీమ్ - జగత్ - లోకములకు, మోహినీమ్, మోహసంపాదకమైన, వ్రజశిశోః- గోపాలబాలునియొక్క, మూర్తిమ్- దివ్యమంగళ విగ్రహమును, మమ- నాయొక్క, లోచనమ్- నేత్రము, ఆశాస్తే- ప్రార్థించుచున్నది. ❋

ఉ॥ కాంచుటయెన్నఁడీక్షణ సుఖంబుగఁ దొంగలిఱెప్పలుక్ బనా।
యించినవింటివంటిబొమలింపగు మాటలు కెంపుమోవిబొం। కించిన
పిల్లగ్రోవిఁ బలికించుభ్రాంతిపూళియుక్ దయోన్నతిక్ । మించినజె
లువ్రుఁజూపుఁగలమిక్కిలిచక్కని ముద్దుబాలకుక్॥ ౫౪

తా. ఈషద్వక్రింబులగు నల్లనికనుబొమలును జెంపొందిదట్టంబులగు తెప్పలందలి వెంట్రుకలును జంచలంబులై కరుణారసంబుఁదొలఁకుకన్నులును సరసంబును గంభీరంబునగు వేణునాదంబునుంగలుగుటంజేసి జగంబులకానంద జనితసమ్మోహంబును త్పాదించునట్టి గోపాలబాలుని దివ్యమంగళవిగ్రహంబుఁ గనఁగోరెదననుట.

శ్లో॥ తత్త్రైశోర స్తచ్చవక్త్రారవిన్ద స్తత్కారుణ్యం తేచలీలాకటాక్షాః। తత్సౌన్దర్యంసాచమన్దస్మితశ్రీస్సత్యంసత్యన్దుర్లభందేవతేషు॥౫౫

టీక. తత్త్రైశోరమ్ - తత్ - నామనంబంధుఁ దోఁచినయట్టి, కైశోరమ్ - బాల్యమును, తచ్ఛ - నాచిత్తమునందుఁదోఁచినయట్టి, వక్త్రారవిన్దమ్- ముఖకమలమును, తత్కారుణ్యాం - తత్ - నామనంబంధగుపడునయట్టి, కారుణ్యా - దయయును, తే - నాహృదయమందుఁ గానుపించినయట్టి, లీలాకటాక్షాశ్చ - లీలా - విలాసములతోఁగూడిన, కటాక్షాశ్చ - కడకంటిచూపులును, తత్సౌన్దర్యశ్చ - తత్ - నాచిత్తంబున సాక్షాత్కరించిన యట్టి, సౌందర్యశ్చ - సోయగమును, సా- నాయెదయందుఁ గానంబడిన, మన్దస్మితశ్రీశ్చ- మన్దస్మిత - లేనగవుయొక్క, శ్రీశ్చ - సంపదయును, దేవతేషు - ఇంద్రుండు మొదలగు వేలుపులయందు, దుర్లభమ్-లేదు, సత్యమ్- యథార్థము, సత్యమ్- యథార్థము.

శా॥ ఆకారుణ్యకటాక్షవీక్షణము లాయందంపులేఁబ్రాయమా। యాకారద్యుతియాదరస్మితముతీరామోముచక్కందనం। బాకెంజాయపదంబురానజలయొయ్యారంబులేవేల్పులం। దేకాలంబునలేదులేదనుచునేనెంచేసిఁజాటించెదన్॥ ౫౫

తా. సమాధినిష్ఠుండనగునాయెదంబరికించినచోనగుపడిన శ్రీకృష్ణదేవునియబ్బాల్యంబునద్దయయునానెమ్మోముఁ దాపురయునాకడకన్నులచూపులు నాసోయగంబుఁనాలేనగవునేవేల్పులయందుఁ జేనియులేదనుచు నిక్కంబుగాఁబలెకెదననుట.

శ్లో॥ విశ్వోపప్లవశమనైకబద్ధదీక్షం విశ్వాసస్తకితచేతసాంజనానామ్। పశ్యామఃప్రతినవకాన్తికన్దళార్ద్రమ్పశ్యామః పథిపథిశైశవం మురారేః॥ ౫౬

టీ. మురారేః- శ్రీకృష్ణమూర్తియొక్క, శైశవమ్-బాల్యమును, ప్రతినవకాన్తికందళార్ద్రమ్- ప్రతినవ-ప్రతిక్షణనూతనములైన, కాంతి- కాంతు

లయొక్క, కందళ- మొలకలచేత, ఆర్ద్రమ్-సరసమైనదానిగాను, పశ్యామః- మనముచే నెఱుంగుచున్నాము, విశ్వాస స్తబకితచేతసాం- విశ్వాస-విశ్వాసము చేత, స్తబకిత-సంజాతగుచ్ఛములఁగల, చేతసాం-చిత్తములుగల, జనానాం- జనులయొక్క, పధిపధి - ఆయాస్థలములయందు, విశ్వోపప్లవ శమనైకబద్ధ దీక్షమ్-విశ్వ-సమస్తమైన,ఉపప్లవ-ఉపద్రవములయొక్క, శమన- శాంతియందు ఏక- ముఖ్యమగునటుల, బద్ధ- ఘటింపఁబడిన, దీక్షమ్- నియతిగలదానిగాను, పశ్యామః- మనంబుచేఁ నెఱుంగుచున్నాము.

మ ॥ నుతధారాధరకాంతికందళము కన్నుల్ చల్లఁ జేయన్ సమ।
గ్రతరాతంకపరంపరాశమనదీక్షన్ దేహముల్వ్రజకా । యతగాంచ
న్గెఅనమ్మినట్టిప్రజకత్యానందమా దేవకీ । సుతునొయ్యారపుబాలలీల
గనవచ్చున్నాఁడుదృగ్విధులన్ ॥ ౫౬

తా. ఆశ్రితులగుజనంబుల సర్వోపద్రవంబులఁబోవనడచు నియమం బుగలిగి ప్రతిక్షణంబును గ్రొత్తలగుకాంతులచే సరసంబైవెలుఁగు శ్రీకృష్ణుని బాల్యంబునుగనుంగొనుచున్నాననుట.

మూ॥ మౌళిశ్చన్ద్రకభూషణా మరకతస్తమ్భాభిరామం వపుర్వ
క్త్రం చిత్రవిముగ్ధహాసమధురమ్బాలేవిలోలేదృశౌ । వాచశ్శైశవశీత
లామదగజశ్లాఘ్యా విలాసస్థితిర్మన్దంమన్దమయేకఏష మధురావీధీమి
తోగాహతే॥ ౫౬

టీక. అయేబాలే-ఓవనిత, మౌళిః-సిగ, చంద్రకభూషణా- చందక- నెమలిపురియనెడి, భూషణా- ఆభరణముగలది, వపుః- శరీరము, మరకతస్తమ్భాభిరామమ్, మరకత-ఇంద్రనీలమణియొక్క, స్తమ్భ- స్తంభమువలె, అభిరామమ్- సుందరము,వక్త్రమ్- ముఖము, చిత్రవిముగ్ధహాసమధురమ్-చిత్ర-విచిత్రమైనట్టి. విముగ్ధ- మిక్కిలిసుందరమైనట్టి, హాస - చిఱునగవుచేత, మధురం- మనోహరము, దృశౌ- కన్నులు, విలోలే- చంచలములు, వాచః-పలుకులు, శైశవశీతలాః- శైశవ - బాల్యముచేత, శీతలాః - చల్లనైనవి, విలాసస్థితిః - విలాస - లీలయొక్క, స్థితిః - ఉనికి, మదగజశ్లాఘ్యా - మదగజ- మదపుటేనుఁగువలె, శ్లాఘ్యా - కొనియాడఁదగినది, (ఇట్టిగుణంబులు గలిగి) మన్దంమన్దం - మెల్లమెల్లన, ఇతః - ఇటునుండి, మధురావీధిమ్ - మధురా - మధురాపట్టణము యొక్క, వీధిమ్ - వీధిని, కఏషగాహతే - వీఁడెవ్వఁడు ప్రవేశించుచున్నాఁడు.

ఉ॥ మౌళితటిన్ ఘటించినసమంచితపింఛము మందహాసముల్ । లో
లవిశాలలోచనములుం జిఱునవ్వును ముద్దుమాటలున్ । నీలపు డాలు
నేలు మెయినిగ్గులుగల్గిన బాలుఁ డెవ్వఁడో । ప్రాలెడు వీనిఁ జూడు మధు
రాపుర వీధులఁ బాటలాధరా॥ ౫౬

తా. మధురాపురంబు తెఱువు ప్రవేశించునట్టి శ్రీకృష్ణునిఁ గని యొకదివ్యవిలాసిని మఱియొక దివ్యవిలాసిని తోడం బలుకుచున్నది, నెమలిపురిచేనలంకరింపఁబడిన సిగయును విచిత్రంబు సుందరంబునగు చిఱునగవుగల సెమ్మొగంబును జంచలంబులగు కన్నులును బాల్యంబువలన సరసంబులగు నాలాపంబులును మత్తగజంబువలె కొనియాడఁదగిన విలాసంబునుంగలిగి మెల్లమెల్లన నటనుండి మధురాపురంబు తెఱువుం బ్రవేశించువీఁ డెవ్వండు వీనిం జూడుమనుట. *

శా॥ పాదౌ పాదవినిర్జితాంబుజవనౌ పద్మాలయాలంకృతౌ।
పాణీ వేణువినోదనప్రణయినౌ పర్యాప్తశిల్పశ్రియౌ । బాహూ దో
హదభాజనం మృగదృశాం మాధుర్యధారా గిరో। వక్త్రం వాగ్విభవా
తిలంఘితమహో బాలః కిమేతన్మహః ॥ ౫౭

టీక. పాదవినిర్జితాంబుజవనౌ - పాద - అంశముచేత, వినిర్జిత - జయింపఁబడిన. అంబుజవనౌ - కమలవనములుగల - యస్య - ఏ శ్రీకృష్ణుని యొక్క, పాదౌ - పాదములు, పద్మాలయాలంకృతౌ - పద్మాలయా - లక్ష్మీదేవిచేత, అలంకృతౌ - పూజింపఁబడినవియో, వేణువినోదనప్రణయినౌ - వేణు - పిల్లనఁగ్రోవియొక్క, వినోదన - వాయించుటయందు, ప్రణయినౌ - ప్రీతిగల, యస్య - ఏ కృష్ణునియొక్క, పాణీ - హస్తములు, పర్యాప్తశిల్పశ్రియౌ - పర్యాప్త - పరిపూర్ణమైన, శిల్ప - విజ్ఞానముయొక్క, శ్రియా - సంపదగలవియో, యస్య - ఏకృష్ణునియొక్క, బాహూ - భుజములు, మృగదృశామ్ - స్త్రీలకు, దోహదభాజనమ్ - దోహద - దోహదక్రియకు, భాజనమ్ - స్థానమో - (దోహదమనఁగా గాన సమయమునందుఁ దరులతలను బుష్పింపఁజేయు క్రియ అటుల శ్రీకృష్ణుని బాహువులు స్పృశించుట మాత్రంబున బాలికలనైన ప్రౌఢలనుగాఁ జేయసామర్థ్యముగలవి యనుట) యస్య - ఏ శ్రీకృష్ణునియొక్క, గిరః - మాటలు, మాధుర్యధారాః - మాధుర్య - తియ్యదనముయొక్క, ధారాః - ప్రవాహములుగలవియో, యస్య - ఏ శ్రీకృష్ణునియొక్క, వక్త్రమ్ - ముఖము, వాగ్విభవాతిలంఘితమ్ - వాగ్విభవ - వాగ్వైభవమును, అతిలంఘితం - అతిక్రమించినదియో, ఏతత్ - ఈకృష్ణరూపమైన, మహః - తేజస్సు, బాలః కిం - శిశువా యేమి, అహో - ఆశ్చర్యము॥

చ॥ చెలువల కెల్లదోహదముఁ జేయుకరంబులులచ్చి కాకరం। బు లుజితపద్మముల్చరణముల్మురళీరచనా చమత్క్రియా। కలితము కేలుదమ్మిముఖకాంతులు వింతులు తేనెలూరుమా। టలుగలయట్టి శైశవవిడంబన తేజమిదేమి చిత్రమో॥ ౪౭

తా. శ్రీమహాలక్ష్మిచేత గంధపుష్పాదులనలంకరింపంబడునదు గుఁదామరలును- పిల్లనఁగ్రోవిని మ్రోయించుటయందుఁబూర్ణంబగు విన్నాణంబుగల కరంబులు నవాఙ్మానసగోచరంబగు నెమ్మొగంబునుంగల యీ తేజమును శిశువని చెప్పనలవియగు నేయనుట.

శ్లో॥ బర్హంనామవిభూషణమ్బహుమతం వేషాయ శేషైరలంవక్త్రం ద్విత్రివిశేషకాన్తిలహరీ విన్యాసధన్యాధరమ్। శీలైరల్పధియామగమ్యవిభవై శ్శృంగారభఙ్గీ మయఞ్చిత్రఞ్చిత్ర మహోఽ। విచిత్రతమహోఽచిత్రం విచిత్రమహః॥ ౪౮

టీక, వేషాయ-అలంకారముకొఱకు, శేషైః- ఇతరములగు భూషణములచేత, అలమ్- సాధ్యములేదు, బర్హంనామ-బర్హమని ప్రసిద్ధమైన, విభూషణమ్- రవణము, బహుమతమ్- అంగీకరింపఁబడియెను,వక్త్రమ్- ముఖము, ద్విత్రివిశేషకాంతిలహరీ విన్యాసధన్యాధరం-ద్విత్రి- రెండు మూఁడయిన, విశేష. తిలకముయొక్క, కాంతి - కాంతులయొక్క, లహరీ - ప్రవాహముయొక్క, విన్యాస- వ్యాప్తిచేత, ధన్యా-హృద్యమైన, అధరం-మోవిగలది, అల్పధియాం - స్వల్పబుద్ధిగలవారలకు, అగమ్య విభవైః- అగమ్య - అగోచరమైన, విభవైః - వైభవముగల, శీలైః- స్వభావములచేత, శృఙ్గారభఙ్గీమయం- శృఙ్గార- శృంగారములయొక్క, భఙ్గీమయం - పరంపరా ప్రాచుర్యముగల,మహః- తేజస్సు, చిత్రం - ఆశ్చర్యము, చిత్రం - ఆశ్చర్యము, అహో - ఆశ్చర్యము, విచిత్రం- ఆశ్చర్యముగలది, అహో- ఆశ్చర్యము, చిత్రం - ఆశ్చర్యము, విచిత్రం- మిక్కిలియాశ్చర్యము.

ఉ॥ సొమ్ములు మేనికందమని చూడక పింఛమె పూని మోముపైఁ। గమ్మబొట్లు రెంతరలు గావిలసిల్లఁగఁగావిమోవిచా। ల్పమ్ములరసోత్తరంగ విభవమ్ముఁగమ్యము నైశసర్పఁజి। తమ్మొకపాటివారికిఁదరంబె నుతింపనోయూరి తేజముకా॥ ౪౮

తా. కాంచన రత్నమయంబులైన భూషణంబులంగైకొనక నెమలిపురిమె మేలైనభూషణంబుగ ధరయించి చందన కస్తూర్యాదితిలకంబులచే నందంబ

గు ముఖారవిందంబున రసోత్తరంబగు కెమ్మోవి మెఱయు సింగారంబుల రాశి యోయన వెలుంగు శ్రీకృష్ణరూపంబగు తేజంబతివిచిత్రంబై యుండఁగా నట్టి తేజంబున నల్పబుద్ధులగు వారలకు నుతింపనలవియగునే యనుట-

మూ॥ అగ్రే సమగ్రయతి కామపి కేళిలక్ష్మీ మన్యాసు దిక్ష్వపి విలో
చనమేవ సాక్షీ। హాహన్త హస్తపథదూరమహో కిమేత దాసీత్కి-
శోరమయమస్మ జగత్త్రయం మే॥ ౩౯

టీక. హస్తపథదూరం- హస్తపథ-హస్తప్రసారణమునకు, దూరం_ దూరమగునట్టుగాను, అగ్రే-ముందటను, కామపి-నుడువ నలవిగాని, కేళిలక్ష్మీం కేళి- విహారముయొక్క, లక్ష్మీం- సంపదను, సమగ్రయతి - నిండింపఁజేయు చున్నది, అన్యాసు- ఇతరములయిన, దిక్ష్వపి- దిక్కులయందును, కేళిలక్ష్మీం - విహారసంపదను, సమగ్రయతి - నిండింపఁజేయుచున్నది, విలోచనమేవ- నేత్రమే, సాక్షీ - ప్రమాణము, హాహన్త- అకటకటా, హోఅస్మ- ఓతల్లి, జగత్త్రయం- లోకత్రయమును, మే- నాకు, కిశోరమయం - బాలునియయముగాను, ఆసీత్ - ఆయెను- ఏతత్- ఇది, కిం- ఏమి- అహో- ఆశ్చర్యము.

శా॥ చూడంజూడ మనోహరాకృతి కరుం బోద్యంబు గాబాల
కుం। డాడక్ ముందటఁ గౌఁగిలింతు ననిడాయం జిక్కఁడా రీతి నే। క్రీ
డించున్ దిశలందునిందులకు నక్షిద్వంద్వమే సాక్షియో। జాడక్ మజ్జగ
మంబ బాలమయమాశ్చర్యంబు నాకెంతయున్॥ ౩౯

తా. చూడఁజూడ మనోహరంబయి యాడుచుఁ గౌగిలింపఁబోవ దూరంబై యెల్లదెసలయందుఁ గ్రీడించుచుండు నిందులకుఁ గన్నుఁగవయ సాక్షి యోతల్లి ముజ్జగంబును బాలమయంబయ్యె నిది చేమి విచిత్రంబనుట.

మూ॥ చికురం బహుళం విరళం భ్రమరం మృదులం వచనం విపులం న
యనం। అధరం మధురం వదనం లలితం చపలం చరితం చ కదా నుభవే॥

టీక. కృష్ణస్య- శ్రీకృష్ణమూర్తియొక్క, బహుళం, దట్టమైన, చికురం కుంతలములను, విరళం- పలచనైన, భ్రమరం- ముంగురులను, మృదులం కోమలమైన, వచనం - వాక్యమును, విపులం - విశాలమైన, నయనం- నేత్రములను, మధురం- మనోజ్ఞమయిన, అధరం- అధరోష్ఠమును, లలితం-సుందరమయిన, వదనం- ముఖమును, చపలం- చంచలమయిన, చరితం చ-. చరిత్రమును, కదా- ఎప్పుడు, అనుభవే- చూచుచున్నాను,

ఉ॥ వెన్నెలఁ గోపకాంతలను వేడుకఁ గోరెడు చాపల్యంబులోఁ।

గన్నులబెళుకు-తోనగు మొగంబునవ్రాలు చలాలకాళితోc । దిన్ననిప
లుకు-తో ముడిచి దిద్దినగొప్పశిరోజపాళితో । నెన్నఁడునాదు మోహిలంజ
రియించునో వెన్నుఁడు కావి మోవితోc । ౬౦

తా॥ గోపికలంగోరెడు చపలంబును విశాలంబులగు కన్నులును సొగస
గునగు మొగము వంగారు ముంగురులును-నును మెఱుంగు గొప్పకొప్పునుc- ది
య్యదనంబుఁ దెల్పు ముద్దుపలుకు-లును మనోజ్ఞంబగు కెమ్మోవియుం గలిగి తే
జరిల్లు శ్రీకృష్ణమూర్తి నెప్పటికెంగాం చెదనోయనుట.

మూ॥ పరిపాలయనకృపాలయేత్యసకృజ్జల్పితమాత్మబాన్ధవః ।
మురళీమృదులస్వనాన్తరే విభురాకర్ణయితాంకదానునః॥ ౬౧

టీక. హేకృపాలయ- ఓయిదయావంతుఁడ, నః- మమ్మును, పరిపాల
య-రక్షింపుము, ఇతి-ఇట్లని, అసకృజ్జల్పితమ్- అసకృత్-మాటిమాటికి నుడి
వెడు, జల్పితమ్- వచనమును, విభుః-శ్రీకృష్ణమూర్తి, ఆత్మబాన్ధవస్సన్-ఆ
త్మ-నాకు, బాన్ధవస్సన్- బంధువుఁడగుచున, మురళీమృదులస్వనాన్తరే- ము
రళీ- వేణువుయొక్క-, మృదుల- కోమలమయిన, స్వనాన్తరే- ధ్వనిమధ్యమం
దు, కదాను- ఎప్పుడు, ఆకర్ణయితామ్- వినును.

చ॥ నిరుపమవేణుగాన మహనీయసుఖాను భవైకమగ్నతన్ । గ
రcగిపరాకుఁ గైకొనిన కంజదళాక్షుండు దత్తచిత్తుఁడై । నిరతమునన్ను
గావునవనీతహరాయని మాటిమాటికిన్ । మొరయిడునట్టినా వచన
ముల్ దయలో నెపుడాలకించునో॥ ౬౧

తా॥ తులలేని వేణుగానంబునన్ నైన సుఖానుభవంబున బరాకుc బొందిన
శ్రీకృష్ణుని సుఖంపు వాని బంధువుడైనను రక్షింపు మోదయానిధియని మాటిమాటి
కె మొరయిడుచున్న నావచనం బెన్నటికి వినునోయనుట.

శ్లో॥ కదానుకస్యాన్ను విపద్దశాయాం కైశోరగన్ధిః కరుణామ్బు
ధిర్నః । విలోచనాభ్యాం విపులాయతాభ్యాం వ్యాలోకయిష్యన్విష
యీకరోతి॥ ౬౨

టీక. కస్యాన్ను విపద్దశాయాం- ఏయాపత్సమయంబున, కైశోరగన్ధిః-
ఈషద్బాల్యముగల-కరుణామ్బుధిః- దయాసముద్రుఁడగు కృష్ణమూర్తి, విపు
లాయతాభ్యామ్- విపుల- వెడలుపులైనట్టి, ఆయతాభ్యాం- నిడుపులైనట్టి, వి
లోచనాభ్యామ్- నేత్రములచేత, వ్యాలోకయిష్యన్- మిక్కి-లిచూడఁగలవాఁ
డైనః-నన్ను, కదాను, ఎప్పుడు, విషయీకరోతి- గోచరునిఁగా జేయుచున్నాఁడు.

చ ॥ ఒకపలవంపఁజింతిలుచునుం డెడినన్నుశిశుత్వగంధమా । త్ర
కలితయౌవనంబుదనరన్ గరుణాపరుణాలయుండవా । యకశతపత్ర
పత్రవిపులారుణలోచన లీలఁజూచుచూ । డికెకీఁదగుపీడఁటంచుఁ బరి
కించుట లెన్నఁడుగల్గ నేర్చునో॥ ౬౧

తా. ఎట్టియాపత్కాలంబుననైనను కొంచెంబుగనుండు బాల్యఁబు
గలిగి వెలయు దయాసముద్రుండైన శ్రీకృష్ణదేవుండు వెడలుపై నిడుపై వె
లుంగుకన్నులచేఁజూడ వీడక్కుండకదాయనినను నెప్పుడు గాంచునోయనుట.

మా ॥ మధురమధరబిమ్బే మంజులంమందహాసే శిశిరమమృతవా
క్యే శీతలందృష్టిపాతే । విపులమరుణనేత్రే విశ్రుతంవేణునాదే మరకత
మణినీలమ్బాలమాలోకయే ను॥ ౬౨

టీక. అధరబిమ్బే - దొండపండువంటి యధరమందు, మధురమ్ - తి
య్యనైనయట్టి, మందహాసే- చిరునగవందు, మంజులమ్- మనోజ్ఞమైనయట్టి, అ
మృతవాక్యే - అమృతమువంటిమాటయందు, శిశిరమ్ - చల్లనైనయట్టి, దృష్టి
పాతే- చూపందు, శీతలం-చల్లనైనట్టి, అరుణనేత్రే- అరుణ- ఎఱ్ఱనైన, నేత్రే-
నేత్రమందు, విపులమ్- విశాలమైనయట్టి, వేణునాదే - వేణుధ్వనియందు, వి
శ్రుతమ్ - మిక్కిలివినుచున్నయట్టి, మరకతమణినీలమ్ - మరకతమణి- ఇంద్రనీ
లమణివలెను, నీలమ్-నల్లనైన, బాలమ్ - బాలగోపాలుని, ఆలోకయే ను- చూ
చుచున్నానాయేమి.

చ ॥ చల్లనిచెల్వుఁజూపుసుధఁజల్లెడుమాటలుదివ్యమోవియున్ ।
సల్లలితారుణద్యుతివిశాలవిలోచనముల్ మృదుస్మితో । త్ఫుల్లముఖాం
బుజంబుఁబరిపూరితవేణువినోదనాదమున్ । నల్లనిమేనికాంతిమ్మెఱుఁగు
నన్విలసిల్లినబాలుఁగాంచెదన్॥ ౬౩

తా. తియ్యదనంబుఁదెల్పు కెమ్మోవియు మనోహరంబగు చిఱునగవు
నమృతంబునోలుకు ముద్దుపలుకులును జల్లనగుచూపును గెంజాయరంజిల్లు వెడలు
పగుకన్నుగవయును పరిపూర్ణమయిన వేణుగానంబునుం గలిగి యింద్రనీలర
త్నంబుఁబోలు నెమ్మేనిచాయచేఁ జెజరిల్లు బాలకృష్ణునింజూచెదననుట.

ము॥ మాధుర్యాదపిమధురం మన్మథతాతస్య కిమపికైశోరమ్ ।
చాపల్యాదపిచపలంచేతోమమహరతిహంతకిం కుర్మః॥ ౬౪

టీక. మాధుర్యాదపి - సకలజనసిద్ధసౌంధర్యంబుకన్నను, మధురం-
సుందరమయినయట్టి, చాపల్యాదపి- సకలజనచపలతకన్నను, చపలమ్- చంచల

నైనయట్టి, కిమపి- చెప్పనలవిగాని, మన్మథతాతస్య- మన్మథ - ప్రద్యుమ్నుని కి, తాతస్య- తండ్రియైనశ్రీకృష్ణునియొక్క, కైశోరమ్- బాల్యము, మమ- నా యొక్క, చేతః - చిత్తమును, హరతి - హరించుచున్నది, కిం కుర్మః - ఏమిసే యుదును, హంత- అకటా.

ఉ ॥ గుబ్బెమెఱుంగుబోండ్లు తటుకాపడిలోలతఁ జూచునంతలో।
నిబ్బరమైనచిత్తము నెపొంగన నందనుకన్ననందనా। యబ్బురమైనబా
ల్యమునవద్దిరయంగఁ గన్నతండ్రియౌ। గుబ్బునవామదింగలుగుగుట్టు
గలంచెను కేమిసేయుదున్॥ ౬౪

తా. సకలజనంబులందుండెడి సౌందర్యంబునకన్న నధికంబగు సౌం దర్యంబుగలిగి సకలలోక చాపల్యంబునకన్న నధికంబగు చంచలంబుగలిగి వెలుంగు మన్మథతండ్రియగు శ్రీకృష్ణదేవు చెప్పనలవిగానిబాల్యంబు నామ నంబుఁ గలంచుచున్నది యికనేమిసేయుదునసుట.

శ్లో॥ వక్షస్థలేచవిపులం నయనోత్పలేచ మందస్మితేచ మృదులం
మదజల్పితేచ। బింబాధరేచమధురం మురళీరవేచ బాలంవిలాసనిధి
మాకలయేకదాను॥ ౬౫

టీక. వక్షస్థలేచ- వక్షస్థలమందును, నయనోత్పలేచ - కలువవంటినే త్రములందును, విపులం- విశాలమైనయట్టి, మందస్మితేచ- చిఱునగవందును, మద జల్పితేచ- మద-మదయుక్తమైన, జల్పితేచ- వచనమందును, మృదులం- కోమ లమైనయట్టి, బింబాధరేచ- బింబ- దొండపండువంటి, అధరేచ- మోవియం దును, మురళీరవేచ - వేణుగానమందును, మధురం - హృద్యమైనట్టి, విలాస నిధిం- విలాస- విలాసములకు, నిధిం-నిక్షేపమైన, బాలం- బాలుఁడైనకృష్ణుని కదా- ఎప్పుడు, ఆలోకయేను- చూచుచున్నాను.

మ ॥ భళిరాకన్నులబెళ్కుఱొమ్ము జిగిఁజెప్పఁగారాదు వేణుధ్వ
నుల్। దరహాసయెంచఁగఁగావి మోవిరుచివింతల్ చేటులేనవ్వని। గ్గుబ్బు
మగుబ్బారెసుధామనోహర మృదూక్తుల్ మాయురేయిట్టివె। వ్వలకు
వ్వవలకించుభాగ్య మహామంబుల్ మాకునింకెన్నఁడో॥ ౬౫

తా. విశాలంబగు వక్షంబును గన్నులుంగలిగి కోమలంబగు మందహా సంబునువచనంబునుంగలిగితీయనగు నధరంబును వేణుగానంబునుంగలిగి, విలా సమ్ములనిక్షేపంబగుచుఁ దేజరిల్లుబాలకృష్ణునెన్నటికిం గాంచెదనోయనుట.

మా॥ మారస్స్వయంను మధురద్యుతిమండలంనుమాధుర్యమేవనుమ
నోనయనామృతంను। వాణీమృజంను మమజీవితవల్లభోను బాలోయ.
మభ్యుదయతే మమలోచనాయ॥ ౬౬

టీక. మమ- నాయొక్క, లోచనాయ- నేత్రములకొఱకు, బాలః-బాలుఁడు- అభ్యుదయతే- ఆవిర్భవించుచున్నాఁడు, అయం-ఈబాలుఁడు, మారస్స్వయంను- మన్మథుఁడాయేమి, మధురద్యుతిమండలంను - మధురద్యుతి- చంద్రునియొక్క, మండలంను - బింబమాయేమి, మాధుర్యమేవను- సౌందర్యమేనా యేమి, మనోనయనామృతంను- మనః - మనస్సుయొక్కయు, నయన- నేత్రములయొక్కయు. అమృతంను- అమృతమాయేమి, వాణీమృజంను-వాక్పారిశుధ్యమాయేమి, మమ - నాయొక్క, జీవిత వల్లభోను - ప్రాణనాథుఁడాయేమి.

*

ఉ॥ మారుఁడొ కాకయంబుధి కుమారుఁడొ మానసలోచనామృ
తా। కారమొ మాధురీగుణవికారమొ మంజులవాక్పవిత్రతా।సార
మొ నాదుజీవమణిసారమొ లేకమఱేమిచిత్రమో। మీఱెడు బాలభావ
మున మెచ్చులుగు లెఱుఁడు నాదుచూడ్కికిన్॥ ౬౬

తా. నాకన్నులకుం గానవచ్చుచున్న యిబ్బాలుండు మన్మథుండో లేక చంద్రుండో సౌందర్యంపు రాశియో నామనోనయనామృతమో వాక్పవిత్రతాకారమొకో లేక నాప్రాణవల్లభుండోయని యుత్తెఱంగున నిశ్చయంబు సవికల్పించెననుట.

మా॥ ఆర్ద్రావలోకిత దయాపరిణద్ధనేత్ర మావిష్కృతస్మిత సు
ధామధురాధరోష్ఠమ్। ఆద్యంపుమాంసమవతంసితబర్హిబర్హమాలో
కయంతి కృతినః కృతపుణ్యపుంజాః॥ ౬౭

టీక. ఆర్ద్రావలోకితదయాపరిణద్ధనేత్రమ్- ఆర్ద్ర- సరసములైన, అవలోకిత- చూపులుగలయట్టి,దయా- దయతోడ, పరిణద్ధ-కూర్పఁబడిన, నేత్రమ్- నేత్రములుగలయట్టి, ఆవిష్కృతస్మితసుధామధురాధరోష్ఠమ్-ఆవిష్కృత- ప్రకాశింపఁబడిన, స్మిత- లేనగవనెడి,సుధా - అమృతముచేత, మధుర - మనోజ్ఞమైన, అధరోష్ఠమ్- మోవిగలయట్టి, అవతంసితబర్హిబర్హమ్- అవతంసిత- శిరోభూషణముగాఁ జేయఁబడిన, బర్హిబర్హమ్ - నెమలిపురిగలయట్టి,ఆద్యమ్- జగత్కారణుండైన,పుమాంసమ్- శ్రీకృష్ణమూర్తిని,కృతపుణ్యపుంజాః-పుణ్యసమూహములుగల, కృతినః- విద్వాంసులు, ఆలోకయంతి- చూచుచున్నారు.

ఉ॥ అందము చిందు మోము దరహాససుధామధు రాధరోష్ఠము। నందదయావలోకన విశాలవిలోచనముల్ శిరంబునం। బొందుగ నెమ్మి పింఛమును బూనినయాద్యుని దేవదేవుని। నందకుమారుఁ గాంతు రుసనాతనపుణ్యమునన్ బుధోత్తముల్॥ ౬౭

తా. సరసంబులగు చూపులుగలిగి దయాకరంబులై విశాలంబులగు నేత్రంబులును ప్రకాశించు చిఱునగవను నమృతంబుచే మనోహరంబగు నధరంబును శిరోభూషణంబు ధరియించిన నెమలిపురియును గలిగి సర్వజగంబునకుం దాసయేలికయైనవెలయు శ్రీకృష్ణదేవునిఁ బుణ్యంబు చేసిన పెద్దలు చూచుచుందురుగ వాయనుట.

మూ॥ బాలోయమాలోలవిలోచనేన వక్త్రేణ చిత్రీకృతదిఙ్ముఖేన। వేషేణ ఘోషోచితభూషణేన ముగ్ధేన దుగ్ధే నయనోత్సుకం నః॥ ౬౮

టీక- ఘోషోచితభూషణేన - ఘోష-గొల్లపల్లియకు, ఉచిత- తగిన, భూషణేన - సొమ్ములుగల, వేషేణ- అలంకారముచేత, ముగ్ధేన-సుందరమయినట్టి, ఆలోలవిలోచనేన- ఆలోల- చంచలములైన, విలోచనేన- నేత్రములుగలయట్టి, చిత్రీకృతదిఙ్ముఖేన- చిత్రీకృత- చిత్తరువుగలవానిగాఁ జేయఁబడిన, దిఙ్ముఖేన - దిఙ్ముఖములుగల, వక్త్రేణ- ముఖముచేత, అయం బాలః- ఈబాలుఁడు, నః- మాయొక్క, నయనోత్సుకమ్- చక్షు-స్సంతోషమును, దుగ్ధే-సంపాదించుచున్నాఁడు.

ఉ॥ ఎల్లెడఁ జిత్రరూపము వహించిన చక్కని మోము దమ్మితో। గొల్లవిలాసవేషమునకుం దగు సొమ్ములతోఁ జలత్ప్రమో। జ్జ్వల్లసదక్షిశీతలసమున్నతితో విలసిల్లుబాలకుం। డుల్లముపల్లవింపనయనోత్సవమారఁ జరించుచున్నఁడో॥ ౬౮

తా. గొల్లపాళెంబునకుఁ దగినసొమ్ములచే నలంకరింపఁబడి విశాలంబులగు నయనంబులుగలిగి యెల్లదెసలం జిత్రించినయటుల వెలుంగు నెమ్మోముచేఁ దేజరిల్లు నీబాలుండు నాకన్నులకత్యంతసంతోషంబుఁ జేయుచున్నాఁడనుట

మూ॥ ఆన్దోళితాగ్రభుజమాకులనేత్రలీల మార్ద్రస్మితార్ద్రవదనాంబుజచన్ద్రబింబమ్। శింజానభూషణశతం శిఖిపింఛమౌళిం శీతం విలోచనరసాయనమభ్యుపైతి॥ ౬౯

టీక. ఆందోళితాగ్రభుజమ్- ఆందోళిత- ఈషత్కంపితములగు, అగ్రభుజమ్- భుజాగ్రములుగలయట్టి, ఆకులనేత్రలీలం - ఆకుల - వ్యాకులమయిన

నేత్రలీలమ్ - నేత్రవిలాసముగలయట్టి, ఆర్ద్రస్మితార్ద్రవదనామ్బుజచన్ద్రబిమ్బమ్-ఆర్ద్ర- సరసమయిన,స్మిత-చిఱునగవుచేత-ఆర్ద్ర-సరసమయిన,వదనామ్బుజచన్ద్రబిమ్బమ్- చంద్రునివంటిముఖకమలముగలయట్టి, శింజానభూషణశతం-శింజాన-మ్రోయుచున్న,భూషణశతమ్-ఆభరణశతముగలయట్టి,శిఖిపిఞ్ఛమౌళిమ్- శిఖిపిఞ్ఛ - నెమలిపురి, మౌళిమ్- శిరమందుఁగలయట్టి, శీతమ్ (చూచువారలనేత్రములకు) చల్లనైనయట్టి,లోచనరసాయనమ్-లోచన- నేత్రములకు, రసాయనమ్- తియ్యనైనశ్రీకృష్ణాఖ్యవస్తువు, మమ-నాకు, అభ్యేష్యతి- అభిముఖముగావచ్చుచున్నది.

ఉ॥ అంచెలుమువ్వలున్మొరయ హస్తములూపఁగఁగంకణధ్వను
ల్ । సందడిఁజేయనాననవిలాసముచందురుఁ గ్రేణిసేయనా । నందవి
శాలలోలనయనమ్ములతోశిఖిపింఛమౌళితో । నందముఁజెందులోచన
రసాయనమల్లదెవచ్చెఁజల్లఁగన్॥ ౬౯

తా. కొంచెముగా సంచలించుచున్న మూపులును ప్రకాశించుచున్న విశాలంబులగు నేత్రవిలాసంబులును సరసంబగుచిఱునగవుచేఁ బేజరిల్లు నెమ్మోము దామరయును - మ్రోయుచున్న భూషణశతంబును నెమలిపురిచే నలంకరింపఁబడినసిగయును గలిగి చూచువారలచూపులకుఁ జల్లదనంబు నెఱపు కన్నుల పండువగు శ్రీకృష్ణరూపంబగువస్తువు నాకభిముఖంబుగ వచ్చుచున్నది యనుట.

సూ॥ పశుపాలబాలపరిషద్విభూషణంశిశురేష శీతలవిలోలలో
చనః । మృదులస్మితార్ద్రవదనేన్దుసమ్పదా మదయన్మదీయహృదయం
విగాహతే॥ ౭౦

టీక. పశుపాలబాలపరిషద్విభూషణం-పశుపాలబాల-గోపాలబాలురయొక్క, పరిషత్- సభకు, విభూషణమ్- అలంకారభూతుఁడైనయట్టి,శీతలవిలోలలోచనః - శీతల-చూచువారలరక్షించుచున్నయట్టి, విలోల- చంచలములైన, లోచనః-నేత్రములుగల, ఏషః శిశుః-ఈబాలుఁడు, మృదులస్మితార్ద్రవదనేన్దుసమ్పదా - మృదుల - కోమలమయిన, స్మిత-లేనగవుచేత, ఆర్ద్ర-సరసమయిన, వదనేన్దు- ముఖచంద్రునియొక్క, సమ్పదా- సమృద్ధిచేత, మదీయహృదయమ్- మదీయ-నాసంబంధమైన, హృదయం-హృదయమును,మదయన్ మదముగలదానిఁగాఁజేయుచు, విగాహతే- పొందుచున్నాఁడు.

చ॥ వికవికనవ్వుచున్నదిట ప్రేలుకఖ్ఖుల్ నునుపాలబుగ్గలుం ।
జికిలిమెఱుంగుచూపు దహిఁజెందఁగనాననశీతలద్యుతిన్ । బ్రికట్టిఁగో

పశ్చాలకసభానవ భూషణమై చెలంగుచు । లకుచకుమదీయమానసత
లంబుననిల్చెనుసొంపునించుచున్॥ ౨౦

తా- గోపాలబాలకసభయందు భూషణంబులం దేజరిల్లుచుం జూచువారలకు రక్షకంబులై చంచలంబులగు కన్నులుగల యిచ్చాలుండు కోమలంబగు చిఱునగవుచే సరసంబగు నెమ్మొగంబు చందురునందంపు సమృద్ధిచే వెలుంగుచు నాహృదయంబు ముదింపజేయుచుం గానవచ్చుచున్నాడనుట.

మూ॥ తదిదముపనతంతమాలనీలం తరళవిలోచనతారకాభిరామ
మ్। ముదితముదితవక్త్రచన్ద్రబిమ్బంముఖరిత వేణువిలాసజీవితమ్॥ ౨౧

టీక. తమాలనీలమ్- తమాల-చీకటిమ్రాకులవలె, నీలమ్-నల్లనిదైనయట్టి, తరళవిలోచనతారకాభిరామమ్ - తరళ- చంచలములయిన, విలోచన-కన్నులయొక్క, తారక - గ్రుడ్లచేత, అభిరామమ్- సుందరమైనయట్టి, ముదితముదితమ్ - మిక్కిలి సంతోషించునట్టి, వక్త్రచన్ద్రబిమ్బమ్ - చంద్రమండలమువలెనున్నముఖముగలయట్టి, ముఖరిత వేణువిలాసజీవితమ్ - ముఖరిత- మ్రోయుచున్న, వేణు-పిల్లనగ్రోవియొక్క, విలాస- స్వరవిశేషములకు, జీవితమ్- ప్రాణంబైనకృష్ణుడనెడివస్తువు, మే- నాకు, ఉపనతం-ఎదురయ్యె.

ఉ॥ నీలఘనాభమైయతివినిర్మలవేణునినాదజీవమై । లోలతరోల్లసల్లలితలోచన తారకమైప్రసన్నతో । ల్లోలముఖేందుమండల సకీన విలాసకలాకలాపమై । బాలునిలీలవచ్చి కనుపట్టె మహోజ్జ్వలతేజ మిప్పుడున్॥ ౨౧

తా. చీకటిమ్రాకులవలె నల్లనిమేనుగలిగియు నిగనిగలాడు నయనంబులను విలోచనంబు చేమనోహరుండును - సంతసంబునొందుకతమునం దనరు బాలవదనంబుగలవాడును - వేణునాదవిలాసంబులకుం బ్రాణంబునగు శ్రీకృష్ణుండు నాకెదురయ్యెననుట.

మూ॥ చాపల్యసీమచపలానుభవైకసీమచాతుర్యసీమచతురానన
శిల్పసీమ । సౌరభ్యసీమసకలాద్భుతకేళిసీమసౌభాగ్యసీమతదిదం వ్ర
జభాగ్యసీమ॥ ౨౨

టీక. చాపల్యసీమ-చాపల్య-దుష్టచేష్టలకు, సీమ, పొలిమేరయైనయట్టి, చపలానుభవైకసీమ- చపలా- లక్ష్మియొక్క, అనుభవ- భోగంబునకు, ఏక- ముఖ్యమయిన, సీమ- ఇరవైనయట్టి, చాతుర్యసీమ- చాతుర్య- చమత్కారవచనములకు, సీమ- ముఖ్యస్థానమయినయట్టి, చతురాననశిల్పసీమ-చతురానన- బ్రహ్మ

యొక్క, శిల్ప - నిర్మాణమునేయు నెఱతనమునకు, సీమ- పొలిమేరయైనయట్టి, సౌభాగ్యసీమ - సౌభాగ్య - సకలపరిమళవస్తువులకు, సీమ - ముఖ్యస్థానమైన యట్టి, సకలాద్భుత కేళిసీమ- సకల - సమస్తములైన, అద్భుతకేళి - ఆశ్చర్యవిలాసములకు, సీమ - ముఖ్యస్థానమైనయట్టి, సౌభాగ్యసీమ సౌభాగ్య - సౌందర్యమునకు, సీమ - ముఖ్యస్థాన మైనయట్టి, వ్రజభాగ్యసీమ - వ్రజ - గొల్లపల్లెలో నున్నజనులయొక్క, భాగ్య - అదృష్టఫలమునకు - సీమ-పొలిమేరయైన, తత్ - కృష్ణుఁడనెడివస్తువు, ఇదం - నాయెదుటనున్నది.

❋

చ॥ కలిమినెలంత వేఁడుకలకందువపంటవిలోలవృత్తికిన్ । నెలవు శుభాళికాస్పదము నేర్పులప్రోవజ శిల్పికల్పనా।ఫలమతిచిత్రకేళులకుఁ జాలెము తావుల కెల్లదావుగో । కులజన భాగ్యసీమ యిదిగో కనుఁ గొంటిని గంటికింపుగన్॥ ౭౨

తా. అధికంబులగుదుష్టచేష్టలకును లక్ష్మీవిలాసంబులకును - సకలచాతుర్యంబులకును - బ్రహ్మనిర్మాణసామర్థ్యంబులకును - సకలపరిమళపదార్థంబులకును - సమస్తాశ్చర్యవిలాసంబులకును - సకలసౌందర్యంబులకును - గోపాలకులభాగ్యఫలంబులకును ముఖ్యస్థానంబగు కృష్ణాభిదానలోకోత్తర వస్తువునాకెదురయ్యెనన్నటు.

❋

శ్లో॥ మాధుర్యేణద్విగుణశిశిరంవక్త్రచన్ద్రంవహంతీవంశీవీథీవిగళదమృతస్రోతసాసేచయన్తీ । మద్వాణీనాంవిహరణపదంమత్తసౌభాగ్యభాజాంమత్పుణ్యానాంపరిణతిరహో నేత్రయోస్సన్నిధత్తే ॥

టీక.. మద్వాణీనామ్ - నాపలుకులకు, విహరణపదమ్ - విహారస్థానమయిన, మత్తసౌభాగ్యభాజామ్-అధికసౌందర్యమొందిన, మత్పుణ్యానామ్-నాయొక్కపుణ్యములయొక్క, పరిణతిః - పరిపాకము - (అనఁగా శ్రీకృష్ణస్వామి) మాధుర్యేణ - సౌందర్యముచేత, ద్విగుణశిశిరం-మిక్కిలి యాహ్లాదంబున తాపదించునట్టి, వక్త్రచన్ద్రం - చంద్రునివంటిముఖంబును, వహంతీ- వహించుచున్నదై- వంశీవీథీవిగళదమృతస్రోతసా- వంశీ - పిల్లనఁగ్రోవియొక్క, వీథీ-రంధ్రపరంపరనుండి, విగళత్ - జారుచున్న, అమృతస్రోతసా-అమృతప్రవాహసదృశమైన గానవిలాసముచేత, సేచయన్తి - కర్ణానందము సేయుచున్నదై, (మమ - నాయొక్క) నేత్రయోః-కన్నులకు, సన్నిధత్తే- సమీపించుచున్నాఁడు.

శా॥ లావణ్యాంబుధిచంద్రబింబముఖలీలన్ దాల్చి వంశీధ్వనా। దావిర్భూతసుధా ప్రవాహమున నోలాడంబ్రవర్తిల్లునా । దైవాకా

రమునావచో విహారణస్థానంబునాపుణ్యాస । న్యాభవంబారఁబ్రసన్నము
ఖ్యోనుయశో దాపుత్రరూపంబునక్ ॥ ౨౩

తా. నాపలుకులకు విహారస్థానంబును, సర్వోత్తమంబులగు నాయ
దృష్టంబుయొక్క ఫలపరిపాకంబుననగు శ్రీకృష్ణుఁడు సౌందర్యంబుచే సకలజ
నానందంబుసంపాదించుచున్న చందురుంబోలిముఖంబును వహించుచున్నవాఁ
డును, బిల్లనగ్రోవిసందులనుండి వెడలుచున్న యమృతంబువోనిగానంబుచేఁ జె
వులకింపు సేయుచుండువాఁడునునై, నాకుఁబ్రత్యక్షమయ్యెననుట. ※

—※ ఇట్లు ప్రత్యక్షమయిన శ్రీకృష్ణునికినమస్కరించుచున్నాడు. ※—

శ్లో॥ తేజసేస్తు నమో ధేను పాలినే లోకపాలినే । రాధాపయో
ధరోత్సఙ్గ శాయినే శేషశాయినే ॥ ౨౪

టీక. శేషశాయినే - శేష - ఆదిశేషునియందు, శాయినే - పవ్వళించి
నట్టి, రాధాపయోధరోత్సఙ్గశాయినే - రాధా - రాధయొక్క, పయోధరా -
స్తనములయొక్క, ఉత్సఙ్గ - మీఁదను, శాయినే - పవ్వళించినట్టి, లోకపాలినే -
జగద్రక్షకమయినట్టి, ధేనుపాలినే - ధేను - గోవులను, పాలినే - కాచునట్టి, తేజ
సే - తేజముకొఱకు, నమః - నమస్కారము, అస్తు - అవుఁగాక. ※

ఉ॥ పాయని భక్తిమ్రొక్కెద నపారకృపారస ధేనుపాలనో ।
ధ్యాయికి లోకరక్షణవిధాయికి భాసురరాధికాకుచ । స్థాయికిఁబన్నగా
ధిపవిశాలఫణామణి సౌధవీధికా । శాయికిగోపికానయన సాదరసార
ఫల ప్రదాయికిన్ ॥ ౨౪

తా. శేషశయనుండును, సకలలోకపరిపాలకుండును, పరబ్రహ్మం
బయ్యుసులభ్యము తెలియఁజేయుటకై రాధాస్తనంబులందుఁ బరుండు
వాఁడును నావులఁ గాచువాఁడునైన శ్రీకృష్ణునికొఱకు నమస్కారము సేసె
దననుట. ※

శ్లో॥ ధేనుపాలదయితాస్తనస్థలీధన్యకుఙ్కుమసనాథకాన్తయే ।
వేణుగీతగతిమూల వేధసే తేజసే తదిదమోఁన మోనమః ॥ ౨౫

టీ. ధేనుపాలదయితాస్తనస్థలీధన్యకుఙ్కుమసనాథకాన్తయే - ధే
నుపాల - గోపాలురకు, దయితా - ప్రియురాండ్రయిన వ్రేఁతలయొక్క, స్తన
స్థలీ - స్తనప్రదేశమునందు, ధన్య - కృతార్థమైన, కుఙ్కుమ - పసుపుమొదలగు
చూర్ణవిశేషములతోడ, సనాథ - కూడుకొన్న, కాన్తయే - కాంతిగలయట్టి
వేణుగీతగతిమూలవేధసే - వేణు - పిల్లనఁగ్రోవియొక్క - గీత - గానముయొ

కళా, గతి - సర్వవిశేషములకు, మూలవేధసే - మూలబ్రహ్మమైన, తేజసే - శ్రీకృష్ణరూపమైన తేజంబుకొఱకు, తదిదమ్, అయీ, ఓం నమోనమః - ప్రణవపూర్వకములయి పలుమఱుం జేయు నమస్కారములు.

మ॥ పసిగాపుంజిగురాకుంబోండ్లమెఱుంగుం బాలిండ్లకాశ్మీరపుం
రసనుల్ జొబ్బిలనుబ్బినిర్భరశరీరంభస్థితిం దేల్చను । ల్లసితంబైనమురళీని
నాదగతి మూలబ్రహ్మమై కంటికిం। బోసంగుంజాలెడు మూర్తికిం కేమొ
గడంగేలోంకారపూర్వంబుగన్॥ ౨౫

తా. గోపికాస్తనంబులయందలికుంకుమంబులోంగూడినశరీరకాంతిగలయదియును - వేణుగానంబులకు మూలబ్రహ్మంబైన తేజంబునకుం బ్రణవపూర్వకంబుగాంగం బలుమాఱునమస్కరించెదననుట - ఇట్లునమస్కరించినపిమ్మట తనకెదుట వచ్చుచున్న శ్రీకృష్ణుని విలాసంబు వర్ణించుచున్నాండు.

మూ॥ మృదుక్వణన్నూపురమన్థరేణ బాలేనపాదామ్బుజపల్లవే
న । అనుస్వనన్మఞ్జులవేణుగీత మాయాతి మేజీవితమాత్తకేళి॥ ౨౬

టీక. ఆత్తకేళి - ఆత్త పొందంబడిన, కేళి - విహారంబులుగల, మేజీవితమ్ - నాప్రాణంబైన శ్రీకృష్ణుండను తేజంబు, మృదుక్వణన్నూపుర మన్థరేణ - మృదు - చెవులకింపగునట్లుగా, క్వణత్ - మ్రోయుచున్న, నూపుర - అందియలచేత, మన్థరేణ - మందసంచారముగలయట్టి, బాలేన - చిన్నవాండైనట్టి, పాదామ్బుజపల్లవేన - తామరఱేకులవంటి పాదంబులచేత, అనుస్వనన్మఞ్జులవేణుగీతమ్ - అనుస్వనత్ - అందియలననుసరించి పుట్టుచున్నట్టి, మంజుల - మనోహరమైన, వేణుగీతమ్ - వేణునాదము గలుగునట్లుగా, ఆయాతి - వచ్చుచున్నది.

ఉ॥ చల్లనివేణుగీతికను సారిగతాళగతుల్సెగంగఘల్ । ఘల్లుర
టుంచునందియలు గజ్జలునొక్కటంబెక్కటిల్లగాం। బల్లవకోమలాంఘ్రు
లనుబాలకుండాడుచుంజూపుచుండనా । పేర్మితవృత్తివచ్చెంగనువిందుగ
జీవమువచ్చుకైవడిన్॥ ౨౬

తా. నాప్రాణభూతుండగు కృష్ణుండువిహారంబులనొందుచు మృదువుగమ్రోయుచున్న యందియలచేమందసంచారంబు నొందుననియును దామరఱేకులుంబోనివియునగుచిన్నియడుగులచే నూపురంబుల కనురూపంబుగా ధ్వనిచేయుచున్న వేణుగానంబునకు సమానంబుగనర్తనంబు సేయుచు వచ్చుచున్నాండనుట.

మూ॥ సోయంవిలాసమురళీనినదామృతేన సించన్నుదఞ్చితమిదం

మమకర్ణయుగ్మమ్ । ఆయాతి మే నయనబన్ధు రనన్యబన్ధురానన్దకందళి
త కేళికటాక్షలక్షః॥ ౨౨

టీక. ఆనన్దకన్దళితకేళికటాక్షలక్షః- ఆనన్దకన్దళిత, ఆనందాంకురములఁ జేయుచున్నట్టి, కేళి-విలాసప్రధానములైన, కటాక్ష - కడకంటి చూపులయొక్క, లక్షః-లక్షలుగలయట్టి, మే-నాయొక్క, నయనబన్ధుః - నయన-నేత్రములకు, బన్ధుః - బంధువైనయట్టి, అనన్యబన్ధుః-సర్వబంధువైన శ్రీకృష్ణుండు, ఉదఞ్చితమ్ - వినుటకునుయుక్తమైన, మమ - నాయొక్క, కర్ణయుగ్మమ్, కర్ణ-చెవులయొక్క, యుగ్మమ్ - జంటను, విలాసమురళీనినదామృతేన- విలాస-వినదగిన, మురళీ-పిల్లనఁగ్రోవియొక్క, నినద- ధ్వనియనెడి, అమృతేన-అమృతముచేత, సిఞ్చన్ - తడుపుచున్నవాఁడై, ఆయాతి-వచ్చుచున్నాఁడు.

ఉ॥ మారిమిజేసిగోపికలమానమునాచినవాఁడుపీఁడెకాఁ । బో
లును నేఁడు వేణురవముం జెవినింపుచు నాదుకంటికిన్ । మేలలరంబ్రమో
దరసనిర్భరకేళికటాక్షలక్షుఁడై । చాయఁడనన్యబంధుఁడెడవాయక యిట్ల
లయింపవచ్చెఁగా॥ ౨౨

తా. ఆనందాంకురంబులనుత్పాదించునట్టియసంఖ్యేయంబులగు విలాసకటాక్షంబులుగలవాఁడును- సర్వబంధుండును నానయనంబులకు నత్యంతప్రియుండునునగు- కృష్ణుండాశగలదైన నాకర్ణద్వయంబును మనోహరంబగుమురళీనాదామృతంబుచేఁదడుపుచున్నవాఁడై వచ్చుచున్నాఁడనుట.

ము॥దూరాద్విలోకయతివారణఖేలగామీధారాకటాక్షభరి
తేన విలోచనేన । ఆరాదుపైతి హృదయఙ్గమ వేణునాద వేణీదుఘేనద
శనావరణేన దేవః॥ ౨౩

టీక. హృదయఙ్గమవేణునాదవేణీదుఘేన - హృదయఙ్గమ- హృద్యమైన, వేణునాద- వేణుధ్వనియనెడి, వేణీ - ప్రవాహమును, దుఘేన - పిదుకుచున్న, దశనావరణేన- అధరోష్ఠముచేత, ఉపలక్షితః-చూడఁబడుచున్న, దేవః- శ్రీకృష్ణుఁడు, ధారాకటాక్షభరితేన, ధారా- ప్రవాహముగాఁజేయఁబడిన, కటాక్ష - కడకన్నులచేత, భరితేన - నిండింపఁబడిన, విలోచనేన - కన్నుఁదోయిచేత, దూరాత్-దూరమునుండి, విలోకయతి- చూచుచున్నాఁడు, వారణఖేలగామీ - వారణ, ఏనుఁగువలె, ఖేలగామీ - లలితముగనట్టుగమనశీలుఁడగుచు, ఆరాత్ - సమీపమునుండి, ఉపైతి-వచ్చుచున్నాఁడు-

మ॥ ఘనమత్తేభవిలాసయానము సెలంగన్ దవ్వులఁజూచిచ । ల్లి

నిఖారాళకటాక్షవీక్షణ సముల్లాసంబుతోఁ జెంగటం । జనువేళన్ దశ
నచ్ఛదంబు వెలయన్నాస్వామి సమ్మోదమో । హనవంశీనినదప్రవా
హాముఖలీలావాప్తిఁ జెల్వున్ దయన్॥ ౭౯

తా. మనోహరంబగు వేణునాదంబనియెడి ప్రవాహంబుంబిదుకు కెమ్మోవిచేఁగానంబడు శ్రీకృష్ణదేవుండు ప్రవాహంబుగఁ జేయఁబడిన కడకంటిమాపులచే నిండింపంబడిన కన్నుంగవచేఁ దూరంబుగనుండి చూచుచు మత్తగజంబువలె సుందరమగు గమనంబు గల వాఁడగుచు సమీపమునుండి వచ్చుచున్నాఁడనుట.

శ్లో॥ త్రిభువనసరసాభ్యాం దివ్యలీలాకులాభ్యాం దృశిదృశిశిశిరాభ్యాం దీప్తభూషాపదాభ్యాం। అశరణశరణాభ్యామద్భుతాభ్యాం పదాభ్యామయ మనుకూజద్వేణు రాయాతి దేవః॥ ౭౯

టీక. దేవః- శ్రీకృష్ణమూర్తి, అనుకూజద్వేణుః- అనుకూజత్- మ్రోయుచున్న, వేణుః - పిల్లనఁగ్రోవిగలవాఁడగుచు, త్రిభువనసరసాభ్యామ్- త్రిభువన- ముల్లోకములకును, సరసాభ్యామ్- మనోహరములైనవియు, అద్భుతాభ్యాం- ఆశ్చర్యసంపాదకములైనవియు, దీప్తభూషాపదాభ్యాం- దీప్త- ప్రకాశించుచున్న, భూష- భూషణములకు, పదాభ్యాం- నివాసములైనవియు, దివ్యలీలాకులాభ్యామ్ - దివ్య- దేవసంబంధములయిన, లీలా- విలాసములచేత, ఆకులాభ్యామ్- వ్యాకులములయినవియు, దృశిదృశి- ప్రతిదర్శనమందును, శిశిరాభ్యామ్- ఆహ్లాదసంపాదకములైనవియు, అశరణశరణాభ్యామ్- అశరణ- అగతికులకు, శరణాభ్యామ్- రక్షకములైనవియునైన, పదాభ్యామ్- పాదములచేత, అయమ్- అయం- వీఁడు, ఆయాతి- వచ్చుచున్నాఁడు.

మ॥ క్రీడాభూషణధారులై యశరణశ్రేయశ్శరణ్యంబులై । చూ
డంజూడఁగఁజల్లనై సొగసునై చోద్యంబులై దేవతా । చూడారత్న
ములైనపాదములరా సొంపొందివేణుధ్వనుల్ । జాడల్ చెల్వఁగ వీఁడె
వీఁడెయున నాస్వామిన్ విలోకించెదన్॥ ౭౯

తా. మ్రోయుచున్నపిల్లనఁగ్రోవిగలవాఁడగుచు ముల్లోకంబులకు మనోజ్ఞంబులై యాశ్చర్యంగలుగఁజేయునవియై ప్రకాశించుచున్న భూషణంబులకు నెలవులై దివ్య విలాసంబులతోడం గూడి చూడ జూడఁ జల్లనివియై యశరణ్యంబులైన పాదంబులచే నితండితఁడె యనునటుల సమీపంబున శ్రీకృష్ణుండు వచ్చుచున్నాఁడనుట.

మూ॥ సోయమ్మునీన్ద్రజనమానసతాపహారీ సోయంమదవ్రజవ
ధూవసనాపహారీ । సోయంతృతీయభువనేశ్వరదర్పహారీ సోయంమదీ
యహృదయామ్బురుహాపహారీ॥ ౮౦

టీక. యః-ఎవ్వఁడు, మునీన్ద్రజనమానసతాపహారీ-మునీన్ద్ర-మునిశ్రే
ష్ఠులయొక్క, జన-సమూహముయొక్క, మానసతాప-మనస్తాపమును, హా
రీ- అపహరింపసమర్థుఁడో, సః-ఆపురుషుఁడు, అయం-ఇతఁడే, యః-ఏపురుషుఁ
డు, మదవ్రజవధూవసనాపహారీ-మద-మత్తలైన, వ్రజవధూ-గోపస్త్రీలయొ
క్క, వసన - వస్త్రములను, అపహారీ-హరింపసమర్థుఁడో, సః- వాఁడు, అ
యం- ఇతఁడే, యః-యెవఁడు, తృతీయభువనేశ్వరదర్పహారీ-తృతీయభువనే
శ్వర- ఇంద్రునియొక్క, దర్ప - గర్వమును, అపహారీ - అపహరింపసమర్థుఁ
డో, సః-అతఁడు, అయం-ఇతఁడే, యః- ఎవఁడు, మదీయహృదయామ్బురు
హాపహారీ- మదీయ- నాసంబంధమయిన, హృదయ- ఎడఁదయనియెడి, అమ్బురు
హ-కమలమును, అపహారీ-అపహరింపసమర్థుఁడో, సః-వాఁడు,అయం-ఇతఁడే.

ఉ॥ చిక్కఁగనాఁడుగోపికలచేలములెత్తినదొంగ శైలముల్ । చె
క్కులుసేయువానిమదజృంభమునాఁచినదొంగభక్తిచే । నెక్కొనుమా
నికోటిమదినిల్చినపాపముఁబాపుదొంగనా। చొక్కపుఁజిత్తసారసము
జూరలుగాఁగొనుదొంగనేటికిఁ॥ ౮౦

తా. ఎవఁడు సకలమునులమనంబులంబొడముతాపంబులంగొల్లలాడె
నెవ్వం డెలజవ్వనంపు ద్రేంతలచేలంబులంబారఁగొనె నే పురుషుండింద్ర గర్వం
బపహరించె నెవఁడు నాడెందంపుఁదామరం గొల్లగొనియె నట్టిపురుషుండి
తండేయనుట.

మూ॥ సర్వజ్ఞత్వేచమౌగ్ధ్యేచ సార్వభౌమమిదంమమ। నిర్విశ
న్నయనం తేజో నిర్వాణపదమశ్నుతే॥ ౮౧

టీక . సర్వజ్ఞత్వేచ- సర్వజ్ఞత్వమందును, మౌగ్ధ్యేచ - సౌందర్యంబున
ను, సార్వభౌమమ్- సర్వభూమీశ్వరాతిశాయియగు, ఇదం - ఈపురోవర్తియ
యిన, తేజః - తేజముఁగూర్చి, నిర్విశత్ - ప్రవేశించుచున్న, మమ - నాయొ
క్క, నయనం - నేత్రము, నిర్వాణపదం- మోక్షసుఖమును, అశ్నుతే- అను
భవించుచున్నది,

మ॥ వినుసర్వజ్ఞతయందుమౌగ్ధ్యమునసుర్విఁ సార్వభౌమంబు
నా॥ జనునీ తేజముఁ జూచి నానయనముల్సారూప్యముం జెందెవీ । డని

యాలోకముఁ జేయఁగా భ్రమరకీటన్యాయముం గాంచికా । దనజ్ఞా
నేంద్రియరూఢికన్నులకు నేలాకల్గునూహింపఁగన్ ౮౧

తా. సర్వజ్ఞత్వంబున సౌందర్యంబున సర్వాతిశాయినైయీముందఁగానంబడు తేజంబుఁగూర్చి ప్రవేశించు నానయనంబు మోక్షసుఖంబు ననుభవించుచున్నదియనుట.

శ్లో॥ కృష్ణాంకమేతత్పునరుక్తశోభమున్ముక్తతారాంశోరుదయంముఖేన్దోః। తృష్ణాంబురాశిం ద్విగుణీకరోతి కృష్ణాహ్వయం కించన జీవితం మే॥

టీక. మే-నాయొక్క, జీవితం- జీవనమయినదియు, కించన- ఇట్టిదియనిచెప్పనలవిగానిదియు, కృష్ణాహ్వయం- శ్రీకృష్ణాఖ్యమునునగు, ఏతత్-ఈవు రోవర్తివస్తువు, ముఖేన్దోః - ముఖచంద్రునివలన, ఉన్ముక్తతారాంశోః - చంద్రునియొక్క, ఉదయం-ఆవిర్భావమును- పునరుక్తశోభం- పునరుక్త-ద్విగుణితమగు, శోభం, కాంతిగలదిగా, కృష్ణానం-చేయుచున్నదైయె, తృష్ణాంబురాశిం ఆశాసముద్రమును, మే-నాయొక్క. ద్విగుణీకరోతి- రెండంతలుగాఁజేయుచున్నది

మ॥ కనులోల్లాసకమైనిరంతరకళల్ గన్పట్టశీతాంశుబిం। బము
కంఠున్ ద్విగుణాభిరూప్యమున రమ్యంబైన నెమ్మోముఁబు। న్నవజా
బిల్లి వెలుంగుతో వెలయు కృష్ణాభిఖ్యమానాయుజీ। వముదృష్ణాబ్ధితరంగ
లన్ ద్విగుణమైన ట్లిల్లఁ జేసెన్మదిన్ ॥ ౮౨

తా. నాజీవితంబగుచుం జెప్పనలవిగాని శ్రీకృష్ణాఖ్యంబగునీముందుకానంబడువస్తువు నెమ్మొగంబుచంద్రునివలనఁబూర్ణిమయందుఁబొడముచంద్రునికి వన్నియఁగల్పించునదియై నాయందాశా సముద్రంబును నెగడంజేయుచున్నదియనుట.

శ్లో॥ తదేతదాతామ్రవిలోచనశ్రీ సంభావితాశేషవినమ్రవర్గమ్।
ముహుస్స్మరాశేస్సను రాధరోష్ఠం ముఖామ్బుజం చుమ్బతి మానసం మే॥

టీక. ఆతామ్రవిలోచనశ్రీసంభావితాశేషవినమ్రవర్గం - ఆతామ్ర - ఈషదరుణములయిన, విలోచన - నేత్రములయొక్క, శ్రీ - కాంతిచేత, సంభావిత - బహూకరింపఁబడిన, అశేషఁ సను స్రవయిన, వినమ్రవర్గం-నమ్రజనసమూహముగలదియు, మధురాధరోష్ఠం- మధుర - మనోజ్ఞమగు, అధరోష్ఠం- అధరముగలదియునునగు, ముహుః- శ్రీకృష్ణమూర్తియొక్క, యత్ - ముఖామ్బుజం, ముఖకమలమును, మే- నాయొక్క, మానసం- మనస్సు, చుమ్బతి- ధ్యానము చేయుచున్నదియో, తత్ - ఆ శ్రీకృష్ణమూర్తిముఖము - ఏతత్

చ॥కలశపయోధిశీకరని కాయముచేసును గెంపుమీరుక।న్నులన
తపాళికిం బ్రియము నూలొక్కొనఁజేయుచుఁ దత్సుధాకణం। బులుమధు
రాధరోష్ఠమునఁ బూనినయాదిమదేవు మోముగా। వలెనదిగాకయు
న్నయెడఁబల్కులు నామదియానఁ గోరునే॥ ౬౩

తా. ఈషదరుణంబులగునయనంబులకాంతిచేసన్మా నింపఁబడిమెడియ
శేషసేవకసమూహంబుగలిగి - మనోజ్ఞంబగు నధరంబుచేఁ దేజరిల్లు శ్రీ
కృష్ణునిమోముదానురను నామనంబానఁగోరునో - అట్టిముఖం బెట్టియగుప
దేశముఖంబనుట,

శ్లో॥ కరౌశరదుదఞ్చితామ్బుజవిలాసశిక్షాగురూపదౌవిబుధపా
దపప్రథమపల్లవోల్లఙ్ఘినౌ। దృశౌదళితదుర్మదత్రిభువనోపమానశ్రి
యావిలోకయవిలోచనామృతమహోమహచ్ఛైశవమ్॥ ౬౪

టీక. హేవిలోచన - ఓనేత్రమా, అమృతమహః - అమృత-అమృత
మువలె, మహః- తేజముగలిగిన,మహచ్ఛైశవం - మహత్- శ్రీకృష్ణమూర్తి
యొక్క, శైశవమ్- బాల్యమును, విలోకయ-చూడుము, కరౌ-హస్తములు,
శరదుదఞ్చితామ్బుజవిలాస శిక్షాగురూ-శరత్- శరత్కాలంబున,ఉదఞ్చితపు
ట్టిన, అమ్బుజ- కమలములయొక్క, విలాస- కాంతివిశేషములయొక్క,శిక్షా-
శిక్షించుటయందు, గురూ-నియామకములు, పదౌ-పాదములు, విబుధపాదప
ప్రథమపల్లవోల్లఙ్ఘినౌ - విబుధపాదప- కల్పవృక్షములయొక్క, ప్రథమ-నూ
తనములయిన, పల్లవ-చిగుళ్లను, ఉల్లఙ్ఘినౌ- అతిక్రమింపసమర్థములు,దృశౌ-
నేత్రములు, దళితదుర్మదత్రిభువనోపమానశ్రియా- దళిత - విదారింపఁబడి
న, దుర్మద - గర్విష్ఠములయిన, త్రిభువన - ముల్లోకంబుల పదార్థంబులయొ
క్క, శ్రియా- కాంతులుగలవి.

ఉ॥ పాదములంటిమూవిబుధపాదపనూతనపల్లవావళిం।గాద
నుఁగన్నుదోయిసరికాంతి విశేషముజగంబునన్। లేదనుశారదాబ్జ
వనలీలలగెలవగేరులోచనా, శ్లాఘమయారె శైశవవిలాసముగంటిమి
నందసూతికిన్॥ ౬౪

తా. శరత్కాలంబునంబొడముకెందమ్ములం గేరుకేల్గవయును వేలుపు
మ్రానులంబుట్టినకొ్రొత్తచిగుళ్లందెగడునడుగులను ముల్లోకంబులందుండెడిగ
ర్విష్ఠంబులగుపదార్థంబుల కాంతివిశేషంబుల బోవందోలుకన్నుగవయునుంగలి
గియమృతంబుబోలి వెలయుశ్రీకృష్ణునిబాల్యంబునో నయనంబా చూడుమనుట

శ్లో ॥ ఆచిన్వానమహన్యహన్యహని సాకారాన్విహారక్రమా నారుంధానమరుంధతీ హృదయమప్యార్ద్రస్మితాస్యశ్రియా। ఆతన్వానమనన్యజన్మనయనశ్లాఘ్యామనర్ఘ్యాం దశామామన్దం వ్రజసున్దరీ స్తనతటీసామ్రాజ్యముజ్జృమ్భతే॥ ౨౫

టీక. అహన్యహన్యహని-ప్రతిదినమును, సాకారాన్-ఆకారముతోఁ గూడిన, విహారక్రమాన్ - విహారవిధులను, ఆచిన్వానం - సంపాదించుచున్నదియు, ఆర్ద్రస్మితాస్యశ్రియా- ఆర్ద్ర-సరసమైనదియు, స్మిత- చిఱునగవుగలదియునగు, ఆస్య - నెమ్మొగముయొక్క, శ్రియా - సవిపదచేత, అరున్ధతీహృదయమపి- అరున్ధతీ,(పతివ్రతాశిరోమణియగు)వసిష్ఠభార్యయొక్క, హృదయమపి- హృదయమునేనియు, అరున్ధానం, కొంచెమభిముఖముగఁ జేయుచున్నదియు, అనన్యజన్మనయనశ్లాఘ్యాం-అనన్యజన్మ- మన్మథునియొక్క, నయన- నేత్రములచేత, శ్లాఘ్యాం - కొనియాడఁదగినదియు, అనర్ఘ్యాం - శ్రేష్ఠమైన, దశాం- అవస్థను- ఆతన్వానం - విస్తరింపఁ జేయుచున్నదియునగు, వ్రజసున్దరీస్తనతటీసామ్రాజ్యమ్- వ్రజసున్దరీ- గోపస్త్రీలయొక్క, స్తనతటీ- స్తనప్రదేశములయందు, సామ్రాజ్యం-ఆధిపత్యరూపమైన శ్రీకృష్ణాఖ్యవస్తువు- ఆమన్దం- ఈషన్మందమగునటుల, ఉజ్జృంభతే- ప్రకాశించుచున్నది.

మ॥ నలినాస్త్రుండనుబోక కన్గొనుచు నానందించె నమ్మోము క్రొం। దళుకున్నవ్వలరుంధతీ హృదయమైనం బోవనీకాఁగవిం। తలుగాఁ బ్రోద్బోకరూపమై మెఱుఁగు విన్నాణంబులం జేలిని। నిశ్చలసందవ్రజసుందరీస్తనతటీసామ్రాజ్యముప్పొంగెడిన్॥ ౨౫

తా. ప్రతిదినంబునాకారవంతంబులగు విహారక్రమంబులనెఱయం జేయుచు సరసంబగుముఖకాంతిచే నరుంధతీ హృదయంబునైన స్వవశంబుగఁ జేయంజాలి కన్నవిల్తునిపలపింపంజాలిన గోపస్త్రీ స్తన సామ్రాజ్యరూపంబగు శ్రీకృష్ణాఖ్యవస్తువునాకన్నుల యెదుటం బ్రకాశించుఁగాతయనుట.

శ్లో॥ సముచ్ఛ్వసితయౌవనం తరళశైశవాలఙ్కృతం మదచ్ఛురితలోచనం మదనముద్ధహాసామృతమ్। ప్రతిక్షణవిలోచనం ప్రణయపీతవంశీముఖం జగత్త్రయవిమోహనం జయతి మామకం జీవితమ్॥ ౨౬

టీక. సముచ్ఛ్వసితయౌవనమ్। సముచ్ఛ్వసిత- లెస్సగానావిర్భవించుచున్న యౌవనమ్ - ఎలప్రాయముగలదియు, తరళశైశవాలఙ్కృతమ్ - తరళ- చంచలమైన, శైశవ, బాల్యముచేత, అలఙ్కృతమ్ - అలంకరింపఁబడినదియు

మదస్ఫురితలోచనం, మద- మన్మథమదముచేత, స్ఫురిత - పూయఁబడిన, లోచనం - నేత్రములుగలదియు, మదనముగ్ధహాసామృతమ్- మదన- మన్మథునిచేత, ముగ్ధ, సుందరమయిన, హాసామృతమ్, అమృతమువంటి నగవుగలదియు, ప్రతిక్షణవిలోచనమ్ - ప్రతిక్షణ - అనుక్షణమును, విలోచనమ్ - చూచువారలకు మోహమును సంపాదించుచున్నయదియు, ప్రణయపీతవంశీముఖం- ప్రణయ ప్రేమచేత, పీత- పానముచేయఁబడిన, వంశీముఖం- వేణుముఖముగలయదియు జగత్త్రయవిమోహనం. జగత్త్రయ- మూఁడులోకములకు, విమోహనం- మోహకజనకమయినయదియునగు, మామకం - నాసంబంధమయిన, జీవితం- ప్రాణపదమయినశ్రీకృష్ణాఖ్యవస్తువు, జయతి- సర్వోత్కర్షముగాప్రవర్తించుచున్నది.

మ॥ తలపంతంతకునీటుఁజేర్చెఁ దళుకొందంజాలె బాల్యంబువె
న్నెలనేలం దెలినవ్వు క్రొందళుకు లినేన్నేత్రము ల్మోవికెం । గలవం
శీముఖచుంబనంబమరెలోకంబుల్విలోకించియు।న్వెఱుఁగొందున్నది నా
దుజీవితముఁ బ్రోవంగ్రృష్ణాకృతిన్॥ ౬౬

తా. తెల్లంబుగఁగనఁబడుజవ్వనంబు గల్గుటం జేసిబాలుచున్న బాల్యంబుచేనలంకరింపంబడిమదనసౌందర్యంబుఁ దెల్పుకందోయి నెలంగనమృతంబుం బోని లేనగవుప్రతిల్లఁ బ్రతిక్షణంబును జూచువారకు మోహంబు తోఁపించుచు నతిప్రేమంబున వేణుముఖంబుఁజుంబనఁబుజేయుచు జగత్త్రయమనోహరంబై వెలయునాజీవితప్రాయంబైన శ్రీకృష్ణాఖ్యవస్తువు సర్వోత్కర్షముగా వర్తించుచున్నదియనుట,

శ్లో॥ చిత్రంతదేతచ్చరణారవిన్దం చిత్రంతదేతన్నయనారవి
న్దం । చిత్రంతదేతద్వదనారవిన్దం చిత్రంతదేతత్పునరమ్బచిత్రమ్॥

టీక. తదేతచ్చరణారవిన్దమ్-తత్- ఆశ్రీకృష్ణమూర్తియొక్క, ఏతత్ ఈయగుపడుచున్న, చరణారవిన్దం- పాదకమలము, చిత్రం - ఆశ్చర్యజనకమయినది, తదేతన్నయనారవిన్దం- తత్ - ఆశ్రీకృష్ణమూర్తియొక్క, ఏతత్- ఈయగుపడుచున్న, నయనారవిన్దం- నేత్రకమలము, చిత్రం- ఆశ్చర్యసంపాదకమయినది, తదేతద్వదనారవిన్దం - తత్ - ఆశ్రీకృష్ణమూర్తియొక్క, ఏతత్ - ఈయగుపడుచున్న, వదనారవిన్దం- ముఖకమలము-చిత్రం- ఆశ్చర్యకరమయినది- హేఅమ్బ ఓతల్లీ, పునః-మఱియు- తదేతత్-అట్టిపాదారవిందాద్యవయవవిశిష్టమయిన శ్రీకృష్ణాఖ్యవస్తువు - చిత్రంచిత్రం-మిక్కిలియాశ్చర్యమయినది.

ఉ॥ లోకములోనమోము ౘవిలోచనముల్పదము ల్నవహ్రస్రసం। ఖ్యాకములంచు నెంచు శ్రుతులాపురుషోత్తము నిర్విధంబుగా । నీకను దమ్మిదోయి చెలువీముఖసారసమీపదాబ్జముల్ । చేకొనఁజిత్రమంచు నుతిచేయఁగఁబల్మబునంబశక్యమే॥ ౮౭

తా. ఇట్టిదియని చెప్పనలవిగాని యడుగు దామరలును గనదమ్ములును నెమ్మోము విరిదమ్మియునుంగల శ్రీకృష్ణునినుతింపఁగనో యంబా మిక్కిలిచిత్రమనుట.

మా॥ అఖిలభువనైకభూషణమధిభూషితజలధిదుహితృకుచకుమ్భమ్। వ్రజయువతిహారవల్లీమరకతనాయకమహామణింవన్దే॥ ౮౮

టీక. అఖిలభువనైకభూషణం-అఖిల- సమస్తమయిన-భువన-లోకములకు- ఏకభూషణం- ముఖ్యభూషణమయినట్టియు- అధిభూషితజలధిదుహితృకుచకుమ్భం - అధిభూషిత- అలంకరింపఁబడిన- జలధిదుహితృ- లక్ష్మియొక్క- కుచకుమ్భం - కలశములవంటి స్తనములుగలయట్టియు- వ్రజయువతిహారవల్లీ మరకతనాయకమహామణిం - వ్రజయువతి - గోపికలయొక్క- హారవల్లీ - తీవియలవంటిహారములయొక్క- మరకత - మరకతమణియైనెడి - నాయకమహామణిం - స్థూలనాయకరత్నమయిన శ్రీకృష్ణమూర్తినిగూర్చి - వన్దే- నమస్కరించుచున్నాను.

చ॥ జలనిధికన్యకా ఘనకుచస్థలి పచ్చలతాళిగోపికా। విలసితహారనీలమణివిశ్వజగద్వలయప్రకాశకో । జ్జ్వలమహనీయరత్నమనివారిత కాళియభోగిభోగమం । డలగిరివ్రజమై వెలయునందతనూజు భజింతునామదిన్॥ ౮౮

తా. ఎల్లలోకంబులకుభూషణంబై మహాలక్ష్మి స్తనమండలంబునకలంకారరత్నంబై గోపస్త్రీహారమధ్యంబుల నింద్రనీలనాయకమణినై వేయుశ్రీకృష్ణదేవునింగూర్చి మ్రొక్కెదననుట.

శ్లో॥ కాన్తా కచగ్రహణ విగ్రహబద్ధలక్ష్మీఖణ్డాఙ్గరాగరసరఞ్జితమంజులశ్రీః । గణ్డస్థలీముకుర మణ్డలఖేలమాన ఘర్మాఙ్కురాంక మవిక్షోలతి కృష్ణతేజః॥ ౮౯

టీక. కాన్తాకచగ్రహణవిగ్రహబద్ధ లక్ష్మీఖణ్డాఙ్గరాగరసరఞ్జితమంజులశ్రీః- కాన్తా- ప్రియురాలియొక్క- కచగ్రహణ - కేశగ్రహణముయొక్క- విగ్రహ- కలహమందు - బద్ధ - గ్రహింపబడిన - లక్ష్మీ- రుక్మిణీదేవియొక్క-

ఖర్జూ- చిటిలిన- అఙ్గరాగ - మెయిపూతచేత, రఞ్జిత-అలంకరింపబడిన- మంజుల- మనోహరమయిన- శ్రీః-సంపదగలయట్టి - గణ్డస్థలీముకురమణ్డలఖేలమాన ఘర్మాఙ్కురమ్- గణ్డస్థలీముకురమణ్డల- అద్దములవంటిచెక్కిళులయందు - ఖేలమాన- నృత్యము చేయుచున్న- ఘర్మాఙ్కురమ్- చిఱుచెమటగలయట్టి శ్రీకృష్ణ తేజము- కిమపి- ఇట్టిదియని చెప్పనలవిగానిదైయె- ఖేలతి - ప్రకాశించుచున్నది.

మ|| తళుకున్నిగ్గవుఁ జెక్కుటద్దములపై ఘర్మాంకురంబూరగాఁ |
గలికాభోగ పయోధరాంతర లసత్కాశ్మీర సంబంధగం | ధిల్లవక్షస్థ
లుఁడై గృహీతఘనవేణీ బంధుఁడై నెయ్యపుం | జెలియుంజుంబన కేళిఁ
దేల్చుహరినాచిత్తంబునం జెందెడున్|| ౮౯

తా. కేశగ్రహణ కలహంబునకుం దాఱ్చిన రుక్మిణీదేవి స్తనమండలంబునం జిటిలినయంగరాగంబుచే నలంకరింపఁబడినదియై యద్దంబులంబోలు చెక్కిళులం జిఱుచెమటలూఱంజెలంగు శ్రీకృష్ణతేజంబు సెప్పనలవిగాక వెలుంగుచున్నదియనుట.

మూ|| మధురంమధురం వపురస్యవిభోర్మధురంమధురం వదనంమ
ధురమ్ | మధుగన్ధిమృదుస్మిత మేతదహోమధురం మధురంమధురం
మధురమ్|| ౯౦

టీక. అస్య-ఈసుందరటనగుపడియెడి-విభోః- శ్రీకృష్ణమూర్తియొక్క- వపుః- శరీరము, మధురంమధురం- మిక్కిలిసుందరము- మధుగన్ధిమృదుస్మితం- మధు- మకరందమువలె- గన్ధి -పరిమళముగల- మృదు- కోమలమయిన- స్మితం- లేనగవుగల, అస్యవిభోః- ఈకృష్ణమూర్తియొక్క- మధురం_సుందరమయిన వదనం- ముఖము- మధురంమధురం- మిక్కిలిసుందరము- ఏతత్ - ఈకానంబడుచున్న శ్రీకృష్ణతేజము- మధురంమధురంమధురంమధురం - మిక్కిలిమనోహరమయినది అహో- ఆశ్చర్యము.

శా|| చూడంజూడఁగ మేనుఁడా నినుమడించు న్మాధురీసంపదల్ |
చూడంజూడఁగ మోముగోము మదినెచ్చుల్గుల్కు మున్మాటికిం |జూ
డంజూడమరందబిందువుల మించున్మందహాసంబుని | జూడంబల్లుమహామా
ధురిం జెలఁగునాస్వామిన్విలోకించెదన్|| ౯౦

తా. చూడంజూడ నెమ్మేన సోయగంబినుమడించుమకరందబిందువులం దెగడులేనగవు నెమ్మొగమునందుసందడించు నిట్టివేషంబులంగలిగియొప్పుచుండు శ్రీకృష్ణతేజంబందలిసౌందర్యంబత్యాశ్చర్యంబుఁ బుట్టించుచున్నదియనుట.

మూ॥ శృంగారరససర్వస్వం శిఖిపిఞ్ఛవిభూషణమ్। అఙ్గీకృతనరాకారమాశ్రయే భువనాశ్రయమ్॥ ౯౧

టీక. శృంగారరససర్వస్వం - శృఙ్గారరస- శృంగారరసముయొక్క- సర్వస్వం- సర్వార్థరూపమయినవాఁడును- శిఖిపిఞ్ఛవిభూషణం-శిఖిపిఞ్ఛ-నెమలిపురి, విభూషణం- అలంకారముగాఁగలవాఁడును, అఙ్గీకృతనరాకారం- అఙ్గీకృత- స్వీకరింపఁబడిన, నరాకారం- మనుష్యశరీరముగలవాఁడును, భువనాశ్రయమ్- లోకాధారుఁడునైనశ్రీకృష్ణుని, ఆశ్రయే- సేవించుచున్నాను.

ఉ॥ చక్కనివానిముద్దు వెదఁజల్లెడువాని దయారసంబుచే । నెక్కొనువాని మౌళితటినించినపింఛము వానిలోకముల్ । గ్రుక్కకఁగ నేలువానినతిమోహన మానుషవేషధారియై । యక్కడలేనివానిజగ దాశ్రయు నెప్పుడునాశ్రయించెదన్॥ ౯౧

తా. రాశిగాఁజేయఁబడిన శృంగారరసంబు కరణిం జెలరిల్లుచు నెమలిపురి యలంకారంబుగధరియించి మనుష్యదేహంబుచే వెలుంగులోకాశ్రయుండైన శ్రీకృష్ణమూర్తిని నాశ్రయించుచున్నాననుట.

మూ॥ నాద్యాపిపశ్యతి కదాచనదర్శనేన చిత్తేనచోపనిషదాసుదృశాంసహస్రం। సత్వంచిరంనయనయోరనయోః పదవ్యాంస్వామిన్ కదానుకృపయామమసన్నిధత్తే॥ ౯౨

టీక. సుదృశాం - విద్వాంసులయొక్క, సహస్రం- సహస్రసంఖ్యాగలసమూహము, అద్యాపి - ఈదినమందైనను, కదాచన - మఱియొకకాలంబులనైనను- దర్శనేన-నేత్రముచేత, చిత్తేన- చేతస్సుచేత, ఉపనిషదాచ-వేదాంతశాస్త్రముచేతనైన, త్వాం-నిన్ను, చిరం.బహుకాలమునుండి,నపశ్యతి-చూడదు, హేస్వామిన్- ఓకృష్ణ, సత్వం- ఆనీవు, మమ-నాయొక్క, అనయోః- ఈప్రకృతి సంబంధములగు, నయనయోః- కన్నులయొక్క, పదవ్యాం - మార్గమునందు, కృపయా. దయచేత, కదాను-ఎప్పుడు, సన్నిధత్తే- సన్నిధానముచేయుచున్నావు.

ఉ॥ కొందఱుయోగదృష్టి నొకకొందఱు వేదవిచారవాసనం । గందురునిన్ను నెప్పుడొయొకానొక వేళనభిజ్ఞులైనవా । రందఱునిట్టినీవుకరుణాంబుధి ప్రాకృత దృష్టిఁజెందునా । ముందటనిల్చియెన్నఁడుఁ బ్రమోదమొనర్తువునందనందనా॥ ౯౨

తా. వేలసంఖ్యలంగలవిద్వాంసులుగొండఱుయోగనిష్ఠంబగుమనంబు న్ననైన విజ్ఞానవంతంబగుచూపుననైన వేదాంతశాస్త్రంబుననైన నెంతకాలంబునకు నిన్నుంగాంచనోప రట్టియవాఙ్మానసగోచరుండవగు నీవు కేవలప్రకృతిసంబంధంబుగలనాకన్నులకెన్నటికింగానంబడువాఁడవొకదాయనుట.

మూ॥ కేయంకాన్తిః కేశవత్వన్ముఖేన్దోః కోయంవేషఃకాపివాచామభూమిః । సేయంసేయం స్వాదుతామఞ్జులశ్రీ ర్భూయోభూయోభూయశస్త్వాంనమామి॥ ౯౩

టీక. హే కేశవ - ఓశ్రీకృష్ణ, త్వన్ముఖేన్దోః - త్వత్ - నీయొక్క, ముఖేన్దోః- ముఖచంద్రునియొక్క, ఇయంకాన్తిః - ఈకాంతి, కా- ఎట్టిదియనిచెప్పవచ్చును, అయంవేషః - ఈయలంకారము, కః - ఎట్టి యనవచ్చును, సాసా - ఆయాప్రసిద్ధంబగు, ఇయమియంస్వాదుతా - ఈయీలావణ్యము, మంజులశ్రీః- సౌందర్యలక్ష్మియును, వాచామభూమిః- వాగగమ్యము, తత్ -ఆ కారణమువలన, భూయోభూయః - మాటిమాటికి, భూయశః- అధికముగ, త్వాం- నినుఁగూర్చి, నమామి- మ్రొక్కుచున్నాను.

ఉ॥ ఎక్కడిగోపరూపమది యొక్కడినుద్దుమొగంబుసోయగం । బెక్కడనీకళావిభవ మెక్కడ నేమనియెన్నవచ్చున । మ్మక్కయగోచరంబుభవదాకృతి పద్మభవాదిసూక్తికిన్। మ్రొక్కెద సారెసారెకును మోహరయేయనినందనందనా॥ ౯౩

తా. ఇట్టిదియని చెప్పనలవిగాని నెమ్మొగంపుఁజెందపురుని కాంతియువాచామగోచరంబగు నలంకారమునునుడువ నశక్యంబగు లావణ్యంబును మనోహరంబగు సౌందర్యసంపదయుంగల్గియుండుఁగాన నిట్టినినుంగూర్చి మ్రొక్కుచున్నాననుట.

మూ॥ వదనేన్దువినిర్జితశ్శశీ దశధాదేవపదంప్రపద్యతే। అధికాంశ్రియమశ్నుతేతరాంతవకారుణ్యవిజృమ్భితంకియత్॥ ౯౪

టీక. హే దేవ- ఓకృష్ణ, శశీ-చంద్రుఁడు,తవ-నీయొక్క,వదనేన్దు వినిర్జితః- వదనేన్దు- ముఖచంద్రునిచే, వినిర్జితః-తిరస్కరింపఁబడినవాఁడై, దశధా- పదినఖములగుచు, పదం- పాదయుగళమును, ప్రపద్య- పొంది,అధికాం- అధికమయిన, శ్రియం - కాంతిని, అశ్నుతేతరాం - పొందుచున్నాఁడు, తవ- నీయొక్క, కారుణ్యవిజృమ్భితం -కారుణ్యాతిశయము, కియత్- ఎంతనవచ్చును.

ఉ॥ ఆననకాంతితోడ నెదురానిశశాంకుఁడు నిల్వలేకనీ। మానిత

పాదపద్మములమాటునఁ జేరినఖాంకురాకృతిం । బూనిభజించినంతనె సమున్నతి శ్రీలొసఁగూర్చితౌరనీ । దీనదయాపర్వతము నుతింపఁగశక్యమెనందనందనా॥ ౬౪

తా. చందురుండు నీముఖచంద్రునెదిరించియోడిపది తెఱంగుల నీపదంబులనఖరూపంబున నాశ్రయించినంతనధికంబగు కాంతినొందె నిట్టినీదయకెయ్యేదియుసాటిలేదనుట.

శ్లో॥ తత్త్వన్ముఖంకథమివాబ్జసమానకక్ష్యం వాఙ్మాధురీబహుళపర్వకళాసమృద్ధం।తత్కింభవేత్తదపరమ్భువనైకకాంతంయస్యత్వదాననసమాసుషమాసదాస్యాత్॥ ౬౫

టీక. వాఙ్మాధురీబహుళపర్వకళాసమృద్ధం - వాఙ్మాధురీ - వచోమాధుర్యమనియెడి, బహుళ - అధికమయిన, పర్వకళా - పూర్ణిమాకళలచే, సమృద్ధం - అతిశయించిన, తత్ - ఆప్రసిద్ధమైన, త్వన్ముఖం - త్వత్ - నీయొక్క, ముఖం - నెమ్మొగము, అబ్జసమానకక్ష్యం - అబ్జ - చంద్రకమలములతోడ, సమానకక్ష్యం - సమానకోటిగలది, కథం - ఎటుల, భవేత్ - అయ్యెను, యస్య - ఏపదార్థమునకు, సదా ఎప్పుడును, త్వదాననసమా - త్వదానన - నీముఖముతోడ, సమా - సమానమగు, సుషమా - ఉత్కృష్టకాంతి, స్యాత్ - అయ్యెను, అపరం - మఱియొకటి, భువనైకకాంతం. భువన - లోకములయందు, ఏకముఖ్యమగు, కాంతం - సుందరము, స్యాత్ - అయ్యెను, తత్ - అది, కిం - ఏది.

చ॥ సరసిజమంటిమాతగదు సాటికి సారదపూర్ణిమాసుధా। కరరుచియుంటిమాసమముగాదిఁకవేఱెజగంబునన్మనో । హరమగువస్తువొండొకటియూఁగనిచూడనొకానొకప్పుడుం। బురుడుఘటిల్లునే భువనమోహననీముఖకాంత కాంతికిన్॥ ౬౫

తా. వచోమాధుర్యంబును బూర్ణిమ కళలచే సమృద్ధంబగు నీమోముతోడం జంద్రకమలంబులు సమంబులెటులగును నీమోముతోడ భువనంబుల నెల్లపదార్థంబులు సమంబులనుచుం జెప్ప నెయ్యేదియుఁ గానంబడమిఁబ్రసిద్ధంబుగాన నీసమానుం డొకఁడును లేడనుట-

మా॥ సుశూ్రషసేయదివచన్ముఖి హామమకీంఁ పూర్వైరపూర్వకవిభిర్నకటాక్షితంయత్।నీరాజనక్రమధురంభవదాననేందోర్నిర్వ్యాజమహతి చిరాయశశిప్రదీపః॥ ౬౬

టీక. హేకృష్ణ - ఓకృష్ణ, శుశ్రూషసేయది - పినసిచ్ఛయించితేని, ॥

రైః - మొదటివారలయిన, అపూర్వకవిభిః- అపూర్వ- చమత్కారసంపాదకప్రబంధములను జెప్పిన. కవిభిః వాల్మీకాదిమహాకవులచేత, యత్ - ఏవాక్యము, నకటాక్షితం- చెప్పఁబడలేదో, మామకీనం - నా సంబంధమైన- వచ-వాక్యమును, శృణు- వినుము, శశిప్రదీపః - శశి - చంద్రరూపమైన, ప్రదీపః-దీపము, భవదాననేందోః- భవత్ -నీయొక్క, ఆననేందోః- ముఖచంద్రునియొక్క, నీరాజనక్రమధురం - నీరాజన - నివాళియొక్క, క్రమ - విధియొక్క, ధురం- భారమునుగూర్చి, నిర్వ్యాజం- ఉపాధిలేనటుల - చిరాయ-బహుకాలము, అహూతి - అగుచున్నది.

చ ॥ తొలుతటివ్యాసముఖ్య కవిధుర్యులు పలుకని సాహసంబునే। వలికెదవింటివేని వినుపంకజలోచన నీదుమోముతోc । గలువలతేని పాటియనఁగాఁదగ దారతిపళ్లెరంబులో । పలవిడిదివ్వెగా నతనిఁబట్టి నివాళియొనర్పఁగాఁదగుణ్॥ ౯౬

తా, ఓకృష్ణా నాపలుకొక్కటివింటివేని వినుము పూర్వులగు వాల్మీకివ్యాసాది మహాకవులచేఁ జెప్పఁబడని సాహసంపుమాట నుడివెద నెట్లనినఁ జంద్రుఁడనియెడిదీపంబు నారతిపళ్ళెరంబుననిడి నీనెమ్మోము జందురునికి నివాళియొనర్పం దగుననుట.

శ్లో ॥ అఖణ్డనిర్వాణరసప్రవాహైః విఖణ్డితాశేష రసాంతరాణి ।
నియంత్రితోద్వాన్తసుధార్ణవాని జయంతిశీతానితవస్మితాని॥ ౯౭

టీక. అఖండనిర్వాణరసప్రవాహైః - అఖండ - పరిపూర్ణమైన, నిర్వాణసుఖమనియెడి, రస - ఉదకముయొక్క - ప్రవాహైః - ప్రవాహముల చేత, విఖండితాశేషరసాంతరాణి - విఖండిత - కొట్టఁబడిన - అశేష,సమస్తమైన, రసాంతరాణి - ఇతరరసములుగలవియు, నియంత్రితోద్వాంతసుధార్ణవాని- నియంత్రిత - యథేచ్ఛమగునటుల, ఉద్వాంత - బయలువెడలుచున్న సుధార్ణవాని- అమృతసముద్రముగలయవియు, శీతాని - చూచుజనులకు మనోహరమయినవియునగు, తవ - నీయొక్క, స్మితాని - లేనగవులు, జయంతి సర్వోత్కర్షముగావర్తించుచున్నవి.

మ ॥ కలితానందమహానుభావమున వేడ్కం జెందియంతంతకుం । జెలియంబొంగుసుధాతరంగిత పయోధిక్షేలగన్పించుచు । న్వలితానేకరసాంతరంబులగు లేనవ్వుల్ మిటారింపగో । కులకాంతాజన భోగభాగ్య మహిమాంకూరంబు సెల్వొందెడిణ్॥ ౯౭

తా. సంపూర్ణంబగు సుఖరసప్రవాహంబులచే నిరసింపఁబడిన యి తరరసంబులుగలిగి యథేచ్ఛనుగునటుల బయలువెడలు నమృతసముద్రంబుగ లిగి చూచువారలకు సుఖంబొనర్చు నీచిఋనగవులు సర్వోత్కర్షము గా వర్తించుచున్నవియనుట.

మూ॥ కామంసంతుసహస్రశః కతిపయేస్వారస్యధౌరేయకాః। కామంవా కమనీయతాపరిమళస్వారాజ్యబద్ధవ్రతాః। తైర్నైవంవివ దామహేనచవయం దేవప్రియంబ్రూమహే యత్సత్యం రమణీయ తాపరిణతిస్త్వయ్యేవపారంగతా॥ ౯౭

టీక. కతిపయే- కొందఱు, స్వారస్యధౌరేయకాః - సౌందర్యవంతు లు, కామం-యథేచ్ఛముగాను, సంతు- ఉండురుగాక, కమనీయతా పరిమళ స్వారాజ్యబద్ధవ్రతాః - కమనీయతా - సౌందర్యముయొక్క, పరిమళ-ఆధిక్య మనిరెడి, స్వారాజ్య - స్వర్గరాజ్యమందు, బద్ధ-కూడుకొన్న, వ్రతాః- పు ణ్యవిశేషములుగల, సహస్రశః - వేలసంఖ్యలు, కామం - యథేచ్ఛముగను సంతు- ఉండురుగాక, హేదేవ-ఓకృష్ణ, తైః-అయధికసుందరులయినవారితో డ, నవివదామహే- వివాదమునుజేయము, ఏవం- ఈప్రకారము, ప్రియంచ- ప్రియమును, నబ్రూమహే- నుడువము, యత్-ఏకారణమున, రమణీయతా పరిణతిః- రమణీయతా - సౌందర్యముయొక్క, పరిణతిః - పరిపాకము,,త్వ య్యేవ- నీయందే,పారంగతా-సంపూర్ణముగానుండును, సత్యం-యధార్థము

ఉ॥ లోకములోపలఁ రసికలోకమనేకముగల్గుఁగాకయు। స్తోక మనోహరావయవశోభితులుందురు గాకవారితో। నేకలహంపనేల మొగమిచ్చకమేటికె సత్యమాడెదఁ। నీకమనీయతామహీమ నీకతగు న్మఱికానమెయ్యెడఁ॥ ౯౮

తా. లోకంబున ననేకరసికజనంబులుందురుగాక యధికసౌందర్యసం పన్నులనేకులుందురుగాక వారితోడంగలహంబును బ్రియంబునుంబలుకనేలయ థార్థంబుగనుడివెద నీసౌందర్యంబుతోడంబురణింప నెట్టివారలుంజాలరనుట.

మూ॥ మందారమూలే మదనాభిరామం బింబాధరాపూరితవేణు నాదమ్। గోగోపగోపీజన మధ్యసంస్థం గోపంభజేగోకులపూర్ణ చంద్రమ్॥ ౯౯

టీక. మందారమూలే- మందార - కల్పవృక్షముయొక్క,మూలే- మొదటియందు, గోగోపగోపీజన మధ్యసంస్థమ్- గో-గోవులయొక్క యును,

గోప - గోపాలకులయొక్కయును, గోపీ - గోపస్త్రీలయొక్కయును, జన-సమూహముయొక్క, మధ్య - నడుమను, సంస్థమ్ - కూర్చున్నవాఁడును, బింబాధరాపూరితవేణునాదమ్- బింబ - దొండపండువంటి, అధర- అధరోష్ఠముచేత, అపూరిత - లెస్సగాఁబూరింపఁబడిన, వేణునాదమ్ - వేణుధ్వనిగలవాఁడును, గోకులపూర్ణచంద్రమ్- గోకుల-గోసమూహమునకు, పూర్ణచంద్రమ్ - రాకాశశాంకుఁడైనవాఁడును, మదనాభిరామమ్ - మదన- మన్మథునికన్నను, అభిరామం - సుందరుఁడైనవాఁడునగు, గోపం - బాలగోపాలుని, భజే- భజించుచున్నాను.

ఉ॥ గోపికలోపికల్పడలి కొల్వఁగ గోపులు గోవులాడఁగాఁ । గ్రొవ్వు
లు మేపువాని కపటకంపఁగఁ గొంజికురాకు మోవిపై । మోపినవేణువగ్గ
లము మ్రోయఁగఁగల్పవనిన్వసించునా । గోపకుమారమన్మథునిఁ గో
కులవార్ధిశశిన్ భజించెదన్॥

తా. కల్పవృక్షమూలంబున గోవులయు- గోపాలకులయు, గోపికలయు నడుమనుండి కెమ్మోవియందు మోపినవేణువు మ్రోయించుచు మన్మథమన్మథుండై గోకులవార్ధిపూర్ణ చంద్రుండై వెలయు బాలగోపాలుని భజియించెద ననుట.

మూ॥ గళద్వ్రీడాలోలా మదనవనితా గోపవనితా మధుస్ఫీతంగీ
తం కిమపి మధురా చాపలధురాః । సముజ్జృంభా గుంభా మధురిమగి
రాం మాదృశ గిరాం త్వయి స్థానే జాతే దధతి చపలం జన్మ సఫలమ్॥

టీక- గళద్వ్రీడాః - నిర్లజ్జలయిన, గోపవనితాః- గోపస్త్రీలు, లోలాః- నీయందాసక్తులును, మదనవనితాః - రతితుల్యలు, జాతాః-అయిరి గీతం, నీసంబంధమయిన గానము, మధుస్ఫీతం-మధు- తేనియవలె, స్ఫీతం-స్ఫీతిఁగలదైనదై, కిమపి- చెప్పనలవిగానిది, జాతమ్ - అయినది.- చాపలధురాః- చాపల - నీసంబంధమయిన చాపల్యముయొక్క, ధురాః- భారములు, మధురాః- మనోహరములు, జాతాః-అయినవి, మాదృశగిరాం - మాదృశ- నావంటియప్రతిజ్ఞులయొక్క, గిరాం-వాక్యములయొక్క, గుంభాః గుంభనలు. మధురిమగిరాం - వాల్మీకిమొదలగు వారలయొక్క వాక్యములవలె. సముజ్జృంభాః- అతిశయములు. జాతాః-అయినవి. త్వయి-నీవిషయము, జాతేసతి- అగుచుండఁగా. చపలం- చపలమైన. జన్మ-జన్మమును. సఫలం - ఫలసహితముగునట్లు. దధతి- వహించుచున్నవి. స్థానే-యుక్తము-

ఉ॥ నానఁదొంగిత త్తరము నస్మరులెత్తి గోపకామినుల్ । దేవి యఁగులుకు పాటలును దివ్యనిమాటలు నికతంబునం । బూనిఫలంబుఁ జెందుకృియమోదముతోడను సన్నుతింపఁగా । నానుపవుల్పలించెఁజ ననంబుగృతార్థతఁజెందు నెంతయుఁ॥ ౧౦౦

తా. గోకులంబునంగృష్ణుఁనటం జేసియరసిక లైన గొల్లలైనగోప స్త్రీల సౌందర్యంబులును గానంబులును జాపల్యంబులును నీయందలివిని యోగించుక తంబున స్వసమానాధికరహింబులైనభంగి నపృశిణ్ణుండనగునావచనంబులసం దర్భంబును వాల్మీకిమొదలగు వారలవచోగరిమంబులకైవడిం బ్రసిద్ధంబగుచు నీ వలన వెలసెనునేఁగృతార్థుండనైతిననుట.

శ్లో॥భువనంభవనం విలాసినీశ్రీః స్తనయాతామరసాసనస్మరౌ చ। ప రిచారపరమ్పరా సురేన్ద్రాస్తదపిత్వచ్చరితం విభో విచిత్రమ్॥ ౧౦౧

టీక- హేవిభో - ఓకృష్ణా, భువనం- లోకము, భవనం- గృహము, శ్రీః- లక్ష్మీదేవి, విలాసినీ- పాణిగ్రహణభార్య, తామరసాసనస్మరౌచ- తామ రసాసన- బ్రహ్మదేవుఁడును, స్మరౌచ- మన్మథుఁడును, తనయా- కుమారులు, సురేన్ద్రాః-దిక్పాలకాదులు, పరిచారపరమ్పరాః- పరిచార- పరిచారకులయొ క్క, పరమ్పరాః- సమూహము, తదపి - అటులైనను, త్వచ్చరితం,త్వత్- నీయొక్క, చరితం- చరిత్రము, విచిత్రం- మిక్కిలియాశ్చర్యము.

మ॥ లలనారత్నము శ్రీపధూటిజగమెల్లం గేళికాసౌధమా । జల జాతాసన శంబరారులుసుతుల్ శక్రాదిదిక్పాలవ । ర్యులుభృత్యుల్వి వరింపనీమహిమలోహా యిట్టిదైయుండగో । కులవాటంబున జా రచోరకృతిలోకుల్ నవ్వఁగాంతీంతురే॥ ౧౦౧

తా. ఇట్లుముజ్జగంబుభార్య లోకైకమాతయగుసిరి- చతురాననుఁడు నుమన్మథుండునుకొమరులు- ఇట్టినీవు గోకులంబుననుండుట గడుచిత్రంబనుట.

శ్లో॥ దేవస్త్రీలోకీ సౌభాగ్యకస్తూరీతిలకాఙ్కురః। జీయాద్వ్రజాఙ్గనానఙ్గ కేళీ లలితవిభ్రమః॥ ౧౦౨.

టీక. త్రైలోకీసౌభాగ్య కస్తూరీతిలకాఙ్కురః - త్రైలోకీ- మూఁడులో కములయొక్క, సౌభాగ్య- అవయవసౌష్ఠవమునకు, కస్తూరీతిలకాఙ్కురః- కస్తురిబొట్టువలె నున్నవాఁడును, వ్రజాఙ్గనానఙ్గకేళిలలితవిభ్రమః - వ్రజాఙ్గ నా - గోప స్త్రీలయొక్క, అనఙ్గకేళీ - మన్మథక్రీడలయందుని, లలిత - సరస

మగుడు, విభ్రమః- విలాసములుగలవాఁడునునగు, దేవః- శ్రీకృష్ణమూర్తి, జీయాత్- సర్వోత్కర్షముగావర్తించుగాక.

మ॥ కులుకుం జెక్కులఁ బికటిల్లు పులకాంకూరంబు తోరంబు గాఁ। దళుకుం గస్తురిబొట్టు నెన్నొసలిపైఁ దైలోక్యభాగ్యాకృతిం। జెలఁగ గోపనితంబినీరతికళాశృంగారభావోన్నతుల్। దొలుకం గన్నులపండువై నవిభుఁ గాంతుఁ భాగ్యసంసిద్ధికిన్॥ ౧౦౨

తా. ముల్లోకంబుల సౌభాగ్యావయవంబులకుఁ గస్తూరి తిలకంబై గోప స్త్రీలతో ననంగక్రీడం జేయుట యందత్యంత విలాసంబులుగల శ్రీకృష్ణదేవుం డు సర్వోత్కర్షంబుగావర్తించుననుట.

శ్లో॥ ప్రేమదంచ మే కామదంచ మే వేదనంచ మే వైభవంచ మే।
జీవనంచ మే జీవితంచ మే దైవతంచ మే దేవనాపరమ్॥ ౧౦౩

టీక- హే దేవ- ఓకృష్ణ, మే- నాయొక్క, ప్రేమదంచ- ప్రేమంబుని చ్చువస్తువును, మే- నాయొక్క, కామదంచ - కోరికనిచ్చువస్తువును, మే-నా యొక్క, వేదనంచ- జ్ఞానమును, మే- నాయొక్క, వైభవంచ- ఐశ్వర్యమును, మే-నాయొక్క, జీవనంచ- ప్రాణమును, మే- నాయొక్క, జీవితంచ - జీవ నహేతువస్తువును, మే- నాయొక్క, దైవతంచ - దైవతమును, అపరం-మఱి యొకటి, నాస్తి-లేదు.

ఉ॥ కోరికలిచ్చినన్నెనరుఁ గూర్చినజీవన జీవితమ్ములే. చారినా సర్చిసంఘెలివిఁ చాల్చినఁదల్లియుఁ దండ్రియుంబలె। నేరములోర్చినం దీరుగ నేర్పుగఁదీర్చినఁ గల్మియిచ్చినన్। భారమునీదె కాని మఱిపంకజ నాభ యెఱుంగనన్యులన్॥

తా. కోరికనిచ్చినం బ్రియంబుఁజేసిన నీవనాజ్ఞానంబు నైశ్వర్యంబును జీవనంబును జీవనహేతువగు వస్తువును నాదైవతంబును నీవకాని మఱియ న్యునే నెఱుంగననుట-

మూ॥ మాధుర్యేణవిజృమ్భన్తాం వాచోన స్తవవైభవే। చాపల్యేన వివర్ధన్తాంచిన్తాన స్తవశైశవే॥ ౧౦౪

టీక. నః - నాయొక్క, వాచః - వాక్యములు, తవ-నీయొక్క, వైభ వే- గోవర్ధనోద్ధరణాది వైభవమందు- మాధుర్యేణ- శ్రావ్యమగుటచే-విజృమ్భ న్తాం - మిక్కిలి వియ్యక్తినయిుంచుంగాక - నః నాయొక్క- చిన్తాః-మనోవ్యాపార

ములు, తవ-నీయొక్క, శైశవే - బాల్యమందు, చాపల్యేన - చపలతచే, వివర్ధన్తాం- వృద్ధినొందుఁగాక

ఉ॥ నీనుభవత్కథామణుల నెన్నెడు పట్లమదీయసూక్తిసం। తానము మాధురీగుణవితానముఁ జెందిపొసంగుఁగాతనా। మానసవృత్తినీదు సుకుమారకిశోరవయో విహారము। ల్పూనిపఠించునట్టులతి లోలతఁ గాంచిమెలంగుఁ గావుతన్॥ ౧౦౪

తా. నావచనంబులునీ గోవర్ధనోద్ధరణాదివైభవంబుల నతిమాధుర్యంబుగ నతిశయింపుంగాక నామనోవ్యాపారంబులునీ బాల్యంబున నతిచాపల్యంబునం బొందుఁగాకయనుట-

మూ॥ యానిత్వచ్చరితామృతాని రసనాలేహ్యానిధన్యాత్మనాం। యేవాశైశవచాపలవ్యతికరారాధాపరాధోన్ముఖాః।యావాభావితవేణుగీతిగతయోలీలా ముఖాంభోరుహే ధారావాహికయావహన్తు హృదయేతాన్యేవతాన్యేవమే॥ ౧౦౫

టీక. ధన్యాత్మనాం - కృతార్థమనస్సులయొక్క, రసనాలేహ్యాని-రసనా - జిహ్వలకు, లేహ్యాని - లేహ్యవిశేషములయిన, త్వచ్చరితామృతాని-త్వత్ - నీయొక్క, చరితామృతాని - అమృతమువంటి చరిత్రములు, యాని-ఏవిగలవో, రాధాపరాధోన్ముఖాః - రాధా - రాధావిషయమయిన, అపరాధ- అపరాధముచే, ఉన్ముఖాః-మొదలుగాఁగలవి, శైశవచాపలవ్యతికరాః శైశవ- బాల్యమందలి, చాపల-చాపల్యముచేత, వ్యతికరాః- ఉద్వృత్తములు యేవా - ఎవ్విగలవో, లీలాముఖాంభోరుహే- లీలా - విలాసయుతమయిన, ముఖాంభోరుహే - ముఖకమలమందు, భావితవేణుగీతిగతయః - భావిత-పుట్టించున్న, వేణుగీతి - వేణుగానముయొక్క, గతయః - భేదములు, యావా-ఏవిగలవో, తాన్యేవతాన్యేవ-అవియవియే, మే-నాయొక్క,హృదయే-హృదయమందు, ధారావాహికయా- ధారారూపముచేత,వహన్తు-ప్రవహించుఁగాక

మ॥ అలఘున్ ధన్యులకే కథామృతము జిహ్వాన్ లేహ్యమే బాల్యచా। పలముల్ రాధకు నెయ్యముంగినుకనాపాదించు నేయందము। ల్వెలయునోష్ఠమున వేణుగానకలనవ్వేమాఱు నాదివ్యచా। ర్యలెనామానస వీథీ వేడెదను ధారాళంబుగానిల్వఁగన్॥ ౧౦౫

తా- కృతార్థులనాలుకలలేహ్యంబుంబోలెనుండునీ చరితామృతంబులెవ్వియో రాధకుఁబ్రియంబు నపరాధంబునుం జేయు నీచాపల్యోద్రేకములెవ్వి

దేవ-దేవతలకు, దేవ-దేవుఁడైన-హే దేవ-శ్రీకృష్ణ-జయజయ-సర్వోత్కర్షముగా వర్తింపుము.

చ॥ జయజయ దేవకృష్ణ రిపుసైన్య మహాద్రితతిభేదకృద్ఘనం ౹ జయజయకారణాభువన సన్నుతమంగళనామధేయసం ౹ జయజయబాధ సాధకవచశ్శ్రుతి నేత్రమనోమనోహరా ; జయజయ విశ్వజన్మలయశాసన గాఢతమోనిరాసనా॥ ౧౦౭

తా. శ్రోత్రంబులకు నేత్రంబులకు మనంబునకు నమృతంబువలె సుఖంబుఁ జేయునుద్భవంబుగలిగి ముల్లోకంబులకును శోభనకరంబులగుచు నితరాసాధారణంబులగు దివ్యమంగళనామంబులుగలిగి దేవదేవుండవై వెలయుచున్న యోకృష్ణా సర్వోత్కృష్టుండవై యుండుమనుట,

మా॥ తుభ్యం నిర్భరహర్షవర్షవివశావేశస్ఫుటావిర్భవచ్చాపల్యేనవిభూషితేషు సుకృతాంభావేషునిర్భాసతే। శ్రీమద్గోకులమండనాయమహతేవాచాంవిదూరస్ఫురన్మాధుర్యైకరసార్ణవాయమహసేకస్మైచిదస్మై నమః

టీక. నిర్భరహర్షవర్షవివశావేశస్ఫుటావిర్భవచ్చాపల్యేన-నిర్భర-అతిశయమయిన-హర్షవర్ష-సంతోషవర్షముచేత, వివశావేశ-బాహ్యశూన్యతయందు, స్ఫుట-వ్యక్తమగునటుల, ఆవిర్భవత్-పొడముచున్న, చాపల్యేన-చపలతచేత-విభూషితేషు-అలంకరింపఁబడిన, సుకృతాం-ధన్యులయొక్క, భావేషు-మనోవ్యాపారములయందు-నిర్భాసతే-మిక్కిలి ప్రకాశించుచున్నవాఁడును, శ్రీమద్గోకులమండనాయ-శ్రీమత్-సంపత్కరమయిన, గోకుల-గోసమూహమునకు, మండనాయ-అలంకారమయినవాఁడును, మహతే-వ్యాపకుఁడైనవాఁడును, వాచాం-ఉపనిషత్తులకు, విదూరస్ఫురన్మాధుర్యైకరసార్ణవాయ, విదూర-మిక్కిలిదూరమగున, స్ఫురత్-ప్రకాశించుచున్న, మాధుర్య-సౌందర్యమనియెడి, ఏక-ముఖ్యమైన, రస-రసమునకు, అర్ణవాయ, సముద్రుఁడైనవాఁడును, కస్మైచిత్-చెప్పనలవిగాని, అస్మై-ఈయెదురనున్న, మహసే-తేజోరూపుఁడైనవాఁడవైన, తుభ్యం-నీకొఱకు, నమః-నమస్కారము.

శా॥ ఆనందంబున బాహ్యముల్మఱచి యాత్మారామలీలారతిన్ ౹ ధ్యానుల్గ్రాల్వఁగముంగలన్నిలిచి వాచాగోచరంబైయశోదానందాంగణరత్నమైమధురిమాధారార్ణవంబైననెం ౹ దేనమోఘ్రిజ్వలమట్టితేజమునకెంతే మకుటావన్మ్రొక్కెదన్ ॥ ౧౦౮

తా, సంపూర్ణంబగుసంతోషవర్షంబుచే బాహ్యంబుమఱచివ్యక్త

గునటులం బొడముబాహ్యంబున నలంకరింపంబడిన ధన్యులమనంబులం బ్రకాశింపుచుఁ గోకులంబునలంకరించుచు నుపనిషద్గమ్యంబయ్యును దూరంబగు సౌందర్యాది గుణసముదయంబను రసంబునకర్ణవుండై యవాఙ్మానస గోచరుండై యీముంగలం గానుపించు తేజోరూపుండనగునీకొఱకు క్రమొకెక్కెదవనుట.

మూ ॥ ఈశానదేవచరణాభరణేననీ విదామోదరస్థిరయశ స్తబకోద్గమేన । లీలాశుకేనరచితం తవదేవకృష్ణకర్ణామృతంవహతుకల్పశతాన్తరేపి॥

టీక. దేవ-దేవుఁడవైన. హేకృష్ణ-ఓకృష్ణ, ఈశానదేవచరణాభరణేన- ఈశానదేవ-శివునియొక్క, చరణపాదములే-ఆభరణేన-భూషణముగాఁగలవాఁడును- నీవిదామోదరస్థిరయశస్తబకోద్గమేన-నీవి-మూలధనమైనదామోదర- శ్రీకృష్ణమూర్తియొక్క, స్థిర-నిశ్చలమయిన,యశః- కీర్తియనియెడి స్తబక- పువ్వులగుత్తియందు,ఉద్గమేన- ఉన్ముఖుడైన,లీలాశుకేన పోష్యశుకంబుఁబోలిలీలాశుకునిచేత,రచితమ్-చేయఁబడినశ్లోకసమూహం- కల్పశతాన్తరేపి-ఎప్పుడును-తవ-నీకు,కర్ణామృతం-కర్ణ, చెవులకు,అమృతం-అమృతమై,వహతు-పొందుగాక.

మ॥ ఫలవాంఛన్ హరికీర్తిగుచ్ఛరతియున్ ఫాలాక్షుసంసేవ
వయుం। గలలీలాశుకవాక్యముల్ చెలుఁగునన్ గర్ణామృతఖ్యాతిగా।న
లరం జేసితివెల్లఫూడి మణిపెద్దామాత్యవెంగన్ననే । నలరుందోయిలి
మాడ్కెఁ గైకొనుము కృష్ణాకల్పసంస్థాయిగన్॥ ౧౦౯

తా- ఓయిశ్రీకృష్ణ శివునిపాదంబు లాభరణంబుగ మనంబున ధరియించి యునఁగ శివునియందలి ద్వేషంబుతనకులేదనుట దామోదరుండవైన నీకీర్తియని యెడియలరులగుత్తియందుఫలాపేక్షచేఁబోష్యశుకంబుఁబోలెవెలయులీలాశుకునిచేరచియింపంబడినశ్లోక సమూహంబునీకర్ణంబులకమృతంబగుచుఁగల్పశతంబులపర్యంతంబును శాశ్వతంబుగనుండుం గాతయనుట. ఆశ్వాసాంతము.

మాలిని ॥ తనుజితజలవాహా తారితశ్వేతవాహా । జనకృతతమోహా శాంతదుర్దాంతమోహా । యనఘగుణసమూహా యార్తరక్షస్సమూహా । వినతవిషయగేహా వేంకటాహార్యగేహా॥

మ ॥ ఇదికృష్ణాశ్రియయోగిపుంగవ కృపావీక్షాత్తసారస్వతా ।
భ్యుదయ శ్రీవిభవప్రసిద్ధ చిదచిద్బ్ర దక్షమాశాంతిసత్యదయాభూష
ణవెల్లఫూడి మణిపెద్దామాత్యవెంగాగ్రణీ। గదితాశ్వాసముపొల్చుఁ
బ్రాథమికమై కర్ణామృతశ్రీకృతిన్॥

శ్రీకృష్ణకర్ణామృతము- ప్రథమాశ్వాసము. సంపూర్ణము.

శ్రీరస్తు.

శ్రీకృష్ణకర్ణామృతము - ద్వితీయాశ్వాసము.

శ్లో॥ అభినవ నవనీతస్నిగ్ధమాపీతదుగ్ధం దధికణపరిదిగ్ధం ముగ్ధమఙ్గంమురారేః । దిశతుభువనకృచ్ఛ్రచ్ఛేదితాపిఞ్ఛగుచ్ఛచ్ఛవి నవశిఖిపిఞ్ఛాలాఞ్ఛితంవాఞ్ఛితంనః॥ ౧

టీక. అభినవనవనీతస్నిగ్ధమ్- అభినవ- మిక్కిలినూతనమైన, నవనీత- వెన్నచేత, స్నిగ్ధమ్- స్వచ్ఛమైనట్టిదియు, ఆపీతదుగ్ధమ్ - ఆపీత - పానముచేయఁబడ్డ, దుగ్ధమ్- క్షీరముగలదియు, దధికణపరిదిగ్ధమ్ - దధి- పెరుగుయొక్క, కణ- బిందువులచేత, పరిదిగ్ధమ్ - అంతటఁబూయఁబడినయట్టియు - తాపిఞ్ఛగుచ్ఛచ్ఛవి - తాపిఞ్ఛ- కానుగుచెట్టుయొక్క, గుచ్ఛ - పువ్వులగుత్తియొక్క, ఛవి- కాంతివంటికాంతిగలయదియు, నవశిఖిపిఞ్ఛాలాఞ్ఛితం - నవ-నూతనమైన, శిఖిపిఞ్ఛ - నెమలిపురిచేత-ఆలాఞ్ఛితం - లెస్సగానలంకరింపఁబడినయదియు, భువనకృచ్ఛ్రచ్ఛేది- భువన - లోకములయొక్క, కృచ్ఛ్ర - ఉపద్రవములను, ఛేది- పోనడుపసమర్థమునైన, మురారేః - శ్రీకృష్ణమూర్తియొక్క, ముగ్ధం-సుందరమైన, అఙ్గం - శరీరము, నః - మాయొక్క, వాఞ్ఛితమ్- అభీష్టార్థమును, దిశతు - ఇచ్చుఁగాక.

శా॥ తాపించచ్ఛవిదైమెవినీలనవనీతస్నిగ్ధమై ముగ్ధమై । యాపీతామితదుగ్ధమైదధికణైకాదిగ్ధమైలోకకృ । ఛ్రాపచ్ఛేదకమై వినీల శిఖిపింఛాలాంచితంబైనశ్రీ। గోపాల ప్రభుమూర్తి వాంఛిత మొసంగున్మాకునశ్రాంతముగ॥ ౧

తా. క్రొత్తయగు వెన్నచేనచ్ఛంబగుచుఁబానంబుచేయఁబడిన క్షీరంబుగలిగి దధికణంబులచేతఁబూయంబడినదియై లోకంబుల యుపద్రవంబులఁబోనడుపసమర్థంబై కానుగుపువ్వులకాంతివంటి కాంతిగలదియై నెమలి పురిచేనలంకరింపఁబడినదియై సుందరంబైన శ్రీకృష్ణునిశరీరంబు మాకఖిలాభీష్టంబులనిచ్చుంగాకయనుట.

మూ॥ యాందృష్ట్వా యమునాంపిపాసురనిశం వ్యూహోగవాం గాహతే । విద్యుత్వానితి నీలకణ్ఠనివహోయాం ద్రష్టుముత్కణ్ఠతే ।

ఉత్తంసాయ తమాలపల్లవమితి ఛిన్దన్తి యాం గోపికాః కాన్తిః కాళి
యశాసనస్య వపుషస్సా పావనీ పాతునః ॥ ... ... ౨

టీక. పిపాసుః -పానముచేయనిచ్ఛయించుచున్న, గవాం- గోవులయొక్క, వ్యూహాః- సమూహము, యాం-ఏకాంతిని, యమునాం -యమునానదినిగా, దృష్ట్వా- చూచి, అనిశం- ఎప్పుడును, గాహతే- ప్రవేశించుచున్నదియో, నీలకంఠనివహాః- నీలకంఠ-నెమిళులయొక్క, నివహాః-సమూహము, యాం-ఏకాంతిని, విద్యుత్వానితి- మేఘమును గా, దృష్ట్వా-చూచుకొఱకు, ఉత్కంఠతే- సంతోషమును జేయుచున్నదియో, గోపికాః-గోపికలు, యాం-ఏకాంతిని, తమాలపల్లవమితి- తమాల-నల్లకానుగుచెట్టుయొక్క, పల్లవమితి- చిగురుగా, దృష్ట్వా- చూచి, ఉత్తంసాయ-శిరోభూషణముకొఱకు, ఛిందంతి- ఛేదింపఁదలంచుచున్నారో, కాళియశాసనస్య- శ్రీకృష్ణమూర్తియొక్క, వపుషః-శరీరముయొక్క, సా-ఆప్రసిద్ధమైన, పావని-పావనమైన, కాంతిః-కాంతి, నః-మమ్మును, పాతు-పరిపాలించుఁగాక.

చ॥ అనిశము యామునాంబువిదియంచు నెదమంచును గోగణంబు
లె। ల్లనుఁ జొరఁ బర్హ్యాళిబలాహకమంచును వేడ్కతోడఁగ। న్గొనఁ
గఁ దమాలపల్లవము కొప్పునకౌనని గోపకామినుల్। చిదుమఁగనొప్పు
కృష్ణుని విశేషతనుద్యుతి నన్ బ్రోవుతన్॥ ౨

తా. గోసమూహంబును నెమళులపిండును వేరితలు నేకాంతిం గనుంగొనుచునానదియనియు మొగులనియు గుంపనియుఁ గానుగుచిగుళ్ళనియును బలందలంచ చిత్రావసంబాడసుంజెడుమనుం గమకించునో యట్టి శ్రీకృష్ణుని నెమ్మేనిచాయ నను బ్రోచుఁగాక యనుట.

శ్లో॥ దేవః పాయాత్పయసి విమలే యామునే మజ్జతీనాం యాచం
తీనామనునయపదైర్వఞ్చితాన్యంశుకాని । లజ్జాలోలైరలసవిలసైరు
న్మిషత్పుచ్ఛబాణైర్గోపస్త్రీణాంనయనకుసుమైరర్చ్చితః కేశవో నః॥ ౩

టీక. విమలే- నిర్మలమైన, యామునే-యమునానదీసంబంధమైన, పయసి- నీటను, మజ్జతీనామ్-స్నానముచేయుచున్నవారును, వఞ్చితాని-దాచఁబడిన, అంశుకాని-వస్త్రములను, అనునయపదైః- వినయపుమాటలచేత, యాచంతీనామ్ - యాచించుచున్నవారునగు, గోపస్త్రీణాం-గోపికలయొక్క, అలసవిలసైః- అలస- సౌమ్యములగుటచే, విలసైః ప్రకాశించుచున్న, లజ్జాలోలైః- లజ్జా- సిగ్గుచేత, లోలైః - చంచలములైనవియు, ఉన్మిషత్పుచ్ఛబాణైః-

ఉన్మిషత్ - అవిర్భవించుచున్న, పఞ్చబాణైః - మన్మథునిచేఁ గలిగియున్న, నయనకుసుమైః- నయన నేత్రములనియెడి, కుసుమైః-పుష్పములచేత, అర్చితః-పూజింపఁబడిన- కేశవః-శ్రీకృష్ణమూర్తి, నః- మమ్ములను, పాయాత్ - రక్షించుఁగాక

ఈ శ్లోకము గోపాలకృష్ణమంత్రరాజమునకు ఋష్యాదికమగు ధ్యానమని సనత్కుమార సంహితయందుఁ జెప్పఁబడి యున్నది.

మూ॥ కదమ్బవృక్షమూలస్థం గోపీసహస్రపరివృతం। కృష్ణం ధ్యాత్వా వ్రతరాత్రేతుజపేన్మంత్రంసహస్రకం।దశరాత్రజపాద్దేవమూకత్వేన నాగకన్యకాం।కన్యకాస్త్రీదశాదీనాంకిం పునర్మర్త్యయోషితః॥

ప॥ యమునావేదికయందు గోపికలు నీరాడఁగ స్వకీయాంశుకా। ఘములు దాఁచఁగ సిగ్గుచే మృదులవాక్య ప్రౌఢితో వేఁడఁగ। సముదంచత్స్మిదనాలసోల్లసనిరీక్షాసీలని రేజమా। త్యములన్నారలు పూజసేయఁ దగు నయ్యబ్జాక్షునింబూచెదన్॥ 3

తా॥ నిర్మలంబగు యమునోదకంబునఁ జలకాలాడుచు దాఁచఁబడిన యంబరంబులను నయవచనంబుచే వేఁడుకొను వేంతలయొక్క లజ్జయనియెడి యుపాధివలనఁ జంచలంబులై మన్మథోద్దీపకంబులై యలసంబులై యలసిల్లు నేత్రచామరలచే నర్చింపఁబడు శ్రీకృష్ణుండు నను రక్షించుఁగాక యనుట.

మూ॥ మాతర్భ్రాతః పరమనుచితం యత్ఖలానాం పురస్తాదస్తాశఙ్కం జఠరపిఠరీపూర్తయే నర్తితాసి। తత్తత్సర్వం సహజసరళే వత్సలే వాణి కుర్వే ప్రాయశ్చిత్తం గుణగణనయా గోపవేషస్య విష్ణోః॥ ౪

టీక. సహజసరళే-సహజ - స్వభావమయిన, సరళే - ఋజుస్వభావము గలయదియు, మాతః- తల్లియైనదియు, వత్సలే- దయావతియైనదియు నగు హే వాణి - ఓ సరస్వతీ, జఠరపిఠరీపూర్తయే, జఠర-ఉదరమనియెడి, పిఠరీ-కుండయొక్క, పూర్తయే- పూరణముకొఱకు, ఖలానామ్-దుర్జనులయొక్క, పురస్తాత్-ముందరను, అస్తాశఙ్కమ్- సందేహము లేనట్లుగ, మయా- నాచేత, నర్తితాసి ఇతి యత్- నర్తనము సంపాదింపఁబడితివనునదియేదికలదో, అతః-ఇంతకన్నను, పరం-అన్యము, అనుచితం - ఉచితముకానిది, నాస్తి-లేదు, తత్-అది, తత్సర్వం- సహింపఁదగినది, గోపవేషస్య - గోపాలవేషముగల, విష్ణోః-శ్రీకృష్ణమూర్తియొక్క, గుణగణనయా - గుణకీర్తనముచేత, ప్రాయశ్చిత్తం - నిష్కృతిని, కుర్వే-చేయుచున్నాను.

*

చ॥ ఉదరమునించఁగోరి ఖలులుం జెడితావులు జేరి వారికిం జెపటి

సశంకనన్ను నటియింపఁగఁజేసిన పాతకంబులన్ । సదయతనోర్వఁగా
వలెఁ బ్రసన్నమతిన్ననుఁగన్నతల్లి శా । రదయదువంశనాయకునిఁ బ్రస్తు
తినిష్కృతి సేనొనర్చెదన్ ॥ ... ... ... ౪

తా. స్వభావసిద్ధంబగుఋజుత్వంబుగలిగిననిమిత్తంబున మదీయప్రార్థనంబు విఫలంబు చేయనోపకయుండి జగంబులకెల్ల తల్లియైనకతంబున నాకుందల్లియై యత్యంతదయావతియై మదీయవాగ్రూపంబునం బరిణమించినయోసరస్వతీ మర్జనులయెదుట నినునర్తనంబు చేయించినపాతకంబు సహింపవలయునింక శ్రీకృష్ణునిగుణకీర్తనంబునం తత్పాప ప్రాయశ్చిత్తంబుఁ జేయుచున్నాననుట. *

శ్లో ॥ అఙ్గుళ్యగ్రైరరుణకిరణైర్ముక్తసంరుద్ధరంధ్రంవారంవారం
వదనమరుతా వేణుమాపూరయన్తం । వ్యత్యస్తాంఘ్రింవికచకమలచ్ఛా
యవిస్తారనేత్రంవన్దేబృన్దావనసుచరితంనన్దగోపాలసూనుమ్ ॥ ౫

టీక. అరుణకిరణైః- అరుణ- ఎఱ్ఱనైన, కిరణైః- మయూఖములుగల, అంగుళ్యగ్రైః- వ్రేలికొనలచేత, ముక్తసంరుద్ధరంధ్రం-ముక్త- విడువఁబడినదియు సంరుద్ధ- కప్పఁబడుచున్నదియునగు, రంధ్రం-వివరములుగలుగునటుల, వేణుం-పిల్లనగ్రోవిని, వదనమరుతా- ముఖవాయువుచేత, వారంవారం - మాటిమాటికిని, పూరయన్తమ్-నిండింపఁజేయుచున్నవాఁడును, వ్యత్యస్తాంఘ్రిం-వ్యత్యస్త-వ్యత్యయములైన, అంఘ్రిం- పాదములుగలవాఁడును, వికచకమలచ్ఛాయవిస్తారనేత్రం- వికచ- వికసించిన, కమల- తెల్లదామరరేకులయొక్క, ఛాయ- కాంతివంటికాంతిగల, విస్తార - విశాలములైన, నేత్రం - కన్నులుగలవాఁడును, బృందావనసుచరితం-బృందావన- బృందావనమందు, సుచరితం-శోభనసంచారముగల, నందగోపాలసూనుమ్- నందగోపాల,నందునియొక్క, సూనుమ్-కుమారుండైన శ్రీకృష్ణమూర్తినిగూర్చి, వందే-నమస్కరించుచున్నాను,

మ॥ అరుణశ్రీదళుకొత్తనంగుళులవొయ్యన్గప్పుచున్విప్పుచు। న్ము
రళీరంధ్రములాస్య మారుతమునంబూరించునొయ్యారమై । చరణ
ద్వంద్వముమార్పడన్నిలుచుకంజాతాయతాలోకధా। సురబృందావ
నమందిరాంతర చరిష్ణుంగృష్ణుఁగీర్తించెదన్ ॥ ౫

తా. కెంపుసొంపులం దేజరిల్లునంగుళాగ్రంబుల వేణురంధ్రంబులంగప్పుచును విప్పుచును ముఖమారుతంబున సారెసారెకును వేణువుంబూరించుచు వామదక్షిణపాదంబుల దక్షిణవామభాగంబులందనరంబృందావనంబునఁ జరియించునందగోపాలకృష్ణునింగూర్చి మ్రొక్కుచున్నాననుట.

మూ॥ మన్దంమన్దం మధురనినదైర్వేణుమాపూరయన్తం బృన్దావనభువిగవాంచారయన్తంచరన్తమ్। ఛందోభాగే శతముఖముఖధ్వంసినాం దానవానాంహన్తారంతంకథయరసనే గోపకన్యాభుజఙ్గమ్॥ ౬

టీ. మధురనినదైః- మధుర-మనోహరములైన, నినదైః- ధ్వనులచేత, మన్దంమన్దం-మెల్లమెల్లగ, వేణుం-పిల్లనగ్రోవిని, పూరయంతమ్- నిండింపఁజేయుచున్నవాఁడును, బృందావనభువి-బృందావనప్రదేశమందు, గవాం-గోవులయొక్క, బృందమ్- సమూహమును, చారయంతమ్ - సంచరింపఁ జేయుచున్నవాఁడును, ఛందోభాగే- వేదైకదేశమయినవేదాంతమందు, చరంతమ్- సంచరించుచున్నవాఁడును, శతమఖముఖధ్వంసినాం- దేవేంద్రుఁడు మొదలగువారలనణఁచుచున్న, దానవానాం - దనుజులకుహన్తారమ్ - నాశనము చేయుచున్నవాఁడును, తం- అప్రసిద్ధుఁడైన, గోపకన్యాభుజంగమ్-గోపికావిటుఁడైన కృష్ణుని, హేరసనే-ఓనాలుకా, కథయ- కీర్తింపుము.

శా॥ బృందారణ్యతరుప్రదేశముల గోబృందంబులన్మేపుచు। న్మందంబౌ మధురధ్వనిన్మురళిఁబల్మాఱున్వినోదింపుచు౯ । ఛందోవీధిఁజరించుచున్విమతరక్షస్తోమవిధ్వంసనా। నందుండైన వ్రజాంగనావిటురసజ్ఞా ప్రజ్ఞఁగీర్తింపుమా॥ ౬

తా. మనోహరంబులగు నాదంబులచే మెల్లమెల్లన వేణువు నిండింపఁజేయుచు బృందావనంబునగోగణంబులను మేపుచును వేదాంతవీధులం జరియించుచు నెల్లదానవులంబోనడుచుచులోకప్రసిద్ధుండైవెలయు గోపికావిటుని నో నాలుకాకీర్తింపుమనుట.

మూ॥ వేణీమూలేవిరచితఘనశ్యామపిఞ్ఛావచూడో విద్యుల్లేఖావలయిత ఇవస్నిగ్ధపీతామ్బరేణ। మామాలిఙ్గన్మరకతమణిస్తమ్భగమ్భీరబాహుస్స్వప్నేదృష్టస్తరుణతులసీభూషణోనీలమేఘః॥ ౭

టీక. వేణీమూలే- వేణీ- కేశబంధవిశేషముయొక్క, మూలే- మొదటను, విరచితఘనశ్యామపిఞ్ఛావచూడః - విరచిత-ఉంచఁబడినదియు, ఘన - మేఘమువలె, శ్యామల- నల్లనైన. పిఞ్ఛ-నెమలిపురి,అవచూడః- శిరోభూషణముగలవాఁడును- స్నిగ్ధపీతామ్బరేణ-స్నిగ్ధ-స్వచ్ఛమయిన, పీతామ్బరేణ - పీతాంబరముచేత, విద్యుల్లేఖావలయితః-విద్యుత్-మెఱుపులయొక్క- లేఖా- పఙ్క్తిచేత వలయితః - చుట్టుకొనఁబడిన, నీలమేఘఇవ - నీలమేఘమువలెనున్నవాఁడును, మరకతమణిస్తమ్భగమ్భీరబాహుః- మరకతమణి - ఇంద్రనీలమణిచేసిన

రమైన - స్తమ్భ - స్తంభమువలె - గమ్భీర - గంభీరములైన, బాహుః - బాహువులుగలవాఁడును, తరుణ తులసీ భూషణః - తరుణ - లేఁతయగు, తులసీ - తుళసీమాలిక - భూషణః, అలంకారముగాఁగలిగినవాఁడునైన శ్రీకృష్ణమూర్తి - మాం - రుక్మిణీదేవిని. ఆలిఙ్గన్ - కౌఁగిలించినవాఁడగుచు, స్వప్నే - స్వప్నమందు, మయా - నాచేత, దృష్టః - చూడఁబడియెను॥ ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణ షోడశాక్షర మంత్రధ్యానంబని సనత్కుమార సంహితయందుఁ జెప్పఁబడియున్నది.... ... ... ... ❋

శ్లో ॥ వామాఙ్కస్థితయా నామపాణిపద్మస్థపద్మయా। పద్మావతారయాశ్లిష్టం రుక్మిణ్యా కనకాభయా । హరిం తాపిఞ్ఛసచ్ఛాయం మాసీనాం కాఞ్చనాసనే । ఆశ్లిష్య న్తం ప్రియాం దేవ్యాః ఫలోద్యద్వామపాణినా। సౌపర్ణ వేత్రవిలసద్దక్షిణాంసతలం స్మరేత్ । పీతామ్బరధరం దివ్యం భూషామాలావిభూషణం॥

చ ॥ అలరు మెఱుంగుఁబంగుగల హాటకశాటిక మాళిపాళిభా । సిలున వపింఛకంబు తుళసీదళ దామము గల్గినట్టి యే । ఘలలిత మూర్తి మానిక పుగంబము బోలిభుజద్వయంబుచే । సలమి రమాంగ భూటిఁ జెలువందఁ గలన్గనుపించె నింపుగన్ ॥ ౭

తా. తొలుకాఱుమెఱుంగు రంగు బంగారు వల్వలు నుమాళి తలంబున నగుపట్టు నెమలిపురి యును తులసీ దామంబునుం గలిగి నీలమేఘంబుఁ బోలిన శ్రీకృష్ణమూర్తి లంపుకంబంబులం బోలు బాహాయుగళంబుచే రుక్మిణిం గౌఁగిలించుకొని నాస్వప్నంబునం గానంబడియె ననుట,

శ్లో ॥ కృష్ణే హృత్వా వ్రజనిచయనిచోళం కూలకుఞ్జాధిరూఢే। ముగ్ధా కాచిన్ముహురనునయైః కిన్న్వితి వ్యాహరన్తీ । సభ్రూభఙ్గం సదరహసితం సత్రపం సానురాగం ఛాయాశోకైః కరతలగతాం స్వాం స్వరన్త్యా చకర్ష ॥

టీక. నిచయనిచయం - నిచయ - వస్త్రములయొక్క - నిచయం - సమూహమును, హృత్వా - హరించి, కృష్ణే - శ్రీకృష్ణమూర్తి, కూలకుఞ్జాధిరూఢే కూల - యమునాతటమందలి, కుంజ - పొదయందు, అధిరూఢే సతి - యెక్కినవాఁడగుచుండఁగా, కాచిత్ - ఒకానొకతయైన, ముగ్ధా - ముగ్ధరాలు, ముహుః - మాటిమాటికి, అనునయైః - ప్రియవచనములచేత, కిన్న్వితి - యేమి ప్రయోజనమని, వ్యాహరన్తీ - చెప్పుచున్నదియై, సభ్రూభఙ్గం - బొమముడితోఁగూడినటులను, సదరహసితం - చిఱునగవుతోఁ గూడినటులను - సత్రపం - సిగ్గుతోఁడ

గూడినటులను, సానురాగం - అనురాగముతో గూడినట్టులను, ఛాయాశౌరేః - శ్రీకృష్ణచ్ఛాయయొక్క, కరతలగతాని - కేలనున్న, అమ్బరాణి - వస్త్రములను, ఆచకర్ష - లాగెను॥ ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణమంత్రరాజవస్త్రాకర్షణ ప్రయోగధ్యానమని గోపాలకల్పమందు జెప్పంబడియున్నది.

మూ॥ కదమ్బవృక్షమారూఢం గోపీవస్త్రాపహారిణం। కృష్ణం ధ్యాత్వార్ధరాత్రే తు జపేన్మంత్రం సహస్రకం। దశరాత్రజపాదేవ మాకర్షేన్నాగకన్యకాః। కన్యకాస్త్రిదశాదీనాం కింపునర్మర్త్యయోషితః॥

ఉ॥ కోకలు మ్రుచ్చిలించి తటకుంజగృహంబున నిల్వ సిగ్గునన్। భ్రూకుటియున్ దరస్మితనిరూఢయుఁ బ్రేముడు దోఁపఁ గట్టకున్। రాకయి చేనిరాతగదు రాఁచని ముగ్ధవధూటినీటిలోఁ। జేకొనఁబూనె నీడయగు చిన్ని ముకుందుని చేతిచేలముల్॥

తా. వస్త్రసమూహంబుల నపహరించి శ్రీకృష్ణుండు యమునాతటంబునందుండిన వృక్షంబునధిరోహింప నొకముగుదయైన గోపిక ప్రియవచనంబుల నివియేమి ప్రయోజనంబని నుడువుచు బొమముడియును చిఱునగవును సిగ్గును రాగంబునుం దెలుపుచు నీడయగు కృష్ణునికరతలంబు లందుండిన చేలంబుల నాకర్షించెనట.

అవతారిక॥ కవియొకానొకగోపిక మనోరథముం జెప్పుచున్నాఁడు.

మూ॥ అపి జనుషి పరస్మిన్నాత్తపుణ్యో భవేయం తటభువి యమునాయాస్తాదృశో వంశనాళః। అనుభవతి య ఏష శ్రీమదాభీరసూనోరధరమణిసమీపన్యాసధన్యామవస్థాం॥

టీక. పరస్మిన్ - యితరమైన - జనుషి - జన్మమందు - ఆత్తపుణ్యః - ఆత్త, పొందఁబడిన - పుణ్యః - పుణ్యముగలదానచు - యమునాయాః - యమునానదియొక్క - తటభువి - తీరదేశమందు - తాదృశః - శ్రీకృష్ణాధరమును బొందయోగ్యమైన - వంశనాళః - వేణువు - భవేయమపి, అయినఁ బుట్టకని - యగాదే - ఏషః - ఏ యమునాతీరమునఁ బుట్టినయీ వేణువు - శ్రీమదాభీరసూనోః - శ్రీమత్ - సంపత్కరుఁడైన - ఆభీరసూనోః - శ్రీకృష్ణమూర్తియొక్క - అధరమణిసమీపన్యాసధన్యాం - అధరమణి - మణివంటియధరముయొక్క - సమీప - ప్రాంతమందు - న్యాస - ఉంచుటచేత - ధన్యాం - కృతార్థమైన - అవస్థాం - గతను - అనుభవతి - అనుభవించుచున్నది.

ఉ॥ నందతనూజు మోవిరతనంబున మీఁదుచేరి ధన్యతం। బొందె

గళిందజాతటము పొంతవసించినవంశనాళమా। యందముగాంతునో
కొంకజననాంతరమందియు శేషసత్క్రియా। బృందము వెంటనంటిఫల
మియ్యఁగఁగోరుకలపంటపండఁగన॥ ౯

తా. శ్రీకృష్ణుని కెమ్మోవి రతనంబుపొంతంజేరి యమునాతటంబునం బొడమినవంశనాళంబుపవిత్రంబయ్యె నేనునటులజన్మాంతరంబునన్నైన శేషసత్కర్మఫలంబులచే నైనం దాదృశవంశనాళంబుపోలిక కృతార్థతంబునొందుదునో కోయని యొక వ్రేతమనంబునందలంచెననుట.

శ్లో॥ అయిపరిచినుచేతః ప్రాతరమ్భోజనేత్రం కబరకలితచఞ్చత్పిఞ్ఛదామాభిరామమ్। వలభిదుపలనీలంవల్లవీభాగధేయం నిఖిలనిగమవల్లీమూలకన్దంముకున్దమ్॥ ౧౦

టీక. అయి-ఓ-చేతః-చిత్తమా-ప్రాతరమ్భోజనేత్రం-ప్రాతరమ్భోజ-ప్రాతఃకాలకమలములవంటి- నేత్రం- కన్నులుగలవాఁడగు- కబరకలితచఞ్చత్పిఞ్ఛదామాభిరామమ్- కబర-సిగయందు- కలిత-చుట్టబడ- చఞ్చత్-ఒప్పుచున్న-పిఞ్ఛదామ- నెమలిపురిదండచేత- అభిరామం- సుందరుండైనవాఁడగు- వలభిదుపలనీలం- వలభిదుపల- యింద్రనీలమణివలె- నీలం-నీలవర్ణుండైనవాఁడును- వల్లవీభాగధేయం - వల్లవీ- గోపస్త్రీలయొక్క- భాగధేయం- భాగ్యస్వరూపుండైనవాఁడును. నిఖిలనిగమవల్లీ మూలకన్దం- నిఖిల-సమస్తమైన-నిగమ-వేదములనియెడి- వల్లీ-తీఁగెలయొక్క- మూల-మొదటిదియగు- కన్దం-గడ్డయైనవాఁడును-ముకున్దం-శ్రీకృష్ణమూర్తినిగూర్చి-పరిచినుఁ పరిచయముచేయుము

మ॥ లలితాంభోరుహనేత్రు గోపరమణీలావణ్యపాత్రున్నను।
జ్జ్వలపౌరందరనీలగాత్రుఁ గబరాంచత్పింఛలీలున్విను। శ్చలవేదాంతలతాలవాలుమురళీ సంగీతలోలుం దయా। నిలయున్ సమ్మతమీరఁగో
రి మనమా నిత్యంబు సేవింపుమా॥ ౧౦

తా. ఓమనంబాదినముఖంబునంబొల్చు విరిదమ్మిరేకులుంబోలికన్నుఁగవచేఁదేజరిల్లి సిగయందునలంకరింపఁబడిన నెమలిపురిదండచేనభిరాముఁడగుచు నింద్రనీలరతనంబుంబలె నీలకాంతిగల్గి గోపస్త్రీ భాగ్యరూపంబై యెల్లవేదంబులకునాది కారణంబైన వెలయు శ్రీకృష్ణమూర్తింగూర్చి నిక్కలియుం బరిచయంబుచేయుమనుట.

శ్లో॥ అయిముపళీముకున్దస్మేర వక్త్రారవిన్దస్వసమధురగన్ధైత్వాం

ప్రణమ్యాద్య యాచే। అధరమణిసమీపం ప్రాప్తవత్యాం భవత్యాం కథ
య రహసి కర్ణే సద్దశాం నన్దసూనోః॥ ౧౧

టీక • ముకున్దస్మేరవక్త్రారవిన్దశ్వసన మధురసజ్ఞే - ముకున్ద- శ్రీకృష్ణ మూర్తియొక్క- స్మేరవక్త్ర-నగుమొగమనియెడి-అరవిన్ద కమలము యొక్క- శ్వసన- విశ్వాసమనియెడి- మధు-మకరందముయొక్క-రసజ్ఞే- రసము నెఱిఁగిన-అయిమురళీ- ఓవంశనాళమా- త్వాం-నిన్నుఁగూర్చి -అద్య- యిప్పుడు-ప్రణమ్య- నమస్కరించి- యాచే-యాచించుచున్నాను- భవత్యాం-నీవు-అధరమణి సమీపం, అధరమణి - మణివంటియధరముయొక్క - సమీపం - సమీపమును- ప్రాప్తవత్యాం - పొందుచుండఁగా - నన్దసూనోః - శ్రీకృష్ణమూర్తియొక్క - కర్ణే - చెవియందు - రహసి. యేకాంతమున- సద్దశాం-నాయవస్థను- కథయ - చెప్పుమా

చ॥ హరియధరాంతికస్థలవిహారమునన్ స్మితపూర్ణవక్త్రతా। మరససమీరసీధురసమాధురిఁ జెందిననిన్ను వేఁడెద। న్మురళిరొనందసూను మదినూల్కొనఁగాఁ జెవిదండనుండియొ। వ్వరువినకుండనాదువలవంత సమస్తముఁ దెల్పుమొక్కెదన్॥ ౧౧

తా. శ్రీకృష్ణునినగుమొగంబుఁ దామరంబొడము నిట్టూరుపుతేనియచవి నెఱింగినయోపిల్లనఁ గ్రోవి నినుం గూర్చి మ్రొక్కి వేడెదనీవురతనంబుఁబోని యధరంబుసమీపంబునఁ జేరినయెడ శ్రీకృష్ణునిచెవియందేకాంతంబున నాయవస్థంజెప్పుమనుట.

మా॥ సజలజలదనీలం వల్లవీకేళిలోలం శ్రితసురతరుమూలం విద్యుదుల్లాసిచేలం। నతసురమునిజాలం సన్మనోబిమ్బలీలం సురరిపుకులకాలం నౌమిగోపాలబాలం॥ ౧౨

టీక. సజలజలదనీలం - సజల-నీటితోఁగూడిన - జలద- మేఘమువలె.నీలం-నల్లనైనవాఁడును- వల్లవీకేళిలోలం- వల్లవీ- గోపస్త్రీలయొక్క- కేళి- సల్లాపాదులయందు - లోలం - ఆసక్తితోఁగూడినవాఁడును - శ్రితసురతరుమూలం-శ్రిత - ఆశ్రయింపఁబడిన- సురతరు- కల్పవృక్షముయొక్క, మూలంబు మొదలుగలవాఁడును- విద్యుదుల్లాసిచేలం - విద్యుత్ - మెఱుపువలె- ఉల్లాసి-ప్రకాశించుచున్న - చేలం- వస్త్రముబుగలవాఁడును - నతసురమునిజాలం - నతనమ్రులైన, సుర, దేవతలయొక్కయు , ముని, మునులయొక్కయు, జాలం,సమూహముగలవాఁడును, సన్మనోబిమ్బలీలం, సత్, సత్పురుషులయొక్క,

మనః- మనస్సునందు, బిమ్బ- సాకారములైన, లీలం- విలాసములుగలవాఁడును, సురరిపుకులకాలం -సురరిపు-రాక్షసులయొక్క, కుల-వంశములకు, కాలం-యమప్రాయుఁడైన వాఁడును, గోపాలబాలం - గోపాలబాలుండునైన (కృష్ణుని)స్వామి నుతించుచున్నాను॥ ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణ ద్వాదశాక్షరీమంత్రధ్యానమని సనత్కుమార సంహితయందుఁ జెప్పంబడియున్నది.

శ్లో॥ ధ్యాయేత్కల్పద్రుమాధస్తాన్మణిపీఠాబ్జగం శుభమ్। కృష్ణం పీతాంబరధరం శంఖచక్రకరాంబుజమ్॥ పిఞ్ఛమానం సుధాకుమ్భై రైరావణకరావృతైః। శక్రకరౌఘాంతదర్పేణ సన్నుతం తపసాన్వినా॥ స్తూయమానం సురగణైః పుష్పవృష్టికరైర్దివి। సేవ్యమానం చ మునిభిస్సిద్ధసాధ్యైర్యశస్విహారగైః॥

మ॥ సజలాంభోధరజాల నీలు విలసత్సౌదామినీచేలునిన్। వ్రజ
భామానసకేళిలోలుని సుపర్వద్వేషకృత్కాలునిన్। ద్విజరాణ్మానస
బింబలీలునిన్ శ్రితామితకల్పద్రుమమూలాలునిన్। భజియింతున్మదిగోపబాలు
నతనానాదేవతాజాలునిన్॥ ౧౨

తా. నీరంబుతోఁడఁగూడిన మొదలుంబోలెనల్లనై గోపికల సల్లాపాది క్రీడలయందాసించుచుఁ గల్పవృక్షమూలంబున నుండి మెఱుఁగుబోని చేలంబమర సర్వదానవ వంశ నాశకుండై దేవతలు మునులు భజయింప సత్పురుషుల యెదుట సాక్షాత్కరించుచు వెలుంగు గోపాలబాలు నుతించుచున్నాననుట.

శ్లో॥ అధరబిమ్బవిడమ్బితవిద్రుమం మధురవేణునినాదవినోది
నం। కమలకోమలకమ్రముఖాంబుజం కమపిగోపకుమారముపాస్మహే॥

టీక. అధరబిమ్బవిడమ్బితవిద్రుమమ్ - అధరబిమ్బ- దొండపండువంటి యధరముచేత, విడమ్బిత- అపహసింపఁబడిన, విద్రుమమ్ - పవడముగలవాఁడును, మధురవేణునినాదవినోదినమ్- మధుర-శ్రావ్యమయిన, వేణునినాద-వేణునాదముచేత- వినోదినం - కాలముగడుపుచున్నవాఁడును, కమలకోమలకమ్రముఖాంబుజం- కమల- కమలమువలె, కోమల- మృదువైనయదియు, క్రమ-సుందరమైనదియునగు, ముఖాంబుజం- ముఖకమలముగలవాఁడును, కమపి-ఇట్టిదని చెప్పవలవిగాని వాఁడునునగు, గోపకుమారం- శ్రీకృష్ణమూర్తిని, ఉపాస్మహే- ఉపాసించుచున్నాను.

మ॥ మురళీనాదమధూళి-కాకలితసమ్మోదున్ సుధాసారమే।దు
రబింబాధర పూత విస్ఫురిత వినోదున్ రాధికాంఘ్రిద్వయీ। వరలా

తాలసమానఫాలతలు శ్రీవత్సాంకితవక్షస్థలుఁడై । సరసీజాతమనోహ
రాననుమదింజక్రాయుధుం గొల్చెదన్॥ ౧౩

తా॥ దొండపండువంటి కెమ్మోవి పవడంబు నపహసింపఁ శ్రావ్యంబగు వేణుగానంబునఁ గాలంబుం గడుపుచుఁ గమలంబువంటి న్యాసలంబును సుందరంబునైన నెమ్మొగంబునుగల నిద్దేవుఁడని చెప్పనలవికాక వెలుంగు గోపాలకృష్ణును పాసించుచున్నాననుట.

మూ॥ అథ రేపిని వేశ్యవంశనాళం వివరాణ్యస్య సలీలమఙ్గుళీభిః। ము
హురన్తరయన్ముహుర్వివృణ్వన్మధురం గాయతి మాధవో వనాన్తే॥ ౧౪

టీక. మాధవః- శ్రీకృష్ణమూర్తి, అధరే- కెమ్మోవియందు, వంశనాళం- వేణువును, నివేశ్య- ఉంచి, అస్య- ఈవేణువుయొక్క, వివరాణి- రంధ్రములను, సలీలం- విలాసముతోఁగూడినటుల, ముహుః- పలుమఱు, అఙ్గుళీభిః- వ్రేళ్ళచేత, అంతరయన్- కప్పుచును, ముహుః- పలుమఱు, వివృణ్వన్- విప్పుచును, వనాంతే- బృందావనమందు, మధురం- శ్రావ్యముగను, గాయతి- గానము చేయుచున్నాఁడు.

ఉ॥ నెమ్మది యామునాంతరవనిన్వసియించుచుఁ గావిమోవి
నం। దమ్ముగవంశిఁగీలుకొలిపితద్వివరమ్ములఁ గేలఁబెట్టి। క్రమ్మఁగఁ
జిమ్ముచున్ శ్రుతిసుఖమ్మగు గానము దానమానముల్ । ఘుమ్మని మ్రో
యఁ జేయు పసికుంగను గొంటి కెకంటికింపుగన్॥ ౧౫

తా॥ అధరంబున వంశనాళంబు నిలిపి రంధ్రంబుల వ్రేళ్లచే మాటిమాటికిం గప్పుచు విప్పుచుం బృందావనంబున శ్రీకృష్ణమూర్తి వీన నింపగునటుల గానముం జేయుచున్నాఁడనుట.

✓ మూ॥ వదనే నవనీతగన్ధవాహం వచనే తస్కరచాతురీధురీణమ్ । న
యనే కుహనాశ్రుమాశ్రయే చరణే కోమలతాండవం కుమారమ్॥

టీక. వదనే- ముఖమందు, నవనీతగంధవాహం- నవనీత- వెన్నయొక్క- గంధ- పరిమళమును, వాహం- వహించుచున్నవాఁడను, వచనే- వాక్యమందు, తస్కరచాతురీధురీణం- తస్కర- దొంగయొక్క, చాతురీ- చాతుర్యములయొక్క, ధురీణం- భారవహుఁడైనవాఁడను, నయనే- కన్నులయందు, కుహనాశ్రుం- కుహనా- అబద్ధమైన, అశ్రుం- కన్నీరుగలవాఁడను, చరణే- పాదమందు, కోమలతాండవం- కోమల- మనోహరమైన, తాండవం- నృత్యముగలవాఁడును, కుమారం- కుమారుఁడైనకృష్ణుని, ఆశ్రయే- ఆశ్రయించుచున్నాను.

ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణైకదశాక్షరీ మంత్రధ్యానమని సనత్కుమార సంహితయందుఁజెప్పంబడియున్నది ॥మూ॥ హారన్తంనవనీతాదిచౌర్యేణ వ్రజయోషితామ్ । గోపబాలైర్వృతం కృష్ణంధ్యాయన్మంత్రమిమంజపేత్. ✻

ఉ ॥ కన్నులనివెన్నవాసనముఖమ్మునఘుమ్మనిసోఁకుముట్టవా । క్యమ్ములఁ జౌర్యనైపుణులుగన్పడఁగన్నఁగవన్సృపాత్రువు। ల్గ్రిమ్మఁగఁ గోమలాంఘ్రియుగళమ్మునఁదాండవకేళియొప్పఁగాఁ । గ్రమ్మరుగోపబాలకు ముకుందుని నామదినాశ్రయింతెదన్॥ ... ... ౧౫

తా. నెమ్మొగంబున నవనీతగంధంబు వెలయమాటలయందు దొంగతనంపుచతురుబుపొసంగఁ గన్నంగవ మిథ్యాశ్రులొలుక నవకుచామరల నాట్యంబువిస్తరిల్లంగ్రుమ్మరు గోపాలబాలునినామనంబా యాశ్రయింపుమనుట.

మూ॥అమునాకిలగోపగోపనార్థంయమునారోధసినన్దనన్దనేన ।దమునా వన సమ్భవః పపే నః కిమునాసౌ శరణార్థినాం శరణ్యః॥౧౬

టీక. అమునా- ఈయగుపడుచున్న, నన్దనన్దనేన- శ్రీకృష్ణమూర్తిచేత,యమునారోధసి-యమునాతటమందు,గోపగోపనార్థమ్-గోప-గోపాలకులయొక్క,గోపనానార్థం-రక్షించుకొఱకు,వనసమ్భవః-వనమందుఁబొడమిదమునాః.దహనుఁడు, పపేకల-పాలముచేయఁబడెనెనగదా, అసౌ - ఈకృష్ణమూర్తి,శరణార్థినామ్-శరణమును బార్థించుచున్న,నః-మాకు-శరణ్యః రక్షకుండు,నకిము-కాఁడావేమి.

ద్విప్రాసమత్తేభము ॥ యమునాతీరవనాంత సంజనిత దావాగ్నిమ్మహార్చిర్నికా । యమునానాజన భీకరంబగుచు డాయన్ వ్రేలవేఁగాచునె ।య్యమునాయంజనిదానినాసెనిటనిత్యంబున్ హరిన్ గప్తసం। యమునారాధనచేయునాకిపుడభీష్టావాప్తిగాకుండునే॥ ౧౬

తా. ఈకానంబుచున్న శ్రీకృష్ణమూర్తిచే యమునాతటవనంబున గోపాలరక్షణంబుకొఱకుదావానలంబుపానంబుచేయఁబడియెంగదా ఆట్టి ఈ కృష్ణమూర్తిశరనాగతులమగుమమ్మింగావనేటుల సమర్థుండుగాక పోవుననుట.

మూ॥జగదాదరణీయజారభావంజలజాపత్యవచోవిచారగమ్యమ్। తనుతాన్తసుతాం శివేతరణాం సురనాథోపలహాన్దరం మహోనః ॥

టీక. జగనాదరణీయజారభావమ్. జగత్ - లోకములచేత,ఆదరణీయ అంగీకరింపఁదగిన, జారభావమ్- జారత్వముగలదియు, జలజాపత్యవచోవి

చారగమ్యామ్ - జలజాపత్య, చతుర్ముఖునియొక్క, వచః - వాక్యములైనవే దాంతములయొక్క, విచార-సంచారముగలయుత్తర మీమాంసచేత, గమ్యామ్- తెలియఁదగినయదియు, సురనాథోపలసుందరమ్ - సురనాథోపల- ఇంద్ర నీలమణివలె, సుందమ్ - సుందరమైనదియునైన, మహః- తేజము- నః - మా యొక్క, శివేతరాణామ్ - అశుభములయొక్క, తనుతామ్ - కార్యమును, తనుతామ్- చేయుఁగాక-

చ॥ సరసిజసంభవ ప్రముఖసర్వసు పర్వవచోవిచారగోచర
మగుదివ్యతేజమని శంబుజగంబులు మెచ్చజారుఁడై। మరకతసూత్నర
త్నసుషమంజెలువందగు మారమూర్తియై। పరగిదయార్ద్రదృష్టినశు
భంబులడంచి శుభంబులీవుతన్॥

తా - వేదాంతవాక్యంబుల విచారంబుగల యుత్తరమీమాంసచేఁ దె లియందగియును జగంబుచే నాదరింపఁబడిన జారత్వంబు గలిగి యింద్రనీల రత్నంబుంబోలె సుందరంబై వెలుంగు తేజంబు నాయశుభంబుల నడంచి శు భంబుల నొసంగుతయనుట.

మూ॥ సాకాపిసర్వజగతా మభిరామసీమా కామాయనోభవ
తుగోపకిశోరమూర్తిః। యాశేఖరేశ్రుతిగిరాం హృదియోగభాజాం
పాదాంబుజేచసులభావ్రజసుందరీణామ్॥ ౧౮

టీక, సా-ఆప్రసిద్ధమైనయదియు, కాపి- ఇట్టిదియనిచెప్పనలవిగానిది యును, సర్వజగతామ్ - ఎల్లలోకములయొక్క, అభిరామసీమా . అభిరా మ, సౌందర్యమునయొక్క, సీమా-ఉత్తరావధియునైన, గోపకిశోరమూర్తిః- గోపకిశోర, గోపాలబాలునియొక్క, మూర్తిః, శరీరము, నః, మాయొక్క, కామాయ, శ్రేయస్సుకొఱకు, భవతు, ఆగుఁగాక, యా, ఏమూర్తి, శ్రుతిగి రాం, వేదవాక్యములయొక్క, శేఖరే, అంతమందు, యోగభాజామ్, బ్రహ్మ నిష్ఠులయొక్క, హృది, హృదయములయందును, వ్రజసుందరీణామ్, గోప స్త్రీలయొక్క, పాదాంబుజేచ, పాదకమలంబునను, సులభా, సులభముగాఁ బ్రవర్తించుచున్నదియో, సాకామాయభవతు అని యన్వయము.

ఉ॥ ఎల్లజగంబులుక్ రహింవహించు శుభాస్పదసీమయోగిహృ।
త్ఫుల్లసరోజపాళిఁ బదముల్దులకింపఁ ద్రయీవధూటికా ।హల్లకసీమ
లంబొలుచునద్భుత గోపకిశోరమూర్తియీ। వల్లవకామినీచరణవారి
జసీమకులెస్సఁజిక్కెడిన్॥ ౧౯

తా. ఎద్దియేనియు వేదాంతంబున బ్రహ్మనిష్ఠుల హృదయంబులం బ్రకాశించునదియయ్యుం గోపవధూచరణాంబుజసేవకుఁ బాల్పడియెనో, అట్టిప్రసిద్ధంబైనదియు నెల్లలోకంబుల సోయగంబునకు నెల్లయునైన గోపాలకృష్ణమూర్తి మా శ్రేయస్సుకొఱకగుంగాకయనుట.

శ్లో॥ అత్యన్తబాలమతసీకుసుమప్రకాశం దిగ్వాససం కనకభూ
షణభూషితాఙ్గమ్ । విస్రస్తకేశమరుణాధరమాయతాక్షం కృష్ణం న
మామి మనసా వసుదేవసూనుమ్॥ ౧౯

టీక॥ అత్యన్తబాలమ్- మిక్కిలి బాలుఁడైనవాఁడును, దిగ్వాససం-దిగంబరుండైనవాఁడును, విస్రస్తకేశమ్ - విస్రస్త- ముడివేయని, కేశం- వెండ్రుకలుగలవాఁడును, అతసీకుసుమప్రకాశమ్, అతసీకుసుమ, నల్లవిశపుష్పమువలె కెం, ప్రకాశం, ప్రకాశమువంటి ప్రకాశముగలవాఁడును, కనకభూషణభూషితాఙ్గమ్, కనక - బంగారువికారమైన, భూషణ - ఆభరణములచేత, భూషిత - అలంకరింపఁబడిన, అఙ్గమ్, శరీరముగలవాఁడును, అరుణాధరమ్, అరుణ, యెఱ్ఱనైన, అధరం, అధరముగలవాఁడును, ఆయతాక్షమ్, ఆయత, దీర్ఘములైన, అక్షమ్, కన్నులుగలవాఁడునైన, వసుదేవసూనుమ్, శ్రీకృష్ణమూర్తిని- మనసా, మనస్సుచేత, నమామి, నమస్కరించుచున్నాను

ఉ॥ కోమలసుందరాకృతియు గొప్పకనుంగవ కెంపుమోవియు ।
న్నామున వ్రేలుముంగురులు నూత్నవిభూషణభూషితాంగము । ద్దామది
గంబరాకృతియుఁ దాల్చిన వెన్నునిఁ జిన్నిబాలకున్ । శ్రీమెఱయన్ భ
జింతు నతసీవసుభాసుని నందసూనునిన్॥ ౧౯

తా. మిక్కిలి చాలుండును నల్లవిశపూవుంబోని నెమ్మేనిచాయచేం దేజరిల్లువాఁడును దిగంబరుండును, గనకాభరణంబులచే నలంకరింపఁబడిన శరీరంబుగలవాఁడును, ముడువని వెండ్రుకలు గలవాఁడును, వెడలువగు కన్నుంగవలవాఁడును గెంపువెంపుగఱయింపని యధరంబు గలవాఁడును, వసుదేవసూనుండునునగు శ్రీకృష్ణమూర్తిం గూర్చి శిరంబుచే నమస్కరించుచున్నాననుట.

శ్లో॥ హస్తాఙ్ఘ్రినిక్వణితకఙ్కణకిఙ్కిణీకం మధ్యే నితమ్బమవల
మ్బితహేమసూత్రమ్ । ముక్తాకలాపముకళీకృతకాకపక్షం వందామ
హే వ్రజచరం వసుదేవభాగ్యమ్॥ ౨౦

టీక. హస్తాఙ్ఘ్రినిక్వణితకఙ్కణకిఙ్కిణీకమ్ - హస్తాఙ్ఘ్రి. కరచరణకమ

లములయందు, నిక్వణిత- మ్రోయుచున్న, కఙ్కణ- కంకణమంజీరములయొ
క్క, కిఙ్కిణీకమ్- చిఱుగంటలుగలవాఁడును, మధ్యేనితమ్బం - నితంబమధ్య
మందు, అవలమ్బితహేమసూత్రమ్ - అవలమ్బిత - ఆశ్రయింపఁబడిన, హే
మసూత్రమ్ - బంగరుమొలనూలుగలవాఁడును, ముక్తాకలాపముకుళీకృతకా
కపక్షం- ముక్తాకలాప- ముక్తావళిచేత, ముకుళీకృత- మోడ్పంబడిన, కాకప
క్షం- చిప్పకూఁకటిగలవాఁడును, వ్రజచరం- వ్రజ-వ్రేపల్లెయందు,చరం-సం
చరించుచున్నవాఁడునునగు, వసుదేవభాగ్యమ్ - శ్రీకృష్ణమూర్తినిగూర్చి, వ
న్దామహే- నమస్కరించుచున్నాము ॥ ఈశ్లోకార్థంబు శ్రీకృష్ణాష్టాక్షరీధ్యా
నంబనిసనత్కుమారసంహితయందుఁజెప్పఁబడియున్నది॥ శ్లో॥ పఞ్చహాయన
మీశానంధావమానంవ్రజాఙ్గణే । కిఙ్కిణీనూపురగ్రైవ కర్ణభూషోజ్జ్వలం
స్మరేత్॥

చ ॥ సరసనితంబమధ్యమున జాఱెడుపొన్మొలనూలుచిన్నముం ।
గురుబుధళంబుగా గమిచికూర్చినముత్తెపురావిరేకయుం । గరచరణా
గ్రనిక్వణితకంకణకింకిణులొప్పనందముం । దిరమునసంచరించువసుదే
వతపఃఫలముం భజించెదన్॥

తా. హస్తంబులనుబాదంబులను గంకణమంజీరంబులయొక్క చిఱు
గంటలుమ్రోయుచుండఁగటిపశ్చాద్భాగమధ్యంబునబంగరుమొలనూలువ్రేలు
చుండ మోడ్పంబడినచిప్పకూఁకటియందు రావిరేకమెఱయ వ్రేపల్లెయందుఁ
గ్రుమ్మరుశ్రీకృష్ణమూర్తింగూర్చిమ్రొక్కెదననుట॥ శ్లో॥ బృన్దావనద్రుమతలేషు
గవాంగణేషు వేదావసానసమయేషుచదృశ్యతేయత్ । తద్వేణువాదనపరంశిఖి
పిఞ్ఛచూడంబ్రహ్మాఽస్మరామికమలేక్షణమభ్రనీలమ్॥ ౨౧

టీ॥ బృన్దావనద్రుమతలేషు- బృన్దావన-బృందావనమందలి, ద్రుమ-వృ
క్షములయొక్క, తలేషు-ప్రదేశములయందు,గవాం-గోవులయొక్క, గణేషు -
సమూహములయందు, వేదావసానసమయేషు - వేదావసాన-వేదాంతముల
యొక్క, సమయేషు- సిద్ధాంతములయందు, యత్- యేబ్రహ్మము, దృశ్యతే
చూడఁబడుచున్నదియో, తత్ -ఆప్రసిద్ధమైనయట్టి, వేణువాదనపరం- వేణు-పిల్లఁ
నఁగ్రోవియొక్క, వాదన-వాయించుటయందు, పరం,ఆసక్తమైనదియు, శిఖిపి
ఞ్ఛచూడం- శిఖిపిఞ్ఛ-నెమలిపురి, చూడం- శిరోభూషణముగాఁగలయదియు,
కమలేక్షణం- కమల- తామరరేకులవంటి, ఈక్షణం, నేత్రములుగలదియు, అ
భ్రనీలం-అభ్ర- మేఘమువలె, నీలం-నల్లనైనదియునగు, బ్రహ్మమ్- శ్రీకృష్ణ.

క్ష్యపరబ్రహ్మమును, స్మరామి - స్మరించుచున్నాను.

శా॥ బృందారణ్యతరుప్రవేశములగో బృందాంగణక్షోణులన్ ।
ఛందోవీధులఁగానుపించు పరమస్వచ్ఛందమౌతేజమౌ । నందబ్రహ్మ
మునందనీయమురళీ నాదానుమోదంబునౌ । యందు న్నిల్పెదఁబింఛ
చూడముపయోజాతక్షంబు మేఘాభమున్॥ ౨౧

తా. బృందావనంబుతరువులనీడలను గోసమూహములయందును వే
దాంతవీధులయందు నేబ్రహ్మంబుగానంబడుచున్నదియో, యట్టిప్రసిద్ధంబై వే
ణునాదానందంబందునాసక్తంబై నెమలిపురిశిరోభూషణంబుగధరియించి తా
మర రేకులవంటికన్నులుగలిగి మేఘంబుఁబోలెనల్లనై వెలుంగు శ్రీకృష్ణాఖ్య
బ్రహ్మంబును స్మరించుచున్నాననుట,

మూ॥ వ్యత్యస్తపాదమవతంసితబర్హిబర్హం సాచీకృతాననని వేశితవేణురన్ధ్రం । తేజఃపరం పరమకారుణికం పురస్తాత్ప్రాణప్రయాణసమయే మమ సన్నిధత్తామ్॥ ౨౨

టీక. వ్యత్యస్తపాదం- వ్యత్యస్త-వ్యత్యస్తములైన, పాదం- చరణములు
గలయదియుఁ అవతంసితబర్హిబర్హం- అవతంసిత- శిరోభూషణముగఁ జేయఁ
బడిన, బర్హిబర్హం-నెమలిపురిగలదియు, సాచీకృతాననని వేశితవేణురన్ధ్రం-
సాచీకృత- అడ్డముగాఁ జేయఁబడిన, ఆనన- ముఖమందు, నివేశిత- ఉంచఁబడి
న, వేణు- పిల్లనగ్రోవియొక్క, రన్ధ్రం- బిలముగలయదియు, పరమకారుణికం,
అత్యంతదయాళువైనయదియు, పరం- ఉత్కృష్టమైనయదియునగు, తేజః- తేజ
ము, మమ-నాయొక్క, ప్రాణప్రయాణ సమయే ప్రాణప్రయాణమరణముయొ
క్క, సమయే- కాలమందు, పురస్తాత్-యెదుట, సన్నిధత్తాం-సమీపమగుగాక,

చ॥ మొగమొకయోరఁజేసుకొని మోవినివేణువుఁ జేర్చి తిర్యగం।
ఘ్రిగవిలసిల్లమౌళితటిఁగేకి కలాపకలాపముంచి రీ। విగఁగనుపట్టుసా
క్ష్యపదవింగను వేళ మదీయసన్నిధిన్ । నిగమనివాస తేజమువినిర్మలస
త్కరుణాధురీణమై॥ ౨౨

తా. వామదక్షిణభాగంబులదక్షిణవామ పదంబులనునిచి శిరోభూష
ణంబుగ నెమలిపురిధరియించియోరగాఁ జేయఁబడిన నెమ్మొగంబున వేణురంధ్రం
బుఁజేర్చియత్యంతదయాళువై యుత్కృష్టంబగుచు వెలుఁగు తేజంబుప్రాణా
పస్థానకాలంబుననా యెదుటందోఁచుఁగావుతయనుట,

శ్లో॥ ఘోషప్రఘోషశమనాయ మథో గుణేన మధ్యే బబంధ జననీ నవనీతచోరమ్। తద్బంధనం త్రిజగతాముదరాశ్రయాణా మాక్రోశకారణమహో నితరాం బభూవ॥ ౨౩

టీ. ఘోషప్రఘోషశమనాయ - ఘోష - గొల్లపల్లియొక్క, ప్రఘోష - ఆక్రోశముయొక్క, శమనాయ - శాంతికొఱకు, జననీ - తల్లియైన యశోద, నవనీతచోరం - వెన్నదొంగయైనకృష్ణుని, మధ్యే - నడుమునందు, మథః - కవ్వముయొక్క, గుణేన - త్రాటిచేత, బబంధ - కట్టివేసెను, తద్బంధనం - ఆబంధనము, ఉదరాశ్రయాణాం - ఉదర - శ్రీకృష్ణోదరమును, ఆశ్రయాణాం - ఆశ్రయించిన, త్రిజగతాం - ముల్లోకములకును, ఆక్రోశకారణం - ఆక్రోశ - అత్యంతఘోషమునకు, కారణం - బీజము, నితరాం - మిక్కిలియు, బభూవ - ఆయెను.

శా॥ పాలున్వెన్నయు మ్రుచ్చిలించెనని గోపాలాంగనల్గుయ్యిడన్। జాలింజెందుచుఁదల్లి మట్టుపడు పంజర్పించి యా బాలకున్। రోలం గవ్వఁపుఁద్రాటఁగట్టెనట యాక్రోశించెఁ దత్కుక్షిలోఁ। గ్రైలోక్యంబును దస్సహామహిమముగ్ధల్గాంచఁగా నేర్తురే॥ ౨౩

తా. పాలువెన్నలుమ్రుచ్చిలించెననినందవ్రజంబునందుండెడిగోపాంగనలు సెప్పుకొనుమాఁలాలించి యాదొంగతనంబుడు పందలంచి యశోద నవనీతచోరుండగు కృష్ణునిఁగవ్వపుత్రాట నులూఖలనబునఁ గట్టినంద నుదరంబునను న్న ముల్లోకంబులునుదద్బంధనంబునగు వేదనావశంబుదనాక్రోశింపందొడంగె, తల్లియైనయాయశోదగోపికా క్రోశంబుడుపందలంచి చేయుబంధనంబెల్ల లోకంబులకు నుపద్రవకరంబయ్యెననుట. శ్లో॥ శైవావయం నఖలు తత్ర విచారణీయం పఞ్చాక్షరీజపపరా నితరాం తథాపి। చేతో మదీయమతసీకుసుమావభాసం స్మేరాననం స్మరతి గోపవధూకిశోరమ్॥ ౨౪

టీక. పఞ్చాక్షరీజపపరాః - పంచాక్షరీ - పంచాక్షరీమంత్రముయొక్క - జప - జపమందు, పరాః - ఆసక్తులమైన, వయం - మేము, శైవాః - శివసంబంధులము - తత్ర - ఆవిషయమందు, విచారణీయం నఖలు - విచారింపగూడదు గదా, తథాపి - అయినప్పటికిని, మదీయం - నాసంబంధమైన, చేతః - చిత్తము, అతసీకుసుమావభాసం - అతసీకుసుమ - నల్లఅవిసెపువ్వుయొక్క, అవభాసం - కాంతివంటికాంతి గలవాఁడును, స్మేరాననం - నగుమొదముగలవాఁడునగు, గోపవధూకిశోరం, గోపవధూ - యశోదయొక్క, కిశోరం - శిశువగుకృష్ణుని, నితరాం - మిక్కిలియు, స్మరతి - స్మరించుచున్నది.

మ॥ అనుమానింపఁగ నేమి శైవులము మే మత్యంతపంచాక్షరీ । మనుపారీణుల మాదుమైన నెపుడున్ మందస్మితభ్రాజితా । ననచంద్రుం గపిలాతసీకుసుమసమానద్యోత నిస్తంద్రుఁ గృ । ష్ణునిఁ గోపాలకబాలు నెంచ నెతలంచుం జిత్తమాసక్తితోన్ ॥ ... ... ౨౪

తా. పంచాక్షరీ మంత్రంబు జపియించు మేము శివసంబంధముగల వారలమనుటయుం దనుమానంబు లేదైనను నల్లవిసెపూవు కాంతివంటి కాంతిగల నెమ్మేను గలిగి నగుమొగంబునం దేజరిల్లు యశోదాసుతుండైన కృష్ణుని నామనంబు గోరుచుండుననుట.

శ్లో। రాధాపునాతు జగదచ్యుతదత్తచిత్తామంథానమాకలయతీదధిరిక్తపాత్రే । తస్యాస్తనస్తబకచఞ్చలలోల దృష్టిర్దేవోపి దోహనధియావృషభం నిరున్ధన్ ॥ ౨౫

టీక. అచ్యుతదత్తచిత్తా- అచ్యుత - శ్రీకృష్ణునియందు, దత్త-ఉంచఁబడిన, చిత్తా మనస్సుగలదియై - దధిరిక్తపాత్రే-దధి- పెరుగుచేత, రిక్త-శూన్యమైన, పాత్రే-ఘటమందు, మంథానం, కవ్వమును, ఆకలయతీ, త్రిప్పుచున్న- రాధా- రాధయనుగోపిక- జగత్- భువనమును, పునాతు- పవిత్రముగాఁ జేయుఁగాక, తస్యాః - ఆరాధయొక్క, స్తనస్తబకచంచలలోలదృష్టిః - స్తనస్తబక- పూవుగుత్తులవంటిపాలిండ్లయందు, చంచల- సారెసారెకుఁ బ్రవర్తించుచున్నదియు, లోల - ఆసతోఁగూడుకొన్నదియునగు, దృష్టిః - చూపుగలవాఁడై, దోహనధియా - దోహనబుద్ధిచేత, వృషభం - వృషభమును- నిరుంధన్- కట్టుచున్న, దేవోపి- శ్రీకృష్ణుఁడును, జగత్-లోకమును, పునాతు-పవిత్రముగాఁ జేయుఁగాక.

చ॥ భ్రమసిహరిందలంచి దధిభాండముపండవసించురిక్తభాం । డనుమధియించురాధయనుమనంబునఁ దత్కుచకుంభికుంభవి । భ్రమముఁదలంచియొక్కవృషభంబునుదోహనబుద్ధిఁగట్టున । క్కమలదళాక్షుఁడుం గరుణఁగాతురు గాతజగద్వితానమున్ ॥ ౨౫

తా. శ్రీకృష్ణమూర్తి యందు మనంబిడిన యగుటచే దధి భాండము పొంతనుండిన పెరుగు లేని కుండయందుఁ గవ్వంబునిడి తరువంగమకించు రాధయు నా రాధ కుచకుంభంబుల మాటిమాటికిం జంచలించు మనంబుగలవాఁడగుటంజేసి భ్రాంతిచే వృషభంబిదుకనమకట్టు శ్రీకృష్ణుండును లోకంబుఁ బవిత్రంబుగాఁ జేయుదురుగాక యనుట.

మూ॥ గోధూళిధూసరిత కోమలకుంతలాగ్రం గోవర్ధనోద్ధరణ
కేళికృతప్రయాసమ్ । గోపీజనస్యకుచకుంకుమ ముద్రితాంగం గోవి
న్దమిందువదనం శరణంభజామః॥ ౨౬

టీక. గోధూళిధూసరిత కోమలకుంతలాగ్రమ్- గోధూళి-గోసమ్మర్దన ములనఁబుట్టిన రేణువులచేత, ధూసరిత -ధూసరవర్ణముగలదిగాఁజేయఁబడిన, కోమల- మృదువులైన- కుంతలాగ్రమ్ - కేశాగ్రములుగలవాఁడును, గోవర్ధనోద్ధరణ కేళికృతప్రియాసమ్- గోవర్ధన, గోవర్ధనపర్వతముయొక్క, ఉద్ధరణ - ఎత్తుటయనియెడి, కేళి-విహారమందు, కృత- చేయఁబడిన, ప్రియాసం-ప్రయాసముగలవాఁడును, గోపీజనస్య- గోపికాసమూహముయొక్క, కుచకుంకుమముద్రితాంగమ్ - కుచ - స్తనములయందలి, కుంకుమ , అంగరాగవిశేషముచేత, ముద్రిత - చిహ్నితములయిన, అంగమ్. వక్షముమొదలగు నవయవములుగలవాఁడును, ఇందువదనమ్ - ఇందు- చంద్రునివంటి, వదనం-ముఖముగలవాఁడును, శరణం-రక్షకుఁడనైన, గోవిందమ్- శ్రీకృష్ణమూర్తిని, భజామః- సేవించుచున్నాము.

ఉ॥ గోపదధూళి ధూసరితకోమలకుంతలు గోపికాకుచస్థాపిత
కుంకుమాంకితవిశాలభుజాంతరుఁబాణిపంకజా। రోపితభూమిభృద్వ
రనిరూఢసుఖాస్పదనందగోకులున్ । గోపకుమారునిందువదనున్మదను
గ్రహవాంఛఁగొల్చెదన్॥ ౨౬

తా. గోపదసమ్మర్దంబునం బొడమిన పరాగంబుచే ధూసరంబగు కేశాగ్రంబులుగలిగి గోవర్ధనోద్ధరణంబును విహారంబుచేఁ జేయఁబడిన శ్రమంబు గలిగి గోపికాకుచకుంకుమంబున లాంఛితంబగు నురంబుచేఁ జెజల్లుచుఁ జందురుంబోలు నెమ్మొగంబున నమరి నాకు రక్షకుండై తనరుగోవిందుని సేవించుచున్నాననుట.

మూ ॥ యద్రోమరంధ్రపరిపూర్తివిధావదక్షా వారాహజన్మనిబ
భూవురమీసముద్రాః । తంనామనాథమరవిందదృశంయశోదాపాణి
ద్వయాన్తరజలైస్స్నపయాంబభూవ। ౨౭

టీక. వారాహజన్మని-వరాహావతారమందు , అమీసముద్రాః- ఈసముద్రములు, యద్రోమరంధ్రపరిపూర్తివిధౌ - యత్- ఏశ్రీకృష్ణమూర్తియొక్క, రోమ-వెండ్రుకలయొక్క, రన్ధ్ర-బిలముయొక్క, పరిపూర్తి- పూర్ణముయొక్క, విధౌ- చేయుటయందు, అదక్షాః-అసమర్థములు, బభూవుః -అయి

నవియో. తం- ఆ- అరవిందదృశం- పుండరీ గాక్షుఁడైన, నాథం-శ్రీకృష్ణమూ ర్తి ని, యశోదా- నందునిభార్య, పాణిద్వయాంతరజలైః- పాణిద్వయ - దోయిలియొక్క, అంతర- మధ్యమందలి, జలైః - ఉదకములచేత, స్నపయాంబభూవనామ - స్నానముఁ జేయించెఁగదా. ... ... *

ఉ॥ ఏయధికుండు క్రోడతవహించిన నాతని రోమరంధ్రము। న్దోయధులెల్లనించుహవణుల్గన నేరకయుండెనట్టినా । రాయణుఁడర్భకా కృతినిరాగిలినందవ ఘూటిదోయిటన్ । దోయముఁజల్లఁగాఁదనిసితోఁ గుచునుండెని దేమిచిత్రమో॥ ౨౭

తా. వరాహజన్మంబున నీసముద్రంబులే శ్రీకృష్ణుని రోమరంధ్రంబుఁ బూరింప సమర్థంబులుగాక పోయినవియో యట్టి ప్రసిద్ధుండును బుండరీకాక్షుండునగు కృష్ణమూ ర్తిని యశోదాదేవి దోయిలిలోని నీటిచే స్నానముచేయించె నివియెట్టివిచిత్రంబోయనుట.

శ్లో ॥ వరమిమముపదేశమాదియధ్వం నిగమవనేషునితాంతచారఖిన్నాః । విచినుతభవనేషు వల్లవీనాముపనిషదర్థములూఖలేనిబద్ధమ్॥

టీక. నిగమవనేషు-నిగమ- వేదములనియెడి - వనేషు-వనములయందు- నితాన్తచారఖిన్నాః-నితాన్త- మిక్కిలియు, చార-పరిశీలనముచేత, ఖిన్నాః, బడలిన, హేసుకృతినః - ఒవిద్వాంసులారా, వరం - ఉత్కృష్టమైన, ఇమముపదేశం- ఈయుపదేశమును, ఆదియధ్వం- ఆదరింపుఁడు, వల్లవీనామ్- గోపస్త్రీలయొక్క, భవనేషు- గృహములయందు- ఉలూఖలే - రోటియందు, నిబద్ధం- కట్టఁబడిన, ఉపనిషదర్థం - ఉపనిషత్ - వేదాంతములయొక్క, అర్థం- లక్ష్యమయినకృష్ణుని, విచినుత - వెదకుండు-

చ॥ నిగమమహావనాంతములనే వెదకన్వలెనంచుఖిన్నులై । వగవగనేల నేయొకయుపాయముఁజెప్పెదఁ బోయిచూడుఁడీ । యగణిత వల్లవీమణిగృహాంగణభూమి నులూఖలంబుతో । డగుణనిబద్ధమైశ్రుతులడాగినభావము గానవచ్చుచున్ ॥ ౨౮

తా. వేదంబులను నరణ్యంబులం గ్రుమ్మరంబొడమిన దప్పిచేనొగిలిన యోవిద్వాంసులారా నాపలుకొక్కండువినుండు - ఉపనిషదర్థంబు గోపికాగృహంబుల ముంగిళులయందు నవనీత చౌర్యాదికంబుననయిన యులూఖలబంధనంబు గల్గియున్నదిగాన వారల గృహంబుల వెదకుండనుట.

మూ॥ దేవకీతనయపూజనపూతః పూతనారిచరణోదకధౌతః।య
ద్యహంస్స్మృతధనంజయసూతః కింకరిష్యతి సమేయమదూతః॥ ౨౯

టీక. అహం-నేను, దేవకీతనయపూజనపూతః - దేవకీతనయ-శ్రీకృష్ణమూర్తియొక్క, పూజన-పూజచేత, పూతః- పవిత్రుఁడను, పూతనారిచరణోదకధౌతః-పూతనారి,శ్రీకృష్ణమూర్తియొక్క,చరణోదక-పాదోదకముచేత, ధౌతః - పరిశుద్ధుఁడను, స్మృతధనంజయసూతః- స్మృత,స్మరియింపఁబడిన, ధనంజయ- అర్జునునియొక్క, సూతః - సారథియైనశ్రీకృష్ణస్వామిగలవాఁడను, యది -అయినట్లులయ్యెనేని, మే-నాకు, సః-ఆప్రసిద్ధుఁడైన, యమదూతః,యమభటుఁడు, కింకరిష్యతి- యేమిచేయఁగలఁడు-

మ॥ సకలప్రార్థితదేవకీతనయపూజాపూతునింబూతనాం।త
కపాదాంబుజవారిధౌతుని మనోనాళీకహేళీభవ। త్ప్రకటాటోపకిరీటిసూతునివచోరాజీవరాజన్ముకుం। దకథాస్వీతునిసన్నునాశమనదూతల్సేరఁగాఁజూతురే॥ ౨౯

తా- దేవకీతనూజపూజనంబుచేఁ బవిత్రుండనై పూతనాంతకుండగు శ్రీకృష్ణుని పాదోదకంబునం బరిశుద్ధుండనై యెల్లప్పుడును పార్థసారథియైన కృష్ణుని స్మరించుచుండునను యమభటుఁడేమి చేయఁగలండనుట.

శ్లో॥ భాసతాంభవభయైకభేషజంమానసేమమముహుర్ముహుర్ముహుః
గోపవేషముపసేదుషస్స్వయం యాపికాపిరమణీయతావిభోః॥

టీక. భవభయైకభేషజం-భవభయ- సంసారభయమునకు, ఏక-ముఖ్యమయిన, భేషజం-ఔషధమయిన, గోపవేషం- గోపాలవేషమును,స్వయం తాను, ఉపసేదుషః- పొందిన, విభోః-శ్రీకృష్ణమూర్తియొక్క,యాపికాపిఅనిర్వాచ్యమయిన, రమణీయతా- సౌందర్యము, మమ-నాయొక్క, మానసే మనంబునందు- ముహుర్ముహుర్ముహుః మాటిమాటికిని, భాసతాం-ప్రకాశించుఁగాక.

చ॥ భవభయభేషజంబు శ్రుతిభావ్యమునైతగు గోపవేషము। త్స
వమునఁబూనినట్టిహరి సర్వమనోహరదివ్యరూపమై । భవమునమదీయ
భావమున భాసిలుఁగాతనిరంతరంబుమా। ఘనసుమణీతృణీకరణకౌశల
పేశలతేజమొప్పఁగన్ ౩౦

తా. సంసారభయంబనురోగంబునకుముఖ్యౌషధంబగుగోపవేషంబు

దన్నంతటనంగీకరించిన శ్రీకృష్ణమూర్తియొక్క యనిర్వాచ్యమైన సౌందర్యం నామసంబునం బ్రకాశించుంగాకయనుట.

శ్లో॥ కర్ణావలమ్బితకదమ్బ మంజరీ కేసరారుణకపోలమణ్డలమ్। నిర్మలంనిగమవాగగోచరం నీలిమానమవలోకయామహే॥ ౩౧

టీక. కర్ణావలమ్బిత కదమ్బమంజరీ కేసరారుణ కపోలమణ్డలమ్- కర్ణ- శ్రోత్రములందుంచు, లమ్బిత- వ్రేలుచున్న, కదమ్బమంజరీ- కడిమిపూగుత్తుల యొక్క, కేసర- కింజల్కములచేత, అరుణ-యెఱ్ఱనైన, కపోల- గండస్థలము లయొక్క, మండలమ్ - ప్రదేశములు గలవాడును, నిర్మలం - పరిశుద్ధుండైన వాడును. నిగమవాగగోచరమ్ - నిగమవాక్ - వేదాంతవాక్యములకు, అగో చరమ్- విషయుండుగాని వాండునునగు, నీలిమానం - నీలవర్ణుండగుకృష్ణుని, అ వలోకయామహే - చూచుచున్నాము॥ ఈ శ్లోకార్థంబు గోపాలమంత్రరాజము యొక్క మోక్షోపయోగ ప్రయోగంబందలి ధ్యానంబని గోపాల కల్పంబునం జెప్పంబడియున్నది॥ శ్లో॥ నీలోత్పలదళశ్యామం పీతవాససమావృ తమ్। శుద్ధస్ఫటిక సకాశ మహాపురుషోత్తమమ్। ధ్యాత్వాన్వహం జపేన్మం త్రం మోక్షార్థీత్రిసహస్రకమ్॥

మ॥ చెవులం వ్రేలు కదంబమంజరులచేఁ జెన్నారి కేసరాలి జ్వాల। స్నపసంఘ్యారుణితాభ్రకాంతిఁ జెలువందన్గండహాసప్రభా। లనము ల్వెన్నెలకల్వఁజూప మృదులాలంకారుఁడై వేదనం। స్తవనాగోచ రుఁడైన శౌరియను తబ్బాఁ యన్నివాలోకింతు నే॥ ౩౧

తా. చెవులన్వ్రేలుకడిమి పూవగుత్తుల కాంతిచేఁ గెంపగు చెక్కి ళులుగలిగి పరిశుద్ధుండై వేదాంతాగోచరుండై వెలయు శ్రీకృష్ణమూర్తిం జూ చుచున్నాననుట.

శ్లో॥ సాచిసఞ్చలితలోచనోత్పలం సామికుడ్మలితకోమలాధరమ్। వేగవల్గితకరాఙ్గుళీముఖం వేణునాదరసికం భజామహే॥ ౩౨

టీక. సాచిసఞ్చలితలోచనోత్పలం- సాచి- అడ్డముగను, సఞ్చలిత- చ లింపఁజేయఁబడిన, లోచనోత్పలం - కలువలవంటికన్నులుగలవాఁడును, సా మికుడ్మలితకోమలాధరం- సామి-సగము, కుడ్మలిత- మోడ్పఁబడిన, కోమల- మృదువగు, అధరం- మోవిగలవాఁడును, వేగవల్గితకరాఙ్గుళీముఖం -- వేగ - త్వరయగునట్లుగ, వల్గిత - సారెకునెత్తఁబడిన, కర - హస్తములయొక్క, అ ఙ్గుళీముఖం- అంగుళాగ్రములు గలవాఁడునునగు, వేణునాదరసికం - వేణునా

కోపి- ఒకానొకఁడైన, ధూర్తః-దుర్జనుఁడు, నితమ్బబిమ్బే- కటిప్రదేశ విశేష మందు, విన్యస్తహస్తోపి-విన్యస్త- ఉంచఁబడిన,హస్తోపి - హస్తముగలవాఁడైనను, చిత్తవిత్తం - చిత్త - మనమనియెడి, విత్తం - ధనమును, సమాకర్షతి లెస్సగాగ్రహించుచున్నాఁడు,

చ ॥ పథికులుపోఁకుఁడచ్చటికిఁబల్మఱుఁభీమరథీపథంబునిం । బృథులతమాలమేచకశరీరుఁడొకండు దిగంబరాకృతిం । బ్రథితకటీతటీఘటితపాణితలుండయిప్రోన్నిషన్నునో । రథుఁడయిచిత్తవిత్తమునిరంతర ముఁగహరియించుఘూర్తుఁడై। ౩౪

తా॰ ఓపథికులారా భీమరథీనదీమార్గంబున రాకుండుండేమనిన దిగంబరుండును దమాలనీలుండునునగు పురుషుండు నితంబప్రదేశంబున గరంబులునిచికొనియుండియును ధూర్తుండై చిత్తవిత్తంబునపహరించుంగాన దత్ప్రదేశంబునకు రాకుండుఁడనుట.

—※ రాసక్రీడాష్టకము. ※—

శ్లో ॥ అఙ్గనామఙ్గనామన్తరేమాధవో మాధవంమాధవంచాన్తరే ణాఙ్గనా। ఇత్థమాకల్పితేమణ్డలేమధ్యగస్సంజగౌ వేణునా దేవకీనన్దనః॥

టీ. అఙ్గనామఙ్గనామ్ - అంగనలయొక్క, అన్తరే - మధ్యమందు, మాధవః- శ్రీకృష్ణమూర్తియును, మాధవంమాధవమ్- పుండరీకాక్షు-పుండరీకాక్షులయొక్క, అన్తరేణ - మధ్యమున, అఙ్గనాచ - స్త్రీయును, ఇత్థం - ఈప్రకారముగా, ఆకల్పితే- కల్పింపఁబడిన- మణ్డలే- సమూహమందు, దేవకీనన్దనః - శ్రీకృష్ణమూర్తి, మధ్యగః - మధ్యధ్వనినిబొందినవాఁడగుచు, వేణునా- పిల్లనగ్రోవిచేత, సంజగౌ- లెస్సగా గానముఁజేసెను.

గ్రంథకర్త యీపద్యముమొదలెనిమిదిపద్యములవఱకు శ్రీకృష్ణుని రాసక్రీడలను వర్ణించి చెప్పుచున్నాఁడు,

చ॥ఇరుదెసఁదానునిల్చితనకెంతులుపార్శ్వము లన్వసింపఁగా। గరములుగంఠపాళిఁజెలంగఁ బలభిన్మణివిభ్రమంబులన్ । సరమొనరించినట్లుసరసస్థితిమండలమధ్యవర్తియై । మురళిరవంబునంజెలఁగు మోహనమూర్తిమురారిఁగొల్చెదన్॥ ౩౫

తా॰ ఇరుదెసలందానును దనకిరుగడలనింతులునిల్వనీ తెఱంగునఁగల్పింపఁబడిన మండలంబునం గృష్ణుండు మధ్యమనియెడి ధ్వనివిశేషము నాశ్రయించిపిల్లనగ్రోవిచేమిక్కిలియు గానంబుచేసెననుట.

మూ॥ కేకికేకాదృతానేకపఙ్కేరుహాలీనహంసావళీహృద్యతాహృద్యతా। కంసవంశాటవీదాహదావానలస్సంజగౌ వేణునా దేవకీనన్దనః॥ ౩౬

టీ. కేకికేకాదృతానేకపఙ్కేరుహాలీనహంసావళీహృద్యతాహృద్యతా- కేకి- నెమళులయొక్క, కేకా - ధ్వనివిశేషములయొక్క, ఆదృత- ఆదరించుటచేత, అనేక- అనేకములైన, పఙ్కేరుహా - కమలములనుండి, ఆలీన- లేచుచున్న, హంస- అంచలయొక్క, ఆవళి- పఙ్క్తులకు, హృద్యతా-సంతోషమును, ఆహృద్యతా- సంపాదించుచున్న, వేణునా-పిల్లనగ్రోవిచేత, కంసవంశాటవీదాహదావానలః - కంసవంశ - కంసకులమనియెడి, అటవీ-అడవియొక్క, దాహ-కాల్చుటయందు, దావానలః-వనవహ్నియైన, దేవకీనన్దనః- శ్రీకృష్ణమూర్తి, సంజగౌ-లెస్సగాగానముచేసెను.

మ॥ తనుకాంతుల్ జలదంబటంచుశిఖిసంతానంబుఁగేకాస్వనం।
బునుమీఁ అన్ని వినియంచ పిండు లలితాంభోజాళిలోనుండిచ। య్యనలేపక్
భ్రమమాన్చి సంతసము చేయంజాలువంశీమృదు। స్వనముంగాంచిన
కంసవంశదహనజ్వాలిక్ హరింగొల్చెదన్॥ ౩౬

తా. నెమ్మేనిచాయందిలకించిమొగులనుచుం జెలంగు నెమళుల కేకారావంబుల వినిన యంతనవానతఁజీదోరకొనియెనను తలంపునఁ దామరపిండున నుండి లేవనుంకించునరిచలకేదిమేఘంగాదు కృష్ణుండని తెలియంజేసి సంతసంబు నాపాదించు పిల్లనఁగ్రోవిచేఁ గంసునికులంబను నడవికిఁ గార్చిచ్చగు శ్రీకృష్ణమూర్తి గానంబుచేసెననుట.

మూ॥ క్వాపివీణాభిరారావిణా కమ్పితః క్వాపివీణాభిరాకిఙ్కిణీనర్తితః। క్వాపివీణాభిరామాన్తరంగాపితస్సంజగౌ వేణునా దేవకీనన్దనః॥

టీ. దేవకీనన్దనః- శ్రీకృష్ణమూర్తి, క్వాపి- ఒకచోటను, వీణాభిః- వీణలచేత, ఆరావిణా - గానవంతుఁడైన వానిచే, కమ్పితః - నాట్యమునొందింప బడినవాఁడగుచు, వేణునా - పిల్లనగ్రోవిచే, సంజగౌ- గానముచేసెను, క్వాపి-ఒకచోట, వీణాభిరాకిఙ్కిణీనర్తితః - వీణాభిరా - వీణానుగుణధ్వనిఁ జేయుచున్న, కిఙ్కిణీ-చిఱుగంటలతోడ, నర్తితః- నర్తనముఁబొందింపఁబడినవాఁడగుచు, సంజగౌ- గానముచేసెను, క్వాపి-ఒకచోట, వీణాభిరామాన్తరమ్ వీణా - వీణయొక్క, అభిరామ - మనోహరములైన, అన్తరమ్-గానవిశేషములుగలుగునట్టులుగా, గాపితః- గానముబొందింపఁబడిన వాఁడగుచు, సంజగౌ- గానముచేసెను-

తా. పుటపాకశోభితంబగు సువర్ణనిభంబగు శరీరకాంతిచేఁ దేజరిల్లుచుందిరకు విభుండును వైజయంతి యనియెడి వనమాలికచేఁ బరిమళించు నెద గలుగు వాఁడునగు శ్రీకృష్ణమూర్తి బృందావన నివాసినులగు గోపికల మధ్యంబునం జేరి వేణువుచే గానంబుచేసెననుట. ... *

శ్లో॥ బాళికాతాళికాతాళలీలాలయాసంగసందర్శిత భ్రూలతావిభ్రమః। గోపికాగీతదత్తావధానస్స్వయం సంజగౌ వేణునా దేవకీనన్దనః॥

టీక. బాలికాతాళికాతాళలీలాలయాసంగసందర్శిత భ్రూలతావిభ్రమః- బాలికా- గోపాలబాలికలనియెడి, తాళికా- తాళకర్త్రియలయొక్క, తాళలీలా- తాళక్రియయొక్క, లయ- న్యూనాధికరాహిత్యముయొక్క, అసంగ- ఉద్యోగముచు, సందర్శిత-చూపఁబడిన, భ్రూలతా-తీఁగెవంటికనుబొమలయొక్క, విభ్రమః-విలాసములుగల, దేవకీనందనః- శ్రీకృష్ణమూర్తి, స్వయం-తాను, గోపికాగీత దత్తావధానః - గోపికా - గోపికలయొక్క, గీత - గానమందు, దత్త- ఉంచఁబడిన, అవధానః- తత్పరత్వముగలవాఁడగుచు, వేణునా- వేణువుచేత, సంజగౌ - గానముచేసెను. ... ... *

ఉ॥ తాళములుగ్గడించువనితాకరతాళలయానుభావిత। భ్రూ
లతసొంపువల్లవసరోజముఖీమృదుగానవైఖరిన్ ।దాలిమునెచ్చరించు
నవధానముమీఱఁగ వేణుపాణియై ।లాలితగానవైభవకళానిపుణుండ
గుశౌరిఁగొల్చెదన్ ॥ ... ... ౪౧

తా. తాళంబుల నుగ్గడించు గోపబాలికా కరతాళంబులం గనుబొమలీలచే మెచ్చుచు గోపికల సంగీతంబులఁ దత్పరంబగు మనంబు గలిగి గోపాలదేవుండు వేణువుచేఁ గానంబు జేసెననుట. ... ... *

మూ॥ పారిజాతంసముద్ధృత్య రాధావయోరూపయామాసభా
సాగుణైరంగణే ।శీతశీతేవటేయామునీయే తటే సంజగౌ వేణునా దేవకీ
నందనః॥ ... ... ... ౪౨

టీక. దేవకీనన్దనః - శ్రీకృష్ణమూర్తి, రాధావయోరూపయా- లక్ష్మీదేవియవయవసౌష్ఠవమువంటి యవయవసౌష్ఠవముగలిగినయట్టిన్ని, గుణైః- సౌందర్యాదిగుణములచేత, మాసభాసా- మా- లక్ష్మీదేవికి, సభాసా-సమానురాలయినయొకానొకయువతిచేత, అంగణే- ముంగిలియందు, పారిజాతమ్-పారిజాతతరువును, సముద్ధృత్య- స్థాపించి, యామునీయే- యమునా సంబంధమైన, తటే - గట్టునందు, శీతశీతే - శీతసదృశమైన, వటే - భాండీరమనియె

డి పేరుగలన్యగ్రోధవృక్షమందు, వేణునా - వేణువుచేత, సుజగౌ - గానముచేసెను.

మ॥ రమతోడన్ సమమైనకాంతిగుణముల్ రాధాపయోరూప
విభ్రమముల్ గల్గినభామముంగిటనుగల్పక్ష్మాజమున్నిల్పియ। య్యమునా
సైకతమధ్యశీతలతలన్యగ్రోధవీథిన్ ముదం। బమరన్వేణువినోదనా
దరతుండౌనబ్జాక్షునీక్షించెదన్॥ ౪౨

తా. నిరుపమాన కాంతి గుణంబులచేఁ బదాఱేడ్ల ప్రాయంబుచేఁ దేజరిల్లు నిందిరాదేవియుంబోని యొకానొక యువతిముంగిటం బారిజాతంబు నెలకొల్పి యమునాతటంబు నందుండు ఖాండీరవటతరువు నీడయందు శ్రీకృష్ణమూర్తి వేణువుచే గానంబుచేసెనట.

శ్లో॥ అగ్రేదీర్ఘతరోయమర్జునతరుస్తస్యాగ్రతో వర్త్మనీసా
ఘోషంసముపైతి తత్పరిసరే దేశేకళిందాత్మజా। తస్యాస్తీరతమాల
కాననతలేచక్రంగవాం చారయన్గోపః క్రీడతిదర్శయిష్యతిసఖేపం
థానమవ్యాహతమ్॥ ౪౩

టీక. ఈశ్లోకంబునకర్థంబులు రెండుగాన నిక్రిందవివరింపంబడుచున్నవి, హేసఖే-ఓయిసఖుండ, అగ్రే-ఎదుట, అయం-ఈకానంబడుచున్న, దీర్ఘతరః-మిక్కిలిపొడవయిన, అర్జునతరుః-కదంబవృక్షము, తస్య- ఆకదంబతరువుయొక్క, అగ్రతః- ముందరను, వర్త్మని-కాలిత్రోవ-సా-ఆకాలిత్రోవ- ఘోషం- గొల్లపల్లియను, సముపైతి - పొందుచున్నది, తత్పరిసరే-తత్-ఆవ్రేపల్లెయయొక్క, పరిసరే-సమీపదేశమందు, కళిందాత్మజా-యమునానది, తస్యాః-ఆయమునానదియొక్క, తీరతమాలకాననతలే - తీర- గట్టునందు, తమాల-నల్లకానుగుచెట్లయొక్క, కానన-వనముయొక్క, తలే-ప్రదేశమందు, గవాం- గోవులయొక్క, చక్రం- సమూహమును, చారయన్ - సంచరింపఁజేయుచు, గోపః- గోపాలుఁడు, క్రీడతి - విహరించుచున్నాఁడు, సః-ఆగోపాలుఁడు, అవ్యాహతమ్- అక్షతమైన, పంథానమ్-మార్గమును, త్వామ్-నినుఁగూర్చి, దర్శయిష్యతి - చూపించుచున్నాఁడు ( రెండవయర్థంబు ) హేసఖే - ఓయిమిత్రుఁడా, అగ్రే - రథాగ్రమందు, దీర్ఘతరః - మహానుభావుఁడైనవాఁడును, అయం - ఈప్రసిద్ధుఁడయిన, అర్జునతరుః- తరువువంటియర్జునుఁడు - తస్య - ఆయర్జునునియొక్క, అగ్రతః-ముందర, వర్త్మని- ఉపదేశమార్గమును, సా-ఆ

మార్గము, ఘోషం - ఉపనిషత్తుయు, సముష్ణైతి, పొందుచున్నది, తత్పరిసరే- తతి - ఆయుపనిషత్తుయొక్క, పరిసరే - సమీపమందు, కళిందాత్మజా - యమునానది, తస్యాః - ఆనదియొక్క, తీరతమాల కాననతలే - తీర - గట్టునందుండు, తమాల కానన - కానుగ యడవి యొక్క, తలే - ప్రదేశమందు, గవామ్ - ఉపనిషద్వాక్యములయొక్క, చక్రం - సమూహమును, చారయన్- అధ్యయనముచేయించుచు, గోపః-శ్రీకృష్ణమూర్తిః, క్రీడతి- విహరించుచున్నాడు, సః-ఆకృష్ణుండు, త్వామ్-నిన్నుఁగూర్చి, అవ్యాహతం-అకుంఠితమైన, పంథానమ్, మార్గమును, దర్శయిష్యతి-చూపించుచున్నాఁడు॥ ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణసార్వకృత్యైకాక్షరీమంత్రధ్యానమని సనత్కుమారసంహితయందుఁజెప్పంబడియున్నది॥శ్లో॥పార్థే శస్త్రాంగీతార్థం ధ్యాయన్ముద్రాలసత్కరమ్। రత్నస్తంభావయుక్ జప్త్వాదశలక్షమిమంమనుం । నోచిరాల్లభతే జ్ఞానం పరమైశ్వర్య దాయకమ్॥

మ॥ అదిగో ముంగల పెద్దవద్దియటఁ బోనా చెంత వ్రేపల్లియు । న్న
దియాదండఁ గళింవజాతటమునందాపించ భూజాళినా । కదుపుస్సేపు
చుగోపబాలకుఁడునికరంబొప్పఁగాఁజెల్వుస । త్పదవింబొమ్మనుఖాసు
ఖాస్పదముగాభావంబురంజిల్లెడున్॥ ౪౩

తా, ఓయిమిత్రుఁడా వినుము ముందరనొకయత్యున్నతంబగుసర్జనతరువుగలదు దానికిముందొక కాళిందాంకయున్నది యాత్రోవ వ్రేపల్లియంగూర్చిపొందుచున్నది యప్పల్లియపొంతయును నానదీతీరంబునం బొడవగు కానుగయడవిలోపల నావులగుంపుల మేపుచునొక గోపాలుండున్నాఁడతండవ్యాహతంబగుమార్గంబుఁజూపుననుట॥ ఈయర్థంబుగాక మఱియొక తాత్పర్యపయోఘూతంబగునర్థంబుగల దదియెట్లనిన నొకండు సంసారారణ్యంబునఁబడి పుణ్యపాపంబులచే సంపాదింపఁబడినమార్గవిశేషంబులచేఁబోయిపోయి పరిభ్రమించుచు వెండియు సంసారగహనంబునఁబ్రవేశించి యతిదుఃఖంబగుజీవితంబుఁగూర్చి బెగడునొకనికిం జెప్పనలవిగాని సన్మార్గంబు నుపదేశించువానిం జూపుచున్నాఁడు॥ ఓయిమిత్రుఁడా ముందర రథాగ్రంబునం బ్రసిద్ధుండైమహాన్నతుండైబంధులం జంపఁబోవుకతంబునం బొడమినదుఃఖంబుఁ దరువుఁబోలె జడుండైన యర్జునుండున్నాఁడతనిముందట నుపదేశమార్గంబున్నది యయ్యుపదేశమార్గంబు శబ్దప్రధానంబగు నుపనిషత్తుం బొందుచున్నది యప్పట్టున యమునాతీరంబునం బుట్టిన తమాలకాంతారంబుఁబోసి కాంతిపుంజంబుఁ దన స్తలం

బునుపనిషద్వాక్యంబులం జెప్పుచు శ్రీకృష్ణదేవుండు విహరించుచున్నాఁడను తద్వ్యాహతంబగు మార్గంబుం జూపించుననుట.

మూ॥ గోధూళిధూసరితకోమలగోపవేషం గోపాలబాలకశతై
రనుగమ్యమానమ్ । సాయన్తనే ప్రతిగృహం పశుబన్ధనార్థం గచ్ఛన్తమ
చ్యుతశిశుం ప్రణతోఽస్మి నిత్యమ్॥ ౪౪

టీక, గోధూళిధూసరితకోమలగోపవేషమ్- గోధూళి-గోసమ్మర్దము వలనఁ బుట్టినపరాగముచే, ధూసరిత - ధూసరవర్ణము గలదిగాఁ జేయఁబడిన, కోమల- మృదువైన, గోపవేషమ్-గోపాలవేషము గలవాఁడును, గోపాలబాలకశతైః- అనేకులగు గోపాలబాలురచే, అనుగమ్యమానమ్-అనుసరింపఁబడుచున్నవాఁడును, సాయన్తనే- సాయంకాలమందు, పశుబన్ధనార్థమ్-పశు- ఆవులయొక్క, బన్ధనార్థమ్ - కట్టివేయుటకొఱకు, ప్రతిగృహం-గృహగృహముంగూర్చి, గచ్ఛన్తం-పోవుచున్న, అచ్యుతశిశుం- అచ్యుత- నారాయణుఁడనియెడి, శిశుం-బాలునిఁ గూర్చి, ప్రణతః-నమ్రుఁడను, అస్మి- అయితిని.

ఉ॥ గోపదధూళిధూసరితకోమలవేషముతోడ సంజెలం । గోప
కశాబకాళి తనకుం గయిలోడఁగ నింటనింటనుం । గ్రేపులఁ గట్టఁగాఁ దిరు
గుకృష్ణుని జాము కరాభిశోభితుఁ । గోపకుమారు నందువదను న్మదనుం గ
నినయ్యఁ గొల్చెదన్॥ ౪౪

తా. గోవులసమ్మర్దంబునం బొడమినధూళిచే ధూసరవర్ణంబగు గోపాలవేషంబుగలిగి గోపాలబాలకసమూహంబులు వెంటనంటిరా గ్రేపల్లియం బ్రతిగృహంబునకుం దిరుగు గోపాలకృష్ణునిం గూర్చి ప్రణతుండనైతిననుట.

మూ॥ నిధిం లావణ్యానాం నిఖిలజగదాశ్చర్యనిలయం నిజావాసం
భాసాం నిరవధికనిశ్శ్రేయసరసం । సుధాధారాసారం సుకృతపరిపాకం
మృగదృశాం ప్రపద్యే మాంగల్యం ప్రథమమధిదైవం కృతధియామ్॥

టీక. లావణ్యానాం- కాంతివిశేషములకు, నిధిం- ఆకరమైనవాఁడును, నిఖిలజగదాశ్చర్యనిలయం- నిఖిల-సమస్తమైన, జగత్-లోకములయొక్క, ఆశ్చర్య- అచ్చెరువులకు. నిలయం- ఇల్లయినవాఁడును, భాసాం- కాంతులకు, నిజావాసం- నిజ- స్వకీయమైన, ఆవాసం-గృహమైనవాఁడును, సుధాధారాసారం-సుధా-అమృతముయొక్క, ధారాసారం- జడివానయైనవాఁడును, మృగదృశాం- యువతులకు, సుకృతపరిపాకం-సుకృత- అదృష్టముయొక్క, పరిపాకం- ఫలస్వరూపమైనవాఁడును, కృతధియాం - విద్వాంసులయొక్క - మాఙ్గల్యం,

శుభమైనవాఁడును అధిదైవం, దైవమైనవాఁడును, నిరవధికనిశ్రేయసరసం- ఆనందరసస్వరూపుఁడైనవాఁడును, ప్రథమం, జగత్కారణుండునైనకృష్ణుని, ప్రపద్యే- సేవించుచున్నాను.

ఉ॥ చక్కదనంబుపోఁ్రవు రుచిసంతతిఁబోల్చిన తావులోకము । వ్యాకనినుండుదంటవిక చాంబుజనేత్రిలనోముపంటపెం । పెక్కు- షును క్తిధామము మునీశులకాదిమధామమార్యస । వ్యాకృతసా ధవర్షమజహర్షము నైన మురారిఁగొల్చెదన్॥ ౮౫

తా, కాంతివిశేషంబులకు నాకరంబై యెల్లలోకంబుల యశ్చర్యవు లకునిల్లయినవాఁడును గాంతులకుఁబుట్టినిల్లయి నిరవధికానంద రసస్వరూపం బైయమృతంబుజడినైు యెల్లయువతులయదృష్టఫలస్వరూపంబై జ్ఞానవంతుల కధిష్ఠానదైవతంబై సర్వశుభంబులనిక్షేపంబై యాద్యంబగుచు వెలయు శ్రీకృష్ణపరబ్రహ్మంబు సేవించుచున్నాననుట.

మా॥ ఆతామ్రపాణికమల ప్రిణయప్రతోద మాలోలహారమణి కుండలహేమసూత్రమ్ । ఆవిశ్శ్రిమామ్బుకణ మమ్బుదనీలమవ్యాదా ద్యంధనంజయరథాభరణం మహోనః॥

టీ. ఆతామ్రపాణికమల ప్రణయప్రతోదమ్- ఆతామ్ర - అంతటనెఱ్ఱనైన, పాణికమల - హస్తకమలంబున, ప్రిణయ- ప్రేమగలిగిన, ప్రతోదం- కళావిశేషముగలయదియు, ఆలోలహారమణికుండల హేమసూత్రమ్- ఆలోల చలించుచున్న- హార-హారములును, మణి- మణివికారమైన, కుండల- కుండలములును, హేమసూత్రం, బంగరుమొలనూలు గలిగినయదియు, ఆవిశ్శ్రిమా మ్బుకణం-ఆవిః - ప్రకాశించుచున్న,శ్రిమామ్బుకణం శ్రమోదకబిందువుల గలవియును, అమ్బుదనీలం - అమ్బుద - మేఘమువలె, నీలం - నల్లనైనయది యు, ధనంజయరథాభరణం - ధనంజయ-అర్జునునియొక్క, రథ- రథమునకు ఆభరణం- భూషణమైన, మహః, తేజము, నః - మమ్ము, అవ్యాత్ - రక్షించుఁగావుత.

ఉ॥ కెంజిగురాకుకేలఁ దులకించుప్రతోదముచేతనాజిధా నంజ యవాజిరాజిగనుకప్రియ యేర్పడుపన్నాగంబునం। గ్రాంజెమటూటి హారమణికుండలముల్ చలియింపనొప్పున । య్యంబుదనీలతేజమురథా భరణంబనయంబుఁబ్రోవుతన్॥

తా. కెంజిగురుంబోలికరంబునఁ బ్రతోదంబువెఱయుహారంబులుకుం

డలంబులు మొలసూలునుం జలియంప నెమ్మొగంబునం గ్రొంజెమ్మటలూఱ నీలమేఘంబుఁబోలెఁ ననుజయుని యురదంబున వెలుంగు తేజంబు ననుఁబ్రోచుఁ గావుత యనుట.

మూ॥ నఖనియమితకండూన్పాణ్డవస్యన్దనాశ్వాననుదినమభిషిఞ్చన్నం
జలిస్థైః పయోభిః। అవతువితతగాత్రి స్తోత్రనిస్యూతమౌళిర్దశనవిధృ
తరశ్మిర్దేవకీపుణ్యరాశిః॥ ౪౭

టీ. దశనవిధృతరశ్మిః- దశన- దంతములచేత, విధృత- ధరియింపఁబడిన, రశ్మిః - పగ్గములుగలవాఁడును; తోత్రనిస్యూతమౌళిః- తోత్ర-ములుకోల తోడ, నిస్యూత - కూర్పఁబడిన, మౌళిః- శిరముగలవాఁడును, నఖనియమిత కండూన్, నఖ-గోళ్ళచేత- నియమిత-నివురఁబడిన, కండూన్-దురదగల, పాండవస్యన్దనాశ్వాన్-పాణ్డవ - అర్జునునియొక్క, స్యన్దన-రథముయొక్క, అశ్వాన్-గుఱ్ఱములను, అంజలిస్థైః-దోయిటనున్న, పయోభిః- ఉదకములచేత, అనుదినం-ప్రతిదినమును, అభిషిఞ్చన్ - స్నానముచేయించుచున్నవాఁడునగు, దేవకీపుణ్యరాశిః- దేవకీ- దేవకీదేవియొక్క, పుణ్యరాశిః- పుణ్యంపుఁబ్రోవగు కృష్ణుఁడు, అవతు-రక్షించుఁగాక.

మ॥ తలతోత్రంబు ధరించి పగ్గములు దంతశ్రేణిఁ గీలించియు । గ్గలి
కన్ నిగుడించి పార్థరథకంఖాణంబులన్ దోయిటి । జ్జలముల్ జల్లి నఖాళి
మైనివురుచున్ రక్షించు నా దేవకీ। లలనాపుణ్యఫలంబు నన్నుఁ గరుణా
లంకారుఁ గాఁ జేయుతన్॥ ౪౭

తా. దంతంబులచేఁ బగ్గంబుల ధరియించి ములుకోల శిరంబునం గట్టికొని పెంపఁబడిన నెమ్మేనుకలవాఁడగుచు నర్జునుని రథంపు గుఱ్ఱంబుల మేనుల నివురుచుం దోయిట నీటిచే వానిం గడుగుచు ననుదినంబు నీక్రియంబునం జేయుచున్న దేవకీపుణ్యఫలంబగు శ్రీకృష్ణమూర్తి నను రక్షించుఁగాత.

మూ॥ వ్రజయువతిసహాయే యౌవనోల్లాసికాయే సకలశుభవిలా
సే నన్దగోపహాసే। నివసతు మమచిత్తం తత్పదాయత్తమస్మిన్స
రసిజనయనానన్దగోపాలసూనౌ॥

టీ. వ్రజయువతిసహాయే- వ్రజ-వ్రేపల్లెయందలి, యువతి - జవ్వనులకు, సహాయే-సహాయుండైనవాఁడును, యౌవనోల్లాసికాయే-యౌవన -వయస్సుచేత, ఉల్లాసి- ప్రకాశించుచున్న, కాయే-శరీరముగలవాఁడును, సక

శుభవిలాసే - సకల- సమస్తమయిన, శుభ, సుభములయొక్క, విలాసే-లీల లుగలవాఁడును, కుందమందారహాసే - కుంద-మొల్లలవంటి, మందార - మందారపుష్పములవంటి, హాసే - నగవుగలవాఁడును, మునిసరసిజభానౌ - మునిశ్రేష్ఠులనియెడి, సరసిజ - కమలములకు, భానౌ- సూర్యుఁడయిన, నందగోపాలసూనౌ - శ్రీకృష్ణమూర్తియందు, తత్పదాయత్తవృత్తమ్ - తత్ - ఆ స్వామియొక్క, తత్ - పాదములకు, ఆయత్త - అధీనమయిన, వృత్తం - వ్యాపారముగల, మమ - నాయొక్క, చిత్తం - చిత్తము, నివసతు - ఉండుఁగావుత.

చ॥ వ్రజయువతీసహాయునతిరాజితయౌవనకాయుమౌనిచి । త్త
జలజమిత్రువిశ్వజనతానుతిపాత్రువినీలగాత్రుఁడో । యజదళనేత్రుఁ
గుందనిభహాసు శుభైకదయావిలాసునిక్ । సుజనహితుందదంఘ్రిర
తిఁజొప్పడునామతినామతించెదన్॥ ౭౮

తా. గోపస్త్రీ సహాయుండై జవ్వనంబుచేఁ దేజరిల్లు నెమ్మేనుగలిగి సకల శుభవిలాసంబులు గలిగి మొల్లవిరులంబోలి చిఱునగవు నెమ్మొగంబున గనుపట్ట మౌనికమలంబులకు మార్తాండుండగు శ్రీకృష్ణమూర్తి యొక్క పాదంబులకధీనంబై నామనంబుండుంగాతయనుట.

శ్లో॥ అరణ్యానీమార్ద్రస్మిత మధురబింబాధర సుధాసరణ్యాసం
క్రాన్తైస్సపది మదయన్వేణునినదైః । ధరణ్యాసానందోత్పులకముప
గూఢాంఘ్రికమలశ్శరణ్యానామాద్యస్సజయతుశరీరీమధురిమా॥ ౭౯

టీక॥ ఆర్ద్రస్మితమధురబింబాధరసుధాసరణ్యా- ఆర్ద్ర-కోమలమైన-స్మిత-చిఱునగవుచేత, మధుర-మనోజ్ఞమయిన, బింబాధర-దొండపండువంటియధరమునందలి, సుధా-అమృతముయొక్క, సరణ్యా-ప్రవాహముచేత, సంక్రాంతైః-సంక్రమించిన, వేణునినదైః-వేణునాదములచేత, సపది-తత్కాలమందు అరణ్యానీం- అరణ్యమును, మదయన్-మదముగలదిగాఁజేయుచున్నయదియు, ధరణ్యా - భూమిచేత, సానందోత్పులకం - సంతోషపులకాంకురములతోఁగూడినదియు, ఉపగూఢాంఘ్రికమలః- ఉపగూఢ-ఆలింగనముచేయఁబడిన, అంఘ్రికమలః-పాదకమలములుగలయదియు, శరణ్యానాం - రక్షకములలోపల- ఆద్యః- మొదటిదైనదియు, శరీరీ- శరీరముగలిగిన, సః - ఆప్రసిద్ధమయిన, మధురిమా-సౌందర్యము, జయతు- సర్వోత్కర్షముగావర్తించును.

మ॥ స్మితబింబాధరమాధురీకలితవంశీనాదమోదంబుచే । నతివ

స్ఫూర్తిగాననంబులరఁచాదాంభోజసంసక్తిచే- శ్రీగోపాంచమునఁ
గాంచెనోయని వితర్కింపంబ్రవర్తించున । చ్యుతుఁడాద్యస్సుధురాభి
మాస్యమునసర్వోత్కృష్టుఁడైవర్తిలున్॥ ౪౯

తా. క్రొత్తయగు చిఱునగవుచే మనోహరంబగు నధరబింబంబందలి యమృతప్రవాహంబునఁ బొడమిన వేణునినాదంబులచే నరణ్యంబులర నానందంబునన్నైన గగ్గురుపాటుచే వెలయు పుడమితోడఁగాఢాలింగనంబు చేయుపాదకమలంబులుగలిగి రత్నకంబులలోపల నాద్యుండయి ప్రసిద్ధంబయిన శరీరవంతంబగు సౌందర్యంబు సర్వోత్కృష్టముగా వర్తించుననుట.

మూ॥ విదగ్ధగోపాలవిలాసినీనాం సమ్భోగచిహ్నాఙ్కితసర్వగా
త్రమ్ । పవిత్రమామ్నాయగిరామగమ్యం బ్రహ్మంప్రపద్యే నవనీత
చోరమ్॥ ౫౦

టీక. విదగ్ధగోపాలవిలాసినీనాం- విదగ్ధ- సుందరులయిన, గోపాలవిలాసినీనాం- గోపస్త్రీలయొక్క, సమ్భోగచిహ్నాఙ్కితసర్వగాత్రం- సంభోగచిహ్న-రతిచిహ్నముల చేత, అఙ్కిత- ముద్రింపఁబడిన, సర్వ- సమస్తమయిన గాత్రం-శరీరముగలయదియు, పవిత్రం- విమలమయినయదియు, ఆమ్నాయగిరామ్- వేదాంతవాక్యములకు, అగమ్యం - పొందనలవిగానిదియై- నవనీతచోరమ్, నవనీత- వెన్నను, చోరమ్-దొంగిలించుచున్న, బ్రహ్మమ్- పరబ్రహ్మమును, ప్రపద్యే-భజించుచున్నాను.

మ॥ నవలావణ్యవిలాసినీ నికరనానాబంధ సంబంధసం । భవద
గ్ధాంకశరీరు విశ్వపరమామ్నాయాంతవాచోవిశ్లే । యవిహారున్నవ
నీతచోరునిఁబవిత్రాచారసంచారుని। న్భువనాధారునిశాంతసారునిమ
దింబూజింతునెల్లప్పుడున్॥ ౫౧

తా. సౌందర్యవంతులగు గోపాలస్త్రీలయొక్క సంభోగ చిహ్నంబులచేనంకితంబగు శరీరంబుగలిగి నిత్యశుద్ధంబై వేదంబులకేఁ దెలియనగమ్యంబయ్యును నవనీతచోరుండై వెలయుబ్రహ్మంబుఁభజించుచున్నాననుట.

మూ॥ అన్తర్గృహే కృష్ణమవేక్ష్య చోరం బద్ధ్వా కవాటం జననీం గతై
కా। ఉలూఖలే దామనిబద్ధమేనం తత్రాపి దృష్ట్వా స్తిమితా బభూవ॥

టీక. ఏకా- ఒకగోపిక, అన్తర్గృహే- లోపలియింటను, చోరం - నవనీతాదిచోరకుఁడైన, కృష్ణం- శ్రీకృష్ణుని, అవేక్ష్య చూచి, కవాటం - తలుపును, బద్ధ్వా- బంధించి, జననీం- తల్లినిగూర్చి, గతా సతి- పోయినదగుచున, ఉలూఖ

లే - గోపీయందు, దామనిబద్ధం - దామ- త్రాటిచేత, నిబద్ధం- కట్టఁబడిన, ఏనం, ఈశ్రీకృష్ణుని, తత్రాపి - అకరోడను, దృష్ట్వా- చూచి, స్త్రియతా - నిశ్చేష్టురాలు, బభూవ - ఆయెను. ... ... ... *

చ ॥ నిలయములోనకర్తునవనీతహరుఁ హరిఁగాంచిగట్టిగాఁ । దలుపుబిగించియకోరోనుకు తల్లికిఁదెల్పఁగబోయి యందులో। ఖలగుణబద్ధుఁడౌనతనిఁగన్గొని యూఁటడివచ్చిరిత్తగా । నలుగనిసారెకేకలిడనత్రియ నాఁటలుకంటఁ గోల్చెదన్॥ ... ... ౫౦

తా. వ్రేపల్లియందొకగోపికలోపలియింటవెన్నదొంగిలించుచున్న శ్రీకృష్ణదేవునింగాంచి యయ్యింటి తలుపుమూసి యశోదాదేవికిం జెప్పరాన కొరడరోలం గట్టఁబడియుండు శ్రీకృష్ణునింగాంచి యారడిలి యింటికిమగుడనే తెంచి వెన్నదేనికుండలంజూచి శ్రీకృష్ణుని కృత్యంబునకు వెఱఁగుపడియెననుట.

శ్లో ॥ రత్నస్థలేజానుచరఃకుమార స్సంక్రాన్తమాత్మీయ ముఖారవిన్దమ్। ఆదాతుకామ స్తదలాభఖేదా ద్విలోక్యధాత్రీవదనంరురోద॥

టీక. జానుచరః- జాను- మోకాళ్ళచేత, చరః - సంచరించుచున్న, కుమారః- శ్రీకృష్ణమూర్తి, రత్నస్థలే- రత్నమయప్రదేశమందు, సంక్రాన్తం - ప్రతిబింబించిన, ఆత్మీయముఖారవిందమ్ - ఆత్మీయ- తనసంబంధమయిన, ముఖారవిందమ్- ముఖకమలమును, ఆదాతుకామః- గ్రహింపనిచ్ఛయించినవాఁడగుచు, తదలాభఖేదాత్ - తత్ - ఆముఖకమలముయొక్క, అలాభ- అప్రాప్తివలననయిన, ఖేదాత్ - క్లేశమువలన, ధాత్రీవదనం- ధాత్రీ-దాదియొక్క, వదనం- ముఖమును, విలోక్య -చూచి, రురోద-ఏడ్చెను. ... ... *

మ ॥ ఘనరత్నస్థలితావనిన్నిజముఖాకారంబు వద్మాకృతిం। గనుపట్టంగనినవ్వితద్గ్రహణకాంక్షంజేన్నిఁజాఁచిచే । రనిఖేదంబునజానుయానమువలిర్పన్ ధాదినీక్షించికా । వనుచుంబోరెడు నందనందనుని మాయాడింభకుం గొల్చెదన్ ॥ ... ... ౫౧

తా. జానువులచే సంచరించు శ్రీకృష్ణమూర్తి మణివికారంబగు భూడమిపైఁ గ్రీడించుచు నక్కడఁ బ్రతిబింబించిన తనమొగంబు కమలంబని గ్రహింపంబోయి రాకుండిన ఖేదంబున దాదిముఖంబుఁ జూచి పోరెడెననుట. *

శ్లో ॥ ఆనందేనయశోదయాసమదనం గోపాంగనాభిశ్చిరం సాశఙ్కంబలవిద్విషాసకుసుమైస్సిద్ధైః పృథివ్యాకులమ్। సేర్ష్యంగోపకు

మారకైస్సకరుణం పౌరైర్జనైస్సస్మితం యోదృష్టస్సపునాతు న్సో
మురరిపుః ప్రోత్క్షిప్తగోవర్ధనః॥ ౨౩

టీక, యశోదయా-యశోదాదేవిచేత, ఆనందేన- సంతోషముతోడను గోపాంగనాభిః-గోపస్త్రీలచేతను, సమదనం- మన్మథునితోఁ గూడుకొన్నటుల, సిద్ధైః-సిద్ధులచేత, సకుసుమైః- పుష్పములతోడ, పృథివ్యా-భూమిచేతఆకులం- వ్యాకులమగునటుల, గోపకుమారైః- గోపాలకుమారులచేత, సేర్ష్యం- ఈసుతోఁగూడుకొన్నటుల, సకరుణైః - దయతోఁగూడిన యట్టియు, పౌరైః పురసంబంధులైన, జనైః - జనులచేత, సస్మితం- చిఱునగవుతోఁగూడుకొన్నటుల, యః- ఎవఁడు, దృష్టః-చూడబడియెనో, ప్రోత్క్షిప్తవగోర్ధనః- ప్రోత్క్షిప్త ఎత్తఁబడిన, గోవర్ధనః- గోవర్ధనపర్వతము గలిగిన, సః-ఆప్రసిద్ధుఁడైన, మురరిపుః- శ్రీకృష్ణమూర్తి, నః-మమ్ము, పునాతు -పవిత్రులఁజేయుఁగావుత.

చ॥ ముదముననందగోపికలు మోహమునన్ జనపాళినవ్వనం।
దిద్రిదశవిభుండు సాధ్వసమతిన్విరివానలసిద్ధపుంగవుల్ ।పొదలినయాకు
లత్వమునభూమియు గోపకుమారులేపునన్ । సదయతఁబౌరులున్ గ
నరసాధరమెత్తినచక్రిప్రోవుతన్॥

తా. యశోదచే నానందంబునను గోపస్త్రీలచే మన్మథోద్రేకంబున నింద్రునిచే సందేహంబునను సిద్ధులచేనలరువానలం గరుణావంతులగుపౌరజనంబులచేనవ్వనం బుడమిచే నాకులంబున గోపకుమారులచే నీసునంజూడం బడుచు నెవ్వండుగోవర్ధనంబెత్తెనో యట్టిశ్రీకృష్ణమూర్తి నను బవిత్రునిగా జేయుగాతయనుట.

మూ॥ఉపాసతాఆత్మవిదఃపురాణాఃపరంపరస్మాన్నిహితంగుహా
యాం।వయంయశోదా శిశుబాలలీలాకథాసుధాసిన్ధు షులీలయామః॥

టీక. పురాణాః పూర్వికులయిన, ఆత్మవిదః జ్ఞానులు, గుహాయామ్- గుహాయను హృదయమందు, నిహితం- ఉంచబడిన, పరస్మాత్, పరమునకన్నను, పరం, పరమయినతత్వమును, ఉపాసతా- ఉపాసింపని, వయం. మేము, యశోదాశిశుబాలలీలా కథాసుధాసిన్ధుషు-యశోదా- యశోదాదేవియొక్క- శిశు - బిడ్డయయిన శ్రీకృష్ణమూర్తియొక్క, బాలలీలా - బాలక్రీడాసంబంధములయిన, కథా-కథలనియెడి, సుధాసిన్ధుషు- అమృతనదులయందు, లీలాయామః-విహరించుచున్నాము.

మ॥ దహరాకాశనివాస మాపరమునాత్మజ్ఞానులీక్షించు ప్రు। త్యా

హాముంగాంతురుగాన నేనలయశోదాబాలలీలాసుధా। లహరీవీచిపరం
పరంగదిసి కొల్లల్లాగ గ్రీడించున । న్నహన ప్రౌఢి జెలంగు డెందము
ననానందంబుసంధించెదన్ ॥ ౫౪

తా. పురాతనులగు నాత్మవిదులు దహరాకాశంబునంబరతత్త్వంబునిలిపి యుపాసింతురుగాత నే నల్లయశోదాశిశుండగు శ్రీకృష్ణునిబాలక్రీడలకథలనియెడియమృతంపునదులయందు విహరించి యానందంబు నొందుచున్నావనుట-

విక్రేతుకామాకిల గోపకన్యామురారిపాదార్పిత చిత్తవృత్తిః।దధ్యాదికం మోహవశాదవోచ ద్గోవిన్ద దామోదర మాధవేతి॥

టీక. దధ్యాదికం-పెరుగుమొదలగువాని, విక్రేతుకామా - విక్రయింపవలయునను నిచ్ఛగలిగిన, గోపకన్యా, గోపకన్యక, మురారిపాదార్పితచిత్తవృత్తిః- మురారి-శ్రీకృష్ణమూర్తియొక్క, పాద-పాదములయందు, అర్పిత-సమర్పింపఁబడిన, చిత్తవృత్తిః, చిత్తవ్యాపారముగలిగినదైన, మోహవశాత్-మోహవశమువలన, గోవిందదామోదరమాధవేతి, గోవిందా-గోవిందాయనియు, దామోదర - దామోదరాయనియు, మాధవేతి- మాధవాయనియు, అవోచత్- పలికెనుగదా,

మ॥ నవలావణ్యవిలాసినీతిలకమానందంబునన్నందసం। భవపా
దార్పితచిత్తవృత్తిమురలింపన్నేరకన్వీటిలో ।నవనీతాదికమమ్మఁజూచి
అప్పుడెందంబారులంగాంచిమా। ధవగోవిందముకుందకృష్ణయను ను
ద్యన్మోహవిభ్రాంతితోన్॥ ౫౫

తా. వ్రేపల్లియ యందొక్క గోపయువతి పెరుగుమొదలగువాని నమ్మఁబోయి శ్రీకృష్ణునిపాదంబులయందు చిత్తనంబు మరలింపనేరక యత్యంత మోహంబునం దగిలి పెరుగుమొదలగువాని నమ్మ మఱచి గోవిందా దామోదరా మాధవా యనియెడు నామంబుల నుగ్గడించుచుం దిరిగెననుట.

మా॥ ఉలూఖలంవాయమినాంమనోవాగోపాంగనానాంకు
చకుట్మలంవా। మురారినామ్నఃకలభస్యనూనం ఆలానమాసీత్త్రయ
మేవభూమౌ॥ ౫౬

టీక- మురారినామ్నః- మురారి- శ్రీకృష్ణుఁడనియెడి, నామ్నః- పేరుగలిగిన, కలభస్య- గున్నయేనుఁగునకు- ఉలూఖలంవా- రోలైనను, యమినాం మునులయొక్క, మనోవా - మనసయినను- గోపాంగనానాం- గోపస్త్రీల

యొక్క, కుచకుట్మలంవా-కుచకుట్మలమయినను, భూమౌ - భూమియందు, త్రియమేవ- మూఁడే, ఆలానం - కట్టుకంబము, ఆసీత్ - ఆయెను, నూనం- నిశ్చయము-

చ॥ మునిజనమానసాంబురుహముం బశుపాలకబాలికామణీ। స్త
నవనజాతకోరకవితానములూఖలముకా మురారిమో। హనకలభం
బు నిల్పుటకునై విలసిల్లినకట్టుకంబముల్। దనరెడునొండురెండునివిద
కొఱ్ఱధరాస్థలిఁగల్గనేర్చునే॥ ౫౬

తా. మునిజనంబుల మానసంబును గోపస్త్రీల మొఁగ్గలవంటి స్తనంబుల పింఁడును రోలును నిప్పుడమియందు శ్రీకృష్ణుండను ముప్పదియేండ్ల ప్రాయంబుగల గజంబునకు నిమ్ముగాఁ గట్టుకంబంబులయ్యె నొండొకటియేదియైన నికఱ్ఱంబనుట.

శ్లో॥ కరారవిందేనపదారవిందం ముఖారవిందే వినివేశయంతమ్।
వటస్యపత్రస్యపుటే శయానంబాలంముకుందంమనసాస్మరామి॥ ౫౭

టీక. కరారవిందేన- హస్తకమలముచేత, పదారవిందం - పాదకమలమును, ముఖారవిందే - ముఖకమలమందు, వినివేశయంతమ్ - ఉంచుచున్నవాఁడును, వటస్య-వటవృక్షముయొక్క, పుటే-పుటమందు, శయానం - నత్తమిల్లిన, బాలం-బాలుఁడైన, ముకుందమ్ - శ్రీకృష్ణుని, మనసా - మనస్సుచేత, స్మరామి-స్మరించుచున్నాను.

శా॥ కేలుందామరచేఁబదాబ్జమెలమింగీలించినేమోమునన్పై। సుశీ
తిస్నిగ్ధవటప్రవాళమృదుశయ్యం బోల్పునబ్బాలునిన్।లీలాలోలవిశాల
లోచనునిలాలించెట్టి-లాలించుచున్। జోలల్పాడుయశోదభాగ్యమున నే
జోహారుగావించెదన్॥ ౫౮

తా. కరకమలంబునం బాదకమలంబు ముఖకమలంబుపైనిడికొని వటపత్రంబునం బవ్వళించి బాలుండై వెలుఁగు ముకుందుని మనంబున స్మరించుచున్నాననుట.

శ్లో॥ శమ్భోస్స్వాగతమాస్యతామిత ఇతోవామేనపద్మాసన క్రౌఞ్చారేకుశలంసుఖంసురపతేవిత్తేశనోదృశ్యసే। ఇత్థంస్వప్నగతస్య కైటభజితశ్శ్రుత్వా యశోదాగిరఃకింకింబాలక జల్పసీతిరచితం ధూ-ధూకృతంపాతునః॥ ౫౯

టీక. హేశమ్భో- ఓయిశివుఁడా, స్వాగతం-కుశలమా-మేమి,

ద్మాసన-ఓయిపితామహుఁడా, వామేన - వామమార్గముచేత, ఆగచ్ఛ - గమ్ము, ఇతఇతః- ఈపార్శ్వమున- ఆస్యతామ్ - కూర్చుండఁదగినది, హేకాశ్రీశ్చారే-ఓయికుమారుఁడా, కుశలం - కుశలమాయేమి, హేసురపతే - ఓయియింద్రుఁడా, సుఖం-సుఖమాయేమి, హేవిత్తేశ - ఓయికుబేరుఁడా, నోదృశ్యసే- చూడఁబడవేమి- ఇత్థమ్ - ఈప్రకారముగా, స్వప్నగతస్య - కలగనుచున్న, కైటభజితః, శ్రీకృష్ణమూర్తియొక్క. గిరః - వాక్యములను, యశోదా- యశోదాదేవి, శ్రుత్వా-విని, హేబాలక - ఓయిశ్రీకృష్ణా, కింకింజల్పసి ఏమేమిమాటలాడితివి, ఇతి.ఇట్లని, రచితం- చేయఁబడిన, థూథూకృతం-థూథూకారము, నః-మమ్ము, పాతు-రక్షించుఁగాత.

మ ॥ హరరారమ్మశుభం బెడాపలనుభాషాధీశకూర్చుండుమా ।
పరిణామంబెకుమారయింద్రసుఖమేపాలస్త్యవీక్షింపమే।సరణిస్విన్న
నఁగాయశోదవిని వత్సాయేమియేచుంచుని। ద్ధురమబ్బానినకృష్ణుపై
నిడినథూథూకారముల్ ప్రోవుతన్॥ ౫౮

తా. ఓయిశివుఁడా నీకుఁ గుశలంబె యోపితామహుఁడా యిటవచ్చి డాపలఁగూర్చుండుము యోకుమారాస్వామీ నీకుభద్రంబె యోయింద్రానీకుసుఖంబె యోకుబేరుఁడా నీవు సూడంబడవేమియని యీరీతింగలలోన నుడువు శ్రీకృష్ణునియాలాపంబులవిని యశోద యేమేమిరాబాలకా యివ్విధంబునంబలికెదవనుచుం జేయు థూథూకారంబు నసుంబ్రోచుఁగావుత.

మూ॥మాతఃకింయదునాథ దేహిచషకంకింతేనపాతుంపయస్త
న్నాస్త్యద్యకదాస్తినానిశినిశాకావాంధకారోదయే । ఆమీల్యాక్షియు
గంనిశాప్యుపగతాదేహీతిమాతుర్ముహుర్వక్షోజాంశుకకర్షణోద్యత
కరఃకృష్ణస్సపుష్ణాతునః॥ ౫౯

టీక. కవి- ఈశ్లోకంబున యశోదాశ్రీకృష్ణులయుత్తరప్రత్యుత్తరములఁజెప్పుచున్నాఁడు॥టీ॥ హేమాతః- ఓతల్లి, హేయదునాథ- ఓశ్రీకృష్ణా, కిం ఏమి, చషకమ్- పానపాత్రమును-దేహి-ఇమ్ము, తేన - ఆపానపాత్రముచే, కిం - ఏమి, పయః పాలను, పాతుం-పానము చేయుకొఱకు, తత్-ఆక్షీరము, అద్య- ఇప్పుడు- నాస్తి- లేదు, కదావా-ఎప్పుడు, అస్తి కలదు, నిశి-రాత్రియందు, నిశా- రాత్రి, కావా-ఏది. అంధకారోదయే - అంధకార- చీఁకటియొక్క, ఉదయే- ఉత్పత్తియందు, అక్షియుగం- కనుదోయిని, ఆమీల్య-మూసుకొని నిశాపి- రాత్రియును.ఆగతా-వచ్చినది, చషకం, పానపాత్రమును, దేహీతి

మ్మని, ముహుః- సారెసారెకును- మాతుః-తల్లియైనయశోదయొక్క, వక్షో
జాంశుకకర్షణోద్యతకరః - వక్షోజాంశుక - పయ్యెదయొక్క, కర్షణ-లాగు
టయందు,ఉద్యతకరః- ఉద్యత-ఉద్యుక్తమయిన, కరః,హస్తముగల-సః ఆ ప్రసి
ద్ధుఁడైన,కృష్ణః-శ్రీకృష్ణమూర్తి,నః- మమ్ము, పుష్ణాతు-పోషించుచుండుఁగాక.

ఉ॥ అమ్మయిదేమిరా యదుకులాగ్రణిగిన్నెయొసంగుమేలపా।
లిమ్ముగఁదాగవలేదిపుడదెప్పుడు రేయదివెట్టిదంధకా। రమ్మగుగన్నుఁ
గన్మొగిచిరాతిరివచ్చెను వేగఁబాలుతే। తెమ్మనితల్లిపైఁటవడిఁదియ్యు
ముకుందుఁడునన్నుఁబ్రోవుత౯॥ ౫౯

తా॥ ఓతల్లీ యోయదుకులనాథా యేమిరాయనినఁ బానపాత్రము
నిమ్మనిన దానిచేనేమనినఁ బాలుద్రావననినం బాలిప్పుడు లేవనినసింకెప్పుడని
యె రాత్రికనిననారాత్రియెప్పుడనినమె నంధకారోదయమందనినం గన్నులు
మొగిచిరాత్రి వచ్చెనింకందెమ్మని తల్లిపయ్యెదచేఁబట్టుగు నాకర్షింపనుద్యుక్తం
బగు కరంబుగల గోపాలదేవుండు నన్నుఁ బోషించుఁగాత యనుట. ॥

మా॥ కాళిందీపులినోదరేషు ముసలీయావద్గతః ఖేలితుం తావత్క
ర్పూరికంపయః పిబహరేవర్ధిష్యతే తే శిఖా। ఇత్థంబాలతయాప్రతారణ
పరశ్శ్రుత్వాయశోదాగిరః పాయాన్నస్స్వశిఖాంస్పృశ౯ ప్రముదితః
క్షీరేర్ధపీతేహరిః॥ ౬౦

టీక. ముసలీ- బలరామస్వామి, కాళిందీపులినోదరేషు- కాళిందీ-య
మునానదియొక్క, పులిన-ఇసుకదిన్నెలయొక్క, ఉదరేషు- మధ్యప్రదేశముల
యందు, ఖేలితుం-విహరించుటకొఱకు, యావత్ - ఎంతపర్యంతము-గతః పో
యెనో- తావత్, అంతలోపలను- హేహరే - ఓశ్రీకృష్ణా- కర్పూరికం -బంగ
రుగిన్నెయందుండిన-పయః - క్షీరమును-పిబ - పానముచేయుము, తే- నీయొ
క్క- శిఖా - సిగ, వర్ధిష్యతే, వృద్ధిబొందుచున్నది - ఇత్థం- ఈరీతిని- బాలత
యా- బాలుఁడౌటచేత- ప్రతారణపరః- ప్రతారణ-శిఖావర్ధనమందు- పరః-
ఆసక్తుఁడగుచు - యశోదాగిరః- యశోదావాక్యములను, శ్రుత్వా - విని- ప్ర
మోదితః- సంతోషించినవాఁడగుచును- క్షీరే- క్షీరము- అర్ధపీతేసతి- సగము
పానుచేయఁబడుచుండఁగా - స్వశిఖామ్-స్వ- స్వకీయమయిన - శిఖామ్- సి
గను- స్పృశ౯ - స్పృశించుచున్న- హరిః- శ్రీకృష్ణమూర్తి- నః- మమ్ము పా
యాత్ - రక్షించుఁగాత-

ఉ॥ హేమలతనూభవావులిన హేలఁజరించుబలుండు పోకముఁ౯।

నుపడవానినవనీతాదులుగానెంచి తనకుమారుఁడు మ్రింగిన యవియన్నియు జీర్ణముగాలేదు - ఎవ్వతెచూచినందున దృష్టితాఁకెనో నేనేమి సేతును చేటపోతినని దుఃఖించి ధూఘూకారపూర్వకముగా నోబాలుఁడా చిరకాలమున్నవు జీవింతువుగాకయని దీవింప వెలుంగు కృష్ణుఁడు మమ్మిఁబోషించుఁగాకయనటు.

✓ మూ॥ కించిత్కుఞ్చితలోచనస్య పిబతః పర్యాయపీతం స్తనం సద్యః ప్రస్నుతదుగ్ధబిందుమపరం హస్తేన సమ్మార్జతః। మాత్రైకాంగులి లాలితస్య చుబుకే స్మేరాననస్యాధరే । శౌరేః క్షీరకణాన్వితా నిపతితా దంతద్యుతిః పాతు నః॥ ౨౨

టీక. పర్యాయపీతం, పర్యాయవరుసగా, పీతఁ యథాతథా - త్రాగఁబడినట్లుగా, స్తనం-ఒక స్తనమును, పిబతః - పానము సేయుచున్నట్టియు, కించిత్కుఞ్చితలోచనస్య-కించిత్-కొంచెము, కుఞ్చిత-వంచబడిన, లోచనస్య-నేత్రములగలయట్టియు, సద్యః ప్రస్నుతదుగ్ధబిందుమ్-సద్యః-అప్పుడు, ప్రస్నుత- కారుచున్నట్టి- దుగ్ధబిందుమ్- పాలబిందువులుగలిగిన, అపరమ్ - మఱియొక స్తనమును, హస్తేన- చేతితో, సమ్మార్జతః- స్పృశించుచున్నట్టియు, మాత్రా- తల్లిచేత, చుబుకే-గడ్డమునందు, ఏకాంగులిలాలితస్య- ఏకాంగులి, ఒకవ్రేలిచేత. లాలితస్య- లాలింపఁబడినట్టియు, స్మేరాననస్య - చిఱునవ్వుతోఁ గూడినముఖముగలయట్టి శౌరేః-కృష్ణునియొక్క, అధరే- మోవియందుఁ నిపతితా- పడియున్నట్టి, క్షీరకణాన్వితా- పాలబిందువులతోఁగూడినట్టి, దంతద్యుతిః-దంతకాంతి నః- మమ్ము, పాతు-రక్షించుఁగాక.

చ॥ ఒకకుచమానిపాలురియనొక్కకుచంబొకకేలఁబూనియా।
నుకుళితనేత్రుఁడైజననిముద్దునఁ గుంజుబుకంబుఁ వ్రేలఁజి। ట్టికనుఁగనంటు
మోవిఁబ్రకటంబగులేనగవొప్పశౌరిదు। గ్ధకణసమేతదంతరుచితత్పర
తన్నునఁ బ్రోచుఁగావుతక॥ ౨౩

తా. ముందొక చన్నుద్రాగి తెఱువాఁతె మఱియొక చన్నుద్రాగు నవ్వుచుకన్నులను గొంచెమువంచుకొని యొకచేతితో వాత్సల్యముచలనఁ బాలుగారుచున్నట్టి యొకచన్నుస్పృశించుచునుండగా నవ్వుచుతల్లియొకవ్రేలిచే గడ్డముపట్టిలాలింపఁగా నవ్వుచున్నట్టి చిన్నికృష్ణునియొక్క మోవియందుఁబాలబిందువులతోఁడఁ గనుపడుచున్న చిఱునవ్వు నన్ను రక్షింపవలయుననుట-

✓ మూ॥ ఉత్తుంగస్తనమండలోపరిలసత్ప్రాలంబముక్తామణేః అంతర్బింబితమింద్రనీలనికరచ్ఛాయానుకారిద్యుతిః । లజ్జావ్యాజముపేత్య న

న్రమవదనా స్పష్టం మురారేర్వపుఃపశ్యంతీ ముదితాముదేస్తుభవతాంల
క్ష్మీర్వివాహోత్సవే॥ ... ... ౬౩

టీక. వివాహోత్సవే- వివాహరూపమయిన యుత్సవకాలమందు, ల
జ్జావ్యాజమ్ - సిగ్గనువ్యాజమును, ఉపేత్య - పొంది, నమ్రవదనా - నమ్ర- వం
గియున్న, వదనా - ముఖముగలదియై, ఉత్తుంగ స్తన మండలోపరి లసత్ప్రా
లంబముక్తామణేః ఉత్తుంగ- ఉన్నతములైన, స్తన- చన్నులయొక్క, ఉపరి- పై
న, లసత్ - ప్రకాశించుచున్న, ప్రాలంబ- హారముయొక్క, ముక్తామణేః- ము
త్యములయొక్క, అంతః- నడుమ, బింబితమ్ - ప్రతిఫలించుచున్న, ఇంద్రనీలని
కరచ్ఛాయానుకారిద్యుతేః- ఇంద్రనీలనీలమణులయొక్క, నికర- సమూహము
యొక్క, ఛాయా- కాంతిని, అనుకారి- అనుకరించుచున్న, ద్యుతేః- కాంతిగల,
మురారేః-శ్రీకృష్ణునియొక్క, వపుః-దేహమును, స్పష్టమ్-స్వచ్ఛముగా, పశ్యం
తీ- చూచుచున్నదియు, ముదితా-సంతోషము పొందినదియునైన, లక్ష్మీః - రు
క్మిణీరూపిణియైన లక్ష్మీదేవి, భవతామ్- మీకు, ముదే- సంతోషముకొఱకు, అ
స్తు - అగుఁగాక. ... ... ✽

మ॥ హరినీలచ్ఛవిగేరు శౌరిమృదు దేహచ్ఛాయవక్షోరుహా
పరిముక్తామణియందుఁ గన్పడఁ ద్రపావ్యాజంబునం బెండ్లికూఁ । తురు
చాఁగావున మోమువాంచి కొనిసంతోషస్థితిం జెందునిం । దిరమాకీవు
త సిద్ధసంపదదయా దృష్టి న్విలోకించుచు న్॥ ... ... ౬౩

తా. రుక్మిణీదేవి వివాహకాలమందుఁ గృష్ణునిఁ జూడవలయునను నభి
ప్రాయముగలదియై లజ్జాతిశయమువలన ముఖంబునువంచు కొనుచున్నపుడు తన
కంఠమందువిలసిల్లు హారపుముత్యములయందుఁ బ్రతిబింబరూపముగాఁ గనుప
డు నాశ్రీకృష్ణుని నీలమణి చ్ఛాయ మెఱయు దివ్యమూర్తిని గనుఁగొని మనో
రథ సిద్ధిఁబొందెను - అట్టిరుక్మిణిమీకు సంతోషంబు లొసంగుఁగాక యనుట.

శ్లో॥ కృష్ణేనామ్బ గతేనరంతుమధునా మృద్భక్షితా స్వేచ్ఛయా
తథ్యంకృష్ణకఏవమాహముసలీ మిథ్యామ్బ పశ్యాననమ్ ।వ్యాదేహీతివి
దారితేశిశుముఖే దృష్ట్వాసమస్తం జగన్మాతాయస్యజగామవిస్మయప
దంపాయాత్సవఃకేశవః ॥ ... ... ... ... ... ... ౬౪

టీక. హేఅమ్బ-ఓయమ్మ, రంతుమ్-ఆటలాడుటకు, గతేన-పోయినట్టి,
కృష్ణేన- కృష్ణునిచేత, స్వేచ్ఛయా - తనయిచ్ఛచేత, మృత్- మన్ను, భక్షితా-

భక్షింపఁబడినది- (అనిబలభద్రుండు చెప్పఁగావిని) హేకృష్ణ - ఓయికృష్ణా, తథ్యమ్- యథార్థమా (అనియశోద చెప్పఁగావిని) ఏవమ్- ఇట్లు, కః - ఎవ్వఁడు, ఆహ- చెప్పెను- (అనుకృష్ణుఁడు పలుకఁగానందుకు) ముసలీ- బలరాముఁడు, (అనియశోదయుత్తరము చెప్పనదివిని) మిధ్యా- అబద్ధము, ఆననమ్ - నోటిని, పశ్య - చూడుము, (అనికృష్ణుఁడుపలుకఁగావిని) వ్యాదేహి - తెరువుము, ఇతి-అని, (యశోదపలుకుటవిని) విదారితే - తెఱవఁబడిన, శిశుముఖే బాలరూపుఁడైనకృష్ణునినోటియందు, సమస్తం-సకలమైన, జగత్ - లోకమును, దృష్ట్వా-చూచి, యస్య - యెవ్వనియొక్క, మాతా- తల్లియైనయశోద, విస్మయపదమ్-ఆశ్చర్యస్థానమును, జగామ-పొందినదో, సః-అటువంటి, కేశవః శ్రీకృష్ణుఁడు, నః-మమ్ము, పాయాత్ - రక్షించుఁగాక.

మ॥ మనుభక్షించితె కృష్ణ యెవ్వరని రమ్మాయన్నయన్నాఁడెక । ల్లోగునామోమదికల్లమాపుమను చునోరె త్తపెశ్వంబులె । ల్లనుగన్పించిననింత పెల్లడిన నీలాగయ్యె నాశ్చర్యమం। చునుపీక్షించు యశోదఁ గాంచినగు కృష్ణుఁగాంతునశ్రాంతముస్॥ ౬౪

తా. ఓయికృష్ణా మన్నారగించితివాయని యశోదయడుగఁ గృష్ణుండమ్మాయెవ్వరట్లు చెప్పిరనియె-బలరాముఁడు చెప్పెననితల్లి చెప్పనదికల్ల నోటంజూడుమని చెప్పి సకలజగంబులకు నునికిపట్టగు తనవక్త్రంబుజూపి నిజమాతయగుయశోదనచ్చెరువు కలుగఁజేయు కేశవుండు మముంబ్రోచుఁగాతయనుట.

శ్లో॥ స్వాతీసపత్నీకిల తారకాణాంముక్తాఫలానాంజననీతిరోషాత్। సారోహిణీనీలమసూతరత్నంకృతాస్పదంగోపవధూకుచేషు॥ ౬౫

టీక. తారకాణామ్-నక్షత్రంబులకు, సపత్నీ- సవతియైనట్టి, స్వాతీ- స్వాతీనక్షత్రము, ముక్తాఫలానామ్- ముత్యంబులకు, జననీ- ఉత్పాదకము, ఇతి-అని, రోషాత్ - రోషమువలన, సారోహిణీ- రోహిణీనక్షత్రము, గోపవధూకుచేషు- గోపవధూ-గోపస్త్రీలయొక్క, కుచేషు-గుబ్బలయందు, కృతాస్పదమ్- కృత-చేయఁబడిన, ఆస్పదమ్-స్థానముగలిగినట్టి, నీలం-నీలవర్ణమైన, రత్నమ్- రత్నమును, అసూత- కనెను.

ఉ॥ తారలకెల్లనుక్ సవతిదానగుస్వాతివిశుద్ధమౌక్తికో । దార మణులగనంగనిజాత్మనసూయవహించిరోహిణీ। తాఁకగాంచెగోపవనితాకుచకోరకహారసంగతిక్ । జేరినకృష్ణనాయకమణిక్ రవికోటిఘృణిన్ముదంబునక్॥ ౬౬

తా. శ్రీకృష్ణమూర్తి రోహిణీనక్షత్రమందవతరించెను గావున దాని నుత్ప్రేక్షించుచున్నాఁడు. ఎట్లనఁగా, స్వాతిముత్యములను తెప్పించి ప్రసిద్ధిఁ బొందెనుగదా దానికి సమానమైన నేను దానికధికమైన ప్రసిద్ధిఁ బొందవలయునని తలంచి రోహిణీనక్షత్రము శ్రీకృష్ణుఁడను నీలరత్నమును గనెనని తోఁచుచున్నది- రత్నము స్త్రీలకుచంబులపై విలసిల్లును- అటువలెనీ రత్నంబును గోపికలకుచంబులయందుఁ బ్రకాశించుచున్నది- ఇందువలన ముత్యములకంటె రత్నము విశేషము గావున స్వాతికంటె రోహిణియాధిక్యమును జెందెను - స్వాతిముత్యములను గనుట స్వాతిప్రదేశమందుఁ గురియు వానబిందువులు ముత్యములౌనని ప్రతిపాదించుట రత్నశాస్త్రమువలన స్పష్టము- ఇదియునుంగాక స్వాతియుక్తము క్తిపొందినవారలకు నష్టఫలములు కాని వారలనుగనుచున్నది- ఈరోహిణియో ముక్తులకుఫలరూపమైనట్టి నీలమణిని గనుచున్నదియనియు నొక తాత్పర్యము ధ్వనించుచున్నది.

మూ॥ నృత్యంతమత్యంతవిలోకనీయం కృష్ణం మణిస్తంభగతం మృగాక్షీ ।
నిరీక్ష్య సాక్షాదివ కృష్ణమగ్రే ద్విధా వితేనే నవనీతమేకమ్॥ ౭౭

టీక. నృత్యంతమ్ - నర్తనము చేయుచున్నవాఁడును, అత్యంతవిలోకనీయమ్- అత్యంత-మిక్కిలి, విలోకనీయమ్- చూడఁదగినవాఁడును, మణిస్తంభగతమ్ మణిస్తంభ - రత్నస్తంభమును, గతం, (ప్రతిబింబరూపముగ) పొందినవాఁడునునగు, కృష్ణమ్-కృష్ణుని, మృగాక్షీ- యశోద, అగ్రే-ఎదుట, సాక్షాత్ యథార్థమైన, కృష్ణమివ-కృష్ణునివలె, నిరీక్ష్య-చూచి, ఏకమ్- ఒకటియైన-నవనీతం- వెన్నను, ద్విధా- రెండుఖండములుగాను వితేనే- చేసెను.

మ॥ ప్రకటానందవిచిత్రనాట్యపరుఁడౌ బాలున్విలోకించుచుం
జకితాలోకకురంగలోచన మణిస్తంభంబులో నికటమై నటియించుచున్న
వెండోఁచునిజనైజపొందుగాంచి భాగించెనా త్మకరాంభోజమునం
దునున్న నవనీతంబు ద్యోడక రెండుగాన్॥ ౭౮

తా- యశోద కృష్ణుఁడాడుచుండఁగా వానిప్రతిబింబమును రత్నస్తంభమునందుఁ జూచి యథార్థమైన కృష్ణుఁడని తలంచి వెన్నముద్దను రెండుముద్దలుగాఁ బంచెననుట-

మూ॥ వత్స జాగృహి విభాతముపాగతం జీవ కృష్ణ శరదాం శతం శతమ్
ఇత్యుదీర్య సుచిరం యశోదయా దృశ్యమాన వదనం భజామహే॥ ౭౯

టీక. వత్స- ఓబిడ్డా, విభాతమ్-ప్రాతఃకాలము, ఉపాగతం-వచ్చెను

జాగృహి- మేల్కొనుము, హేకృష్ణ-ఓకృష్ణ, శతం- అనేకమైన, శరదామ్-సంవత్సరములయొక్క, శతం-నూటియందు, జీవ-జీవింతువుగాక- ఇతి -. ఈలాగున, ఉదీర్య-చెప్పి, సుచిరం- బహుకాలము, యశోదయా - యశోదచేత, దృశ్యమానవదనమ్- దృశ్యమాన-చూడఁబడిన, వదనం-ముఖముగలిగిన,కృష్ణం- శ్రీకృష్ణుని, భజామహే-భజించుచున్నాము.

ఉ॥ వెన్నయుఁబాలు ద్రాగుదువు వేగమెలెమ్ముకుమార తెల్లవా। రెన్నుగనన్నతండ్రిని దురింపకు లేపదివేలయేండ్లని । కన్నెఁజయా యువమ్యోడుముకుఁగంద యటన్నయశోదఁజూచున । వ్వెన్నునిముద్దునెమ్మొగము వేడుకమీరభజింతు మెప్పుడున్॥ ౬౭

తా. యశోదాదేవి పవ్వళించియున్న శ్రీకృష్ణునిఁ గృష్ణా తెల్లవారెను మేలుకొనుమని లేపి - చిరంజీవయని దీవించి వానిముఖముఁజూచి సంతోషపడెను- అట్టిశ్రీకృష్ణుని ధ్యానించుచున్నాననుట.

మూ॥ ఓష్ఠంజిఘ్రన్ శిశురితిధియా చుమ్బితో వల్లవీభిఃకణ్ఠంగృహ్ణన్నరుణితపదం గాఢమాలిఙ్గితాఙ్గః। దోర్భ్యాంలజ్జాపదమభిమృశన్నఙ్కమారోపితాత్మాధూర్తస్వామీ హరతుదురితం దూరతో బాలకృష్ణః॥

టీక. శిశురితి- బిడ్డండను, ధియా-బుద్ధిచేత, వల్లవీభిః- గోపస్త్రీలచేత చుమ్బితస్సన్- చుంబనముచేయఁబడినవాఁడై, అరుణితపదమ్ - అరుణిత-ఎఱ్ఱఁగాఁజేయఁబడిన, పదం-ప్రదేశముగలుగునట్లుగా, ఓష్ఠమ్, అధరమును, జిఘ్రన్ - సీత్కారపూర్వకముగా గ్రహించుచును, గాఢమ్ - దృఢముగా-ఆలింగితాఙ్గస్సన్ - ఆలింగిత- కౌఁగిలింపఁబడిన, అంగస్సన్- దేహముగలవాఁడై, కణ్ఠమ్- కంఠమును, గృహ్ణన్- ఆలింగనముసేయుచును, అఙ్కమ్-ఒడిని, ఆరోపితాత్మా- ఆరోపిత- ఎక్కింపఁబడిన, ఆత్మాసన్- దేహముగలవాఁడై లజ్జాపదమ్-లజ్జాస్థానమును, దోర్భ్యామ్-చేతితో, అభిమృశన్-స్పృశించుచున్నవాఁడును, ధూర్త స్వామీ-ధూర్త-విటులకు, స్వామీ- అధిపతియైనవాఁడు గు బాలకృష్ణ,- బాలకృష్ణుఁడు, దురితమ్- పాపమును, దూరతః, దూరమున-హరతు-హరించుఁగాక.

ఉ॥ బాలుఁడటంచు ముద్దులిడు బాలలఁబట్టుక మోవినొక్కు-కెం। గేలఁదెమల్చి చన్నుఁగని క్రేతనముంకము మీఁదనుంపఁజా। ల్చాలుసటంచు నెత్తికొనఁ జన్గవఁబట్టుకకౌఁగిలించుగో। పాలకధూర్తశేఖరుఁడు పాపముఁ బాపికృతార్థుఁజేయుతన్॥ ౬౮

తా॥ గోపికలు చిన్నిబిడ్డఁడని తలఁచి ముద్దిడఁగా మహావిటునివలె వారుమోవి యెఱ్ఱగాఁబంటిగురుతులగులునటులఁ జుంబనము సేయుచు బిడ్డఁడని యాలింగనము సేయువారల నాలింగనము సేయుచు నొడియందెత్తిపట్టుకొనఁగా లజ్జాస్థానమగు మదనగృహంగేల స్పృశించుచు వినోదకారియైన బాలకృష్ణుఁడు పాపములను బోఁగొట్టుంగాకయనుట.

శ్లో॥ ఏతేలక్ష్మణజానకీవిరహితంమాంఖేదయంత్యమ్బుదా మర్మాణీవచ ఘట్టయంత్యలమమీక్రూరాః కదమ్బానిలాః । ఇత్థంవ్యాహృతపూర్వజన్మచరితం యోరాధయావీక్షితస్సేర్ష్యాశఙ్కితయాసనస్సుఖయతుస్వప్నాయమానోహరిః॥ ౭౦

టీక. హేలక్ష్మణ-ఓలక్ష్మణా, ఏతే - ఈ, అమ్బుదాః - మేఘములు, జానకీవిరహితమ్ - జానకీ - సీతచేత, విరహితం - శూన్యుఁడైన, మాంప్రతి - నన్నుఁగూర్చి. ఖేదయంతి-దుఃఖించుచున్నవి, క్రూరాః, క్రూరములైన, అమీ-ఈ, కదమ్బానిలాః - కడిమిపువ్వులవాయువులు, మర్మాణి- మర్మస్థానములను-అలం-మిక్కిలి-ఘట్టయంతీవచ-ప్రహరించుచున్నవి, ఇత్థం -ఈలాగున, వ్యాహృతపూర్వజన్మచరితంయథాతథా- వ్యాహృత- చెప్పఁబడిన, పూర్వజన్మ పూర్వజననముయొక్క, చరితం-చరిత్రములుగల్గునట్టులుగా, స్వప్నాయమానః- స్వప్నము ననుభవించుచున్నవాఁడును, సేర్ష్యాశంకితయా - సేర్ష్య-అసూయతోఁగూడినట్లు, ఆశంకితయా - సందేహపడుచున్న, రాధయా - రాధచేత, వీక్షితః- చూడఁబడినవాఁడునగు, హరిః-కృష్ణుఁడు, నః-మమ్ము, సుఖయతు-సుఖవంతులుగాఁజేయుఁగాత.

శా॥ అన్నాలక్ష్మణ జానకీరహితునన్నంభోధరశ్రేణియా । సన్నంపుం బలిగాలిమర్మములునొంచంజొచ్చెనంచుంబరా । ఖిన్నత్వంబువచింపనువెలపుంగీలొల్కన్నచిత్తంబుతోఁ। దన్నుం రాధికగాంచఁగాఁగలవరింతంగూర్కువాఁడేలుతన్॥ ౭౦

తా. కృష్ణుఁడొకనాడు కలలోలక్ష్మణునిఁజూచి తనకు సీతావిరహకాలమందు మేఘములును జల్లనిగాలియు మిక్కిలి బాధకంబులైయున్నవియని తనరామావతారచరిత్రము చెప్పవిని రాధాదేవి వేఱువనితయందితనికిఁ బ్రీతియధికముగనున్నదియని యోర్వలేనితనముతోఁ గృష్ణునిఁజూచెను- అట్లుచూడఁబడినకృష్ణుఁడు మాకు సుఖముకలుగఁజేయుఁగాకయనుట.

మూ॥ బిష్టంముఖ్యచ్ఛహరేబిభేమిభవతాపాన్నైర్హతావూతనాకంతా

శ్లేషమనుం జహీహీదళి తాపాలింగనేనార్జునా — మా దేహీచ్చురి తంహిరణ్యకశిపుర్నీతోనఖైః పఞ్చతామిత్థంవారితరాత్రికేళిరవతాల్ల త్స్మ్యపహాసాద్ధరిః ॥ ౭౧

టీక. హేహరే- ఓయికృష్ణా, ఓష్ఠం- అధరమును, ముఞ్చ- విడువుమా బిభేమి- భయపడుచున్నాను, భవతా-నీచేతను, పానైః-పానములచేత, పూతనా- పూతనయనురక్కసి, హతా,చంపఁబడెను, అముంకంఠాశ్లేషం, ఈకం ఠాలింగనమును, జహీహి-విడువుమా, బిభేమి- భయపడుచున్నాను,ఆలింగ నేన- కౌఁగిలింతచేత, అర్జునా, మద్దిచెట్లు, దళితా, కొట్టఁబడినవి,ఛురితం-న ఖక్షతమును, మాదేహి- చేయకుము, బిభేమి- భయపడుచున్నాను, హిరణ్య కశిపుః- హిరణ్యకశిపుఁడు, నఖైః-గోళ్ళచేత, పఞ్చతాం- మృతిని, నీతః-పొం దింపఁబడెను, ఇత్థం - ఈప్రకారముగా, లక్ష్మ్యా - రుక్మిణీదేవిచేత, అపహా సాత్- అపహాసమనుహేతువువలన, వారితరాత్రికేళిః- వారిత- నివారింపఁ బడిన, రాత్రికేళిః-నిశాక్రీడగల, హరిః-శ్రీకృష్ణమూర్తిః, అస్మాన్-మమ్మును అవతాత్-రక్షించుఁగావుత-

ఉ ॥ అమ్మకచెల్లమోవివిడువయ్యనకు పూతనపాలెఁగ్రోలఁగాఁ। గ్రిమ్మకురొమ్ముబిగ్గినిధరంబడెమద్దులుగానగోటిచేఁ। జిమ్మకుమీహి రణ్యకథచేమదిభీతిలెనంచుఁదచ్చునల్ । బ్రిమ్మచుఁగేళిమాన్పుధమఁ బై కొనికూడినశౌరిఁగొల్చెదన్॥ ౭౧

తా. ఓకృష్ణా యోష్ఠంబువిడువుము నీవుచుంబనంబు చేసిన పూతనము డిసె నాలింగనంబుచేయకుము నీయాలింగనంబున మద్దికవగూలె నఖక్షతంబుఁ జేయకుము హిరణ్యకశిపుండు నీనఖంబుల వ్రేటుపడినీలిగెఁ గావున భయంబ గుచున్నది యనుచు నపహాసంబుగాఁబలుకు లక్ష్మీదేవిం బైకొని క్రీడించు నా రాయణుండు నను బ్రోచుంగాతయనుట.

మూ ॥ రామోనామ బభూవహుంతదబలాసీతేతిహుంతౌపితు ర్వాచాపఞ్చవటీవనే విహరతస్తామాహరద్రావణః । నిద్రార్థంజననీ కథామితిహరేర్హుంకారతశ్శృణ్వతః స్సౌమిత్రేక్వధనుర్ధనుర్ధనురితివ్య గ్రాగిరః పాతునః॥ ౭౨

టీక. హేకృష్ణ ఓకృష్ణుఁడా, రామోనామ - రాముఁడనియెడు రా జు,బభూవ-ఆయెన్- (అనియశోదకథఁజెప్పఁగా) హుం- హుంకారధ్వనిచే నంగీకరించెను, తదబలా-తత్ -ఆశ్రీరామునియొక్క, అబలా-భార్య- సీతేతి-

సవ్యే శారదచన్ద్రమండలనిభం హాయ్యఙ్గవీనం దధత్। కణ్ఠే కల్పితపుణ్డరీకనఖమప్యుద్దామదీప్తిం వహన్। దేవో దివ్యదిగమ్బరో దిశతు నస్సౌఖ్యం యశోదాశిశుః॥ ౭౫

టీ. సవ్యే-డాపలి, పాణౌ-హస్తమునందు, ఆహితరసమ్, ఆహిత-ఉంచబడిన, రసం-మధురసముగల, పాయసభక్తం-పరమాన్నమును, ముదా-సంతోషముచేత, బిభ్రత్-భరించుచున్నవాఁడును, దక్షిణే-వలపలి, పాణౌ-కరమునందు, శారదచన్ద్రమండలనిభమ్-శారద-శరత్కాలసంధమయిన, చంద్రమండల-చంద్రమండలముతోడ, నిభం-సమానమైన, హాయ్యఙ్గవీనమ్-సద్యోఘృతమును, దధత్-వహించుచున్నవాఁడును, కణ్ఠే-గళమందు, ఉద్దామదీప్తిం-ఉద్దామ-అతిశయమైన, దీప్తిం-కాంతిగల, కల్పితపుండరీకనఖమపి-కల్పితకల్పింపఁబడిన, పుండరీకనఖమపి-పులిగోరును, వహన్-వహించుచున్నవాఁడును, దివ్యదిగమ్బరః-దివ్యదిగంబరుఁడైనవాఁడును, యశోదాశిశుః-యశోదబిడ్డఁడునైన, దేవః-శ్రీకృష్ణమూర్తి, నః-మాకు, సౌఖ్యం సుఖమును, దిశతు-ఇచ్చుఁగాక.

మ॥ అలడాకేలశరన్మృగాంకనిభమాహయ్యంగవీనంబునువ్వలికేలన్ రసయుక్తపాయసముగ్రీవాబద్ధచామీకరో। జ్జ్వలశార్దూలనఖంబనంబరకటీచక్రంబుఁ బెంపొందని। చ్చలుఁ గ్రీడించుయశోదపట్టికరుణన్ సౌఖ్యంబు మాకీవుతన్॥ ౭౫

తా. డాకేలమధురరసప్రధానంబగు పరమాన్నంబును వలకేలఁ గొత్తయగు నేతిముద్దను ధరియించి పులిగోరుగళంబున వేలుఁగ దిగంబరుఁడై వెలయు గోపాలదేవుం డెల్లసౌఖ్యంబులనొసంగుఁగాతయనుట.

మూ॥ శిఞ్జానకిణికిణికిణి రభసైరజ్గణభువి రిఙ్గణైస్సదాటంతమ్। కుణుకుణుకుణుపదయుగళం కఙ్కణకరభూషణం హరిం వన్దే॥ ౭౬

టీక. శిఞ్జానకిణికిణికిణిరభసైః, శిఞ్జాన-చిఱుగంటలయొక్క, కిణికిణి-కిణికిణియనెడి, రభసైః-ధ్వనులుగల, రిఙ్గణైః-స్ఖలనములచేత, అఙ్గణభువి-ముంగిలియను ప్రదేశమందు, సదా-ఎప్పుడును, అటంతమ్-సంచరించుచున్నవాఁడును, కుణుకుణుకుణుపదయుగళం-కుణుకుణు-కుణుకుణనియెడి ధ్వనితోఁగూడిన, పదయుగళం-పాదద్వంద్వముగలవాఁడును, కఙ్కణకరభూషణం, కఙ్కణ-కణకణయనియెడి, కరభూషణం, కంకణములుగలవాఁడునునగు హరిం-శ్రీకృష్ణమూర్తింగూర్చి, వన్దే-నమస్కరించుచున్నాను,

చ॥ గణనకు నెక్కుడైన కరకంకణ నిక్వణనంబు మీఱఁగుం। కుణకుణ
నాదపాదములకుందగు హేమమణీనిపద్ధకిం। కిణికిణినాదసంభ్రమము
గీడ్పడదాటుచునందుమందిరాం। గణమునసంచరించు నయగారవు
ముద్దులబాలుఁగొల్చెదన॥ ౭౬

తా. కిణికిణియనెడు నాదంబులచే జిలుగంటలు మ్రోయ। గుంకుణ
కుణనిమేశి రావంబులఁగాలియందియలు మ్రోయంగణకణయని మెడి నిస
దంబునంగడియంబులు రవళియొనర్పనందుని ముంగిటియందు గ్రహ్మారుహారిం
గూర్చి మ్రొక్కెదననుట,

మూ ॥ సమ్యాభేసురభీణామమ్యా మాయాసయంతమనుయాం
తీమ్। లమ్యాలకమవలమ్చేతం బాలంతను విలగ్నజమ్యాలమ్॥ ౭౭

టీక. సురభీణామ్- గోవులయొక్క, సమ్యాభే - సన్మార్గమందు, అను
యాంతీమ్- వెంబడిగావచ్చుచున్న, అమ్యాం, తల్లిని-ఆయాసయంతమ్ఆయా
సమునొందించుచున్నవాఁడును, లమ్యాలకమ్ - లమ్య- వ్రేలుచున్న, అలకమ్-
చూర్ణకుంతలములు గలవాఁడును, తనువిలగ్నజమ్యాలమ్ - తను - శరీరము
నందు, విలగ్న- కూడుకొన్న, జమ్యాలమ్- బురదగలవాఁడును,తం-ఆప్రసిద్ధు
డైన, బాలం, బాలకృష్ణమూర్తిని, అవలమ్బే, ఆశ్రయించుచున్నాను॥

ఈశ్లోకార్థంబుగోపాలకృష్ణసంపత్కృ దష్టాక్షరీమంత్రధ్యానమునిసన
త్కుమారసంహితయందుఁ జెప్పంబడయున్నది॥మూ॥పఙ్చాహాయనమీశానం
ధావమానంవ్రజాఙ్గణే। కిఙ్కిణీనూపురగ్రీవా కర్ణభూషోజ్జ్వలం స్మరేత్.

ఉ॥ బాలకకేళి నాలుగుమిఁబల్లులు నాడఁగనంబవెంబడిం। గాలిమి
లేకరాగునుగునుంబరువెత్తులలాటభాగలం। బాలకుఁజక్రవాతశకటా
దివిఘాలకునంగలగ్నజం। బాలకుఁబాలకుందలఁతుఁబాలితదిక్తటలోక
పాలకున॥ ౭౮

తా. నెమ్మొగంబున నెఱిముంగురులుగ్రేల నెమ్మేనం బురదకలయం
జెరసియుండఁదనతల్లివెంట నేతేర గునగునంబరువిడు బాలకృష్ణమూర్తినా
శ్రయించుచున్నాననుట.

మూ॥ అఞ్చితపిఞ్ఛాచూడం సఞ్చితసౌజన్యవల్లవీవలయమ్।అక్షర
మణినిహితవేణుం బాలగోపాలమనిశమవలమ్బే॥ ౭౯

టీక. అఞ్చితపిఞ్ఛాచూడం. అఞ్చితఒప్పుచున్న, పిఞ్ఛా. నెమలిపురి
తోఁగూడిన, చూడం- సిగగలవాఁడును, సఞ్చితసౌజన్యవల్లవీవలయం, సఞ్చి

త-సంగ్రహింపఁబడిన, సౌజన్య-సుజనభావముగల, వల్లవీవలయం-గోపస్త్రీ సమూహముగలవాఁడును, అధరమణినిహితవేణుం -అధరమణి - మణివంటి యధరమందు, నిహిత-ఉంచఁబడిన, వేణుం - పిల్లనఁగ్రోవిగలవాఁడును, గోపాలం- గోపరిపాలకుఁడైన, బాలం_ బాలకృష్ణమూర్తిని, అవలమ్బే- ఆశ్రయించుచున్నాను-

మ॥ విలసత్పింఛవతంసుఁడై చిగురుమోవి న్వేణువుం జేర్చి కం।
దళితాలాపసుధాపరంపరలచేతం జేతనాచేతన। మ్మ్లానకున్నిశ్చలతా
చలత్వములపెంపుల్ గూర్చు సద్గోపికా। లలితాంగీసుజనత్వవంచకుని
గొల్వంగాంతుగోపాలకుఁ॥ ౭౮

తా. సిగయందలంకరింపఁబడిన నెమలిపురిమెఱయ సధరమణియందుంచిన వేణువు వెలుంగ, గోపస్త్రీసుజనభావంబు గ్రహించుచు గోపరిపాలకుండై వెలయు బాలకృష్ణు నాశ్రయించుచున్నాననుట.

మూ॥ ప్రస్తావభాగధేయం నిగమమహాగుహాంతరాధేయమ్। నర
హరిపదాభిధేయం విబుధవిధేయం మమానుసంధేయమ్॥ ౭౯

టీక. ప్రస్తావభాగధేయం-ప్రస్తావ-ప్రహ్లాదమునియొక్క, భాగధేయం-భాగ్యభూతమైనయదియు, నిగమ మహాగుహాంతరాధేయం - నిగమ - వేదములనియెడి, మహాగుహ-గొప్పగుహయొక్క, అంతః-లోపలను, ఆధేయం, ప్రతిపాదింపదగినయదియు, నరహరిపదాభిధేయం - నరహరి - నృసింహుఁడనియెడి, పద - అభిధానమునకు, అభిధేయం - చెప్పఁదగినదియు, విబుధ విధేయం- విబుధ-దేవతులకు, విధేయం-స్వాధీనమైనయదియు, మమ - నాకు అనుసన్ధేయం- అనుసంధానముచేయదఁగినదియునగు - వస్తు-వస్తువును, విచారయామి- భావించుచున్నాను॥ ఈశ్లోకము ప్రక్షిప్తమని వ్యాఖ్యాతచేనుదహరింపఁబడియెనని తెలియునది.

మ॥యమిసంభావిత మాపధేయమును బ్రహ్లాదోల్లసద్భాగధేయ।
యమునాయమ్నాయ మహాగుహాంతర నిశాంతాధేయముం బ్రోల్లస।
త్సుమనశ్శ్రేణివిధేయము న్నరమృగస్తోకాభిధానాభిధే।యముఁ గొ
ల్తుంగమలామనఃకమలనిత్యాధేయమును వేడుకన్॥ ౭౯

తా. ప్రహ్లాదమునికి భాగ్యభూతంబై నిగమగుహయందుఁ బ్రతిపాదింపఁదగినదియై నరసింహుఁడనియెడు శబ్దంబునకభిధేయంబై దైవతంబులకు విధేయంబై నాచేననుసంధింపఁబడినదియై వెలయువస్తువుం దలంచెదననుట.

మూ॥ సంసారేకింసారంకంసారేశ్చరణకమలపరిభజనమ్ । జ్యోతిఃకిమన్ధకారేయదన్ధకారేరనుస్మరణమ్॥ ౮౧.

టీక. సంసారే - సంసారమందు, సారం - ఉత్కృష్టము, కిం - ఏమి అన్ధకారే - అజ్ఞానమునందు, జ్యోతిః - తేజము, కిం-ఏది, ఇది ప్రశ్నము- ఇక నుత్తరము, కంసారేః - శ్రీకృష్ణమూర్తి యొక్క, చరణకమలపరిభజనం-చరణకమల- పాదపంకజములయొక్క, పరిభజనం - ధ్యానమును, అంధకారేః- శివునియొక్క, అనుస్మరణం- స్మరణమును, యత్ - ఎద్దియో, తత్ - అదే, పరం- శ్రేష్ఠము.... ... ... ... ※

ఉ॥ సారముగంసవైరిపదసారసచారుతరార్చనంబు సం । సారమునందునింపుధరసన్నుతిగాథతమాంధకారని । స్తారముపీనికిందగిన సద్గురుసేవయకారణంబుగా । కారయనింతకంబెనుశుభావహమైన విశేషమున్నదే॥ ౮౦

తా. సంసారంబునందు శ్రేష్ఠంబెద్దియనంగంసాంతకుండగు శ్రీకృష్ణునిపదకమలధ్యానంబు, ఇదితక్కనొండెద్దియులేదు, అజ్ఞానాంధకారంబు ననవరతంబుదొలంగంద్రోయు నేతేజంబగుననిన నంధకారారియగునుక్కంటి సంస్మరణంబు, ఇదితక్కనొండుపాయంబులేదనుట.

మూ॥ కలశనవనీతచోరే కమలాదృక్కుముదచన్ద్రికాపూరే। విహరతునన్దకుమారే చేతోమమగోపసున్దరీజారే॥

టీక. కలశనవనీతచోరే- కలశ- కుండలయందలి, నవనీత - వెన్నను, చోరే-దొంగలించుచున్నవాడును, కమలాదృక్కుముదచన్ద్రికాపూరే- కమలా- రుక్మిణీదేవియొక్క, దృక్కుముద - కన్నులనుకలువలకు, చన్ద్రికాపూరే-చంద్రికాప్రవాహమైనవాడును, గోపసుందరీజారే- గోపికావిటుడైన, నందకుమారే, శ్రీకృష్ణమూర్తియందు, మమ - నాయొక్క, చేతః-చిత్తము, విహరతు- విహరించుగాత.

ఉ॥ శ్రీరమణీమణీవికచదృక్కుముదస్మితసాంద్రచంద్రికా। సారుప్రజాంగనానివహజారుజగజ్జనతాపనోహరా । కారువిశుద్ధమానిపహృదగారుబయోనవనీతచోరునా। భీరకుమారునాహృదయవీథికయందు వసింపజేసెదన్॥

తా, కలశంబులందలి నవనీతంబుల నపహరించుచు రుక్మిణీదేవి కన్నులనియెడి కలువలకుం జెలునగవనియెడి వెన్నెలయొక్క ప్రవాహమును గలు

గం జేయుమఁ గోపికావిటుండై వెలయు నందకుమారునందు నాచిత్తంబుసంచరించుఁ గాకయనుట.

మూ॥ క స్త్వం బాలబలానుజః కిమిహ తే మన్మందిరాశఙ్కయా యుక్తం తన్నవనీతపాత్రవివరే హస్తం కిమర్థం న్యసేః। మాతః కంచన వత్సకం మృగయితుం మాగా విషాదం క్షణాదిత్యేవం వరవల్లవీప్రతివచః కృష్ణస్స పుష్ణాతు నః॥ ౮౨

అవతరణిక. కవి యీశ్లోకంబు వెన్నవపహరించు శ్రీకృష్ణునియొక్కయు నొకగోపికయొక్కయు నుక్తిప్రత్యుక్తిమాలికం జెప్పుచున్నాఁడు॥

టీక. హేబాల - ఓయిబాలుఁడా, త్వం-నీవు, కః - ఎవ్వఁడవు,(ఇది గోపికవచనము) బలానుజః - బల-బలరామునియొక్క, అనుజః- తమ్ముఁడను (ఇదికృష్ణవచనము) తే-నీకు, ఇహ-ఈనాయింటను, కిం,ఏమిప్రయోజనము. (ఇదిగోపికవచనము) మన్మందిరాశఙ్కయా - మత్ - నాయొక్క, మందిర-ఇల్లనియెడి, శఙ్కయా- సందేహముచేతను (ఇదికృష్ణవచనము) తత్ - అది, యుక్తం- యుక్తము. నవనీతపాత్రవివరే - నవనీతపాత్రవిశేషమందు, కిమర్థం - ఏమినిమిత్తము, హస్తం - కరమును, న్యసేః - ఉంచినవాఁడవైతివి (ఇది గోపికవచనము) హేమాతః- ఓతల్లీ,కంచన- ఒకటైనమైన,వత్సకం- దూడను, మృగయితుం- వెదకుకొఅకు, క్షణాత్ - క్షణకాలమాత్రము, విషాదం- ఖేదమును, మాగాః-పొందకుము. ఇత్యేవం- అనిఈప్రకారము, కృష్ణస్య- కృష్ణునియొక్క - వరవల్లవీప్రతివచః- వర- శ్రేష్ఠమైన- వల్లవీ-గోపికయొక్క,ప్రతివచః- ప్రత్యుత్తరము,నః-మమ్ము,పుష్ణాతు- రక్షించుఁగావుత॥ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణైకాదశాక్షరీ మంత్రధ్యానమని సనత్కుమార సంహితయందుఁ జెప్పంబడియె॥ శ్లో॥ హరంతం నవనీతాదీన్ చౌర్యేణ వ్రజయోషితామ్। సగోపాలైర్వృతం కృష్ణం ధ్యాయేన్మంత్రం జపేదిదమ్॥

ఉ॥ చిన్నికుమారయెవ్వఁడవు సీరికిఁ దమ్ముఁడనేఁ యిందురా।మన్నిలయంబటంచు నిదీమంచిదె కేలటుసాచె దేటికి।వెన్నపసంటిలో నజననీయొకదూడను జూడవచ్చితిన్ ।విన్నదనంబుమానుమని వేతఁకుబల్కుమురారిఁ గొల్చెదన్॥ ౮౨

తా. ఓకృష్ణా నీవెవ్వండవనిన నేబలరాముని తమ్ముఁడనన నీకిక్కడనేమిపనియనన నాయిల్లను భ్రాంతిచేవచ్చితిననియె నదియుక్తంబకాని వెన్నపసంటలో నొంచి వేవ వేసినిన దూడను వెదకుచున్నాను నీవు నుతీవే దియు నెంచకనీ

యని యివ్విధంబున గోపికతోడం బలుకు శ్రీకృష్ణుని వచనంబు నస్నుం బ్రోచుం గాతయనుట.

మూ॥ గోపాలాజిరకర్దమే విహరసే విప్రాధ్వరే లజ్జసే బ్రూషే గో కులహుంకృతైస్స్తుతిశతైర్మౌనం విధత్సే విదామ్। దాస్యం గోకులపుం శ్చలీషు కురుషే స్వామ్యం న దాంతాత్మసు జ్ఞాతం కృష్ణ తవాంఘ్రిపంకజయుగం ప్రేమా చలం మంజులమ్॥ ౮౨

టీక . హే కృష్ణ- ఓయి కృష్ణుఁడా, గోపాలాజిరకర్దమే - గోపాల- గోపాలకులయొక్క, అజిర - ఇంటిముంగిళ్లయందలి, కర్దమే - పంకమందు, విహరసే- విహరింతువు, విప్రాధ్వరే-బ్రాహ్మణయజ్ఞమునందు, లజ్జసే-సిగ్గు నొందుదువు, గోకులహుంకృతైః- గోకుల- పశుసమూహములయొక్క, హుం కృతైః- హుంకారధ్వనులతోటి, బ్రూషే-పలుకుచున్నావు, విదామ్- జ్ఞాను లకు, స్తుతిశతైః- అనేకస్తోత్రములచేత, మౌనం-మూకతను, విధత్సే- చేయు చున్నావు గోకులపుంశ్చలీషు, గోకుల, నందవ్రజమునందలి, పుంశ్చలీషు- స్వై రిణులవిషయమై, దాస్యం- దాసభావమును, కురుషే - చేయుదువు, దాంతా త్మసు, దాంత-విషయములవలన నివృత్తమైన, ఆత్మసు- మనస్సుగలవారలవిషయ మయి, స్వామ్యం- స్వామిత్వమును, నకురుషే-చేయవు, అతః, ఈహేతువు వలన, మంజులం, సుందరమైన, తవ-నీయొక్క, అంఘ్రిపంకజయుగ - పాద కమలద్వంద్వము, ప్రేమా, ప్రేమ, మయా- నాచేత, అచం - స్థిరముగా జ్ఞాతం, తెలియఁబడియెను.

మ ॥ క్రతుభూమిం బోరఁబోవు గోపగృహపంకంబున్ననె ట్టే వు గో।తతిహుంకారము విస్సఁ బల్కెదవు విద్వచ్ఛ్లోకీంబల్కవా।నతిఁ గావింతువు గోపజారలకు దాంతశ్రేణిం గైకోవు యో।గ్యతయే హేతువు ప్రేమకారణముగా దాసేవసీ చర్యకుఁ॥ ౮౩

తా. ఓకృష్ణా గోపాలగృహంబుల ముంగిళ్ళబురుదయందు బొరలుదువు బ్రాహ్మణయజ్ఞంబులకుం బోవ సిగ్గుపడియెదవు ఆవులగుంపుల హుంకారంబులకు మారువల్కెదు విజ్ఞానులతోడం బలుకకుండుదువు గోపకాంతలకు దాస్యంబు సేయుదువు ఆస్తికులకుఁ బ్రభుత్వంబు నైన చేయనోపవిట్టిసీచరితంబు సూడ నెద్దియుఁ గారణంబు లేదు ప్రేమయొక్కటియె కారణంబనుట.

మూ॥ నమస్తస్మై యశోదాయాం దాయాదాయాస్తు తేజసే। యద్ధిరాధాముఖాంభోజం భోజం భోజం వ్యవర్ధత॥ ౮౪

టీక. యత్ - ఏ తేజము, రాధాముఖామ్భోజం - రాధా - రాధయొక్క, ముఖామ్భోజం - ముఖకమలమును, భోజంభోజం - భుజించిభుజించి, వ్యవర్ధత - వృద్ధిపొందెనో, తస్మై - ఆప్రసిద్ధమైనట్టిన్ని, యశోదాదాయాద - యశోదయొక్క, దాయాద - పుత్రుండయిన, తేజసే - తేజముకొఱకు, నమః - నమస్కారము, అస్తు - అగుగాత.

ఉ ॥ ఏమహితప్రకాశ ముదయించిన పిమ్మట నాఁటనుండి రా ।
ధామధురాధరాంచిత సుధారసధారలఁ గ్రోలుచున్ యశో । దామ
హనీయదాయ సముదాయముఁ గాంచి ప్రవృద్ధమానమౌ । నామహ
మిమ్ముఁ గాక హరహంబున శేష సుఖాయమున్నమన్॥ ౮౪

తా. రాధాముఖకమలం బాఘ్రాణించుచుఁ బరివృద్ధంబైన యట్టియశోదాసుతరూపంబగు తేజంబుకొఱకు నమస్కరించెద ననుట.

మూ॥ అవతారాస్సన్త్వన్యే సరసిజనయనస్య సర్వతోభద్రాః ।
కృష్ణాదన్యః కోవా ప్రభవతి గోగోపగోపికాముక్త్యై॥ ౮౫

టీక. సరసిజనయనస్య - పుండరీకాక్షునియొక్క, సర్వతోభద్రాః - ఎల్లెడలశుభంబుగలుగ, అన్యే - కొన్నియైన, అవతారాః - అవతారములు, సన్తు - ఉండుంగాత, కృష్ణాత్ - శ్రీకృష్ణావతారమున కన్నను, అన్యః - ఇతరమైన, కోవా - ఏయవతారము, గోగోపగోపికాముక్త్యై - గో - గోవులయు, గోప - గోపాలకులయు, గోపికా - గోపికలయు, ముక్త్యై - ముక్తికొఱకు, ప్రభవతి - సమర్థమగుచున్నది.

మ ॥ అవతారంబులు లేవె శౌరికతికల్యాణంబు లీధాత్రిలో । నవి
షెన్కల్గలవెంచ గోనికర గోపానీక గోపాంగనా । నివహశ్రేయము
సంగఁజాలెనె కృపానిర్నిద్రుఁడైనట్టిశౌ । రివలెన్వేల్లోకము సాక్షిగా
పునఁదదంఘ్రిం గొల్తు నెల్లప్పుడున్॥ ౮౫

తా. తెల్లతామరరేకులుంబోలు కన్నులుగల శ్రియఃపతి యవతారంబు లెల్లెడల ననేకశుభాకరంబులై యనేకంబులుండనిమ్ము గోగోపాలక గోపికాసమూహంబుల ముక్తిఁగనుచుటకు శ్రీకృష్ణావతారంబు దక్కనొండెద్దియు సమర్థంబులుగావనుట పశువులు మొదలగువానికి మోక్షంబిచ్చుటకుం గృష్ణావతారంబ కారణంబయ్యెననుట.

✓ శ్లో॥ మధ్యేగోకులమండలం ప్రతిదిశం చామ్భారవోజ్జృంభితే।
ప్రాతర్దోహమహోత్సవే నవఘనశ్యామం రణన్నూపురం । ఫాలే
బాలవిభూషణం కటీరణత్సత్కింకిణీ మేఖలం కంఠేవ్యాఘ్రనఖంచ
శైశవకళాకల్యాణకార్త్స్న్యం భజే॥ ౮౬

టీక- ప్రాతర్దోహమహోత్సవే - ప్రాతర్దోహ - రేపకడఁబిదుకుటయనియెడి, మహోత్సవే - ఉత్సవమునందు, ప్రతిదిశం- ప్రతిదిశయందును, అమ్భారవోజ్జృమ్భితే - అమ్భారవ- అంభా యనియెడి ధ్వనులచేత, ఉజ్జృమ్భితే - మిక్కిలియుఁ బ్రకాశించుచున్న, మధ్యేగోకులమండలం- గోసమూహమధ్యప్రదేశమందు, నవఘనశ్యామం - నవ - నూతనమయిన, ఘన - మేఘమువలె, శ్యామం- నల్లనయినయట్టిన్ని, రణన్నూపురం - రణత్-మ్రోయుచున్న, నూపురం- కాలియందియలుగలయట్టిన్ని, ఫాలే - నొసటియందు, బాలవిభూషణం - రావిరేకగలయట్టిన్ని, కంఠే - కంఠమునందు, వ్యాఘ్రనఖం-పులిగోరుగలయట్టిన్ని, కటీరణత్సత్కింకిణీమేఖలం-కటి - పిఱుదులయందు, రణత్- మ్రోయుచున్న, సత్ - శ్రేష్ఠమైన, కింకిణీ - చిఱుగంటలుగల, మేఖలం మొలనూలుగల, శైశవకళాకల్యాణకార్త్స్న్యం- శైశవ - శిశుసంబంధమైన, కళా-కళలయొక్క, కల్యాణ - శుభములయొక్క, కార్త్స్న్యం - సర్వమును, భజే- సేవించుచున్నాను, అహం-నేను. ఈశ్లోకార్థము గోపాలకృష్ణ సర్వస్వ మృత్యుదష్టాక్షరీ మంత్రధ్యానమని సనత్కుమారసంహితయందుఁ జెప్పంబడియున్నది॥ శ్లో॥ పంచవర్షమతిలోలం ధావమానం ప్రజాఙ్గణే। కింకిణీనూపురగ్రీవా కర్ణభూషోజ్జ్వలంస్మరేత్॥

మ॥ మొలనూలుం జెలుఁగజ్జెలు న్మొలయఁజేమూఁతా కృతింజేరిమం।
దలనంభారవ మెల్లెడంజెలఁగఁ బ్రాతర్దోహమీక్షింపఁజా। రులలాటం
బునరావిరేకపులిగోరుం గంఠవీధిన్ దటి । త్తులగాముద్దులు గుల్కఁ బా
లకుసిఁ గాంతుఁ జీవనప్రౌఢికిన్॥ ౮౭

తా. రేపకడం బాలుపిదుకునప్పుడంభారవంబు లెల్లెడలం జెలంగ వెలయు నావులగుంపులచే నొప్పెడు వ్రేపల్లెయందు గప్పముగులు చేసెడంచు నెన్నోసుదనరం బులిగోరుపతకంబును జిఱుగంటల మొలనూలుఁ గాళ్లయందియలు రావిరేకయును మెఱయ నెల్లవారునచ్చెరువు నొందఁగలయ గుఱ్ఱన్నారు చిన్ని కృష్ణుని చిన్ననాటి చేయ్యలఁదలంచి భజియించెదననుట.

మా॥సజలజలదనీలం దర్శితోదారలీలం కరతలధృతశైలం వేణు

నాదైరసాలం । వ్రజజనకులపాలం కామినీకేళిలోలం కలితలలితమా
లం నౌమిగోపాలబాలమ్॥ ౮౭

టీక. సజలజలదనీలం - సజల - ఉదకముతోఁగూడిన, జలద, మేఘము వలె, నీలం- నల్లనైనవాఁడును. దర్శితోదారలీలం-దర్శిత - చూపఁబడిన,ఉదార-అధికములయిన- లీలం- పూతనావధాది విలాసములు గలవాఁడును, కరతలధృతశైలం - కరతల- హస్తప్రదేశముచేత, ధృత-ధరియింపఁబడిన, శైలం- గోవర్ధనపర్వతముగలవాఁడును, వేణునాదైః- వేణునాదములచేత,రసాలం, రసవంతుఁడైనవాఁడును, వ్రజజనకులపాలం - వ్రజ- నందవ్రజమండలి,జనకుల - జనసమూహముయొక్క, పాలం - పరిపాలకుండైన వాఁడును, కామినీకేళిలోలం - కామినీ - కామవతులయిన స్త్రీలయొక్క, కేళి- క్రీడలయందు, లోలం- ఆసక్తోఁగూడికొనినవాఁడును, కలితలలితమాలం - కలిత - కూడుకొనినయదియు, లలిత - కోమలములైనదియునైన, మాలం- నవమాలికగల, గోపాలబాలం - గోపాలకృష్ణుని, నౌమి - నుతించుచున్నాను.

మ॥ మురళీనాద విశాలుశీలమణి జీమూతాత నీనీలునీ । రరుహా
క్షీరతిలోలుహంత జలజాగ్రన్యస్తశైలుంసదా । దరశీలుꣳవ్రజలోక
పాలుఁగరుణోదారైకలీలుꣳ భుజాం । తరరాజద్వన మాలుఁగొల్చె
దసముద్యద్గోపబాలున్మదిꣳ॥ ౮౭

తా. ఉదకంబులోఁగూడిన మేఘంబుఁబోలె నల్లనగుచుఁ జూపంబడిన గంభీరంబులగు పూతనాహరణాది క్రీడలుగలిగి కేలంగీలించిన గోవర్ధనాచలంబుగలిగి వేణునాదంబుననైన యాహ్లాదంబుతోడంగూడి నందవ్రజంబునందున్న వారలంబ్రోచుచు కామవతులైన యువతులకోరికలం దీర్చుచు వైజయంతియనుపేరం దేజరిల్లు వనమాలిక యురంబునఁ గరంబుమెఱయ వెలుంగుగోపాలదేవుని నుతియించుచున్నాననుట.

మా॥ స్మితలలితకపోలం స్నిగ్ధసంగీతలోలం లలితచికురజాలంచౌ
ర్యచాతుర్యలీలమ్ । శతమఖరిపుకాలం శాతకుంభాభచేలం కువలయ
దళనీలం నౌమిగోపాలబాలమ్॥ ౮౮

టీక. స్మితలలితకపోలం- స్మిత- చిఱునగవనియెడి హేతువుచేత, లలిత-సుందరమైన, కపోలం- చెక్కిళ్ళుగలవాఁడును, స్నిగ్ధసంగీతలోలం - స్నిగ్ధ పరిశుద్ధహృదయులైన నారదాదులయొక్క, సంగీత - గానమందు, లోలం - ఆసజేయుచున్న వాఁడును, లలితచికురజాలం- లలిత- సుందరములయిన, చిక

ర- ముంగురులయొక్క, జాలం, సమూహముగలవాఁడును, చౌర్యచాతుర్య లీలం- చౌర్య-చోరకర్మమందు, చాతుర్య-చాతుర్యముతోఁగూడిన,లీలం-క్రీడ గలవాఁడును, శతమఖరిపుకాలం - శతమఖ ఇంద్రునికి, రిపు- శత్రువులయినర క్కసులకు, కాలం- యముఁడైనవాఁడును, శాతకుంభాభచేలం- శాతకుంభ బంగారుయొక్క, ఆభ, కాంతివంటికాంతిగల, చేలం, వస్త్రముగలవాఁడు ను, కువలయదళనీలం, కువలయదళ - నల్లకలువరేకులవలె, నీలం,నల్లనైన- గోపాలబాలం- గోపాలకృష్ణుని, నౌమి- నుతించుచున్నాను.

మ॥ సరసస్మేరకపోలుఁగొల్తు మురళీసంగీతలోలుఁ దశుభా । కర చామీకరచేలునీలమణిరంగత్కుంతలశ్రీవిశా । లురమాపాలుని తాం తచౌర్యగుణ శీలుందానవప్రాణహృ । త్కరవాలుం గపిలాదనీకువల యోద్యన్నీలు గోపాలునిన్॥ ౦౦

తా. చిఱునగవుచే సుందరంబులగు చెక్కిళ్ళు గలిగి నారదాదుల సంగీతంబునందాసక్తుండై లలితంబులగు ముంగురులచేఁ జెజరిల్లుచు దొంగ తనంబునందలి చాతుర్యంబుగలిగి యెల్లరక్కసులకు నంతకుండై బంగరుచేలం బుచే నలంకృతుండై కువలయదళంబుంబోని నెమ్మేనిచాయచే వెలయు గో పాలకృష్ణుని నుతించుచున్నాననుట.

మూ॥ మురళీనినదలోలం ముగ్ధమాయూరచూడం దళితదనుజ జాలం ధన్యసౌజన్యలీలమ్ । పరహితనవహేలం పద్మసద్మానుకూలం నవజలధరనీలం నౌమిగోపాలబాలమ్॥ ౭౮

టీ. మురళీనినదలోలం - మురళీనినద - వేణునాదమందు, లోలం ఆ సఁ చేయుచున్న వాఁడును, ముగ్ధమాయూరచూడం - ముగ్ధ - సుందరమైనఁ మాయూరచూడం - నెమలిపురిగలవాఁడును, దళితదనుజజాలం - దళిత-భేదిం పఁబడిన, దనుజ-రక్కసులయొక్క, జాలం- సమూహముగలవాఁడును,ధన్య సౌజన్యలీలం ధన్య - కృతార్థులవిషయమై, సౌజన్య,సుజనత్వముతోఁగూడిన, లీలం - విలాసముగలవాఁడును, పరహితనవహేలం - పర, అన్యులకు, హిత - హితకరములైనవియు, నవ- నూతనములైనవియునగు- హేలం, విలాసములుగలవాఁడును, (మఱియొకపక్షమున) పర,శత్రువులకు, హిత, హితకరములగు, నవ,నూతనములైన, హేలం - వధాదివిలాసములు గలవాఁ డును, (అనఁగా శ్రీకృష్ణునిచేఁ జేయఁబడు వధాదికృత్యములైననుముక్తిసం పాదకములగుననిభావము) పద్మసద్మానుకూలం-పద్మసద్మ - బ్రహ్మకు, అను

కూలం - అనుకూలుఁడైనవాఁడును, (పక్షాంతరమున) పద్మసద్మా- లక్ష్మీదే వికి, అనుకూలం-అనుకూలనాయకుఁడైనవాఁడును. నవజలధరనీలం-నవజలధర-క్రొ్త్తమొగులువలె, నీలం - నల్లనైనవాఁడునైన, గోపాలబాలం - గోపాల కృష్ణుని, నౌమి- స్తుతియించుచున్నాను.

చ॥ మురళీనినాదలోలు నతిముగ్ధశిఖావళి పింఛచూలు నిం।బరహిత
శీలు రాత్రిచరపాళివిఘాలుఁ గృతార్థలోలుఁబం । కరుహగృహాను
పాలు వ్రజకంజముఖీహిత హేలు నవ్యపు।ష్కరధరనీలుఁగొల్తు శుభ
కాంచనచేలుని గోపబాలునిన్॥ ౭౯

తా. వేణునాదంబునం దాసక్తుండై సిగయందు నెమలిపురి యలంకరించి యెల్లరకళ్లకుసులంజకఁడంచుచు ధన్యులయెడ సౌజన్యంబు నెఱపుచు శత్రుల కువధాదికృత్యంబులచే మోక్షంబొసంగఁజాలి సిరికనుకూలుండై నీలమేఘ నిభశరీరుండై వెలయు గోపాలబాలుని నుతియించుచున్నాననుట.

మూ॥ సరసగుణనికాయం సచ్చిదానందకాయం శమితసకల
మాయం సత్యలక్ష్మీసహాయమ్ । శమదమసముదాయం శాన్తసర్వా
న్తరాయం సుహృదయజనదాయం నౌమిగోపాలరాయమ్॥ ౮౦

టీక. సరసగుణనికాయం - సరస-రసయుక్తములైన, గుణ- సౌందర్యాది గుణముల యొక్క, నికాయం - సమూహము గలవాఁడును సచ్చిదానందకాయం - సత్యజ్ఞానానంద స్వరూపుఁడైన వాఁడును, శమిత సకలమాయం_ శమిత, శాంతిఁబొందింపఁబడిన, సకల-సమస్తమయిన, మాయం-మాయలుగలవాఁడును, సత్యలక్ష్మీసహాయం - సత్యలక్ష్మి - సత్యభామారూపమైనలక్ష్మికి, సహాయం- సహాయుఁడైనవాఁడును, శమదమసముదాయం-శమ-బహిరింద్రియ నివృత్తియొక్కయును, దమ-అంతరింద్రియనివృత్తియొక్కయును, సముదాయం - స్వరూపుఁడైనవాఁడును, శాంతసర్వాంతరాయం, శాంత-నష్టములైన, సర్వ- సమస్తములైన, అంతరాయం - విఘ్నములుగలవాఁడును, సుహృదయజనదాయం, సుహృదయ- నిర్మలాంతరంగులైన, జన- జనములకు, దాయం- భాగ్యమైనవాఁడునైన-, గోపాలరాయం- గోపాల-గోపాలకులకు, రాయం- ధనమైనకృష్ణుని, నౌమి- నుతియించుచున్నాను.

చ॥ సరసగుణోదయున్ శమిత సర్వనిశాచర మాయునిన్ సు
హృ । న్నరవరదాయు నిత్యచిదనంత సుఖోజ్జ్వలకాయు సత్యకా ।
మారిణ్యిగిందిరాచిర సహాయుని శాంత మహాపరాయుఁజి । త్వరుద

మనోంతముఖ్య సముదాయునిఁ గొల్చెద గోపబాలునిన్॥ ౯౦

తా. సౌందర్యాది గుణంబుల రాశియై సత్యజ్ఞానానందశరీరుండై యెల్లరకును మాయలనడంచువాఁడయి సత్యభామాసమేతుండై శమదమాదిగుణసముదాయుండై యశేషవిఘ్నోపశమనుండై నిర్మలాంతరంగులగువారలకేర్పడినదాయంబు బోలె వెలుంగు గోపాలబాలుని నుతియించుచున్నానని యర్థము.

మూ॥ లక్ష్మీకళత్రం లలితాబ్జనేత్రం పూర్ణేందువక్త్రం పురుహూతమిత్రమ్। కారుణ్యపాత్రం కమనీయగాత్రం వందే పవిత్రం వసుదేవపుత్రమ్॥ ౯౧

టీక. లక్ష్మీకళత్రం, లక్ష్మీ-రుక్మిణి, కళత్రం-భార్యగాఁగలిగినవాఁడును, లలితాబ్జనేత్రం, లలిత-సుందరములైన, అబ్జ-కమలములవంటి, నేత్రం-నేత్రములుగలవాఁడును, పూర్ణేందువక్త్రం- పూర్ణేందు- రాకాచంద్రునివంటి, వక్త్రం-ముఖముగలవాఁడును, పురుహూతమిత్రం-పురుహూత-ఇంద్రునియొక్క, మిత్రం-మిత్రుఁడైనవాఁడును, కారుణ్యపాత్రం-కారుణ్య-దయకు, పాత్రం- ఆధారుఁడైనవాఁడును, కమనీయగాత్రం - కమనీయ- కోరఁదగిన, గాత్రం - శరీరముగలవాఁడును, పవిత్రం - శుచిస్వరూపుఁడైనవాఁడునైన, వసుదేవపుత్రం- వసుదేవ-వసుదేవునియొక్క, పుత్రం-కుమారుఁడైన శ్రీకృష్ణునిఁగూర్చి, వందే-నమస్కరించుచున్నాను.

ఉ॥ శ్రీరమణీకళత్రు సరసీరుహపత్రవిశాలనేత్రు బ్రం। ద్వారకానాథమిత్రుఁ గరుణాగుణపాత్రుఁ బవిత్రుఁ బూర్ణిమా। నీరజవైరివక్త్రుఁ గమనీయవయఃపటుగాత్రు యోగభృ। ద్ధీరవనాఘచైత్రు వసుదేవునిపుత్రు మదిం దలంచెదన్॥ ౯౧

తా. రుక్మిణీదేవిని భార్యగాఁ గలిగి తెల్లదామరరేకులంబోలిన కన్నులచేఁ దేజరిల్లుచుఁ బూర్ణిమాచంద్రునింబురడించు నెమ్మొగంబు గలిగి దేవేంద్రునికి మిత్రుండై దయాసముద్రుండై యెల్లవారిచేతం గోరందగిన నెమ్మేనుగలిగి పవిత్రుండై వెలయు గోపాలకృష్ణునిం గూర్చి నేను నమస్కరించుచున్నాను.

మూ॥ మదమయమదమయదురగం యమునామవతీర్య వీర్యశాలీ యః। మమ రణితమురతరసకృతి శమనపరస్సః క్రియాత్ శ్రీకృష్ణః॥ ౯౨

టీక. యః-ఏకృష్ణుఁడు, వీర్యశాలీ - వీర్య- పరాక్రమముచేత, శాలీ - ఒప్పుచున్నవాఁడగుచు, యమునాం- యమునానదిని, అవతీర్య- దిగి, మదమయం - మద-మదముచేత, మయం- ప్రచురమైన, ఉరగం- కాళీయోరగమును.

అదమయత్ - మర్దించెనో, అమరతిరస్కృతిశమనపరః - అమర - దేవతలయొక్క, తిరస్కృతి- తిరస్కారముయొక్క, శమన-శాంతిచేయుటయందు,పరః- ఆసక్తుఁడైన, సః-ఆశ్రీకృష్ణమూర్తి,మమ-నాకు,రతిం-సుఖమును, క్రియాతు చేయుఁగావుత.

శా ॥ కాళిందీజల ముచ్చికల్లి కెదురెకట్టంజొచ్చి హాలాహల। జ్వాలాలీఢ కరాళకాళియ ఫణాజాలంబునృత్తక్రియం । గాలంగేలన డంచినిర్జర తిరస్కారంబువారించుగో । పాలస్వామి కటాక్షవీక్షణము మాపాలందిరంబయ్యెడిన్॥ ౯౨

తా. ఏశ్రీకృష్ణమూర్తి పరాక్రమవంతుండై యమునానదిలోనంజొచ్చిమదంబుచే విఱ్ఱవీగుకాళియోరగంబు మదంబడంచెనో యెల్లదేవతల తిరస్కారంబులం బోవమీటిన యాశ్రీకృష్ణమూర్తిని నాకు శుభంబుగలుగంజేయుఁ గాతయనుట.

మూ॥ మౌళౌ మాయూరబర్హం మృగమదతిలకం చారులాలాటపట్టే కర్ణద్వంద్వేచ తాళీదళమతిమృదులంమౌక్తికంనాసికాయామ్। హారో మందారమాలా పరిమళభరితః కౌస్తుభస్యోప కంఠేపాణౌ వేణుశ్చయస్య వ్రజయువతియుతః పాతుపీతామ్బరోనః॥ ౯౩

టీక. యస్య.ఎవ్వనికి, మౌళౌ,శిరంబున, మాయూరబర్హమ్-నెమలిపురియున్నదో, లాలాటపట్టే- లాలాట- లలాటసంబంధమైన, పట్టే-ప్రదేశంబునందు, చారు-సుందరమైన, మృగమదతిలకమ్ - కస్తూరిబొట్టుగలదో, కర్ణద్వంద్వే-కర్ణ -చెవులయొక్క, ద్వంద్వే-రెంటియందు, అతిమృదులమ్-మిక్కిలిమృదువైన, తాళీదళంచ- తాళపత్రంబునున్నదో, నాసికాయామ్- ముక్కునందు, మౌక్తికం - ముత్యంబున్నదో, కౌస్తుభస్య-కౌస్తుభమణియొక్క, ఉపకంఠే- సమీపమందు, మందారమాలాపరిమళభరితః - మందారమాలా- మందారపువ్వులదండయొక్క, పరిమళ- వాసనచేత, భరితః- సంపూర్ణమైన,హారః-హారంబును, పాణౌ-చేతియందు, వేణుశ్చ - పిల్లనఁగ్రోవియునున్నదో, సః-అట్టి, వ్రజయువతియుతః - వ్రజయువతి- గోపస్త్రీలతోడ,యుతః-కూడుకొనియున్న, పీతామ్బరః - పీతాంబరధరుఁడైన శ్రీకృష్ణుఁడు, నః - మమ్ము, పాతు-రక్షించుఁగాక.

మ ॥ నుదటంగస్తురిబొట్టు నాసికతుదన్ముత్యంబు కర్ణద్వయిన్। మృదుతాళీదళయుగ్మముఖ్ మురళిపాణిన్ మౌళింబింఛంబుపే । రెద

స్పైఃగౌస్తుభహారకల్ప సుమనోహేమాంబరాడంబరం । బోధవక్త్రగో-
పికల్లేగోల్వ హరిడాయుక్త మమ్ముసెల్లప్పుడుక్॥ ౯౩

తా. సిగయందు నెమలిపురియు ఫాలంబునఁగస్తూరిబొట్టును శ్రవణయుగ్మంబునఁ దేఁతయగు తాళదళంబును మకుట కోనయందు మాత్తియంబునుగౌస్తుభమణి చెంగటమందార కుసుమవాసిత దివ్యహారంబును గరంబునఁ బిల్లనగ్రోవియుఁ జెన్నుగఁ జెన్నారఁ బీతాంబరధారియై గోపికాసమేతుండగుచిన్ని కృష్ణుఁడు మమ్ముఁగాపాడుఁగావుత యనుట,

మూ॥ మురారిణా వారివిహారకాలే మృగేక్షణానాం ముషితాంశుకానాం । కరద్వయంవా కచసంహతిర్వా ప్రమీలనంవాపరిధానమాసీత్॥ ౯౪

టీక. వారివిహారకాలే - జలక్రీడాసమయంబున, మురారిణా-కృష్ణునిచేత, ముషితాంశుకానామ్- ముషిత-అపహరింపఁబడిన_ అంశుకానామ్-వస్త్రములుగలయట్టి- మృగేక్షణానామ్- స్త్రీలకు. కరద్వయంవా - కరచేతులయొక్క, ద్వయంవా- రెండును, కచసంహతిర్వా-కచ-వెంట్రుకలయొక్క, సంహతిర్వా- సమూహంబులుఁ నిమీలనంవా- కనులనుమూసుకొనుటయును, పరిధానమ్- వస్త్రంబుగా,ఆసీత్-ఆయెను.

ఉ॥ వారివిహారకాలమున వారిరుహాక్షుఁడు చీరలెత్తఁగా । వారిజనేత్రిపాళికచ భారముకన్నులమోడ్పుచేతుల । న్వారిగమాటులై యొసఁగ వారిచరాక్షులకెల్లనారయ । న్వారికిమాటలేటికినెవారిత మోహాతనుంబుగ్రమ్మఁగన్ ౯౪

తా. జలక్రీడసలుపుచునుండెడి గోపికలు తమచీరెలను కృష్ణుండపహరింప వారిలోకొందరుచేతులతోనున్న కొందరు వెంట్రుకలతోనున్నగుహ్యములను మూసుకొనిరి కొందరుముగ్ధలు తమకన్నులను మూసుకొనఁగా తమగుహ్యంబు లితరులకుఁ దెలియవని యెంచుకొనిరనుట.

మూ॥ యాసాంగోపాఙ్గనానాం లసదసితతరాలోల లీలాకటాక్షాః। యస్యాసాచారుముక్తామణి రుచినికరవ్యోమగంగాప్రవాహః। మీనాయంతేపియాసా మతిరభసచలచ్చారు నీలాలకాన్తా । భృంగాయంతేయ దంఘ్రిద్వయ సరసిరుహేపాతు పీతాంబరోనః॥ ౯౫

టీక - యాసాంగోపాంగనానామ్-ఏగోపస్త్రీలయొక్క,లసదసితతరాలోలలీలాకటాక్షాః- లసత్- ప్రకాశించుచున్నట్టి, అసితతర-అత్యంతనీల

మైనట్టి, ఆలోల - చంచలించుచున్నట్టి, లీలా- విలాసముతోనైన, కటాక్షాః- కడగంటిచూపులు, యన్నాసాచారుముక్తామణి రుచినికరవ్యోమ గంగాప్రవాహే - యత్ - ఎవనియొక్క, నాసా - ముక్కుయొక్క, చారు - సుందరమైన, ముక్తామణి - ముత్యముయొక్క, రుచి - కాంతులయొక్క, నికర- సమూహమయ్యేవే, వ్యోమగంగా-ఆకాశగంగయొక్క, ప్రవాహే-ప్రవాహమందు,మీనాయన్తే- మత్స్యములవలె నాచరించుచున్నవో - యాసామ్-ఏగోపికలయొక్క, అతిరభసచలచ్చారునీలాలకాన్తాః - అతిరభస - అతివేగముచేత, చలత్ - చలించుచున్నట్టిన్ని, చారు- మనోహరంబైనట్టి, నీల - నీలవర్ణంబైన, అలక- ముంగురులయొక్క,అన్తాః- కొనలు-యదంఘ్రిద్వయ సరసీరుహే యత్ _ ఎవ్వనియొక్క, అంఘ్రి - పాదములయొక్క, ద్వయ - రెండను,సరసీరుహే- తామరపువ్వుయందు, భృఙ్గాయన్తే - తుమ్మెదలవలె నాచరించుచున్నవో, తాసామ్- అట్టిగోపికలయొక్క సంబంధమైనట్టి, సః - అటువంటి,పీతామ్బరః- కృష్ణుడు, నః - మమ్ము, పాతు- రక్షించుగాక.

మ ॥ సరవిన్ మీనములయ్యె నేవిభునినాసాముక్తికోద్యత్ప్రభా।
మరగంగన్ వ్రజభామినీచటుల శంపాలోల దృక్పాతులే । హరిపా
దాంబురుహంబునందునళులై వ్యాపించెగోపాంగనా । తరళారాళవి
నీలకుంతళము లాధన్యుండునన్ బ్రోవుతన్॥ ౯౫

తా. కృష్ణునిముక్కరముత్యపుకాంతిగంగా ప్రవాహమువలె ప్రసరించగా నావేడుకచూచుటవలన గోపికల చూపులందులోమత్స్యంబులవలెకనంబడుచున్నవి- అట్టిచూపులుగలగోపికలు - అనగా-మందహాసపిశేషమోయను నట్టిముత్యపుకాంతివెలుగుచుండు కృష్ణుని మొగముజూచి కామపీడను పరవశలైనగోపికలు మాకోరికలనెరవేర్చి మమ్ముకాపవలయునని వాని పాదారవిందంబులయందు ముంగురులు వ్రేలాడునట్లు నమస్కారంబుల నొనర్చెదరనుట.

శ్లో॥ యద్వేణుశ్రేణి రూపస్థిత సుషిరముఖోద్గీర్ణ నాదప్రభిన్నా
పీనాత్మ్యస్తత్క్షణేనత్రుటితనిజవతిప్రేమబన్ధాః బభూవుః । అస్తవ్యస్తాలకాంతాస్ఫుర దధరకుచద్వన్ద్వనాభిప్రదేశాః కామావేశ ప్రకల్ప్య
ప్రకటితపులకాః పాతుపీతామ్బరోనః॥ ౯౬

టీక, యద్వేణుశ్రేణిరూపస్థితసుషిర ముఖోద్గీర్ణనాదప్రభిన్నాః-యత్ - యెవ్వనియొక్క, వేణు - పిల్లనగ్రోవియందు, శ్రేణిరూప - పజ్తీరూపముగా-స్థిత- ఉన్నట్టి సుషిర - రన్ధ్రములయొక్క, ముఖ - ముఖంబులచేత,ఉద్గీర్ణ

విడువఁబడిన, నాద- ధ్వనులచేత, ప్రభిన్నాః- భేదింపఁబడినట్టి, ఏణాక్ష్యః- స్త్రీలు, తత్క్షణేన - ఆక్షణమందె, త్రుటితనిజపతి ప్రేమబంధాః । త్రుటిత- తెంపఁబడిన, నిజ - తమయొక్క, పతి - మగండ్లయందుండెడి, ప్రేమ-ప్రీతివి శేషముయొక్క, బన్ధాః - బంధముగలిగినవారై, అస్తవ్యస్తాలకాన్తాః- అస్త తిరస్కరింపఁబడిన, వ్యస్త- వీడినట్టి, అలక- ముంగురులయొక్క, అన్తాః,కొన లుగలవారుగానున్ను, స్ఫురదధరకుచద్వన్ద్వనాభిప్రదేశాః - స్ఫురత్ - అదు రుచున్న, అధర- మోవియును, కుచద్వన్ద్వ- స్తనద్వయంబును, నాభిప్రదేశా నాభిప్రదేశంబును గలవారుగానున్ను- కామావేశ ప్రకల్ప్య ప్రకటితపుల కాః - కామావేశ- మన్మథావేశముచేత, ప్రకల్ప్య - దట్టముగా జేయఁబడిన ట్టి, ప్రకటిత - బయలుబడుచున్నట్టి, పులకాః - గగ్గురులు గలవారు గాన గన్న బభూవుః - అయిరో, సః - అటువంటి - పీతామ్బరః - కృష్ణుఁడు, నః - మ మ్మును, పాతు - రక్షించుఁగాక.

మ ॥ మురళీరంధ్రవినిర్గత స్వరముచే మోహించి గోపాంగనల్।
మరుబారిన్పలు గుబ్బలుబ్బిపులకింపన్ గ్రొమ్ముడుల్వీడవా । తెరసొం
పుల్మిగుడింపనీవియును భర్తృప్రేమ ముల్జారనే । హరిసెంటన్ జరి
యింతురట్టి సుకుమారాకారుఁ గీర్తించెదన్॥ ౯౭

తా. కృష్ణుని వేణునాదంబువిని గోపికలుహృదయశైథిల్యముపొంది తమ నాయకులయందు ప్రేమవిడిచి - కృష్ణునివద్దపోవునపుడా వేగమువలన జారిన ముంగురులనుకట్టక యుపేక్షించుచు యధరకుచద్వంద్వనాభీ ప్రదేశంబులదర. కామావేశంబువలన మేనెల్లగగ్గురుపాటుగలుగ వెలుగుచుండిరనుట.

శ్లో ॥ దేవక్యా జఠరాకరే సముదితః క్రీతోగవాం పాలినా నన్దే
నానకదున్దుభేర్నిజసుతాపత్యేనపుణ్యాత్మనా।గోపాలావళిముగ్ధహార
తరళో గోపీజనాలఙ్కృతిః స్థేయాద్వోహృదిసన్తతంస మధురః కోపి
ప్రనీలోమణిః॥ ౯౮

టీక. దేవక్యాః- దేవకియొక్క, జఠరాకరే- జఠర- గర్భమను, ఆకరే ఖనియందు, సముదితః - ఉద్భవించినట్టి, పుణ్యాత్మనా-పుణ్య స్వరూపుఁడై నట్టి, నన్దేన- నందుడను,గవాంపాలినా- గోపాలకునిచేత, నిజసుతాపత్యేన-ని జసుతా-తనకూఁతురయ్యె వే. పత్యేన-మూల్యముచేత-ఆనకదుందుభేః-వసుదే వునియందుండి, క్రీతః-కొనఁబడినట్టి, గోపాలావళిముగ్ధహారతరళః-గోపాల- గొల్లవాండ్రయొక్క, ఆవలి - వరుసయును, ముగ్ధ - సుందరమయిన, హార-

ముక్తాహారంబునకు, తరళః-నాయకమణియైనదియు,గోపీజనాలఙ్కృతిః- గోపీజన- గోపికాజనంబులకు, అలఙ్కృతిః- అలంకారంబైనదియు, మధురః- మనోజ్ఞమైనదియు, కోపి - అనిర్వచనీయంబైన, ఇన్ద్రనీలోమణిః - ఇంద్రనీలరత్నము, (అనఁగా) కృష్ణుఁడు, వః- మీయొక్క, హృది-హృదయమందు,సంతతమ్-ఎల్లప్పుడును, స్థేయాత్-ఉండుఁగాక.

మ॥ వసుదేవప్రియదారగర్భఖనిజత్వంబొప్పఁజన్మించియూ। వసుదేవుండిడనందగోపుడుసుతాపణ్యంబునంచొందుఁరా। ససమానవ్రజనూలహారతరళంబై గోపికాకల్పమై। రసలీలాకృతియైన కృష్ణమణి నశ్రాంతంబదసన్నెల్పెదన్॥ ౯౭

తా.ఒకయింద్రనీలరత్నముమీహృదయంబున- అనఁగా శ్లేషచేతఁబొప్పున విలసిల్లవలయు- ఆరత్నమెట్టిదనఁగా దేవకీగర్భమనుఖనియందునద్భవిల్లి వసుదేవునియందుండినందునిచేతఁదనకూఁతురని మెడి వెలయిచ్చికొనఁబడఁగోపాల పరంపరయనుహారంబునకు నాయకమణియై గోపికలకుభూషణంబై దర్శనస్పర్శనాదులచేత ననుభవించువారలకత్యంత మనోహరంబైనది-అనగాశ్రీకృష్ణుఁడెల్లప్పుడును మీమనంబునవర్తిల్లవలయునని ముఖ్యతాత్పర్యము- తనకూఁతురనెడు వెలనిచ్చినందునిచేతఁగొనఁబడినది-అనుటకుభగవదాజ్ఞవలన యశోదాగర్భంబున మాయాస్త్రీశిశువైపుట్టఁగా వసుదేవుఁడు దేవకీగర్భమందుదయించినట్టి కృష్ణునియశోదా శయనంబుననునిచి యాశిశువు నెత్తికొని వచ్చెనను శ్రీభాగవతాదికథల ప్రమాణంబులంబట్టికొనిన శ్లోకంబులయందుబహుభావ విశేషంబులున్నవి యైనను గ్రంథవిస్తరపాతక దురూహత్వాది భయములచే విడువఁబడియె.

✓ మా॥ పీఠేపీఠనిషణ్ణబాలకగళేతిష్ఠన్ సగోపాలకోయన్త్రాన్తస్థిత దుగ్ధభాణ్డమపకృష్యాచ్ఛాద్యఘణ్టారవమ్।వక్త్రోపాన్తకృతాంజలిఃకృతశిరఃకమ్పంపిబన్యః పయః పాయాదాగతగోపికానయనయో ర్గండూషఫూత్కారకృత్॥ ౯౮

టీక. యః- ఏబాలకుఁడు, పీఠే-పీటయందు,పీఠనిషణ్ణబాలకగళే-పీట-పీటయందు, నిషణ్ణ - కూర్చొనియున్న, బాలక- బాలునియొక్క, గళే- కంఠమందు; అనఁగా- మూపులయందు, తిష్ఠన్ - నిలచియున్నవాఁడై,యన్త్రాన్తస్థితదుగ్ధభాణ్డమ్-యన్త్ర-ఉట్టియొక్క, అన్తః- నడుమ, స్థిత- ఉన్నట్టి, దుగ్ధభాణ్డమ్- పాలకడవను, అపకృష్య-వంచి, ఘణ్టారవమ్-గంటయొక్కధ్వనిని, -

ఆచ్ఛాద్య- నిలిపి- వక్త్రోపాన్తకృతాఞ్జలిః- వక్త్ర-నోటియొక్క- ఉపాన్తస మీపమందు- కృత - ఉంచఁబడిన- అంజలిః, దోయిలిగలవాఁడై-కృతశిరఃకమ్పం యథాతథా, కృత-చేయఁబడిన, శిరఃకమ్పంయథాతథా- తలయూఁచుటగలుగునట్టుగా- పయః- క్షీరంబును- పిబన్సన్ , పానముచేయుచున్నవాఁడై, ఆగతగోపికానయనయోః, ఆగత,వచ్చినట్టి, గోపికా, గోపికలయొక్క, నయనయోః, నేత్రములయందు- గండూషఫూత్కారకృత్, గండూష, నోటిపాలయొక్క, ఫూత్కార - ఉమియుటను, కృత్, చేసినట్టి,సః,గోపాలకః,ఆశ్రీకృష్ణుఁడు. పాయాత్, రక్షించుఁగాక.

ఉ॥ తోరపుఁబిడ్డగద్దియలు దొంతరగానిడి బాలునాపయిన్ జేరి
చివానిమూఁపున వసించుచునుట్టి ఘనంటిపంచిఘంటూను నిల్పిపాల్క
రమునందలయూఁచుచునానివచ్చినా । భీతికకన్నులంచు ముసిపెట్టుగ
దూఱినబూటుఁగొల్చెదన్॥ ౯౦

తా. ఒకగోపాంగనయొక్క గృహమందుదూరి యొకపీటపైమఱియొక పీటనునిచి దానిపైనొకబాలునిఁ గూర్చుండఁజేసి వానిభుజములయందు నిలుచుకొనియచ్చటఁగట్టియున్న యుట్టియందుండెడి పాలకడవనువంచి యాయుట్టియందుశబ్దించునట్టిగంటనొకచేతతోఁ బట్టుకొని మఱియొకచేతనినోటగిన్నెవలెనునిచి యాకుండనుండి కారుచున్న పాలుఁద్రాగుచు నుండునప్పుడా గోపిక రాగాఁజూచి వానికన్నులయందుఁ దననోటిపాలనుమిసి భ్రమింపఁజేసినవిలాసినైనబాలకృష్ణుఁడు మమ్ముఁబ్రోచుఁగాకయనుట.

మూ॥ యజ్ఞైరీజిమహే ధనం దదమహే పాత్రేషు నూనం వయం వృ
ద్ధాన్ భేజిమహే తపశ్చ క్రుమహే జన్మాన్తరే దుశ్చరమ్। యేనాస్మా
కమభూదనన్యసులభా భక్తిర్మధుద్వేషిణి చాణూరద్విషి భక్తకల్మష
ముషి శ్రేయఃప్రుషి శ్రీజుషి॥ ౯౯

టీక. వయమ్- మేము, జన్మాన్తరే- జన్మాంతరమందు, యజ్ఞైః యాగముచేత, ఈజిమహే- పూజించినవారము, పాత్రేషు - సత్పాత్రములయందు, ధనం- ధనంబును, దదమహే- ఇచ్చినవారము, వృద్ధాన్- జ్ఞానవృద్ధులను, భేజిమహే - సేవించినవారము, దుశ్చరం- కఠినమయిన, తపః-తపస్సును, చక్రుమహే - చేసినవారముఁ నూనమ్ - నిశ్చయము; యేన - ఏకారణముచేత, అస్మాకం- మాకు, భక్తకల్మషముషి- భక్త-భక్తులయొక్క, కల్మష- పాపము

లను- ముషి - అపహరించుచున్నవాఁడును శ్రేయఃపుషి - శ్రేయః - యశ్శ్రే య్స్సులను, పుషి- పోషించుచున్నవాఁడును, చాణూరద్విషి -చాణూర-చాణూ రుఁడనునసురునికి, ద్విషి- ద్వేషియైనవాఁడును, శ్రీజుషి- లక్ష్మీపతియైనకృష్ణు నియందు, భవద్వేషిణీ- భవ - సంసారమునకు, ద్వేషిణీ- ద్వేషియైనట్టి, అన న్యసులభా - అన్యులకుసుఖముగానొందఁగూడనటువంటి, భక్తిః- భక్తి, అ భూత్ - కలిగెను.

మ॥ మనుజన్మాంతరవేళదుష్కరతపంబుల్ పాత్రదానంబుస|జ్జనసంసేవయుసధ్వరంబు లొనరించక్ గంటిఁగాకున్నఁగ ! ల్గునెలో కోత్తరభక్తినాదుమదినాలోకింపఁబాదావనే| జనకృల్లోప్షణుదుష్టభీ షణుమహాచాణూరవిద్వేషణు॥　౯౯

తా. వేదాంతములు చెప్పినట్లుపిజన్మమందుఁ జేయకపోయినను బూర్వజ న్మంబునయజ్ఞములచే భగవత్స్వరూపులయినట్టిదేవతులను బూజించియుండు ము సత్పాత్రమందుద్రవ్యము వినియోగపఱిచియుందుమువృద్ధసేవసేసియుం దుము కృచ్ఛ్రచాంద్రాయణాదుల ననుష్ఠించియుందుము- అట్లుచేయకుందు మే నినిపుడు దుష్టులనిగ్రహించి భక్తులపాపములనెల్ల పోఁగొట్టి ధర్మాదిసకలపు రుషార్థంబుల నొసంగునట్టి లక్ష్మీపతియైన శ్రీకృష్ణునియందు నీసంసారబంధం బును బెగఁగొట్టునట్టియసాధారణ భక్తిగలుగ నేరదనుట॥ ఇచటలక్ష్మీపతియను నది యాశ్రితరక్షణాదులయందును సర్వోత్కర్షణమందును గారణమను నభి ప్రాయముచేతఁబ్రయోగింపంబడియెనని తెలియునదీ..........................

మూ॥ త్వయిప్రసన్నే మమకింగుణేన త్వయ్యప్రసన్నే మమకింగు ణేన| రక్తేవిరక్తేచ వరేవధూనాం నిరర్థకః కుంకుమపత్రభఙ్గః॥ ౧౦౦

టీక. హేకృష్ణ, ఒకృష్ణ- త్వయి-నీవు, ప్రసన్నేసతి-నాయందుదయఁ జేయుచునుండగా - మమ - నాయొక్క, గుణేన- గుణముచేత, కిమ్-ఏమిప్ర యోజనము, త్వయి-నీవు, అప్రసన్నేసతి - దయఁజేయకుండఁగా, మమ-నా యొక్క, గుణేన - గుణముచేత,కిమ్- ఏమిప్రయోజనము, వరే-నాయకుఁడు, రక్తేసతి - ఆశగలవాఁడైయుండినను, విరక్తేచ -ఆశలేనివాఁడైయుండినను, వ ధూనామ్- నాయికలయొక్క, కుంకుమపత్రభఙ్గః- కుంకుమ - కుంకుమచే తఁజేసినట్టి, పత్ర-మకరికాపత్రములయొక్క, భఙ్గః-రచన,నిరర్థకః-వ్యర్థము.

ఉ॥ నీవుప్రసన్నుడైనయెడ నేరుపు లేటికి నప్రసన్నత ! నీవుప రావుచేసినను నేరుపు లేమిటి కొంచిచూడఁగ| ప్లాపిభుఁడాదరించుస

మయంబున, నొల్లమిసేయువేళలన్ । గావలెనేలతాంగులకుఁ గైశ్రకుంకుమపత్రభంగముల్॥ ౧౦౦

తా. వరుఁడునాయికలపైనాసగలిగియుండినను నాసలేకయుండిన గుంకుమలిప్తమకరికా పత్రములయొక్క వ్రాతనిరర్థమగునటుల భగవంతుఁడు తానేరక్షింప వలయుఁగాని మనస్సుయొక్క గుణదుర్గుణములవలనవానికిదయపుట్టదనుట.

మూ॥ గాయంతిక్షణదావసానసమయే సానన్ద మిందుప్రభారున్ధత్యో నిజదన్తకాంతినివహైర్గోపాఙ్గనాగోకులే। మథ్నత్యోదధి పాణికఙ్కణఝణాత్కారానుకారం జవా ద్వ్యావల్గద్వసనాఞ్చలాయమనిశం పీతామ్బరోఽవ్యాత్సనః॥ ౧౦౧

టీక. నిజదన్తకాంతినివహైః-నిజ-తమయొక్క, దన్తకాంతి-దంతకాంతులయొక్క, నివహైః - సమూహములచేత, ఇందుప్రభాః - చంద్రకాంతులను, రుంధత్యః - తిరస్కరించుచున్నట్టిన్ని, జవాత్ - వేగమువలన, వ్యావల్గద్వసనాఞ్చలాః - వ్యావల్గత్ - విశేషముగాఁజలించుచున్న, వసనకొంగలయొక్క, అఞ్చలాః. కొనలుగలయట్టిన్ని, పాణికఙ్కణఝణాత్కారానుకారంయథాతథా- పాణికఙ్కణ, చేతికడియములయొక్క-ఝణాత్కార - ఝణఝణయనుశబ్దంబులను, అనుకారంయథాతథా - అనుకరింపఁగల్గునట్లులుగా, దధి, పెరుగును, మథ్నత్యః - చిలుకుచున్నట్టి, గోపాఙ్గనాః - గోపస్త్రీలు, గోకులే- గోకులమందు, క్షణదావసానసమయే - ప్రాతఃకాలమందు, సానన్దం-ఆనందముతోడ, యమ్ - ఎవ్వని, అనిశమ్-ఎల్లప్పుడును, గాయంతి- పాడుచున్నారో, సః- అట్టి, పీతామ్బరః-శ్రీకృష్ణుఁడు, నః -మమ్ము, అవ్యాత్-రక్షించుఁగాక,

ఉ॥ ప్రాకటకంకణారవము భాసిలిపైపెదకొంగుదూఁగఁగా। వేఁకువ మోదమొప్పనరవిందముఖుల్ పెరుగుల్ మథించుచుం । గోకవిరోధికెంగళలు గూర్చురథద్యుతిమీఱ నేహరిన్ । గోకులవాటిబాడుదురు కోరికలాహరియిచ్చుఁగావుతన్॥ ౧౦౧

తా. వ్రేపల్లెయందు గోపికలుచంద్రకాంతికినతిశయించిన దంతకాంతులు ప్రసరింపఁగాఁగోకలకొనలసియాడం జేతికంకణములశబ్దంబునకు సరిపడునట్లు పెరుగుచిలుకుచు సంతోషముతోడనేకృష్ణునింబాడుదురో ఆకృష్ణుఁడు మమ్మురక్షింపవలయుననుట-

మూ॥ అంసాలమ్బిత వామకుణ్డలభరం నన్దోన్నత భ్రూలతం కి

కించిత్కుఞ్చితకోమలాధరపుటం సాచిప్రసారేక్షణమ్ । ఆలోలాఙ్గుళిపల్లవైర్మురళికామాపూరయన్తంముదా మూలే కల్పతరోస్త్రిభఙ్గిలలితంజానేజగన్మోహనమ్॥ ౧౦౨

టీక. అంసాలమ్బితవామకుణ్డలభరమ్- అంస-మూఁపునను, ఆలమ్బిత- ఆశ్రయించినట్టి, వామ - ఎడమప్రక్కనిదైన, కుండలభరమ్ - కుండలభారముగలిగినవాఁడును, మన్దోన్నతభ్రూలతమ్- మన్ద- వంగినదియును, ఉన్నత- పొడవుగలదియునైన, భ్రూలతమ్- తీఁగెవంటిబొమలుగలవాఁడును, కించిత్కుఞ్చితకోమలాధరపుటమ్- కించిత్- కొంచెము, కుఞ్చిత- వంపఁబడిన, కోమల-మృదువైన, అధర- మోవియొక్క, పుటమ్- పుటముగలిగినవాఁడును, సాచిప్రసారేక్షణమ్- సాచి, అడ్డముగా, ప్రసార-చూపుగల, ఈక్షణమ్- నేత్రముగలవాఁడును, ఆలోలాఙ్గుళిపల్లవైః- ఆలోల- చలించుచున్న, అఙ్గుళిపల్లవైః-చిగుళ్ళవంటివ్రేళ్లచేత, మురళికామ్ - వేణువును, ముదా - సంతోషముతోడ, ఆపూరయన్తమ్- పూరించుచున్నవాఁడును, త్రిభఙ్గిలలితమ్ - త్రిభఙ్గి- మూఁడువంపులచేత, లలితమ్- సుందరమైనట్టి, జగన్మోహనమ్- జగత్ - లోకంబులను, మోహనమ్-మోహింపఁజేయునట్టికృష్ణుని, కల్పతరోః-కల్పవృక్షముయొక్క, మూలే- క్రిందిప్రదేశమందు, జానే- ఎఱుంగుచున్నాను.

ఉ॥ మూఁపునవామకుండలము మోవియొకించుక మోడ్పునందుముఁ। జూపెడునోరచూపుసొగసుం బొమనొక్కటనిక్కుఁ గన్పడం। గ్రొ ప్పునఁ గల్పకంబు క్రిందఁ ద్రిభంగిగ నిల్చియుండు నీ। వ్యాపితవంశ పూర్తియుతువర్తిలు మోహనమూర్తిఁ గొల్చెదన్॥ ౧౦౨

తా. గానకాలమందెడమప్రక్కయందుఁ దలవంగియుండుటవలనవామకుండలము మూఁపునందగులఁగా నొకబొమవంగి యొకబొమపొడవైయుండ మోవియు మోడ్పున వెలుఁగఁగాఁ జూపులడ్డముగాఁ బ్రసరింపఁగఁ జిగురుటాకులవంటి వ్రేళ్ళచేఁ బూరించి వేణుగానముసేయుచుఁ దద్వశంబున మూఁడువంకలలోఁగనంబడునట్టిమేనితోఁ గల్పవృక్షముక్రింద జగన్మోహనాకారుండై యిలనిల్చు కృష్ణుఁ దలంచుచున్నానను టు.

మూ॥ మల్లైశ్శైలేన్ద్రకల్పశ్శిశుభిరితరజైః పుష్పచాపోఙ్గనాభిర్గోపైస్తు ప్రాకృతాత్మా దివికులిశభృతా విశ్వకాయోప్రమేయః । క్రుద్ధః కంసేన కాలోభయచకితదృశా యోగిభిర్ధ్యేయమూర్తిర్దృష్టో రఙ్గావతారే హరిరమరగణానన్దకృత్పాతుయుష్మాన్॥ ౧౦౩

టీక. రఙ్గావతారే- రఙ్గ-కంసకృతమల్లరంగమునందు, అవతారే-ఆగమనమునందు, యఃహరిః- ఏకృష్ణమూర్తి-మల్లైః-చాణూరాదిమల్లుల చేత, శైలేన్ద్రకల్పః- శైలేన్ద్ర - హిమవత్పర్వతముతోడ, కల్పః - సమానుఁడగుచు, దృష్టః- చూడంబడియెనో- ఇతరజనైః-తదితరజనుల చేత, శిశుః- బాలుండగుచు, దృష్టః-చూడఁబడియెనో, అఙ్గనాభిః-యువతుల చేత, పుష్పచాపః-మన్మథుఁడగుచు, దృష్టః-చూడఁబడియెనో, గోపైస్తు- గోపాలకుల చేత, ప్రాకృతాత్మా- ప్రాకృతుఁడగుచు, దృష్టః - చూడఁబడియెనో, దివి-అంతరిక్షమందు, కులిశభృతా- ఇంద్రుని చేత, విశ్వకాయః- విశ్వ-ప్రపంచమయమయిన, కాయః- శరీరముగల, అప్రమేయః- ప్రమాణవిషయుండు కానివాఁడగుచు, దృష్టః- చూడఁబడియెనో, భయచకితదృశా- భయ- భయముచేత, చకిత-సంచలించుచున్న, దృశా - దృష్టిగల- కంసేన- కంసుని చేత, క్రుద్ధః- కోపవంతుఁడయిన, కాలః- యముఁడగుచు, దృష్టః- చూడఁబడియెనో, యోగిభిః- యోగుల చేత, ధ్యేయమూర్తిః- ధ్యేయ-ధ్యానముఁ జేయఁదగిన, మూర్తిః- స్వరూపముగలవాఁడగుచు - దృష్టః - చూడఁబడియెనో, సః- ఆప్రసిద్ధుఁడయిన, అమరగణానన్దకృత్- అమరగణ- దేవసమూహములకు, ఆనన్దకృత్- సంతసముఁ జేయుచున్నకృష్ణుఁడు, యుష్మాన్-మిమ్ము, పాతు-రక్షించుఁగావుత.

చ॥ నగమని జెట్లు పాపఁడని నాగరికుల్మరుఁ డంచుఁ గాంతలు భ్ర
గపతి విశ్వరూపుఁడని ప్రాకృతుఁడంచును గోపబాలురు। గగతిఁదన
ర్మృత్యువని కంసుఁడు యోగులుస్వామిగాఁగ సం। దగిసురలుబ్బ రం
గమునఁ దాఁగ్రాలు దేవుఁడు మిమ్ముఁ బ్రోవుతన్॥ ౧౦౩

తా. మల్లరంగంబున కంసుపురోభాగంబున నిలిచినప్పుడే హరి చాణూరాదిమల్లులచేఁ బర్వతసమానుండగుచు నితరులచే బాలుండగుచు దరుణులచే మరుండగుచు గోపాలకులచేతం దమబోఁటి ప్రాకృతుండగుచు నాకాశంబున నింద్రునిచే విశ్వమయుండగుచు భయభ్రాంతుండగు కంసునిచేఁ గాలుండగుచు యోగులచే ధ్యానార్హుండగుచు నే హరి చూడంబడియెనో యట్టి సర్వదేవతానందకరుండగు శ్రీకృష్ణమూర్తి మిమ్ముం బ్రోచుఁగాతయనుట.

మా॥ సంపిష్టోమణిశిష్టరేఖాతల మధ్యాసీనలక్ష్మీముఖే కస్తూరీతి
లకంముదావిరచయన్ హర్షాత్కుచౌసంస్పృశన్ । అన్యోన్యస్మితచ
న్ద్రికాకిసలయైరారాధయన్మన్మథం గోష్ఠీగోపవధూవృతో యదుపతిః
పాయాజ్జగన్మోహనః॥ ౧౦౪

టీక మణివిష్టరే - మణి - మరకతమణి వికారమైన, విష్టరే - ఆసనమందు, సంవిష్టః - కూర్చున్నవాఁడును, అఙ్కతలమధ్యాసీన లక్ష్మీముఖే - అఙ్కతల - తొడసందుదను, అధ్యాసీన - కూర్చున్న, లక్ష్మీ - లక్ష్మీదేవియొక్క, ముఖే - నెమ్మొగమునందు, కస్తూరీతిలకం - కస్తూరీ, కస్తూరీమయమయిన - తిలకం - కుంకుమచు, ముదా - సంతోషముచేత, విరచయన్ - దిద్దుచున్నవాఁడును, హర్షాత్ - సంతోషమువలన, కుచౌ - స్తనములను, సంస్పృశన్ - స్పృశించుచున్నవాఁడును, అన్యోన్యస్మితచన్ద్రికా కిసలయైః - అన్యోన్య - పరస్పరమును, స్మిత - చిఱునగవనియెడి, చన్ద్రికా - వెన్నెలయొక్క, కిసలయైః - చిగుళ్ళచేత, మన్మథం - మన్మథుని, ఆరాధయన్ - ఆరాధించుచున్నవాఁడును, గోపీగోపపరీవృతః - గోపీ - గోపస్త్రీలచేతను, గోప - గోపకులచేతను, పరీవృతః - పరివేష్టింపఁబడినవాఁడును, జగన్మోహనః - జగన్మోహనుఁడగు, యదుపతిః - శ్రీకృష్ణమూర్తి, నః - మమ్ము, పాయాత్ - రక్షించుఁగావుత.

చ॥ చెలువగురత్న పీఠమున శ్రీసతినంకముఁ జేర్చి కస్తురిం। దిలకము నిద్దిదిద్దితమి దీరక వెంటనగుబ్బలంటమో। ములఁదళుకొత్తునవ్వువిరిమొత్తములన్మరు పూజసేయున। చ్చెలువయువల్లవప్రకరసేవిత మోహనమూర్తిఁ బ్రోవుతన్ ౧౦౪॥

తా॥ మరకతమణీ వికారంబగు నాసనంబునం గూర్చుండి తొడపైనిడుకొన్న రుక్మిణీదేవి నెమ్మొగంబునం గస్తురిబొట్టుదిద్ది చాఁదనతమితీరక చన్నుంగవనంటుచుం బరస్పరంబు చిఱునగవు వెన్నెలమొలకలచే మారునారాధించుచుం గోపగోపీపరివృతుండై జగన్మోహనుండై నెగడుయాదవశ్రేష్ఠుఁడగు కృష్ణదేవుండు నన్నుం బ్రోచుఁగాతయనుట.

మూ॥ ఆకృష్టే వసనాఞ్చలే కువలయశ్యామా త్రపాధఃకృతా దృష్టిస్సంవలితా రుచా కుచయుగే స్వర్ణప్రభే శ్రీమతి। బాలః కశ్చన చూతపల్లవ ఇతి ప్రాప్తస్మితాస్యశ్రియం శ్లిష్యంస్తామథ రుక్మిణీం నతముఖీం కృష్ణస్స పుష్ణాతు నః॥ ౧౦౫

టీక॥ యస్యాః - ఏ రుక్మిణీదేవియొక్క, వసనాఞ్చలే - పయ్యెదచెఱఁగు, ఆకృష్టే - అపహరింపఁబడుచునుండఁగా, అథ - అనంతరము, త్రపాధఃకృతా త్రపా - సిగ్గుచేత, అధఃకృతా - క్రిందుగాఁజేయఁబడిన, కువలయశ్యామా కువలయ - నల్లకల్వలవలె, శ్యామా - నల్లనైన, దృష్టిః - చూపు, రుచా - కాంతిచేత, స్వర్ణప్రభే - స్వర్ణ - బంగారుయొక్క, ప్రభే - కాంతివంటి కాంతిగలది

యగు, శ్రీమతి- సౌందర్యయుక్తమయిన, కుచయుగే- చన్దోయియందు, సంవలితా- లగ్నమయినదియో, తామ్-ఆలజ్జాయుక్తురాలయినదియును, నతముఖీమ్- నత-నమ్రమయిన, ముఖీం - ముఖముగలదియు, బాలః- లేఁతయయిన కశ్చన-ఒకానొకటియయిన, చూతపల్లవ ఇతి-మామిడిచిగురను హేతువువలన. ప్రాన్తస్మితాస్యశ్రియం - ప్రాన్త- సమీపమున, స్మిత - చిఱునగవుగల, ఆస్యశ్రియం- ముఖకాంతిగల, రుక్మిణీం- రుక్మిణీదేవిని, శ్లిష్యం- ఆలింగనముచేయుచున్న, సః- ఆప్రసిద్ధుఁడయిన, కృష్ణః-శ్రీకృష్ణమూర్తి-నః, మమ్ము, పుష్ణాతు, పోషించుఁగావుత.

మ ॥ అలరుంబయ్యెద కొంగుదియ్యఁ దపనీయశ్రీ విడంబించు గు।
బ్బలపైఁ జిబ్బితిగబ్బి చూపు నేలఁ గొల్పం ద ద్ధ్యానస్థచూతలతాపల్ల
వరీతిఁ గాంచి స్మిత వక్త్ర ప్రౌఢయా రుక్మిణీ। లలనం గౌఁగిటఁ గారవించు
హరి కళ్యాణంబు మా కీవుత౯ ౧౮౫

తా. పైటచెఱంగు దొలంగఁ జేయ బంగరుజిగి సెలకొను సిబ్బెంపు గబ్బి గుబ్బలపై సిబ్బితిచే నధోముఖియై చూపు నేలఁ గొల్పన చ్చూపు నుం జన్దోయి పైమెఱయు బంగరుజిగియును గలయం బెరయ మావిచిగురుం బోని యకాంతిఁ జూచి మెలమావియిగురేల కొనాచన్నుం గవపై నున్నదియని భ్రాంతిం జెంది నవ్వు రుక్మిణిం గౌఁగిటం జేర్చి సుఖియించు కృష్ణుండు నన్నుఁ బ్రోచుఁగాతయనుట.

ఈశ్లోకము రుక్మిణీకృష్ణసంవాదముగఁ గవి సెప్పుచున్నాఁడు,

మూ ॥ ఉర్వ్యాం కోపి మహీధరో లఘుతరో దోర్భ్యాం ధృతో లీల
యా తేన త్వం దివిభూతలే చ సతతం గోవర్ధనో గీయసే । త్వాం త్రై
లోక్యధరం వహామి కుచయో రగ్రే న తద్గణ్యతే । కింవా కేశవ భాషణేన
బహునా పుణ్యైర్యశో లభ్యతే॥ ౧౮౬

టీక. హే కేశవ-ఓకృష్ణా- ఉర్వ్యామ్- భూమియందు, కోపి- ఒకానొకటియైన, లఘుతరః-మిక్కిలియుఁజులకనైన, మహీధరః-గోవర్ధనపర్వతము దోర్భ్యామ్- హస్తములచేత, లీలయా-విలాసముగా, ధృతః - ధరియింపఁబడియెను, తేన-ఆహేతువుచేత, త్వం-నీవు- దివి-స్వర్గమందును, భూతలేచ-భూతలమునందును, సతతం- ఎల్లప్పుడును, గోవర్ధన - గోవర్ధనపర్వతము ధరియించినవాఁడవనుచు, గీయసే - చెప్పఁబడుచున్నావు, త్రైలోక్యధరం-త్రిలోకధురంధరుడవయిన, త్వామ్ - నిన్ను, కుచయోః - స్తనములయొక్క, అగ్రే- తుదను, వహామి- వహించుచున్నాను, తత్-ఆవహనము, నగణ్యతే-

లెక్కింపఁబడలేదు, బహునా - అనేకవిధమయిన,భాషణేన- పలుకుచేత,కిం-
ఏమి ప్రయోజనము, పుణ్యైః పుణ్యములచేత, యశః- కీర్తి, లభ్యతే-పొందఁ
బడుచున్నది.

మ॥ ధరణిం జేతులనొక్కచిన్నగిరియెత్తన్నిన్నగోవర్ధనో । ద్ధర
ణుఁడంచు నుతించె నీదశదిశల్ త్రైలోక్యధాకేయని । స్వరువక్త్రోజ
ములఁ భరింపనసుఁ జేరొక్కరేవ్వరుంబున్యావి । స్ఫురణంగీర్తిఁ జెలంగుఁ
జెక్కవచనంబుల్గ ఎన్నయుం కేటికిన్॥ ౧౦౭

తా. ఓకృష్ణా యిప్పుడమియందునతెసులభంబగనొక్కచిన్నకొండం
జేతులతోనెత్తినందున కయిగోవర్ధనోద్ధరణుఁడని యెల్లజనులంబొగడ్తగాం
చితివిముల్లోకంబుల ధరియించునీవుఁ జనుస్సైనంధరియించిన నాకీర్తిగడ్తలేద
య్యె నేరికెంబు గ్యావిశేషంబులచేతందక్కినితరకర్గంబులచేతంగీర్తిఁగాంచనల
విగాదనుట.

✓ శ్లో॥ సన్ధ్యావన్దన భద్రమస్తు భవతే భోః స్నాన తుభ్యం నమో భో
దేవాః పితరశ్చ తర్పణవిధౌ నాహం క్షమః క్షమ్యతామ్ । యత్ర క్వాపి
నిషద్య యాదవకులోత్తంసస్య కంసద్విషః స్మారం స్మారమఘం హరామి
తదలం మన్యే కిమన్యేన మే॥ ౧౦౮

టీక. హేసంధ్యావందన- ఓసంధ్యావందనమా, భవతే-నీకొఱకు, భ
ద్రం- మంగళము, అస్తు- అగుంగాత, భోస్నాన - ఓస్నానమా, తుభ్యం - నీ
కొఱకు, నమః - నమస్కారము భోదేవాః - ఓదేవతలారా, భోపితరః, ఓపి
తరులారా, తర్పణవిధౌ - తర్పణ- తృప్తియొక్క, విధౌ-చేయుటయందు, నక్ష
మః-ఆశక్తుఁడను, క్షమ్యతామ్ - క్షమియింపఁదగినది, యత్రక్వాపి - ఏకడనై
నను, నిషద్య-కూర్చుండి, యాదవకులోత్తంసస్య - యాదవకుల యదువంశ
మునకు ఉత్తంసస్య - శేఖరుండగు, కంసద్విషః - కృష్ణమూర్తిని, స్మారంస్మా
రం-స్మరించిస్మరించి. అఘం పాపమును, హరామి - పోఁగొట్టుచున్నాను,త
త్- ఆకంసవిరోధిస్మరణము, అలం పాపనివృత్తికిఁజాలునని, మన్యే- తలంచు
చున్నాను, అన్యేన- ఇతరముచేత, కిం-ఏమిప్రయోజనము.

చ॥ సతతముసంధ్యకున్ శుభము స్నాన జపాదివిశేష సత్క్రి
యా । తతికిని మ్రొక్కు దేవపితృతర్పణచర్య శక్తియుక్తుఁడన్న తిగారు
జెంపఁడొక్కనియమస్థితిఁగంసరిపున్ యదూద్వహున్ । స్తుతియొన
రించి కల్మషవిధూరుఁడనౌదు ననన్యకర్మతన్॥ ౧౦౮

తా. సంధ్యావందనంబునకు శుభంబగుస్నానంబునకు మొ|| కర్తవ్యములైన దేవపితరులారాధనంబు చేయంజాలమిదియుంపుడు నేనుకంసరిపుండగు శ్రీకృష్ణునిస్మరించి పాపంబులడంచెద నిదియనాకుంజాలు నింకనన్యంబుచేనే మి ప్రయోజనంబనుట.

మూ|| హేగోపాలక హేకృపాజలనిధే హేసింధుకన్యాపతే హేకంసాన్తక హేగజేంద్రకరుణాపారీణ హేమాధవ। హేరామానుజ హేజగత్రయగురో హేపుణ్డరీకాక్ష మాం హేగోపీజననాథపాలయపరం జానామినత్వాంవినా|| ౧౧౫

టీక. హేకృపాజలనిధే - ఓదయాసముద్రుడా, హేసిన్ధుకన్యాపతే- ఓలక్ష్మీపతీ, హేగజేన్ద్రకరుణాపారీణ- గజేన్ద్ర-గజశ్రేష్ఠునివిషయమైనకరుణా- కరుణకు, పారీణ-పారంగతుండవైనవాడా, హేమాధవ-ఓయిమాధవుడా, హేరామానుజ. రామ-బలరామస్వామివారికి- అనుజ-తమ్ముండవయినవాడా, హేపుణ్డరీకాక్ష - ఓయిపుండరీకాక్షుడా, హేగోపీజననాథ, గోపీజన, గోపికాసమూహమునకు, నాథ-ప్రభుడైనవాడ, హేగోపాలక- ఓయిగోపాలకృష్ణా, మామ్-నన్ను, పాలయ-రక్షింపుమా, త్వాంవినా-నిన్ను దక్క, పరం- అన్యదైవమును, నజానామి, ఎఱుంగను.

శ్లో|| ఓకారుణ్యసముద్రయో కరటిరక్షోదీర్ణయో మాధవా। యోకంసాంతకయోరమాసహచరాయోవల్లవీకింకరా। యోకంజేక్షణయో జగద్గురుమణీయో శౌరిహేణేయానుజా। మీకన్నన్యతిన్నెవ్వ నేనెఱుగఁజుమ్మీ నన్నురక్షింపుమీ|| ౧౧౬

తా. దయాసముద్రుడవైలక్ష్మీపతివినైకంసధ్వంసకుండవైగజేంద్రునివిషయమయిన దయకుఁబారంగతుండవయి బలరామునికిందమ్ముండవైలోకత్రయంబునకును గురుండవయి గోపికాసమూహంబులకుఁబ్రభుండవైపుండరీకాక్షుండవైన యో శ్రీకృష్ణా నీకన్ననితరుని నెఱుంగ ననుంబ్రోవుమీయనుట.

మూ|| కస్తూరీతిలకం లలాటఫలకే వక్షస్థలేకౌస్తుభం నాసాగ్రేనవమౌక్తికంకరతలే వేణుంకరేకఙ్కణమ్। సర్వాఙ్గేహరిచన్దనంచ కలయన్కంఠేవముక్తావళింగోపస్త్రీపరివేష్టితోవిజయతేగోపాలచూడామణిః|| ౧౧౭

టీక. లలాటఫలకే - లలాటప్రదేశమందు, కస్తూరీతిలకం, కస్తురిబొట్టును, వక్షస్థలే, ఱొమ్మునందు, కౌస్తుభం కౌస్తుభమణియు, నాసాగ్రే ము

కుక్షితుదయందు - నవమౌక్తికం ‍శ్రేష్ఠమగు ముత్తియమును కరతలే-హస్తప్రదేశమునందు, వేణుం - పిల్లనగ్రోవియు, కరే-హస్తమునందు; కజ్కణం- కడియమును, కంఠే- గళమందు, ముక్తావళిం-ముత్తియంపుసరమును, సర్వాఙ్గే-సర్వశరీరమందును, హరిచన్దనం - శ్రీచందనమును, కలయన్ - యథాయోగ్యముగా వహించుచున్నవాఁడును, గోపస్త్రీపరివేష్టితః; గోపస్త్రీ, గోపికలచేత, పరివేష్టితః పరివేష్టింపఁబడినవాఁడునగు, గోపాలచూడామణిః- గోపాల-గోపాలకులలోపల, చూడామణిః-శిరోరత్నమగు శ్రీకృష్ణమూర్తిః; విజయతే సర్వోత్కృష్టుఁడగుంగాక.

క॥ నుదుటం గస్తురిబొట్టు నాసికతుదన్ముత్తెంబు శ్రీగంధసం। పద నెమ్మేనఁ గరంబులం గటకముల్వంశంబు హస్తాగ్రమం । దెదప్రైనిస్తులకౌస్తుభంబునయుతన్ శృంగారహారంబునిం । పొదవం గృష్ణుఁడు గోపికావృతుఁడు సర్వోత్కృష్టుఁడై వర్తిలున్॥ ౧౦౯

తా. నుదుటం గస్తురిబొట్టును ముక్కుతుదం శ్రేష్ఠమగు ముత్తియంబును నెమ్మేనహరిచందనంబునుం గరంబులం గడియంబులునుహస్తాగ్రంబున వేణువును వక్షంబునం గౌస్తుభంబును గళంబున ముత్తియముల హారంబును మెఱయ గోపికాపరివృతుఁడైనకృష్ణుఁడు సర్వోత్కృష్టుఁడై వెలయుచుండుఁగాతయనుట.

మూ॥ లోకానున్మదయన్ శ్రుతీర్ముఖరయన్ క్షోణీరుహాన్ హర్షయన్। శైలాన్విద్రవయన్మృగాన్వివశయన్గోబృందమానందయన్। గోపాన్సమ్భ్రమయన్మునీన్ముకుళయన్ సప్తస్వరాన్ జృమ్భయన్నోఙ్కారార్థముదీరయన్విజయతే వంశీనినాదశ్శిశోః॥

టీక. లోకాన్ - లోకములను, ఉన్మదయన్ - మదింపఁజేయుచున్నవాఁడును; శ్రుతీః- వేదములను, ముఖరయన్ - ధ్వనింపఁజేయుచున్నవాఁడును, క్షోణీరుహాన్ - వృక్షములను, హర్షయన్ - చిగురింపఁజేయుచున్నవాఁడును శైలాన్- పర్వతములను, విద్రవయన్- కరఁగఁజేయుచున్నవాఁడును, మృగాన్-మృగములను, వివశయన్- మూర్ఛపడం జేయుచున్నవాఁడును, గోబృందం-గోసమూహమును, ఆనందయన్- సంతోషింపఁజేయుచున్నవాఁడును, గోపాన్ గోపాలకులను, సమ్భ్రమయన్ - భ్రమియింపఁజేయుచున్నవాఁడును, మునీన్- మునులను, ముకుళయన్ - మోడ్పుఁగేలుగలవారలఁగాఁ జేయుచున్నవాఁడును సప్తస్వరాన్ - సరిగమపదనిసలను స్వరములను, జృమ్భయన్- ప్రకాశింపఁ జేయుచున్నవాఁడును, ఓఙ్కారార్థం- ప్రణవార్థమును, ఉదీరయన్,

ప్రతిపాదించుచున్న వాఁడుననగు, శ్రీ:- శ్రీకృష్ణమూర్తియొక్క, వంశీనినాదః- వేణునాదము, విజయతే, సర్వోత్కృష్టమైయుండుఁగాక.

మ॥ మృగములుసొక్కి మ్రాకులుచిగురింపఁగ తాలుగరంగ మ్రో
యఁగా। నిగమములావులుబ్బఁగఁ మునిచ్ఛటమ్రాన్పడగోవులాడఁగా।
జగము సెలంగనోంకృతి యొసంగఁగ సప్తవిధస్వరాంగుళుల్। ల్చిగుడ
గడంగెబాలమురళీ నినదంబుముదంబెసంగఁగన్॥ ౧౧౦

తా. మృగంబులు సొక్కి తాలుగరఁగ మ్రాకులుచిగురింపఁగ వేదంబులుమ్రోయఁగా గోవులుసంతసంబునాంద మునీంద్రులు ముకుళితకరులైనిల్వఁగా గోపకులుసంభ్రమింప లోకంబులు సెలంగ బ్రణవార్థంబగు పరబ్రహ్మంబువెలుంగ సప్తస్వరంబులు ప్రకాశింపశ్రీకృష్ణుని వేణుధ్వని సర్వోత్కృష్టమైవర్తిల్లెననుట.

మాలినీవృత్తము.

సతతవినుతభీమా సచ్చిదానందసీమా। శతమఖనుతనామా సా
ధుమానిప్రణామా। దితిజకులవిరామా దేవతాసార్వభౌమా।
వితతతపనధామా వేంకటాహార్యధామా॥

మ॥ ఇదికృష్ణాశ్రియ యోగిపుంగవకృపాపీయూష సారస్వ
తా। భ్యుదయశ్రీవిభవప్రసిద్ధ చిదచిద్బోధక్షమా శాంతిస
త్హృదయాభూషణ వెల్లపూడి మణిపెద్దామాత్య వెంగాగ్రణీ
గదితాశ్వాసముపొల్చు రెండవదియై కర్ణామృత శ్రీకృతిన్॥

శ్రీకృష్ణకర్ణామృతము - ద్వితీయాశ్వాసము.

సంపూర్ణము.



శ్రీ ర స్తు.

## శ్రీకృష్ణకర్ణామృతము - తృతీయాశ్వాసము.

మూ॥ అస్తి స్వస్త్యయనం సమస్తజగతా మభ్యస్తలక్ష్మీస్తనం వ
స్తుధ్వస్తరజస్తమోభిరనిశంన్యస్తంపురస్తాదివ। హస్తోదస్తగిరీంద్రమ
స్తకతరు ప్రస్తారవిస్తారిత స్రస్తస్వస్తరుసూనసంస్తరలసత్ప్రస్తావి
రాధాస్తుతమ్॥
౧॥

టీక. సమస్తజగతామ్-నిఖిలలోకములకు, స్వస్త్యయనం - రక్షకమైనయదియు, అభ్యస్తలక్ష్మీస్తనం - అభ్యస్త - బహువారసంబంధములయిన, లక్ష్మీ-రమాదేవియొక్క, స్తనం-కుచములుగలదియు,ధ్వస్తరజస్తమోభిః-ధ్వస్త- నష్టములైన, రజస్తమోభిః-రజస్తమోగుణములచేత. అనిశం- ఎప్పుడును, పురస్తాత్- ఎదుట, న్యస్తమివ-ఉంచినదానివలెనున్నయదియు, హస్తోదస్తగిరీంద్రమస్తకతరుప్రస్తారవిస్తారిత స్రస్తస్వస్తరుసూన సంస్తరలసత్ప్రస్తావిరాధాస్తుతం- హస్త-హస్తములచేత, ఉదస్త- ఎత్తఁబడిన, గిరీంద్ర - గోవర్ధనపర్వతముయొక్క, మస్తకే - శిఖరములయందలి, తరు-వృక్షములయొక్క, ప్రస్తార- సమూహములయందు, విస్తారిత - వికసించినయదియు, స్రస్త-జారుచున్నయదియునగు, స్వస్తరు- కల్పవృక్షములయొక్క, సూన-పుష్పములయొక్క, సంస్తర - సమూహలచేత, లసత్ - ప్రకాశించుచున్నదియును, ప్రస్తావి- నుతియించుచున్న, రాధా-రాధచేత, స్తుతం- స్తోత్రముఁజేయంబడుచున్నయదియునగు, వస్తు-శ్రీకృష్ణాఖ్యవస్తువు, అస్తి-కలదు.

శా॥ హస్తోదస్తగిరీంద్రమస్తకతరు వ్యత్యస్తవిస్తారిత। ప్రస్తస్వ
స్తరుసూనసంస్తరలసత్ప్రస్తారమభ్యస్తప। ద్మాస్తోకస్తనమస్తకల్మష
పుంన్యస్తంబును ద్వ్యగ్జగ। త్స్వస్తిశ్రీదమురాధికాస్తుతముఁజంచద్వ
స్తువెంతేతగుణ॥
౧॥

తా. ఎల్లలోకంబులవారలకు రక్షకంబై మాటిమాటికి సిరిచన్నులంటుచున్నదియై శుద్ధసత్వగుణంబునకు నెలవై యెల్లప్రుడును గరతలామలకంబుగనె దుటఁదోఁచుచున్నదియై కరంబున నెత్తఁబడిన గోవర్ధనంబందలితరుల నుండిజా

రుచున్నపువ్వులచేతను గల్పతరుప్రసూనంబుల చేతనుం దేజరిల్లుచు రాధికచే నుతియింపంబడుచున్న వస్తువొకటింకలదు.

మా॥ రాధారాధితవిభ్రమాద్భుతరసం లాలిత్యరత్నాకరం సాధారణ్యపదవ్యతీతసహజస్మేరాననామ్భోరుహం । ఆలమ్బేహరినీలగర్వగురుతాంసర్వస్వనిర్వాపణం బాలంవైణవికం విముగ్ధమధురంమూర్ధాభిషిక్తంమహః॥ ౨

టీక. రాధారాధితవిభ్రమాద్భుతరసం- రాధా-రాధచేత, ఆరాధిత-బహుమానింపంబడుచున్న, విభ్రమ- విలాసముచేత, అద్భుత-ఆశ్చర్యసంపాదకములైన, రసం-శృంగారరసముమొదలగు రసములుగలయదియు, సాధారణ్యపదవ్యతీతసహజస్మేరాననామ్భోరుహం- సాధారణ్యపద- సామ్యమార్గమును, వ్యతీత - అతిక్రమించినయదియు, సహజ- స్వభావసిద్ధమయిన, స్మేర - చిఱునగవుతోఁగూడిన, ఆననామ్భోరుహం- ముఖకమలముగలయదియు, హరినీలగర్వగురుతామ్- హరినీల - ఇంద్రనీలమణుల యొక్క, గర్వగురుతామ్- అహంకారాంకూరముల యొక్క, సర్వస్వనిర్వాపణం- సర్వస్వ-సమస్తపదార్థముయొక్క, నిర్వాపణం - నాశకమైనయదియు, లాలిత్యరత్నాకరం- లాలిత్య- సౌందర్యమునకు, రత్నాకరం- సముద్రమయినయదియు, వైణవికం - వేణునాదసక్తమయినయదియు, విముగ్ధమధురం - విముగ్ధ- మిక్కిలి సుందరముగలవారిలోపల, మధురం - సుందరమయినయదియు, మూర్ధాభిషిక్తం- శ్రేష్ఠమయినయదియు, బాలం- లేఁతయయినదియునగు, మహః- తేజమును, ఆలమ్బే- ఆశ్రయించుచున్నాను.

శా॥ సాధారణ్యసరణ్యతీత దరహాసశ్రీముఖాంభోజుఁడై । మాధుర్యైకనిధానుఁడైమరకతాశ్మప్రౌఢిగర్వాభ్రటీ । వైధుర్యావహతేజుఁడైసరసనిర్వ్యాజాంగశృంగారుఁడై । రాధారాధితుడైనవైణవికమూర్ధన్యున్మదింగొల్చెదన్॥ ౭

తా. రాధికచేతబహూకరింపఁబడిన విలాసంబులచేనాశ్చర్యంబుసంపాదించుచున్న శృంగారాది రసంబులకుఁ దానకంబగుచు సౌందర్యంబను రత్నంబునకుఖనియై నిరుపమానంబై స్వభావసిద్ధంబగు మందహాసంబు తోడఁగూడిననేమ్మోముదామరగలిగి యింద్రనీలంబులగర్వంబునపహసించు నదియై సుందరంబుగలవారలలోన సుందరంబై శ్రేష్ఠంబగుచు నెలయు తేజంబు నాశ్రయించుచున్నాననుట.

శ్లో॥ కరిణాం మతల్లిక గతివైభవం భజే కరుణావలమ్బిత కిశోరవిగ్రహం। యమినాం అనారత విహారి మానసే యమునావనాన్తరసికం పరం మహః॥ ౩

టీక. కరిణాం - ఏనుఁగులచేత, అలంఘ్యగతివైభవం - అలంఘ్య - అతిక్రమింపనశక్యమైన, గతివైభవమ్ - గమనసంపదగలయదియు, కరుణావలమ్బితకిశోరవిగ్రహం - కరుణా - దయచేత, అవలమ్బిత - స్వీకరింపఁబడిన, కిశోరవిగ్రహం - బాలకశరీరముగలదియు, యమినాం - ఋషులయొక్క, మానసే - మనములయందు, అనారతవిహారి అనారత - ఎల్లప్పుడును, విహారి - విహరించుచున్నదియు, యమునావనాన్తరసికం - యమునా - యమునానదియందలి, వనాన్త - వనమధ్యమునందు, రసికం - సరససంచారయుక్తమైనయదియును పరం - ఉత్కృష్టమైనదియునగు, మహః - తేజమును, భజే - సేవించుచున్నాను -

ఉ॥ అల్లనమందయానముగ జావలిగోరఁగ నూనిమానసో। త్ఫుల్లసరోజపాళిఁబదములసైలఁగఁగ యమునాతరంగిణీ। సల్లలితాంబుపూరములసారవయస్యలమీఁదఁజిమ్ముచుం। జల్లనిచూపులంగరుణఁజల్లెడునల్లనిబాలుఁగొల్చెదన్॥ ౩

తా॥ మదపుటేనుంగలచేతం గోరఁదగిన మందయానంబుగలిగి వసుదేవాదులయందలి కరుణచే బాలస్వరూపంబునం జెలువొందిది యెల్లమునులమనంబులం దేజరిల్లుచు యమునయందలి యుదకంబులం జల్లుపోరాడ సరసంబైన తేజంబు సేవించుచున్నానని యనుట.

శ్లో॥ నియన్త్రితత్సకలజగద్వ్రజాఙ్గనాని యన్త్రితం విపులవిలోచనాజ్ఞయా। నిరన్తరం మమహృదయే విజృమ్భతాం సమస్తతస్సరసతరం పరం మహః॥ ౪

టీక. యత్ - ఏ తేజము, సకలజగత్ - సమస్తలోకమును, నియన్త్రి - నియమించుచున్నదియో. విపులవిలోచనాజ్ఞయా - విపుల - విశాలములయిన, విలోచన - నేత్రములయొక్క, ఆజ్ఞయా - ఆజ్ఞచేత, వ్రజాఙ్గనానియన్త్రితం వ్రజాఙ్గనా - గోపస్త్రీలచేత, నియన్త్రితం - నియమింపఁబడినయదియో, సమస్తతః - అంతటను, సరసతరం - మిక్కిలియు సరసమయినయదియో, పరం - ఉత్కృష్టమయినదియో, తత్ - ఆప్రసిద్ధమయిన, మహః - తేజము, మమ - నాయొక్క, హృదయే - ఎదయందు, నిరన్తరం - ఎల్లప్పుడును, విజృమ్భతామ్ - ప్రకాశించుఁగావుత.

ఉ॥ లోకములన్నియుందనకులోకువగాఁ గొనియేలుమేటియ। స్తో
కమనోహరాకృతి వశోభితుఁ డెంతటివింతగోపికా। లోకవధూటులెల్లప
నులుందనుఁ దానయొనర్చువారిదే। కాక ప్రభావవృత్తి త్రిజగత్స్థలభు
న్మదినాశ్రయించెదన్॥ ౪

తా. లోకంబుల నెల్లఁ దనవశంబుగాఁ జేసికొని యేలు జగత్పతి గోపికల కనుసన్నల నెల్ల పనులుం జేయుచు నంతట సరసంబగుచు నధికంబైన తేజంబునా హృదయంబునఁ బ్రకాశించుఁగాతయనుట.

మూ॥ కన్దర్పప్రతిమల్లకాన్తివిభవం కాదమ్బినీబాన్ధవం బృన్దార
ణ్యవిలాసినీవ్యసనినం వేషేణభూషామయం। మన్దస్మేరముఖామ్బుజం
మధురిమవ్యామృష్టబిమ్బాధరం వన్దే కన్దళితార్ద్రయౌవనమిదం కైశోర
కం శార్ఙ్గిణః॥

టీక. కన్దర్పప్రతిమల్లకాన్తివిభవం- కన్దర్ప-మన్మథునికి, ప్రతిమల్ల-ప్రతిభటమైన, కాన్తి- కాంతియొక్క, విభవం- సంపదగలయదియు, కాదమ్బినీబాన్ధవం- కాదమ్బినీ - మేఘపఙ్క్తికి, బాన్ధవం - బంధువైనయదియు, బృన్దారణ్యవిలాసినీవ్యసనినం- బృన్దారణ్య - బృన్దావనమందలి, విలాసినీ- గోపికలవిషయమైన, వ్యసనినం-ఆసక్తిగలయదియు, వేషేణ-అలంకారముచేత, భూషామయం - భూషణస్వరూపమయినయదియు, మన్దస్మేరముఖామ్బుజం- మన్దస్మేర- మందహాసముతోఁగూడిన, ముఖామ్బుజం- ముఖకమలముగలయదియు మధురిమవ్యామృష్టబిమ్బాధరం- మధురిమ - సౌందర్యముచేత, వ్యామృష్ట- మిక్కిలియు గ్రహింపఁబడిన, బిమ్బాధరం - దొండపండువంటి యధరముగల యదియునైన, శార్ఙ్గిణః-శ్రీకృష్ణునియొక్క, కైశోరకం-బాల్యసంబంధమయిన, ఇదం- ఈప్రసిద్ధమయిన, కన్దళితార్ద్రయౌవనం- కన్దళిత- మొలకలెత్తిన, ఆర్ద్రయౌవనమ్- క్రొత్తజవ్వనమునుగూర్చి, వన్దే- నమస్కరించుచున్నాను.

శా॥ కందర్పప్రతిమల్లధామునవమేఘశ్యాముఁ బ్రేమోల్లస ।
ద్బృందారణ్యవధూరతున్మధురిమావ్యామృష్టాధరోష్ఠాన్వితు। న్మంద స్మేర
కపోలు వేషకృతనానాభూషణోద్వేలుఁ జెల్వొందం గొల్చెద బాల్యయౌ
వనవిలాసాలంకృతున్ శ్రీయుతున్॥ ౫

తా. మన్మథునకుఁ బ్రతిభటంబైనకాంతియును నీలమేఘపఙ్క్తితోడం బొత్తును బృందావనమునందలి విలాసినులవిషయకంబగు నాసక్తియు వేషిల

భూషణమయంబగు వేషంబునుమందహాసంబుచేమెరయు మోముదామరయు సౌందర్యయుక్తంబగు నధరబింబంబునుంగలిగిన శార్ఙ్గధరుండగుశ్రీకృష్ణమూర్తియొక్క బాల్యంబుతోడంగూడిన యౌవనంబునకు మ్రొక్కుచున్నాననుట.

శ్లో॥ ఆముక్తమానుషమముక్తనిజానుభావ మారూఢ విగ్రహ మగూఢవిదగ్ధలీలం । అమృష్టయౌవనమనష్టకిశోర భావమాద్యంమహః కిమపిమాద్యతిమానసే మే॥ ౬

టీక. ఆముక్తమానుషం- ఆముక్త- కొంచెముగావిడువంబడిన,మానుషం- మనుష్యభావముగలదిగనుక, అముక్తనిజానుభావం- అముక్త- విడువంబడని, నిజ -స్వకీయమయిన,అనుభావం - అనుభవముగలయదియు, ఆరూఢవిగ్రహం, ఆరూఢ-స్వీకరింపఁబడిన, విగ్రహం- శరీరముగలయదియు,అగూఢవిదగ్ధలీలం- అగూఢ -ప్రకాశించుచున్న, విదగ్ధ-ప్రౌఢములయిన, లీలం-విలాసములుగలయదియు, అమృష్టయౌవనం- అమృష్ట - ఈషద్విలాసయుతమయిన, యౌవనం- జవ్వనముగలయదియు, అనష్టకిశోరభావం- అనష్ట- నశింపని-కిశోరభావం - బాల్యముగలయదియు, కిమపి - వాచామగోచరమయిన యదియు, ఆద్యం- జగత్కారణమయినదియునైన, మహః - తేజము, మమ- నాయొక్క మానసే- మనమునందు, మాద్యతి- ప్రకాశించుచున్నది.

ఉ॥ మానవలీలయున్నిలుప మానమహామహిమానుభావము । న్మేని పరిగ్రహంబుమితిమీఱిన ప్రౌఢియుబాల్యచాపలా। నూనవిలాస మున్నవ మనోహరయౌవనముం జెలంగనెం । తేనియ హర్షవిస్మయ ములిచ్చుఁజెలంగవెలుంగునామదిన్॥ ౬

తా. మనుష్యభావంబునుబూతనాసంహారాది నిజానుభావంబునుశరీరపరిగ్రహంబును మితిమీఱినమహాప్రౌఢియును బాల్యంబును యౌవనంబును వీలసిల్లవెలుంగు తేజంబునామదిం బ్రకాశించుచున్నదియనుట.

మూ॥ తేతే భావాస్సకలజగతీ లోభనీయప్రభావా నానాతృష్ణాసుహృదిహృది మే కామమావిర్భవన్తు । వీణావేణుక్వణితలసితస్మేరవక్త్రారవిన్దాన్నాహం జానేమధురమధురంనన్ద పుణ్యామ్బురాశేః ॥ ౭

టీక. సకలజగతీలోభనీయప్రభావాః- సకల- సమస్తమయిన, జగతీ, లోకములను, లోభనీయ - కోరుచున్న, ప్రభావాః - సామర్థ్యములు గల, తేతే- అయాప్రసిద్ధములయిన, భావాః - భావములు, నానాతృష్ణాసుహృది-

నానా- పుత్రమిత్రవిత్తాదివిషయికములయిన, తృష్ణా - ఆసలకు, సుహృది- మిత్రుమైన, మే-నాయొక్క, హృది - మానసమునందు, కామం- మిక్కిలియును,ఆవిర్భవన్తు- ప్రకాశించుఁగావుత, వీణావేణుక్వణితలసితస్మేరవక్త్రారవిందాత్- వీణా- వీణవలెనున్న, వేణు - పిల్లనగ్రోవియొక్క, క్వణిత - ధ్వనిచేత,లసిత- ప్రకాశించుచున్న, స్మేర - చిఱునగవుతోఁగూడిన, వక్త్రారవిందాత్ - ముఖకమలముగల, నన్దపుణ్యామ్బురాశేః-నన్ద - నందునియొక్క, పుణ్య-పుణ్యమనియెడి, అమ్బురాశేః - సముద్రునికన్నను, మధురం -హృద్యమైన, అపరం- మఱియొకవస్తువును, అహం - నేను, నజానే-ఎఱుఁగను.

మ॥ అమితాశాపశమానుదిన్నిఖిలలోకాశాస్యనానాపెక్కుభా।
వము లెన్నేనియు నిల్చుఁగాక విలసద్వంశీనినాదానుమో। దము సంజస్మి
తసుందరంబగు యశోదానందపుణ్యాంబుపూ। రముకన్న న్మధురంబులే
దొకటిచర్చన్సేయనింకేటికిన్॥ ౭

తా. నిఖిలలోకంబులంగోరు భావంబులెల్లనుం బుత్రమిత్రవిత్తాదులగు నాసలకు మిత్రంబగు నామెవనిల్చుంగాక స్వచ్ఛనేమి వీణయుంబోలెమ్రోయుచున్న వేణువుచే సుందరంబగుచుఁ జిఱునగవుతోడంగూడిన మోముదానరగు యశోదానందుల పుణ్యంబను ప్రవాహంబుంబోని శ్రీకృష్ణునికన్న నన్యంబెఱుంగ హృద్యంబు గాదనుట.

మూ॥ సుకృతైభిరాదృతే సరస వేణునినాదసుధారసలహరీవిహార
నిరవగ్రహకర్ణపుటే । వ్రజవర సున్దరీముఖ సరోరుహ సన్మధుపే
మహసి కదాను మజ్జతిమదీయమిదం హృదయమ్ ॥

టీక. సుకృతైభిః- పుణ్యులచేత, ఆదృతే - ఉపలాలింపబడినయదియు, సరసవేణునినాద సుధారసలహరీ విహారనిరవగ్రహ కర్ణపుటే-సరస-రసయుక్తమయిన, వేణునినాద - వేణుధ్వనియనియెడి సుధారస- అమృతరసముయొక్క, లహరీ- ప్రవాహమందు. విహార- విహరించుటయందు, నిరవగ్రహ- అప్రతిబంధకమయిన, కర్ణపుటే - శ్రోత్రప్రదేశముగలయదియు, వ్రజవరసున్దరీముఖసరోరుహసన్మధుపే- వ్రజ- వ్రేపల్లియందున్న, వర- శ్రేష్ఠలైన, సున్దరీ- గోపస్త్రీలయొక్క, ముఖసరోరుహ- ముఖకమలములకు, సన్మధుపే- శ్రేష్ఠచంచరీకమయిన, మహసి- తేజమునందు, మదీయం - నాసంబంధమయిన, ఇదం-ఈ, హృదయం- నెమ్మనము, కదాను- ఎప్పుడు, విమజ్జతి-మునుంగుచున్నది.

చ॥ విమల తపోధనామృతము వేణురవామృత సారపూరవి। శ్ర
మపదకర్ణగోళము వ్రజప్రమదాముఖపద్మచంచరీ। కముకమనీయనా
కముసకామ జనావనమైనదివ్యతే। జమునమమునుంగు వెన్నుఁడొకొ చల్ల
గనుల్లము పల్లవింపఁగ౯॥ ౮

తా. పుణ్యులచేనుపలాలింపఁబడుచున్నదియై వేణునాదంబను నమృత ప్రవాహంబునం దడ్డంబులేక యోలలాడెడు శ్రోత్ర ప్రదేశంబుగలిగి (అనఁగా వేణునాదమునం దాసక్తంబైనదియనుట) ఇట్టితేజంబుననా నెమ్మనంబె ప్పుడుమునుంగునోయనుట.

మూ॥ తృష్ణాతురే చేతసి జృమ్భమాణం ముష్ణన్ముహుర్మోహమహాన్ధకారం। పుష్ణాతునః పుణ్యదయైకసిన్ధోః కృష్ణస్య కారుణ్యకటాక్షకేళిః

టీక. పుణ్యదయైకసిన్ధోః - దయాసముద్రుండైన, కృష్ణస్య- శ్రీకృష్ణస్వామియొక్క, కారుణ్యకటాక్షకేళిః - కారుణ్యకటాక్ష - దయాప్రధానదృష్టియొక్క, కేళిః- విహారము, తృష్ణాతురే, తృష్ణా-ఆసచేత, ఆతురే, ఆతురమయిన, మమ-నాయొక్క, చేతసి-చిత్తమునందు, ముహుః, సారెకు_ జృమ్భమాణం, వృద్ధిఁబొందుచున్న- మోహమహాన్ధకారం - మోహ-మోహమనియెడి, మహాన్ధకారం- కటికచీఁకటిని, ముష్ణ౯-హరించుచు- నః, మమ్ము, పుష్ణాతు పోషించుఁగావుత,

మ॥ అమితాశావశమైన నామదికపశ్యంబైన మోహాంధకా। ర
ము గారుణ్యకటాక్షవీక్షణవిహారాశిస్వ ఘాలించి నె। య్యము సంప్రో
చు దయాపయోధి ఘనబృందారణ్యకర్ణుం డిబ్భం। దమనోలోచనపా
థుసేవధిప్రమోదంబొప్ప నెల్లప్పుడు౯ ౯

తా. దయాసముద్రుండగు శ్రీకృష్ణదేవిదయాదృష్టి విహారముతృష్ణాతురంబగు నామనంబున నతిశయిల్లు మోహాంధకారంబుఁబోవనడంచుచు నన్నుఁబ్రోచుఁగాతయనుట.

మూ॥ నిఖిలనిగమమౌళిలాలితం పదకమలం పరమస్య తేజసః। వ్రజభువిబహుమన్మహే కరాంసరసకరీష విశేషరూషితమ్॥ ౧౦

టీక. నిఖిలనిగమమౌళిలాలితం - నిఖిల, సమస్తమయిన, నిగమ-వేదములయొక్క, మౌళి- శిరములచేత, లాలితంఁ లాలింపఁబడినయదియు - వ్రజభువి-వ్రజ వ్రేపల్లియయొక్క, భువి, భూమియందు, సరసకరీషవిశేషరూషితం సరస, రసయుక్తమయిన, కరీష-విశేష- రేణముచేత, రూషితం-పూయఁబడిన,

పరమరహస్యస్య - అతిరహస్యమైన, తేజసః - తేజముయొక్క, పదకమలం - పాదకమలమును, బహుమన్యే హోతరామ్ - మిక్కిలియు బహుకరించుచున్నాను.

మ॥ సిరికేల్దమ్ముల నొత్తఁగా శ్రుతివధూ సీమంత సిందూరసుం ।
దరమైయొప్పెసలార యందముగ మందన్నంద గోపాలమం । దిరశా
లాంతకరీషరూషితరసోదీర్ణంబులౌ పాదము। ల్పరమానందముఁ జేయు
నామదికినుల్లాసంబుఁ గల్పించుచుఁ॥ ౧౦

తా. వేదాంతంబుచేలాలింపంబడుచునందవ్రజంబున రేణంబునఁబూయంబడినవిన్నై వెలయు తేజముగల శ్రీకృష్ణునిపాదకమలంబుల బహూకరించుచున్నాననుట.

మూ॥ఉదారమృదులస్మిత వ్యతికరాభిరామాననం ముదాముహు
రుదీర్ణయాముని మనోమ్బుజా మ్రేడితం । మదాలస విలోచన వ్రజవ
ధూమదాస్వాదితంకదాను కమలేక్షణంకమపిబాలమాలోకయే ॥ ౧౧

టీక. ఉదారమృదులస్మిత వ్యతికరాభిరామాననం-ఉదార-గంభీరములయిన, మృదులస్మిత - మందహాసములయొక్క, వ్యతికర- సమూహముచేత అభిరామ- సుందరమయిన, ఆననం - ముఖముగలవాఁడను, ముహుః - సారెకును, ఉదీర్ణయా- పుట్టుచున్న, ముదా- సంతోషముచేత, ముని మనోమ్బుజా మ్రేడితం - ముని- మునులయొక్క, మనోమ్బుజ- మనఃకమలములచేత, ఆమ్రేడితం - మాటిమాటికిని విచారింపఁబడుచున్నవాఁడును, మదాలసవిలోచనవ్రజవధూమదాస్వాదితం - మద - మదముచేత,అలస- మందములయిన,విలోచన- నేత్రములుగల, వ్రజవధూ- గోపస్త్రీలచేత, మద - మదముచేత,ఆస్వాదితం- అనుభవింపఁబడుచున్నవాఁడును, కమలేక్షణం - కమల - తామరరేకుల వంటి, ఈక్షణం- నయనములుగలవాఁడును, కమపి - వాచామగోచరుండైన, బాలం- బాలుని, కదాను- ఎప్పుడు, ఆలోకయే- చూచుచున్నాను-

ఉ॥ కన్నులకొద్దిచూచి వ్రజకాంతలు వేడుకముద్దులాడఁగా । స
న్నపునవ్వువెన్నెలలు సల్లఁగఁజల్లఁగ నెల్లమౌనులుఁ । సన్నుతమాన
సాబ్జములసారెకుసారెవహింపమించున।కన్నుల పండువైనముఖకం
జముకంజిలుబాలుఁగాంచెదఁ॥ ౧౧

తా. గంభీరంబులయిన మందహాసంబులచే సుందరంబగు ముఖంబుగల్గి సారెసారెకును బొడమెడుసంతోషంబున మౌనులచేత ధ్యానంబుచేయఁబ

ఘుచున్నవాఁడై మదంబుచే నలసంబులగు గోపికలచే ముదంబున ననుభవింపఁబడుచున్నవాఁడై పుండరీకాక్షుండై వాచామగోచరుండై వెలయు బాలుని నెన్నటికిం గాంచెదనోయనుట.

మూ ॥ వ్రజజనమదయోషి ల్లోచనోచ్ఛిష్టశేషీ కృతమతి చపలా
భ్యాంలోచనాభ్యాముభాభ్యామ్। సకృదపిపరిపాతుం తేవయంపార
యామఃకువలయదళనీలంకాన్తిపూరంకదాను॥ ౧౨

టీక. వ్రజజనమదయోషిల్లోచనోచ్ఛిష్టశేషీకృతం - వ్రజజన- గోపాలకులయొక్క, మదయోషిత్ - మదముతోఁగూడినస్త్రీలయొక్క, లోచన - నేత్రములచేత, ఉచ్ఛిష్ట - ఉచ్ఛిష్టమాత్రము -, శేషీకృతం - మిగిలినదిగాఁజేయఁబడిన- కువలయదళనీలం- కువలయ- నల్లకలువలయొక్క, దళ- రేకులవలె నీలం- నల్లనైన, కాన్తిపూరం- కాంతిప్రవాహమును, తే- అప్రసిద్ధులమైన వయం- మేము, అతిచపలాభ్యాం - మిక్కిలిచంచలములయిన, ఉభాభ్యామ్- రెండైన, లోచనాభ్యామ్- నేత్రములచేత, సకృదపి - ఒకానొకప్పుడైనను, పాతుం- పానముచేయుటకొఱకు, కదాను- ఎప్పుడును, పారయామః-సమర్థులమగుచున్నాము

మ ॥ కొమరుంబ్రాయపు మబ్బుగుబ్బెతలఁగోరుల్జొబ్బిలన్వల్ల
వప్రమదల్గన్నులనానియాని దిగుపారన్ శేషమైపొల్చునా। రమణీ
యోత్పలకాంతిపూరమెదురైరానొక్కసారైనఁబ్రాం। కముగానీకను
దోయినానఁగలభాగ్యం బెన్నఁడోకల్గెడున్॥ ౧౨

తా. మదించిన గోపస్త్రీలుచూడం జూడమిగిలియున్ననల్లకలువరేకుల కొమ్మెయుంగుఁదెగడుకాంతిప్రవాహరూపుండగు బాలకృష్ణమూర్తిని జంచలంబులగు నీరెండు కన్నులచే నొకపరినైనఁ జూచుభాగ్యం బెన్నటికబ్బునో కోయనుట.

మూ ॥ ఘోష యోషిదనుగీత యౌవనం కోమల స్తనిత వేణునిస్వ
నమ్। సారభూతమభిరామసమ్పదాం ధామతామరసలోచనం భజే॥

టీక. ఘోషయోషిదనుగీతయౌవనం- ఘోష- వ్రేపల్లియయందున్న, యోషిత్ - యువతులచేత, అనుగీత - అనుసరించిగానముచేయఁబడుచున్న, యౌవనం - జవ్వనముగలదియు, కోమల స్తనితవేణునిస్వనం - కోమల - లేతనైన, స్తనిత- ఉఱుమువంటి, వేణునిస్వనం - వేణునాదముగలదియు, అభిరామసమ్పదాం - సౌందర్యసంపదలకు, సారభూతం - శ్రేష్ఠభూతమయిన

యదియు. తామరసలోచనం- తామరస- కమలములవంటి, లోచనం- నేత్రములుగలయదియునైన, ధామ- తేజమును, భజే- సేవించుచున్నాను.

ఉ॥ వ్రేజవరాండ్రు జవ్వనపు విన్ననువుంగొని యాడఁగా ము
ఖాం। భోజమునందు లేయుఱుముఁబోసిరవంబున వేణువొప్పరా। రా
జితకాంతిసంపదలరాశియనన్వెలుఁగొందుశారదాం। భోజదళాక్షు
డై తవిభుం త్రిజగత్పతినాశ్రయించెదన్॥ ౧౩

తా. వ్రేపల్లియయందుండిన గోపికలచే గానంబుచేయంబడుచున్న జవ్వనంబుగలిగి లేఁతయుఱుముచలెనున్న వేణునాదంబు నెలంగ సౌందర్యంబులకెల్లనధికంబైన పుండరీకలోచనంబయి వెలయు తేజంబును సేవించెదననుట.

మూ॥ లీలయాలలితయావలమ్బితం మూలగేహమివ మూర్తిసమ్ప
దామ్। నీలనీరదవికాసవిభ్రమం బాలమేవవయమాద్రియామహే॥

టీక- లలితయా-సుందరమైన, లీలయా-విలాసముచేత, అవలమ్బితం- ఆశ్రయింపబడినవాఁడును, మూర్తిసమ్పదామ్- శరీరసంపదలకు, మూలగేహమివ- ప్రధానగృహమువలెనున్నవాఁడును, నీలనీరదవికాసవిభ్రమం - నీలనీరద- నీలమేఘముయొక్క, వికాస- ప్రకాశముయొక్క, విభ్రమం - విలాసములవంటివిలాసములుగలవాఁడునైన, బాలమేవ-బాలకృష్ణుని, వయం- మేము, ఆద్రియామహే- ఆదరించుచున్నాము.

శా॥ బాలున్మోహనవేషలీలు మురళీపాండిత్యశీలుఁ దయా। లో
లుఁ సాంద్రఘనాఘనావళివినీలుం గోపకన్యానుత। శ్రీలావణ్యవ
యోవిలాసు నవనీరేజాయతాక్షిప్రభా। జాలుఁ సర్వకళాలవాలు
నతవాంఛన్గొల్తునా నెన్నాడిన్॥ ౧౪

తా. సుందరంబగు విలాసంబుచేనాశ్రయింపంబడి శరీరసంపదలకుఁ బ్రధానగృహంబయి నీలమేఘంబు విలాసంబువంటి విలాసంబులుగలిగి వెలుంగుబాలునాశ్రయించెదననుట.

మూ॥ వన్దే మురారేశ్చరణారవిన్దద్వన్ద్వం దయాదర్శితశైశవస్య।
వన్దారుబృన్దారకబృన్దమౌళి మన్దారమాలావినిమర్దభీరు॥ ౧౫

టీక. దయాదర్శితశైశవస్య దయ - దయచేత, దర్శిత-చూపఁబడిన, శైశవస్య - బాల్యముగలిగిన, మురారేః- శ్రీకృష్ణమూర్తియొక్క, వందారుబృన్దారకబృన్దమౌళిమన్దారమాలావినిమర్దభీరు- వన్దారు-నమస్కరించుచున్న, బృన్దారక - దేవతులయొక్క, బృన్ద-సమూహములయొక్క, మౌళి-శిరముల

యుద్యున్న, మందారమాలా - కల్పతరుప్రసూనమాలికలయొక్క, విమర్ద - సమ్మర్దమువలన, భీరు-భయపడుచున్న, చరణారవిందద్వన్ద్వం-అనుగుదామరదోయినిగూర్చి, వందే- నమస్కరించుచున్నాను.

మ॥ దితిజానీకముఁద్రుంపమాని తతివర్తింపఁగ యశోదాదరో।
దితకైశోరకళావిలాసుఁడగు నా దేవాదిదేవోత్తము। న్నతబృందార
కబృందమౌళి విలసన్మందారమాలాంతరం। గితధారాళమరందబిం
దుమృదులాంఘ్రిద్వంద్వ సేవించెదన్॥ ౧౫

తా. దయచే బాల్యంబునొందిన శ్రీకృష్ణమూర్తికి నొక్కరు దేవతాసమూహంబుల శిరంబులం జెలువొందు కల్పతరుప్రసూనమాలికల సమ్మర్దంబువలన భయంబొందు పాదకమలద్వంద్వంబుఁగూర్చి నమస్కరించుచున్నాననుట-

శ్లో॥ యస్మిన్నృత్యతి యస్య శేఖరభరైః క్రౌంచద్విషశ్చంద్రికీయ
స్మిన్దృప్యతి యస్య ఘోష సురభిం జిఘ్రన్వృషో ధూర్జటేః। యస్మిన్స
జ్జతి యస్య విభ్రమగతిం వాఞ్ఛన్ హరేస్సిన్ధురస్తద్బృందావనకల్పక
ద్రుమవనం తం వా కిశోరం భజే॥ ౧౬

టీక. క్రౌంచద్విషః- కుమారస్వామియొక్క, చన్ద్రకీ- నెమలి-యస్య- ఏ శ్రీకృష్ణునియొక్క, శేఖరభరైః- శేఖర- సిగయందుఁజుట్టిన నెమలిపురిదండలయొక్క, భరైః- సమృద్ధులచేత, యస్మిన్-ఏవనమునందు, నృత్యతి-నటించుచున్నదియో, ధూర్జటేః- శివునియొక్క, వృషః-వృషభము, యస్య-ఏశ్రీకృష్ణమూర్తియొక్క, ఘోషసురభిం- ఘోష-వ్రేపల్లియందున్న, సురభిం- కామధేనువును, జిఘ్రన్ - ముక్కుచేతను నాఘ్రాణించుచున్నదైయై, యస్మిన్-ఏ వనమునందు, దృప్యతి-గర్వించుచున్నదియో, హరేః - ఇంద్రునియొక్క, సిన్ధురః- ఐరావతము, యస్య-ఏశ్రీకృష్ణునియొక్క, విభ్రమగతిం- విలాసగమనమును, వాఞ్ఛన్- ఇచ్ఛయించినదగుచు, యస్మిన్- ఏవనమునందు, సజ్జతి-ఆసక్తి గలదియగుచున్నదియో, తద్బృందావనకల్పకద్రుమవనం- తత్- ఆప్రసిద్ధమైన, బృందావన- బృందావనమునందున్న, కల్పకద్రుమ-కల్పవృక్షములయొక్క, వనం - వనమునైనను, తం - ఆప్రసిద్ధుఁడైన, కిశోరంవా - బాలకృష్ణమూర్తినైనను, భజే- సేవించుచున్నాను.

శా॥ ఎందే నెవ్వని మౌళిఁగాంచి గుహవాజీంద్రంబు నర్తించుఁ
దా। నెందే నెవ్వని యానరీతి హరిమత్తేభంబు గాంక్షించుఁదా। నెందే

నెవ్వనిమందమారొ యనుచు ధూతేశాశ్వముంబొంగునా । బృందా
రణ్యసురద్రుమ సాంద్రవని నాకృష్ణున్మదిఁగొల్చెదన్॥ ౧౬

తా. సకలజగత్పతియగు శ్రీకృష్ణమూర్తిని సేవించుకొఱకుఁ గుమారస్వామియును హరుండునింద్రుండును గామధేనువు నేతెంచినయెడ సేవనంబుననే కృష్ణునియొక్క సిగయందు నలంకరింపఁబడిన నెమలిపురిదండలం జూచి కుమారునిమయూరంబు నృత్యంబుఁజేయునో యేవనంబునందునే శ్రీకృష్ణునిగమనవిలాసంబు నెఱింగికొననింద్రునైరావతంబు గాంక్షించియుండునో యేవనంబున నేకృష్ణునిమందకడఁ గామధేనువు యోనిదేశంబు నాఘ్రాణించుచు శివునివాహనంబగు వృషభంబు గర్వించియుండునో యట్టిబృందావనంబునుగల్పకతరువనంబును నాశ్రీకృష్ణుని సేవించుచున్నాననుట.... *

శ్లో॥ అరుణాధరామృత విశేషితస్మితం వరుణాలయానుగ
తవర్ణవైభవమ్ । తరుణారవిన్ద దళదీర్ఘలోచనం కరుణామయంక
మపిబాలమాశ్రయే॥

టీక. అరుణాధరామృత విశేషితస్మితం-అరుణ-ఎఱ్ఱనైన, అధరామృత- అమృతమువంటి యధరముచేత, విశేషిత-అతిశయింపఁబడిన, స్మితం-చిఱునవ్వుగలవాఁడును, వరుణాలయానుగతవర్ణవైభవం- వరుణాలయ- సముద్రముతోడను, అనుగత-అనుకరింపఁబడుచున్న, వర్ణవైభవం- కాంతిసంపద గలవాఁడును, కరుణామయం - కరుణాస్వరూపుఁడయినవాఁడును, కమపి- వాచామగోచరుఁడైనవాఁడునైన, బాలం-బాలకృష్ణుని, ఆశ్రయే- ఆశ్రయించుచున్నాను.

ఉ॥ చల్లనివానినవ్వు వెదఁజల్లెడువాని దయారసంబుఁబో । ల్చెల్లె
డువానిఁగెంపుం జిగిపెంపుఁజెలంగెడు మోవివానిసం ।ఫుల్లసరోజనే
త్రములఁబోల్చినవానిఁ బయోధిపేచికా । వెల్లితనీలనీరదనవీనతనుద్యుతి
వానిఁగాంచెదన్॥

తా. అమృతంబుఁబోలె మధురంబగుచు నెఱ్ఱనయినమోవిపై నెగడుచిఱునగవుచేఁ దేజరిల్లుచు సముద్రంబుననుకరించు కాంతిసంపదగలిగి విరిసినలేఁదామరలం దెగడు కన్నులుగలిగి దయాస్వరూపుఁడై వాచామగోచరుండైనెలయు బాలకృష్ణు నాశ్రయించుచున్నాననుట.

శ్లో॥ లావణ్యవీచీరచితాఙ్గభూషాంభూషాపదారోపితపుణ్యబర్హామ్।
కారుణ్యధారాళ కటాక్షమాలాంబాలాంభజే వల్లవవంశలక్ష్మీమ్॥

టీక. లావణ్యవీచీరచితాఙ్గభూషామ్ - లావణ్య - కాంతివిశేషము యొక్క, వీచీ - అలలచేత, రచిత - చేయఁబడిన, అఙ్గభూషామ్ - అవయవభూషణములుగలయదియు, భూషాపదారోపితపుణ్యబర్హామ్ - భూషాపద - అలంకారప్రదేశమందు, ఆరోపిత - ఉంపఁబడిన, పుణ్య - పవిత్రమయిన, బర్హామ్ - నెమలిపురిగలయదియు, కారుణ్యధారాళకటాక్షమాలామ్ - కారుణ్యధారాళ - దయాసారములోఁగూడిన, కటాక్ష - కడకంటిచూపులయొక్క, మాలామ్ - సమూహముగలయదియు, బాలామ్ - లేఁతప్రాయముగలయదియునగు, వల్లవవంశలక్ష్మీం వల్లవవంశ - గోపవంశముయొక్క. లక్ష్మీమ్ - సకలసౌభాగ్యసంపాదకయయినలక్ష్మిని, భజే - భజించెదను.

చ ॥ మెఱుఁగుల కేమివక్రదన మేపవిలక్షులు సేయుమాయురే ।
సురుచిర పింఛదామకమె సొమ్ములలో వెలలేనిసొమ్మగుం । బరమకృపాకటాక్షసుమమాలికచాపు రెనందమందిరేం । చిరముచి పెంపు శైశవము సేటుసుమీ తె నయారెకంటిరే॥ ౧౮౭

తా. కాంతివిశేషంబులచే నవయవంబుల భూషణంబులకు వన్నెయం గల్పించుచుభూషణప్రదేశంబునం దలంకరింపంబడిన నెమలిపురిగలిగిదయాప్రవాహంబుఁగుమ్మరించుకడకంటిచూపులుగలిగి బాలస్వరూపంబై వెలయు గోపాలవంశలక్ష్మిని భజించుచున్నానను.

మూ ॥ మధురైకరసంవపుర్విభోర్మధురావీధిచరంభజామహే ।
నగరీమృగశాబలోచనా నయనేందీవరవర్షవర్షితమ్॥ ౧౮౮

టీక. మధురావీధిచరం - మధురా - మధురాపట్టణముయొక్క, వీధి - వీధులయందు, చరం - సంచరించుచున్నయదియు, మధురైకరసం - మధుర - సౌందర్యముయొక్క, ఏకరసం - ముఖ్యరసమైనయదియు, నగరీమృగశాబలోచనానయనేందీవరవర్షవర్షితం - నగరీ - మధురయందలి, మృగశాబ - లేడిపిల్లయొక్క. లోచనా - కన్నులవంటికన్నులుగల స్త్రీలయొక్క, నయన - నేత్రములనియెడి, ఇందీవర - కలువలయొక్క, వర్ష - వృష్టిచేత, వర్షితం - వర్షింపఁబడుచున్న, విభోః - శ్రీకృష్ణమూర్తియొక్క, వపుః - శరీరమును, భజామహే - సేవించుచున్నాను.

మ ॥ అమరన్ స్వాదురసైకమైన మధురాపట్టణవీధులన్ ।
ఁదిరుగాడుచుఁబురవీధులందుఁబ్రేమతోఁడ సుకుమారకాంతులతోఁ । భ్రమ

చేయన్మధురావధూచపలనేత్రవ్రాతనీలాబ్జవర్షముచేఁ గ్రమ్మంగఁ
జిత్రమైచెలఁగు కృష్ణస్వామినీక్షించెదన్॥ ౧౯

తా. ఘనీభూతంబగు సౌందర్యంబుకరిణిఁ బేజరిల్లుచు మధురావీధుల యందుఁ జరించుచు నక్రీడనుండెడి యువతుల చపలనేత్రంబులను కలువల వానచే ముంపంబడు వెలుంగు శ్రీకృష్ణునియొక్క విగ్రహంబును మేముసేవించుచున్నామనుట.

మూ॥ పర్యాకులేన నయనాంతవిజృమ్భితేన వక్త్రేణ కోమలమద స్మితవిభ్రమేణ । మందేనమఞ్జులతరేణచ జల్పితేన నన్దస్యహంతతన యేహృదయందినోతి॥ ౨౦

టీక. పర్యాకులేన- చంచలములయిన, నయనాంతవిజృమ్భితేన- నయనాంత-కడకన్నులయొక్క, విజృమ్భితేన- అతిశయముచేతను, మందేన- మందమైన, మంజులతరేణ-మిక్కిలిహృద్యమైన, జల్పితేనచ-మాటచేతను, కోమల మదస్మితవిభ్రమేణ-కోమల-మృదువైన, మద-మదయుక్తమైన, స్మిత-మందహాసముయొక్క, విభ్రమేణ-విలాసముచేతను, నందస్య-నందునియొక్క,తనయే, కుమారుఁడైన శ్రీకృష్ణునియందు, హృదయం-చిత్తము, దినోతి-ప్రేమముగలదిగాఁజేయుచున్నది, హంత-సంతోషము.

మ॥ బెళుకుంగన్నులు మోముచుట్టు దిరుగన్ బింబాధరోష్ఠంబుపైఁ । దళుకున్వెన్నెలలీనులేనగవు వింతల్మాధురింజెందఁగం । దళితాలాపసుధారుచుల్సెవికి సానందంబుగానందుమం । దలనానందముఁ జెందుబాలుని యశోదానందనుం గాంచెదన్॥ ౨౦

తా. చంచలంబులగు కడకంటిచూపులును గోమలంబులగు చిఱునగవు వెన్నెలలంగ్రుమ్మరించు నెమ్మొగంబును హృద్యంబగు వచనంబునుగల నందసుతుండగు శ్రీకృష్ణునియందు నాహృదయం బానందంబుఁజెందుచున్నదియనుట.

మూ॥ కన్దర్పకండూలకటాక్షబందీరిందీవరాక్షీరభిలష్యమాణాన్ । మన్దస్మితాధారముఖారవిందాన్వందామహే వల్లవధూర్తపాదాన్॥

టీక, కందర్పకండూలకటాక్షబందీః, కందర్ప-మన్మథునియొక్క, కండూల-దుస్సహములైన, కటాక్ష-కడకన్నులచేత, బంధీః-బంధింపఁబడిన,ఇందీవరాక్షీః-యువతులను.అభిలష్యమాణాన్- కామించుచున్నయవియు,మన్దస్మితాధారముఖారవిన్దాన్- మన్దస్మిత- మందహాసమునకు, ఆధార- ఆశ్రయములైన, ముఖారవిన్దాన్, ముఖకమలములుగలయవియునగు, వల్లవధూర్తపా

దాః- యాదవధూ ర్త శ్రేష్ఠుల పాదములు గూర్చి, వన్దామహే-నమస్కరించుచు న్నాను, పూజాయాంబహువచనమ్మను న్యాయంబున- వల్లవధూ ర్తపాదాః అ నియెడిచోటయాధవధూ ర్త శ్రేష్ఠుఁడైనకృష్ణుఁడని గ్రంథక ర్తయొక్క భావము.

మ॥ సరసాపాంగతరంగరంగితవిలాసప్రౌఢిచేనగ్గమై । మరుబా రిఁ వళిగుబ్బలుబ్బి పులకింపం గ్రొమ్ముడుల్వీడఁ డ। త్తరపుఁ మేన్నివమె త్తిమ త్తిలినకాంతాపాళిలాలించుచి । త్తరపున్నవ్వ మొగంబుడంబు గలధూ ర్తస్వామిఁ గీ ర్తిం చెదఁ॥

తా. సరసంబులగు కటాక్షంబులచే బంధింపఁబడిన కామినులం గామిం చుచిఱునగవుల కాశ్రయంబైన నెమ్మొగంబుగలగి వేలయుధూ ర్త శ్రేష్ఠుఁడగు శ్రీకృష్ణమూ ర్తిని గూర్చి నమస్కరించు చున్నానసట,

మూ॥ లీలాటోప కటాక్షనిర్భర పరిష్వఙ్గ ప్రసఙ్గాధిక ప్రీతే గీతివి భఙ్గసఙ్గతలస ద్వేణు ప్రణాదామృతే। రాధాలోచన లాలితస్య లలిత స్మేరే మురా రే ర్మదా మాధుర్యై కర సే ముఖేందుకమలే మగ్నం మదీ యం మనః॥

టీక. లీలాటోపకటాక్షనిర్భరపరిష్వఙ్గ ప్రసంగాధిక ప్రీతే - లీలా-విలా సములచేత, ఆటోప- గంభీరములయిన, కటాక్ష-కడకన్నులయొక్క, నిర్భర- సాంద్రమైన, పరిష్వఙ్గ- ఆలింగనముయొక్క, ప్రసంగ. ప్రస క్తివలన, అధి క ప్రీతే - మిక్కిలిసంతుష్టమయిన యదియును - గీతివిభఙ్గసఙ్గతలస ద్వేణు ప్ర ణాదామృతే- గీతి - గానభేదములయొక్క, విభఙ్గ- వచనములయొక్క, సఙ్గ త - స్వసౌష్ఠవప్రయుక్త కలహముచేత, లసత్ - మనోజ్ఞమయిన, వేణుప్ర ణాదామృతే, అమృతమువంటి వేణునాదముగలయదియును, లలిత స్మే రే- లలి త- మనోహరమైన, స్మే రే- మందహాసముగలయదియును, మాధుర్యై కరసే మాధుర్య। సౌందర్యమనియెడి, ఏకరసే- ముఖ్యరసముగలదియును, రాధా లోచనలాలితస్య- రాధా-రాధయొక్క, లోచన-కన్నులచేత, లాలితస్య- ఉ పలాలింపఁబడిన, మురారేః- శ్రీకృష్ణమూ ర్తియొక్క, ముఖేందుకమలే-చం ద్రకమలములవంటి ముఖమునందు, మదీయం- నాసంబంధమయిన, మనః- మనస్సు, మగ్నం- మునిగెను.

మ॥ లలితాలోక తదంగసంగతము లీలామందహాసప్రభా । పులి నంబున్మురళీరవామృతరసంబుఁ రాధికాలోచనో । త్పలసంభావిత

మాధురీగుణమునై భాసిల్లు శ్రీకృష్ణుని। ర్మలవక్త్రాంబురుహాకరంబున
రమింపంగోరెదనాత్మమదిన్॥

తా. విలాసంబులచే గంభీరంబులగు నపాంగదృష్టులచేవశలయితమంతటనవచ్చిగోపికలయాలింగన ప్రసంగంబుచే సంతుష్టంబగుచు గానభేదంబుల వచనంబుల పరస్పరస్వసౌష్ఠవ కలహంబునమనోజ్ఞంబగునమృతంబుఁ బోనివే ణురవంబుగలిగి సౌందర్య రసంబున కాకరంబై మనోహరంబగు మందహాసంబునకు నెలవై మెఱయుశ్రీకృష్ణుని నెమ్మొగంబున నామనంబులగ్నంబయ్యెననుట.

మూ॥ శరణాగతవజ్రపఞ్జరే సరణేశార్ఙ్గధరస్యవైభవే । కృప
యాధృతగోపవిగ్రహే కియదన్యన్మృగయామహేవయమ్॥ ౨౩

టీక. శరణాగతవజ్రపఞ్జరే శరణాగత- శరణుపొందినవారలకు, వజ్ర- అభేద్యశిలావిశేషనిర్మితమైన, పఞ్జరే - యంత్రవిశేషమయినవాఁడును, కృపయా,దయచేత, ధృతగోపవిగ్రహే- ధృత,ధరియింపఁబడిన, గోపవిగ్రహే- గోపాలశరీరముగలవాఁడునునగు, శార్ఙ్గధరస్య- శ్రీకృష్ణమూర్తియొక్క వైభవే. వైభవము, శరణే-రక్షకమగుచునుండ, అన్యత్,ఇతరమైన, కియత్- ఏపదార్థమును- వయం, మేము, మృగయామహే- వెదుకుచున్నాము.

ఉ॥ ఇవ్వలనవ్వలన్వెదక నేటికినన్యుల మాటిమాటికి। న్నవ్వులనుం
డినైనఁగరుణావరుణాలయ గోపమూర్తియై । నవ్వుచుడాయవచ్చి
యదనన్ శరణాగతవజ్రపంజరుం । డవ్వనజాతనేత్రుఁడ నయంబున
యంబు సెలంగఁబ్రోవఁగన్॥ ౨౩

తా. శరణంబునొందినవారలంబ్రోవ వజ్రపంజరుండైయుండుం గానఁగృపచే గోపాలశరీరంబుఁదాల్చి రక్షకుండయి శార్ఙ్గధరుఁడైన శ్రీకృష్ణమూర్తిమెఱయుచుండ నితరుల వెదుకఁగా మేమిచ్ఛగింపమనుట.

శ్లో॥ జగత్త్రయైకాన్త మనోజ్ఞభూమిచేతస్య జస్రంమమసన్నిధ
త్తామ్ । రమాసమాస్వాదిత సౌకుమార్యం రాధాస్తనాభోగరసజ్ఞ
మోజః॥ ౨౪

టీక. జగత్త్రయైకాన్తమనోజ్ఞభూమి - జగత్త్రయ-లోకత్రయమునందును, ఏకాన్త-మిక్కిలినైన,మనోజ్ఞ - సౌందర్యమునకు, భూమి - ప్రదేశమయినయదియు, రమాసమాస్వాదితసౌకుమార్యం-రమా-రుక్మిణీ దేవిచేత, సమాస్వాదిత - అనుభవింపఁబడిన, సౌకుమార్యం-సౌందర్యముగలయదియు, రాధాస్తనాభోగరసజ్ఞమ్-రాధా-రాధయొక్క, స్తనాభోగ-కుచపరిష్వఙ్గరి

యొక్క, రసజ్ఞం-రసమునెఱింగినయడుగునగు, ఓజః- తేజము, మమ - నా యొక్క, చేతసి- చిత్తమునందు, అజస్రం- ఎల్లప్పుడును, సన్నిధత్తాం - సన్నిధానముచేయుఁగావుత.

ఉ॥ నామది నానతింతు భువనత్రయమోహనరూపధేయురా। ధామదిరేక్షణాపరిణత స్తనభారవిధేయభోజక। న్యామహనీయవిభ్రమరసాస్పదవిగ్రహ సౌకుమార్యలీ। లామధురాధరస్మిత కలాపుఁగళాగురువర్యునెప్పుడున్॥ ౨౪

తా, ముల్లోకంబులంగలసౌందర్యంబునకునాధారప్రదేశంబైలక్ష్మ్యంశసంభూతురాలగు రుక్మిణీదేవిచేననుభవింపంబడిన సౌందర్యరసంబుగలిగిరాధాస్తనంబులవిస్తారంబునెఱింగియుండెడి తేజంబునామదినెప్పుడును సన్నిధానముఁజేయుంగాతయనుట.

మూ॥ వయమేతేవిశ్వసిమఃకరుణాకరమూర్తేఃకింవదన్త్యాన్తే। అపి చవిభోతవలలితేచపలతరామతిరియంబాల్యే॥ ౨౫

టీక- హేవిభో-వ్యాపకుఁడవైనయోకృష్ణా, అంగే-రూపవంతుఁడవైననీయందు, కరుణాకరమూర్తేః-కరుణా-దయకు, ఆకర-గనియనియెడి, మూర్తేః- మూర్తియొక్క, కింవదన్త్యా-లోకప్రవాదచేత, ఏతే- ఈసంసారనిమగ్నులమైన, వయం-మేము, విశ్వసిమః- విశ్వాసముఁజేయుచున్నాము, అపిచ-మఱియును, తవ-నీయొక్క, లలితే-కోరఁదగిన, బాల్యే-బాల్యమందు, ఇయం మతిః-ఈబుద్ధి, చపలతరా-మిక్కిలియుఁజపలమైయున్నది,

చ॥ అనిశములోకమెల్లఁ గరుణాకరమూర్తివటంచుఁ దెల్పఁగా। జననిపరంపరల్గడచిసౌఖ్యమునొందుదునంచుఁగృష్ణనా। మనమునసమ్మినాడననుమాత్రమకాదు భవత్కిశోరతా। జనితకథాసుధారసము సారెకుఁగ్రోలఁగఁ దత్తరించెదన్॥ ౨౬

తా. సర్వవ్యాపకుండవైనయోకృష్ణా- శ్రీకృష్ణుండు దయాకరుండనిచెప్పెడు లోకులప్రవాదంబువిని నీయందు విశ్వాసంబు చేయుచుండు మింతియకాదునీయతి మనోహరంబగు బాల్యంబున బుద్ధియతిచపలంబయ్యెంగావుననాయందుఁ గరుణించుటకార్యంబనుట.

మూ॥ వత్సపాలచరఃకోపి వత్సశ్శ్రీవత్సలాఞ్ఛనః। ఉత్సవాయాకదాభావీ త్యుత్సుకేమమలోచనే॥ ౨౭

టీక. వత్సపాలచరః - వత్స- దూడలను, పాల- పరిపాలించుచున్న

వారలలో, చరః- సంచరించుచున్నయట్టియు (ఇచ్చట- వత్సవాటచరః - అని పాఠాంతరముగలదు, కలిగినప్పుడు, వత్సవాట - దూడలనిమిత్తమయి యేర్ప ర్పంబడిన గృహములయందు, చరః- సంచరించుచున్న యని యర్థము) శ్రీవత్సలాఞ్ఛనః- శ్రీవత్స - శ్రీవత్సమనియెడి, లాఞ్ఛనః- చిహ్నముగలవాఁడునగు, కోపి-చెప్పనలవిగాని, వత్సః-బాలుఁడు, ఉత్సవాయ-సంతోషముకొఱకు, సదా- ఎప్పుడు, భావి - అయ్యెని, ఇతి- ఈప్రకారము, మమ- నాయొక్క, లోచనే- నేత్రములు, ఉత్సుకే-ఉత్కంఠితములైయున్నవి.

శా॥ శ్రీవత్సాంకితవక్షుఁడుల్లసితనీరేజాక్షుఁడంభోధిక । న్యా
వక్షోరుహకుంభికుంభయుగళాఢ్యక్షుండు బ్రహ్మాదిసౌ। ఖ్యావిర్భావ
విధానదక్షుఁడగువాఁడానందపుత్రాకృతిన్। గోవత్సంబుల మేపఁగన్
గానుచుఁజక్షుః ప్రీతివాటించెదన్॥ ౭౬

తా. గోపాలబాలురంగలసిగోవత్సంబులమేపు శ్రీవత్సలాంఛనుండగు బాలకృష్ణమూర్తిన్ నెప్పుడుగాంచెదనోయని చూచుచుండెదననుట.

మా॥ మధురిమభరితే మనోభిరామే మృదులతరస్మిత ముద్రితా
ననేందౌ । త్రిభువననయనైక లోభనీయే మహసివయంవ్రజభాజిలా
లసాస్మః॥ ౭౭

టీక. మధురిమభరితే- మధురిమ- సౌందర్యములయొక్క, భరితే-సంజాతాతిశయముగలయదియు, మనోభిరామె - హృదయాభిరామమయినయదియు. మృదులతరస్మితముద్రితాననేందౌ- మృదులతర - మిక్కిలియున్మృదువైన, స్మిత-చిఱునగవుచేత, ముద్రిత -చిహ్నముగలదిగాఁజేయఁబడిన, అననేందౌ- చంద్రునివంటిముఖముగలయదియు, త్రిభువననయనైక లోభనీయే - త్రిభువన - ముల్లోకములయొక్క, నయనే - నేత్రములచేత, ఏక - ముఖ్యముగా, లోభనీయే- ఆసఁజేయఁదగినదియు, వ్రజభాజి- వ్రజ- నందవ్రజమును, భాజి-పొందినయదియునగు, మహసి- తేజమునందు, వయం- మేము, లాలసాః- ఆసక్తులము, స్మః-అయితిమి.

మ॥ రమణీయస్మిత మాధురీకలిత ముద్రాముద్రితంబైసుధా। స
మసల్లాపకలాపమై త్రిజగతీ సంమోహనాకారమై । కమలానేత్రమ
నోభిరామరుచినైకస్ఫుట్టువక్త్రేందుబిం। బమునస్మితివెలుంగుగోపగృ
హసౌభాగ్యంబునేఁ గోరెదన్॥

తా. అతిశయంబగుసౌందర్యసంపదకాకరంబైహృదయాభిరామంబై

యత్యంతమృదులంబగు దరహాసముచేఁ జిహ్నితంబగు చంద్రునివంటి నెమ్మొగంబుగలిగి లోకంబులచే నాశింపఁబడుచున్నదియై నందవ్రజంబుఁ బొందియున్న తేజంబునం దాసక్తుండనగుచున్నాననుట.

శ్లో॥ ముఖారవిన్దే మకరందబిందు నిష్యన్దలీలామురళీనినాదే। వ్రజాఙ్గనాపాఙ్గతరఙ్గ భృఙ్గ సఙ్గ్రామభూమౌ తవ లాలసాః స్మః॥ ౭౮

టీక. మకరన్దబిన్దు నిష్యన్దలీలా మురళీనినాదే - మకరన్ద-పుష్పరసము యొక్క, బిన్దు-ప్రవాహమువలె, లీలా-విలాసార్ద్రమయిన, మురళీనినాదే, వేణునాదముగలయదియు, వ్రజాఙ్గనాపాఙ్గ తరఙ్గభృఙ్గ సఙ్గ్రామభూమౌ-వ్రజ-వ్రేపల్లియందలి, అఙ్గనా-స్త్రీలయొక్క, అపాఙ్గ - కటాక్షములయొక్క-తరఙ్గ- అలలనియెడి, భృఙ్గ-తుమ్మెదలయొక్క, సఙ్గ్రామ-యుద్ధమునకు, భూమౌ- అధికరణభూమియైనదియునగు, తవ-నీయొక్క, ముఖారవిన్దే-ముఖకమలమునందు, లాలసాః-ఆసక్తులను, స్మః- అయితిమి.

మ॥ మురళీగానమరంద బిందుకృతసమ్మోదభ్రమద్వల్లవీ। సరసాపాంగతరంగభృంగపటలీ సంగ్రామరంగస్థలీ। సరణిం జెల్వగు నీముఖాంబుజమునం జంచన్మనఃపంకజా। కరమధ్యంబునఁ జాడఁ గోల్పుటకు నాకాక్షింతు నెల్లప్పుడున్॥ ౭౮

తా. మకరందప్రవాహంబుంబోలి విలాసార్ద్రంబైన వేణుగానంబున నొప్పుచు గోపాంగనలకడకన్నుల చూపులయలలనియెడి తుమ్మెదలగుంపులకలహంబులకు నధికరణప్రదేశంబైన నీముఖకమలంబునందు నెల్లప్పుడును లాలసులమైయుంటిమనుట.

శ్లో॥ ఆతామ్రాయతలోచనాంశులహరీ లీలాసుధాప్యాయితై। ర్గీతామ్రేడితదివ్యకేళిభరితైః స్ఫీతం వ్రజస్త్రీజనైః। స్వేదామ్భఃకణభూషితేనకిమపిస్మేరేణవక్త్రేన్దునా। పాదామ్భోజమృదుప్రచారసుభగంపశ్యామిదృశ్యంమహః॥ ౭౯

టీక. ఆతామ్రాయతలోచనాంశులహరీ లీలాసుధాప్యాయితైః-ఆతామ్ర- కొంచెముగ నెఱ్ఱనైనయవియు, ఆయత-దీర్ఘములైనయవియునయిన లోచన- నేత్రములయొక్క, అంశు-కిరణములయొక్క, లహరీ- ప్రవాహముయొక్క, లీలా-విలాసమనియెడి, సుధా - అమృతముచేత, ఆప్యాయితైః- ఆప్యాయమానములయిన యవియు, గీతామ్రేడితదివ్యకేళిభరితైః-గీత - గానములచేత, ఆమ్రేడిత - పునరుక్తములయిన, దివ్య - అతిరమణీయములయిన,

శైలీ - నర్తనవిశేషములయొక్క, భరితైః - అతిశయములు గలయదియునగు, వ్రజస్త్రీజనైః - గోపికాజనములతోఁగూడిన, పాదాంభోజమృదుప్రచారసుభగం - పాదాంభోజ - పాదకమలములయొక్క, మృదు - మృదువైన, ప్రచార - సంచారముచేత, సుభగం - సుందరమయినయదియు, స్వేదాంబుకణభూషితేన - స్వేద - చెమటయొక్క, అంబుః - ఉదకముయొక్క, కణ - బిందువులచేత, భూషితేన, అలంకరింపఁబడినయదియు, స్మేరేణ - మందహాసముతోఁగూడిన, వక్త్రేందునా - ముఖచంద్రునిచేత, స్పృతం - హృద్యమయినయదియు, దృశ్యం - చూడఁదగినదియు, కిమపి - వాచామగోచరమయినయదియునగు, మహః - శ్రీకృష్ణాఖ్యతేజమును, పశ్యామి - చూచుచున్నాను, ఈశ్లోకార్థంబు శ్రీగోపాలకృష్ణమంత్రరాజధ్యానంబని గోపాలకల్పంబున, జెప్పంబడియున్నది॥

మూ॥ గోపీనాంపాణిపద్మాని గృహీత్వాసహనృత్యతః। ధ్యాయేల్లక్షంజపరశ్చైకకన్యకాముద్వహేచ్ఛుభామ్॥

మ॥ మురిపెంపుంజిఱునవ్వు గెంజెమట సొంపుల్మించు నెమ్మోము
పై। సరసాలోకసుధాతరంగములు నించన్వేణుగానధ్వని। గ్గురుచైరం
జిలఁజొక్కు-గోపికలు గొల్వన్నృత్యలీలాయుత। స్ఫురణన్మెల్లనసంచరిం
చుహరినంభోజాక్షునీక్షించెదన్॥

తా. కొంచెముగ నెఱ్ఱనయిపొడవులైన కన్నులకాంతి ప్రవాహవిలాసంబను నమృతంబున నాప్యాయమానంబులై గానంబులం బునరుక్తంబగు నభినయాదిదివ్యకేళుల యతిశయంబుగలిగిన గోప యువతులతోడంగూడి మృదులంబులగు పాదకమలంబులచే నతిసుందరంబుగనర్తించుచు శ్రాయాసంబునం బొడమినచెమటలచేతం జిఱునగవుచేత నతిసుందరంబగు నెమ్మొగంబుచే నతిహృద్యంబై వాచామగోచరంబై వెలయు శ్రీకృష్ణాఖ్యంబగు తేజంబుఁజూచుచున్నాననుట.

మూ॥ పాణౌ వేణుః ప్రకృతిసుకుమారాకృతౌ బాల్యలక్ష్మీః పా
ర్శ్వే బాలాః ప్రణయసరసాలోకితాపాఙ్గలీలాః। మౌళౌ బర్హం మధు
రవదనాంభోరుహే మౌగ్ధ్యముద్రేత్యార్ద్రాకారం జ్యోతి రన్వే ౩౦
షయామః॥

టీక. పాణౌ - హస్తమునందు, వేణుః - పిల్లనగ్రోవియును, ప్రకృతిసుకుమారాకృతౌ - ప్రకృతి - స్వభావముచేత, సుకుమార - సుందరమైన, ఆకృతౌ - ఆకారమునందు, బాల్యలక్ష్మీః - బాల్యసంపదయును, పార్శ్వే - ప్రాంతమున,

ప్రిణయసరసాలోకితాపాఙ్గలీలాః - ప్రిణయ - ప్రేమచేత, సరస-రసయుక్తములయిన, ఆలోకిత - చూపులుగల, అపాఙ్గలీలాః- కటాక్షవిలాసములుగల, బాలాః-బాలురును, మౌళౌ-సిగయందు, బర్హమ్, నెమలిపురియును,మధురవదనామ్భోరుహే-మధుర-హృద్యమయిన, వదనామ్భోరుహే - ముఖకమలమునందు, ముగ్ధ్యముద్రా- సౌందర్యచిహ్నమును, ఇతి- ఈహేతువుచేత, ఆర్ద్రాకారం-ఆర్ద్ర-క్రొత్తనైన, ఆకారం-ఆకృతిగలయదియు, కితవం-ధూర్తమయినయదియు, కిమపి - వాచామగోచరమయినదియునగు, జ్యోతిః - శ్రీకృష్ణాఖ్యతేజమును, అన్వేషయామః - వెదుకుచున్నాము ॥ ఈశ్లోకార్థంబు శ్రీగోపాలకృష్ణైకాదశాక్షరీమంత్రధ్యానంబనిసనత్కుమారసంహితయందుఁజెప్పంబడియున్నది॥మూ॥ హరన్తంనవనీతాది చౌర్యైఃవ్రజయోషితామ్। గోపబాలైర్వృతం కృష్ణంధ్యాయేన్మన్త్రమిమంజపేత్॥

మ॥ సరసాపాంగవినోదవాక్యములు మించన్బాలకుల్గాల్వఁగా। మురళింగేలనమర్చిపింఛమకుటంబున్నొమ్ము చెల్వంబునుం। దరవేషంబునుబాల్యకాలముదయార్ద్రస్వాంతముంగల్గుచి। త్తరపుంధూర్తశిఖామణిన్వెదకిహృత్పద్మంబునన్ నిల్పెదన్॥ ౩౦

తా॥ కరంబునఁబిల్లనగ్రోవియును స్వభావసిద్ధంబగు సుకుమారంబుగలశరీరంబునఁబాల్యసంపదయును పార్శ్వంబునం బ్రేమచేసరసంబులగుచూపులుగల యపాంగవిలాసంబులునుగల గోపబాలురును సిగయందు నెమలిపురియునుహృద్యంబగు ముఖకమలంబున సౌందర్యముద్రయునీనుచుం గ్రొత్తయగునాకారంబుఁగలిగి ధూర్తంబయి వాచామగోచరంబయి వెలయు శ్రీకృష్ణాఖ్యంబగు తేజంబును వెదుకుచున్నాననుట,

మూ॥ ఆరూఢవేణుతరుణాధరవిభ్రమేణ మాధుర్యశాలివదనామ్బుజముద్వహంతీ। ఆలోక్యతాంకిమనయావనదేవతావః కైశోరకేవయసికాపిచకాంతియష్టిః॥ ౩౧

టీక. హేవనదేవతాః-ఓవనదేవతలారా, వః-మీకు-అనయా-ఈవ్యర్థక్రియచేత, కిం-ఏమిప్రయోజనము, కైశోరకే - కిశోరసంబంధమయిన, వయసి- వయస్సునందు, ఆరూఢవేణుతరుణాధరవిభ్రమేణ, ఆరూఢ- ఉంచఁబడిన, వేణు-పిల్లనగ్రోవిగల, తరుణ - లేఁతయయిన,అధర - అధరోష్ఠముయొక్క, విభ్రమేణ - విలాసముచేత, మాధుర్యశాలివదనామ్బుజం- మాధుర్య-

సౌందర్యముచేత, శాలి-ఒప్పుచున్న, వదనామ్బుజం - ముఖకమలమును, ఉద్వహన్తీ - వహించుచున్నయదియు, కాపి - వాచామగోచరమైనయదియు నగు, కాన్తియష్టిః - యష్టివంటికాంతి, దృశ్యతామ్-చూడఁదగినది.

ఉ॥ చాపకవంశమింపొదవఁ దానధరంబున మోపినాఁడు సం।
ప్రాపితమందహాసమధురాననుఁడై మహనీయతేజుఁడై। క్రేఁగ్రులమే
షమీఁ గొదలఁ గ్రేవ నేపాఁపడ నిల్చినాఁడు మీ। గోపితి రేనిఁ బట్టుఁడిక నో వ
నదేవతలార తెల్పరే॥ ౩౧॥

తా. ఓవనదేవతలారా మీకీవ్యర్థక్రియచే నేమిప్రయోజనంబు వయస్సునందే యధరంబున వేణువు మ్రోయించుచు నతివిలాసంబున సౌందర్యంబుచే నొప్పెడి ముఖకమలంబును వహించినదన్నై వాచామగోచరంబై వెలయు కాంతియిది చేతం జూడఁ దగినదియనుట.

మూ॥ అనన్యసాధారణకాన్తికాన్తమాక్రాన్తగోపీనయనారవి
న్దమ్। పుంసఃపురాణస్యనవంవిలాసం పుణ్యైరపూర్ణైర్విలోకయిష్యే॥

టీక. అనన్యసాధారణకాన్తికాన్తమ్- అనన్యసాధారణ- ఇతరులకందరాని, కాన్తి- కాంతిచేత, కాన్తమ్- మనోహరమయినయదియు, ఆక్రాన్తగోపీనయనారవిందం - ఆక్రాన్త- ఆక్రమింపఁబడిన, గోపీ- గోపికలయొక్క, నయనారవిందం- కమలములవంటి కన్నులుగలయదియునగు, పురాణస్యపుంసః ఆదిపురుషుఁడైన నారాయణునియొక్క, నవం - నూతనమయిన, విలాసం - శ్రీకృష్ణరూపవిలాసమును, పూర్ణైః-తక్కువగాని. పుణ్యైః- పుణ్యముచేత, విలోకయిష్యే- చూచుచున్నాను.

చ॥ ఇతరులకందరానిజగచేకమనోహరకాంతియుఁ గనమా। గత
నవయావనాకరవికాసములన్నియుగోపబాలికా। యతనయనారవిం
దములకగ్గముసేయు పురాణపూరుషు। న్నతెఁదలఁబోసిచూచెదనమగ్ర
సనాతనపుణ్యసంగతిన్॥

తా. ఇతరులకందరాని కాంతిచేమనోహరంబగుచు గోపికలకనుదామరలచే నాక్రమింపఁబడిన పురాణపురుషుండగు నారాయణుని క్రొత్తయగు విలాసంబుఁజూచుచున్నాననుట.

✓ మూ॥ సాష్టాంగపాతమభివన్ద్య సమస్తభావైస్సర్వాన్మునీన్ద్రని
కరానిదమేవయాచే। మన్దస్మితార్ద్రమధురాననచన్ద్రబిమ్బే నన్దస్యపు
ణ్యనిచయేమమభక్తిరస్తు॥

టీక. సాష్టాంగపాతం సాష్టాంగ - అష్టావయవములతోఁ గూడిన, పాతం - పాతము గలుగునట్టుగా. సర్వాన్ - సమస్తమయిన. సురేంద్రనికరాన్ - సురేంద్ర - దేవతాశ్రేష్ఠులయొక్క, నికరాన్ - సమూహములఁ గూర్చి, అభివన్ద్య - నమస్కరించి, సమస్తభావైః - సమస్తప్రకారములచేత, ఇదమేవ - ఈచెప్పఁబోవునదియు, యాచే - యాచించుచున్నాను, మన్దస్మితార్ద్రమధురాననచన్ద్రబిమ్బే - మన్దస్మిత - మందహాసముచేత, ఆర్ద్ర - సరసమయినదియగుటచేత, మధుర - సుందరమయిన, ఆననచన్ద్రబిమ్బే, చంద్రబింబమువంటిముఖము గల, నన్దస్య, నందునియొక్క, పుణ్యనిచయే - పుణ్యసమూహమైన శ్రీకృష్ణునియందు, మమ, నాథ, భక్తిః - భక్తి, అస్తు, అగుఁగాక.

మ॥ అమరన్ సర్వసుపర్వముఖ్యతతికిన్ సాష్టాంగదండప్రణా।
మముఁ గావించుచు సర్వభావముల నాత్మన్ వేఁడెద న్మందహా। సముఖాం
భోజవిలాసుఁడై భువనివాసంబైన నందార్జితో। త్తమపుణ్యావలియందు భ
క్తి నెలువందన్నాకు నెల్లప్పుడున్॥ ౩౩

తా. సమస్తదేవతాశ్రేష్ఠసమూహములం గూర్చి కరంబులు ఉరంబు లు భుజంబులు ఊరంబులు లలాటంబును శిరంబును బడసి వైసోక మ్రొక్కి - సమస్తప్రకారంబుల నిశ్చయంబున నీచెప్పంబోయెడి క్రమంబున యాచించుచున్నాను ఎట్టులనిన నిజమనగవుచే సరసంబై సుందరంబై చందురునిఁబోలిన మొగంబుగలిగిన నందుని పుణ్యంపు గుంపునైనపడిచెలంగు గోపాలదేవునందు నాకత్యంతంబగు భక్తి గలుగుంగావుతయని యాచించుచున్నాననుట-

మూ॥ యేషు ప్రవాహేషు సఫలమన్యే క్షణోపి గణ్యః పురుషాయు
షేషు। ఆస్వాద్యతే యత్ర కయాపి భక్త్యా నీలస్య బాలస్య నిజం చరిత్రమ్॥

టీక. యేషు, ఏయెడఁబోవుచున్నయవియు, ప్రవాహేషు, ప్రవాహరూపములయిన యవియునగు, పురుషాయుషేషు, జీవనకాలములయందు - సఫల - ఆపరిసిద్ధమయిన, క్షణోపి - క్షణమే, గణ్యః - లెక్కింపఁదగినదదియని మన్యే - తలంచుచున్నాను, యత్ర - ఏక్షణమందు, కయాపి - అనిర్వాచ్యమయిన, భక్త్యా - భక్తిచేత, నీలస్య - నీలవర్ణుఁడైన, బాలస్య - బాలకృష్ణునియొక్క, నిజం - స్వకీయమైన, చరిత్రం - చరితము, ఆస్వాద్యతే - అనుభవింపఁబడుచున్నదియో, సఫలక్షణః - ఆక్షణమే, గణ్యః - లెక్కింపఁదగినదియని, మన్యే - తలంచుచున్నాను, అని యన్వయము-

ఉ॥ ఏమిటికిం బుజాత్మమది నెంచఁగ నాయువులెక్కఁబెట్టఁగాఁ-।

చామరవృత్తినైన నతిభక్తివిధంబుననైన బాలలీ| లామహనీయుఁడౌ
హరిఁదలంచని మేషములున్ముహూర్తము| ల్యాములు లెక్కకెక్కనటు
సల్పినికాలములెల్ల వ్యర్థముల్॥ ౩౪

తా, ప్రవాహరూపంబుగఁబోవునీజీవిత కాలంబుననేరూపంబగు భక్తిచేతనైనను నీలవర్ణుండగు బాలకృష్ణునిసుచరిత్రంబు చింతింపబడుచున్న క్షణకాలంబైనను లెక్కింపనర్హంబులేని చానేమిటికనుట,

శ్లో॥ నిసర్గ సరసాధరం నిజదయార్ద్ర దివ్యేక్షణం మనోజ్ఞముఖప
ఙ్కజం మధురసార్ద్రమన్దస్మితమ్ । రసజ్ఞహృదయాస్పదం రమితవల్లవీ
లోచనం పునః పునరుపాస్మహే భువనలోభనీయం మహః॥ ౩౫

టీక. నిసర్గసరసాధరం- నిసర్గ-స్వభావముచేత, సరస- రసయుక్తమయిన, అధరం- అధరోష్ఠముగలయదియు, నిజదయార్ద్రదివ్యేక్షణం- నిజ-నిత్యమయిన, దయా- దయచేత, ఆర్ద్ర-ప్రసన్నములయిన, దివ్య-దివ్యములయిన, ఈక్షణం- నేత్రములుగలయదియు, మనోజ్ఞముఖపఙ్కజం- మనోజ్ఞ-సుందరమయిన, ముఖపఙ్కజం- కమలమువంటి ముఖము గలయదియు, మధురసార్ద్రమన్దస్మితం- మధురస - హృద్యరసముచేత, ఆర్ద్ర-సరసమయిన, మన్దస్మితం - చిఱునగవుగలయదియు, రసజ్ఞహృదయాస్పదం-రసజ్ఞ- బ్రహ్మజ్ఞులయొక్క, హృదయ-హృదయములే, ఆస్పదం- అవస్థానముగఁగలయదియు, రమితవల్లవీలోచనం - రమిత- సంతోషింపఁబడిన, వల్లవీ - గోపికలయొక్క, లోచనం - నేత్రములుగలయదియు, భువనలోభనీయం - భువనలోకములచేత, లోభనీయం - ఆశింపఁదగినయదియునైన, మహః-శ్రీకృష్ణాఖ్యతేజమును, పునఃపునః- సారెసారెకును, ఉపాస్మహే- సేవించుచున్నాము.

ఉ॥ కమ్మనితేనెవానజడి గ్రమ్మెడుమోవి సుధారసమ్ములం । జి
మ్మనుతేఁట నవ్వుదయఁ జిప్పిలుచూపులు మోముదమ్మిచే । ల్వమ్మును
గోపికల్గనిహళాహళిఁ జెందరసజ్ఞులెల్లలో।కమ్ములుగాంచి సొక్కనవ
కంబగుతేజముఁగొల్చెదన్మదిన్ ౩౫

తా. స్వభావంబుచేసుందరంబగు నధరంబును దయచే సరసంబులైదివ్యంబులైన నేత్రంబులును మనోహరంబగు ముఖకమలంబును హృద్యరసంబున సరసంబగు చిఱునగవునుంగలిగి యెల్లలోకంబులచే నాశింపఁదగినదియై పరబ్రహ్మంబు నెఱింగినవారల హృదయంబు లాస్పదంబుగనుండుచు గోపికల నయనంబులకు సంతసంబుఁజేయుచు వెలుంగు శ్రీకృష్ణాఖ్యతేజంబును సారెసా

రెదు నేను సేవించుచున్నాననుట.

మూ॥ సకోఽపి బాలస్సరసీరుహాక్షః సాచ వ్రజస్త్రీజనపాదధూళిః।
ముహుస్తదేతద్యుగళం మదీయే మోహముపాయాతి మనస్యుదేతు॥

టీక. సః- ప్రసిద్ధుఁడయినవాఁడును, కోఽపి - వాచామగోచరుఁడైన వాఁడును, సరసీరుహాక్షః - పుండరీకాక్షుఁడయినవాఁడునైన, బాలః- బాలుఁడును, సా- ఆప్రసిద్ధమయిన, వ్రజస్త్రీజనపాదధూళిశ్చ - వ్రజస్త్రీజన-గోపికాజనములయొక్క, పాదధూళిశ్చ- పాదధూళియును, తదేతద్యుగళం-ఆయీరెంటును, మదీయే - నాసంబంధమయిన, మనసి- చిత్తము- మోహముపాయాతేఽపి- మోహమునొందినదైనప్పటికిని, ముహుః- మాటిమాటికి, ఉదేతు- స్ఫురితపదమునొందుంగాత-

చ॥ అలఘువిమోహభారమున నలుగుచుండుగయ్యెడునన్నుఁ బ్రోవఁగా। లలితవిశాలలోచనములంబరికించుచువాయువేగుఁడై। దులదులవచ్చు బాలుఁడును వీడనేకొనసియాడనాతనిం। గలిసికొనంగవచ్చువ్రజకాంతలపాదరజంబుఁగాంచెదన్॥ ౩౮

తా. ప్రసిద్ధుఁడై వాచామగోచరుఁడై తెల్లదామరలుఁబోనిలోచనంబులుగల బాలకృష్ణుఁడనువానివెంటనంటివచ్చు గోపికలపాదరజంబును మిక్కిలియుఁ బ్రీతంబగునామనంబునందాంచుచున్నాననుట.

మూ॥ మయిప్రయాణాభిముఖేచవల్లవీ స్తనద్వయీదుర్లలితస్సబాలకః। శనైశ్శనైశ్శ్రావిత వేణునిస్వనో విలాసవేషేణపురః ప్రతీయతామ్॥ ౩౯

టీక. మయి- నేను, ప్రయాణాభిముఖేచ- ప్రయాణ-లోకాంతరప్రయాణమునకు, అభిముఖేచ - ఉన్ముఖుఁడనగుచుండఁగా, వల్లవీస్తనద్వయీదుర్లలితః- వల్లవీ- గోపస్త్రీలయొక్క, స్తనద్వయీ- స్తనద్వంద్వములచేత, దుర్లలితః- శ్రాంతుఁడైన, సః-ఆప్రసిద్ధుఁడైన, బాలకః-బాలకృష్ణమూర్తి, శనైశ్శనైః-మెల్లమెల్లన, శ్రావితవేణునిస్వనః-శ్రావిత-శ్రవణమార్గమునొందింపఁబడిన, వేణునిస్వనః - వేణునాదముగలవాఁడగుచు, విలాసవేషేణ-విలాస-విలాసార్థమైన, వేషేణ - అలంకారముచేత, పురః- ఎదుట, మమ- నాకు, ప్రతీయతాం-తోఁచుఁగావుత.

ఉ॥ గొల్లమిటారిపూఁపచను గుత్తులహత్తిన వింతమాగతోఁ। జల్లనిచూపుతోవవలి సారెకుఁజాఱెడుపీలివంగడుల్। నల్లపరాకుఁజెప్పు

టకున్నైనిలస్నిల్పిన పిల్లవ గ్రోపితో। నల్లని బాలుఁడొక్కరుఁడు నాపయి నంబున నిల్చు ముంగలన్॥ 38

తా. నేను లోకాంతరంబునకుఁబోవ సమకట్టినపుడు గోపికల చన్నులరాయిడినలంగిన శరీరంబు గల వాచామగోచరుండగు బాలుండు మెల్లమెల్లన వేణుగానంబు నా చెవులనించుచు నాముందట విలాసయుతంబగు వేషంబుచే నిల్చుం గావుతయనుట.

మూ॥ అతిభూమిమభూమిమేవవా వచసాంవా సితవల్లవీ స్తనమ్।
మనసామపరంరసాయనంమధురాద్వైతమముపాస్మహేమహః॥ 39

టీక. వచసాం-వచనములకును, మనసాంవా-మనస్సులకును, అతిభూమిం- మిక్కిలియు విషయమ్మయినయదియు, అభూమిం- అవిషయమయినయదియు (సగుణత్వమున విషయమనియు నిర్గుణత్వమున నవిషయమనియు నుతాత్పర్యము) అపరం- ప్రసిద్ధమయినయదియు, రసాయనం - రసాయనస్వరూపమయినయదియు, మధురాద్వైతం- మధుర- సౌందర్యముచేత, అద్వైతం- అద్వితీయమయిన యదియు - వాసితవల్లవీ స్తనం - వాసిత నివాసముగఁ జేయఁబడిన, వల్లవీ స్తనమ్- గోపికా స్తనములుగలయదియునగు, మహఏవ- తేజమే ఉపాస్మహే- సేవించుచున్నాము.

చ॥ పలుకఁగొలందిగానియను భావముఁగాంచియు నద్వితీయమై।
సొలుపువహించి నెమ్మదిక పూర్వరసాయనమై మహోన్నతిం। దొలికెమదివ్య తేజము మనోహరవల్లవపల్లవాధరీ। లలితపయోధరాంతర విలాసనివాసముఁగాంచెఁగంటిరే॥ 39

తా. పలుకందరంబుగానియనుభావంబుచేనద్వితీయంబైమనంబునకు రసాయనంబై నెగడుదివ్యతేజంబు గోపికలచన్నులపై నివాసంబుఁజేసెనిట్టి తేజంబు నెడపకయుపాసించుచున్నాననుట.

మూ॥జననాన్తరేపి జగదేకమణ్డనే కమనీయధామ్ని కమలాయతేక్షణే। వ్రజసున్దరీజనవిలోచనామృతే చపలానిసన్తుసకలేన్ద్రియాణిమే॥

టీక - జగదేకమణ్డనే-జగత్ - లోకములకు, ఏక-ముఖ్యమయిన, మణ్డనే-అలంకారమైనవాఁడును, కమనీయధామ్ని-కమనీయ-కోరఁదగిన, ధామ్ని- తేజము గలవాఁడును, కమలాయతేక్షణే- కమల - తామరరేకులవలె- ఆయత- విశాలములైన, ఈక్షణే- నేత్రములుగలవాఁడును, వ్రజసున్దరీజనవిలోచనామృతే- వ్రజ - వ్రేపల్లియయందున్న, సున్దరీజన- స్త్రీజనములయొక్క, విలోచన-

నేత్రములకు, అమృతే- అమృతప్రాయుఁడైన వాఁడునైన శ్రీకృష్ణమూర్తి యందు, జననాన్తరేపి- జన్మాంతరమునందు, మే- నాయొక్క, సకలేంద్రియాణి- చక్షురాదులగు నెల్ల యింద్రియములు, చపలాని- ఆసక్తములు, సంతు- అగుంగాక.

మ॥ శతపత్రోజ్జ్వలపత్రనేత్రు వ్రజకంజాతాననాలోకనా।
మృతధారాకర చారుగాత్రు భువనోత్కృష్టైకభూషాసము। న్నత
చారిత్రుం బవిత్రుఁగోర్చి యనుజన్మంబున్ మాలోలేంద్రియ- ప్రతతుల్
సౌఖ్యమునొందుంగాత నిజ చాపల్యంబు లీడేరఁగన్॥ ౩౯

తా. జగములకు ముఖ్యముగ నలంకారభూతుండును గొనియాడఁదగినమహనీయతేజంబున కాశ్రయుండును బుండరీకాక్షుండును గోపికల నేత్రంబులకమృతంబుబోలె సుఖంబుఁ జేయువాఁడునగు శ్రీకృష్ణదేవునందుఁ బ్రతిజన్మంబునను నా సకలేంద్రియంబులాసక్తంబులై సుఖంబునొందుంగాతయనుట.

శ్లో॥ మునిశ్రేణీవన్ద్యం మదభరలసద్వల్లవవధూస్తనశ్రోణీబిమ్బ
స్తిమితనయనామ్భోజసుభగమ్। పునశ్శ్లాఘాభూమిం పులకితగిరాం
నైగమగిరాం ఘనశ్యామం వన్దే కిమపి మహనీయాకృతి మహః॥ ౪౦

టీక. మునిశ్రేణీవన్ద్యం - ముని- మునీశ్వరులయొక్క, శ్రేణీ - పఙ్క్తుల చేత, వన్ద్యం- నమస్కారము చేయఁబడుచున్నయదియు, మదభరలసద్వల్లవవధూస్తనశ్రోణీబిమ్బస్తిమితనయనామ్భోజసుభగం- మదభర-మదభారము చేత, లసత్- ప్రకాశించుచున్న, వల్లవవధూ- ఆభీరస్త్రీలయొక్క, స్తన- స్తనములయొక్కయు, శ్రోణీ- పిరుదులయొక్కయు, బింబ- ప్రదేశములవిషయమందు, స్తిమిత - నిశ్చలమైనట్టివంటి నయనాంభోజ - తామరరేకులవంటికన్నులచేతను, సుభగం- సుందరము లయినయదియు, పునః- వెండియు, పులకితగిరాం పులకిత - సంజాతపులకములుగల, గిరాం- వాక్యములుగల, నైగమగిరాం- వేదాంతవాక్యములకు, శ్లాఘాభూమిం- కొనియాడఁదగినభూమియైన యదియు, ఘనశ్యామం- ఘన - వారిదమువలె, శ్యామం- నల్లనయినయదియు మహనీయాకృతిం - మహనీయ- స్పృహణీయమయిన, ఆకృతిం- స్వరూపము గలయదియు, కిమపి- చెప్పనలవిగానిదియునగు, మహః- శ్రీకృష్ణుఁడను తేజస్సునుగూర్చి, వందే- నమస్కారము చేయుచున్నాను-

చ॥ పులకలుగ్రమ్మనట్టి జనముల్ శ్రుతివాక్యముల న్నుతింపఁ
గా। జగన్మనోహరాకృతి యొసంగ మదాలసవల్లవాంగనా। లలిత

శ్యైన- చూడదగిన, కైశోరవేషేణ - బాల్య వేషముచేత, ఉపలక్షితం-చూడఁబడి నవాఁడను, విశాలలోచనం- విశాల - వెడల్పులైన, లోచనం - కన్నులుగల వాఁడును, యశోదయా- యశోదాదేవిచేత, లబ్ధయశోనవాంబుధేః-లబ్ధ పొం దఁబడిన, యశః-కీర్తియును, నవ-నూతనమైన, అంబుధేః - ఉదధికి, నీలనిశాక రం-నీల- నల్లని, నిశాకరం- చంద్రుఁడైన శ్రీకృష్ణస్వామిని, కదా- యెప్పుడు, నిశామయే-చూచుచున్నాను.

శా॥ లీలాలోలవిశాలలోచనునిఁ గేళీశైశవాలంకృతు । న్బాలు న్బాలితలోకపాలు వ్రజకాంతల్ సోఁకఁ-చుఁ జొకఁ-చం। దాలంగన్బ లకోద్గీర్ణకగోను యశోదాకీర్తిరత్నాకర। పాలేయాంశుని నీలనీరదతను భావింతునెల్లప్పుడు॥ ౮౨

తా. వ్రేపల్లియయందలి గోపికలనేత్రంబులచేఁ జూడంబడుచున్నవి నై విలాసార్థంబుగ నంగీకరింపఁబడిన బాలవేషంబుగలిగి విశాలంబులగులో చనంబులచేతం దేజరిల్లుచు యశోదాకీర్తిసముద్రంబునకుఁ జంద్రుఁడైనలవ ర్ణుఁడైన గోపాలదేవునెప్పుడు చూచుచున్నాననుట.

మా॥ ప్రకృతిరవతునో విలాసలక్ష్మ్యాః ప్రకృతిజడమ్ప్రణతాపరాధవీథ్యామ్ । సుకృతికృతపదం కిశోరభావే సుకృతిమనఃప్రణిధాన పాత్రమోజః॥ ౮౩

టీక. కిశోరభావే-బాలభావమందు, విలాసలక్ష్మ్యాః-విలాససంపదకు, ప్రకృతిః- మూలకారణమయినయదియు, ప్రణతాపరాధవీథ్యామ్-ప్రణత- భక్తులయొక్క, అపరాధ - అపరాధములయొక్క, వీథ్యామ్ - పరంపరా విషయమై, ప్రకృతిజడం- స్వభావముచేతజడమయినయదియు, సుకృతిమనః- ప్రణిధానపాత్రం - సుకృతి - పుణ్యపురుషులయొక్క, మనః - మనస్సులయొ క్క, ప్రణిధానపాత్రం - ఏకాగ్రవిషయమైన వాఁడును, సుకృతికృతపదం, సుకృతి- పుణ్యపురుషులయందు, కృత- చేయఁబడిన, పదం - స్థానముగలవాఁడు నగు, ఓజః- తేజస్సు, నః- మమ్మును, అవతు-రక్షించుఁగాత.

చ॥ నుతజనతాపరాధముల నెన్నెడుపట్లజడస్వభావమై । కృత సుకృతాత్మలోఁ బరికింపఁగఁ బాత్రమునై కిశోరతా। స్థితపదమై। వి లాససమృద్ధికీర్తికిఁ బ్రసూతియునైన నోహరి। కృతిఁగనుపించునా సుకృత కేవలతేజము మమ్ముఁ బ్రోవుత॥ ౮౩

తా. బాల్యంబున విలాససంపదకుమూలకారణంబై భక్తులయపరాధవీధీవిషయమై స్వభావసిద్ధంబుగజడంబై విద్వాంసులమనంబుల నేకాగ్రిపాత్రంబుసుకృతులయందుఁ జేయంబడిన నివాసంబుగలిగి వెలుఁగు తేజంబు మమ్ముం బ్రోచుఁగావుతయనుట.

మూ॥ అపహసితసుధామదావలేపై రధికమనోహరమార్ద్రమందహాసైః। వ్రజయువతి విలోచనావలేహ్యాం రమయతు ధామరమావరోధనంనః॥ ౪౪

టీక. అపహసితసుధామదావలేపైః - అపహసిత-యెగతాళిచేయఁబడిన, సుధా-అమృతముయొక్క, మద,మద హేతుకమయిన, అవలేపైః-గర్వముగలిగిన, ఆర్ద్రమందహాసైః -ఆర్ద్ర- రసయుక్తమయిన, మందహాసైః-చిఱునగవులచేతను, అధికమనోహరం - అతిశయమయినమనోహరమైన, వ్రజయువతివిలోచనావలేహ్యాం- వ్రజయువతీ- ఆభీరస్త్రీలయొక్క, విలోచన- కన్నులచేత, అవలేహ్యం- అత్యాదరణచేఁ జూడఁదగిన,రమావరోధనం- రమా, లక్ష్మీదేవికి, అవరోధనం - అంతఃపురమైన,ధామ, కాంతి- నః-మమ్మును,రమయతు, ఆనందమునుబొందింపఁజేయుఁగా,

చ॥ నవసుధక్రొవ్వునవ్వు చిఱునవ్వులు మోమున గోనుఁజూప వల్లవలలనావిలోచన విలాసవిలేహ్యము నైరమామణీ। భవనభుజాంతరస్థలిసిఖాసిలునందతపః ప్రభావసం। భవఫలమైనధామముమనోభ్రంబులభంగురభంగిసీవృతఁ॥

తా. నవామృతంబు గర్వంబునపహసించు మందహాసంబు మోమునంగ్రొత్తనవ్వునుంజూప గోపికలవిలోచనంబుచే మిక్కిలియు జూడంబడుచున్నదియై శ్రీమహాలక్ష్మికినిల్లయి వెలుంగు తేజంబు మమ్మునంతోషింపజేయుగాక.

మూ॥ అఙ్కురితస్మేరదశావిశేషై రశ్రాన్తహర్షామృతవర్షమక్ష్ణోః। సఙ్క్రీడతాం చేతసిగోపకన్యా ఘనస్తనస్వస్త్యయనంమహోనః॥

టీక. అఙ్కురితస్మేరదశావిశేషైః అఙ్కురిత అంకురించిన స్మేరదశావిశేషైః మందహాస విశేషములచేతను, అక్ష్ణోం నేత్రములకు, అశ్రాన్తహర్షామృతవర్షం అశ్రాన్త అవిచిన్నమైన, హర్షామృత, ఆనందామృతముయొక్క, వర్షం, వర్షమైనయదియు, గోపకన్యాఘనస్తనస్వస్త్యయనం, గోపకన్యాగోపకన్యలయొక్క, ఘన్య-ధన్యములయిన, స్తన- స్తనములు

యొక్క, స్వస్త్యయనం, మంగళాయతనమయినయుదియున్నైన, మహః-కాం
తిన్నీ-మాయొక్క, చేతసి-మనమునందు, సంక్రీడతాం-లెస్సగా గ్రీడించుగాక.

చ ॥ అతులితమందహాస రుచిరాననము ల్విలసిల్లఘర్మనోద్యతజ
నతావలోక ఘనహర్ష సుధామయ వర్షరూపమై। సతతముగోపికా
ఘనకుచస్థలనిస్తుల టవ్యమంగళా। యతనమునైన ధామమునిరంతర
మున్గజరిల్లుచు నామదిన్॥

తా. ముల కలెత్తుమన్న చిఱునగవుచేతం జూపులకన్నులకుసంతో
షామృతంబు వర్షించుచు గోపకన్యకలకుచములకు మంగళాయతనంబై వెల
యు తేజంబు నామనంబునంజరించుచుం గాతయనుట.

మూ॥ మృగమదపఙ్కసఙ్కరవిశేషిత వన్యమహాగిరి తటగణ్డగైరి
కఘనద్రవవిద్రుమితమ్। అజితభుజాంతరం భజత హే వ్రజగోపవధూ
స్తనకలశస్థలీఘుసృణ మర్దనకర్దమితమ్॥ ౮౬.

టీక. మృగమదపఙ్కసఙ్కరవిశేషిత వన్యమహాగిరి తటగణ్డగైరికఘన
ద్రవవిద్రుమితం- మృగమద- కస్తూరియొక్క, పఙ్క - బురదయొక్క, సఙ్క
ర- సంబంధముచేత, విశేషిత- మిక్కిలియతిశయింపఁబడిన, వన్య-అడవియం
దుఁబుట్టిన, మహాగిరి- గొప్పపర్వతముయొక్క, తట-చరియందలి-గండ-స్థూ
లోపలముయొక్క, గైరిక - గైరికాదివిశేషముయొక్క, ఘన- సాంద్రమైన,
ద్రవ- ద్రవముచేత, విద్రుమితం - పవడముగఁజేయఁబడినయదియు, వ్రజ
గోపవధూస్తనకలస్థఘుసృణ మర్దనకర్దమితం - వ్రజ - నందునివ్రేపల్లియం
దుందలి, గోపవధూ- గోపికాస్త్రీలయొక్క, స్తనకలశ- కలశములవంటి స్త
నములయొక్క, స్థలీ - ప్రదేశమందలి, ఘుసృణ - కుంకుమగంధము యొక్క,
మర్దన- ఒరియుటచేత, కర్దమితం- బురదకలిగినదిగాఁజేయఁబడినదియునగునటు
వంటి, అజితభుజాంతరం - అజిత- శ్రీకృష్ణస్వామియొక్క, భుజాంతరం, భు
జమధ్యమును- భజత సేవింపుఁడు.

చ ॥ మృగమదపంకసంకరగిరిస్థితగైరికధాతురక్తిమం। బొగరువ
హించి వల్లవవధూపృథుల స్తన కుంకుమంబునన్। ద్విగుణితకాంతివ
త్తుఁడగు నీదరుహాత్మునఁ గృపాకటాక్షునిం। దగి భజింపనిల్పుఁడమ
ధంబునను త్తముఁబార చిత్తముల్॥ ౮౬.

తా. కస్తూరికర్దమమునుయొక్క సంబంధముచే నతిశయింబఁబడినగిరి
ప్రదేశంబు గండశిలయందలి ధాతువిశేషముయొక్క యతిశయంబగు ద్రవం

బుచే నరుణంబై వ్రేపల్లియయందలి గోపికలకుచంబుల యంగరాగవిశేషంబు మర్దనంబుచేఁ బంకిలంబగు శ్రీకృష్ణునివక్షంబు సేవింపుఁడనుట.

శ్లో॥ ఆమూలపల్లవితలీలమపాఙ్గజాలై రాసిఞ్చతీభువనమాదృత
గోపవేషా। బాల్యాకృతిర్మృదులముగ్ధముఖేన్దుబిమ్బా మాధుర్యసిద్ధి
రవతాన్మధువిద్విషో నః॥ ౪౭॥

టీక. ఆమూలపల్లవితలీలం- ఆమూల- మూలపర్యంతము, పల్లవిత,చిగిరించినటువంటి, లీలం-లీలలుగలుగునట్లుగా, అపాఙ్గజాలైః-అపాఙ్గ- కీఁగంటిచూపులయొక్క, జాలైః- సమూహములచేత, భువనం-లోకమును,ఆసిఞ్చతీ- తడుపుచున్న యదియు, ఆదృతగోపవేషా- ఆదృత - ఆదరణచేయఁబడిన, గోపవేషా- గోపాలకవేషముగలయదియు, మృదులముగ్ధముఖేందుబింబా- మృదుల- కోమలమయినయదియు, ముగ్ధ- సుందరమయిన యదియునగు ముఖేందుబింబా, చంద్రబింబముతో సమానమయిన ముఖముగలయదియు,మాధుర్యసిద్ధిః- మాధుర్య- మధురత్వముయొక్క, సిద్ధిః- ప్రాప్తిమైనయదియైన యునగు, మధువిద్విషః శ్రీకృష్ణమూర్తియొక్క, బాల్యాకృతి- బాల్యా- బాలభావమందలి, ఆకృతిః- రూపము, నః-మమ్ము, అవతాత్ - రక్షించుఁగాత.

చ॥ కరుణనుబాఁదు కొల్పినజగంబుఁ గటాక్షసుధారసాప్తిచేఁ బ
రిణతఁ బల్లవప్రసవ పక్వఫలంబునుగా నొనర్చుచుం । జిరుతవిలాసి
ప్రాయమునఁ జెల్వగుచకఁదనాల్పపంటన । మ్మురహరుఁబూర్ణచం
ద్రముఖు మోహన పల్లవ వేషుఁగొల్చెదన్॥ ౪౮

తా. మొదలంటఁజిగిర్చిన విలాసంబులు గలుగునటుల నపాంగ నిరీక్షణంబుల జగంబుంజూచుచున్నదియై కోమలంబునుసుందరంబునై చంద్రబింబంబుఁబోలిన నెమ్మొగంబుగలిగి యందఱచే నంగీకరింపఁబడిన గోపాలాలంకారంబుగలిగి సౌందర్యంబుల కాటపట్టయి వెలయునట్టి శ్రీకృష్ణుని బాలభావంబునందలి యాకారంబు మమ్మురక్షించుఁగాక.

శ్లో॥ విరణన్మణినూపురం వ్రజేచరణామ్భోజ ముపాస్వ శార్ఙ్గిణః। సరసే సరసి శ్రియాశ్రితం కమలం వా కలహంసనాదితమ్॥ ౪౯॥

టీక. వ్రజే- నందునిగొల్లపల్లియయందు, విరణన్మణినూపురం - విరణత్ - ధ్వనిచేయుచున్న, మణి- మణిమయములయిన, నూపురం- అందెలుకలయదియు, సరసే - రసయుక్తమయిన, సరసి - సరస్సునందు, శ్రియా-కాంతిచేత, శ్రితం - ఆశ్రయింపఁబడినయదియు, కలహంసనాదితం - కలహంస-

రాజహంసలచేత, నాదితం - ధ్వనికలదిగాఁ జేయఁబడినటువంటి, కమలం కమలములవలెనున్నదియునగు, శార్ఙ్గిణః - శ్రీకృష్ణస్వామియొక్క, చరణాంభోజం - కమలములవంటి పాదములను, ఉపాస్వ - సేవింపుము, ఇచట చరణాంభోజమ్- అనుపదమునకు దద్విశేషణపదములునుజాత్యేక వచనముగాఁ బ్రయోగింపఁబడియె.

ఉ॥ సారసరోమరాళ వరసారసనస్నిభ సూత్నరత్నసుం। జీర విలాసపాదములచేఁ జరియించుచువీధిలేగలం । బారఁగఁదోలివెంబడినెపుప్పులువారుచుఁ జేరిపట్టుమం । గేరినటించుచిన్నియయు కేసరి నామునినాశ్రయించెదఁ॥ ౪౮

తా॥ సారవంతంబగు స్వరంబున మరాళధ్వనితోఁ డంగూడిన కమలంబుకరణియందియల మ్రోఁతచేరవణించు శ్రీకృష్ణుని కాంతియుతంబగు పాదకమలంబును సేవింపుమనుట.

మూ॥ శరణమశరణానాం శారదాంభోజనేత్రం నిరవధిమధురిమ్నానీలవేషేణ రమ్యమ్ । స్మరశరపరతంత్రైస్స్మేరనేత్రాంబుజాభిర్వ్రజయువతిభిరవ్యాద్బ్రహ్మసంవేష్టితం నః॥ ౪౯

టీక- అశరణానాం - రక్షకులులేనివారలకు, శరణం - రక్షకమైనయదియు, శారదాంభోజనేత్రం-శారద- శరదృతుసంబంధములయిన, అంభోజ - కమలములవంటి, నేత్రం - కన్నులుగలయదియు, నిరవధిమధురిమ్నా - నిరవధి-అవధిలేని, మధురిమ్నా- సౌందర్యాతిశయముగల, నీలవేషేణ- నల్లనివేషముచేత, రమ్యం - మనోహరమయినయదియు, స్మరశరపరతంత్రైస్స్మేరనేత్రాంబుజాభిః- స్మరశర- మన్మథబాణములచేత, పరతంత్రై - పరాధీనులయినవారును, స్మేర - వికసించిన, నేత్రాంబుజాభిః- పద్మములవంటి కన్నులుగలవారును, వ్రజయువతిభిః- గొల్లపల్లెయందలి స్త్రీలచేత, వేష్టితం - చుట్టఁబడిన, బ్రహ్మ - శ్రీకృష్ణుఁడనెడుపరబ్రహ్మము, నః -మమ్ము, అవ్యాత్ - కాపాడుఁగావుత.

మ॥ శరదంభోరుహనేత్రు నిస్తులకళా సౌందర్యపాత్రున్మనో । హరపౌరందరనీలగాత్రుఁ గుసుమాస్త్రావేశజాతస్మితాం । కురునందవ్రజసుందరీపరివృతుం-గోపాంగనాలింగితు । న్శరణత్రాణసమున్నతున్వ్రతధియా నాసోన్నతుం గొల్చెదన్॥ ౪౯॥

తా॥ రక్షకులు లేనివారలకు రక్షకుండై శరత్కాలంబునవిరిసిన తెల్ల

చామరరేకులంబోలిన కన్నుఁగవగలిగినిరవధిక సౌందర్యంబుగలనీలవర్ణంబుచే నతిమనోహరంబై మన్మథబాణంబులచే బడలినకతంబునఁ బరాధీనంబులైన లోచనకమలంబులుగల గోపయువతులచేతం బరివేష్టింపఁబడియున్న శ్రీకృష్ణ రూపంబగు పరబ్రహ్మంబు మమ్ముంబ్రోచెడుమనుట,

శ్లో॥ సువ్యక్తకాంతిభరసౌరభ దివ్యగాత్రమవ్యక్తయౌవనపరీ
తకిశోరభావమ్ । గవ్యానుపాలన విధావనుశిష్టమవ్యాదవ్యాజరమ్యమ
ఖిలేశ్వరవైభవం నః॥ ౫౦

టీక. సువ్యక్తకాంతి భరసౌరభదివ్యగాత్రం- సువ్యక్త- ప్రకాశించుచున్న, కాంతి- కాంతులయొక్క- భర-అతిశయముగలిగినదియు, సౌరభ- పరిమళయుక్తమయిన, దివ్యగాత్రం - దివ్యమంగళవిగ్రహముగల యదియు, అవ్యక్తయౌవనపరీతకిశోరభావం - అవ్యక్త - అస్ఫుటమయిన, యౌవన- జవ్వనముచేత, పరీత-వ్యాప్తమయిన, కిశోరభావం- బాల్యముగలయదియు, గవ్యానుపాలనవిధౌ - గవ్య - గోసమూహముయొక్క, అనుపాలన - రక్షణముయొక్క, విధౌ- విధానమందు, అనుశిష్టం - శిక్షితమయినయదియు, అవ్యాజరమ్యం-అవ్యాజ-ఉపాధిరహితముగా, రమ్యం - మనోహరమయినయదియు నగు, అఖిలేశ్వరవైభవమ్ - అఖిలేశ్వర - నారాయణునియొక్క, వైభవం- శ్రీకృష్ణాఖ్యనయిభవము, నః-మమ్ము, అవ్యాత్ - రక్షించుగాక.

చ॥ ప్రకటితకాంతిసౌరభకరంబితగాత్రము యౌవనార్భటీ।
చకితకిశోరభావము నిసర్గమనోహర రూపధేయమై। సకల జగన్ని
యంతయగు శౌరిమహత్త్వము గొల్లపల్లెబా। యకయొకయింటనాప
సులనారసి మేపె నిజేమిచిత్రమో॥ ౫౦

తా. ప్రకాశమానంబగు కాంత్యతిశయంబుగలిగి పరిమళయుతంబైన దివ్యమంగళశరీరంబును మొలకలెత్తుజవ్వనంబుచే వ్యాప్తంబునునగు బాల్యంబునుంగలిగి గోపరిపాలనవిధియందు శిక్షితంబైన శ్రీకృష్ణాఖ్యవైభవంబు మమ్ముం బ్రోచుగావుతయనుట.

మా॥ అనుగతమమరీణా మమ్బరాలమ్బినీనాం నయనమధురిమశ్రీ
నన్దనిమాఞ్జనసీమాన్నమ్ । వ్రజయువతివిలాస వ్యావృతాపాఙ్గమవ్యా
త్త్రిభువనసుకుమారం దైవతం కైశోరకం నః॥ ౫౧

టీక. అమ్బరాలమ్బినీనామ్ - ఆకాశమునాశ్రయించి యున్నయటు
వంటియు. నయనమధురిమాఞ్జనసీమాన్నమ్, నయన-కన్నులయొ

కః - మధురిమశ్రీ - సౌందర్యసంపత్సంబంధములయిన సద్మనిర్మాణ-విలాసచే ష్టలయొక్క, సీమ్నాం - మర్యాదలుగల, అమరీణాం - దేవతాస్త్రీలచేత, అనుగతం - అనుసరింపఁబడుచున్నయదియు, వ్రజయువతివిలాసవ్యావృతాపాంగం - వ్రజయువతి - నందునిగొల్లపల్లియందలిగోపికాస్త్రీలయొక్క, విలాస - లీలలయందు, వ్యావృత - ఉన్నట్టి, అపాంగం - కటాక్షములుగలయదియు, త్రిభువనసుకుమారం - త్రిభువన - మూఁడులోకములకును, సుకుమారం - సుందరమైనయదియునైన, దైవకైశోరకం - దైవ - శ్రీకృష్ణమూర్తియొక్క, కయిశోరకం - బాల్యభావము, నః - మమ్ము, అవ్యాత్ - పాలించుఁగాక.

శా॥ లోలాలోకనహావభావములనాలోకించుచుఁ దేవతా। నా
ళీకాస్యలునిండుటనంటి తిరుగన్నందవ్రజాంభోరుహా। క్షీలీలార్ద్ర కటా
క్షవీక్షలను రక్తింబర్వఁ ద్రైలోక్యర। మ్యాలంకారమునైచెలంగుహరి
బాల్యప్రౌఢిమన్ బ్రోవుతన్॥ ౫౧

తా॥ ఆకసంబుననుండి నేత్రసౌందర్యసంపదచే సంకేతంబులు దెల్పు దేవస్త్రీలచే ననుసరింపఁబడుచు గోపాంగనలవిలాసంబులపై గడకంటిచూపుల నెలకొల్పుచుఁ ద్రైలోక్యసుందరంబై వెలయు శ్రీకృష్ణునిబాల్యంబు మమ్ము బ్రోచుఁగావుతయనుట.

శ్లో॥ ఆపాదమాచూడమతిప్రసక్తైరాపీయమానా యమినాంమ
నోభిః। గోపీజనజ్ఞాతరసావతాద్వో గోపాలభూపాలకుమారమూర్తిః

టీక. ఆపాదమాచూడం - పాదములుమొదలుకొని శిరస్సుపర్యంతము అతిప్రసక్తైః - అత్యావశ్యకముగఁ బ్రవర్తించుచున్న - యమినాం - మునీశ్వరులయొక్క, మనోభిః - మనస్సులచేత, ఆపీయమానా - పానముచేయఁబడుచున్న, గోపీజనజ్ఞాతరసా గోపీజన - గోపికాస్త్రీలచేత, జ్ఞాత - యెఱుంగఁబడిన, రసా - రసముగల, గోపాలభూబాలకుమారమూర్తిః - గోపాలభూపాల గోపాలభూపాలకుఁడయిన శ్రీకృష్ణస్వామియొక్క, కుమారమూర్తిః - బాల్యరూపము, వః - మిమ్ము, అవతాత్ - రక్షించుఁగాక, గోపాలభూపాలకుమారమూర్తిః. అనుపదమునకు, గోపాలభూపాల - గోపాలపతియైననందునియొక్క, కుమార - పుత్త్రుఁడైన శ్రీకృష్ణస్వామియొక్క, మూర్తిః - శరీరము, అనియున్నర్థాంతరముగలదని వ్యాఖ్యాతభావము.

మ॥ విమలాపాంగవిలాసగోపమహిళా విజ్ఞాతసారస్యమం। దమి
తోచ్ఛ్వాసమహా డెందములచేతన్ మౌనులాపానము। స్తమునాపో

వంగనానునట్టి సుషమాసౌభాగ్యధామమనో। జ్ఞముగోపాలకబాల
రూపముమహానందంబుమీకీవుతన్ ॥ ౫౨

తా. ఆపాదమస్తకముగ నత్యాసక్తులగుమునులచే ధ్యానంబుచేయం బడుచున్నదియై గోపీజనంబుచే నెఱుంగంబడిన స్వారస్యంబుగలిగి వెలుంగు శ్రీకృష్ణునిబాలరూపంబు మిమ్ముబ్రోచుగావుతయనుట.

శ్లో॥ దిష్ట్యాబృన్దావనమృగదృశాం విప్రయోగాకులానాంప్రత్యా
సన్నం ప్రణయచపలాపాఙ్గవీచీతరఙ్గైః। లక్ష్మీలీలాకువలయదళశ్యా
మలంధామకామాన్ పుష్ణీయాద్వః పులకముకుళాభోగభూషావి
శేషమ్॥ ౫౩

టీక. విప్రయోగాకులానాం - విప్రయోగ - విరహముచేత, ఆకులానాం - మిక్కిలివ్యాకులమయిన, బృందావనమృగదృశాం - బృందావనంబునందలిగోపికాస్త్రీలయొక్క, ప్రణయచపలాపాంగవీచీతరంగైః - ప్రణయ - ప్రేమాతిశయముచేత, చపల - మిక్కిలిచంచలములయిన, అపాంగ - క్రీగంటిచూపులయొక్క, వీచీ - ఊర్ములయొక్క, తరంగైః - సంతతులచేతను, దిష్ట్యా - దైవముచేతను, పులకముకుళాభోగభూషావిశేషం - పులకముకుళ - మొగ్గలవంటిగగుర్పాటులయొక్క, ఆభోగ - విశాలత్వమునియెడి, భూషావిశేషం - అలంకారములుగలుగునట్టుగా - ప్రత్యాసన్నం - ప్రత్యక్షమయినదానివలెనున్నదియయియు, లక్ష్మీలీలాకువలయదళశ్యామం - లక్ష్మీ - శ్రీరమాదేవియొక్క లీలాకువలయ - విలాసముగాధరించినన ల్లకలువలయొక్క, దళ - రేకులవలె, శ్యామం - నల్లనైన, ధామ - కాంతి, వః - మీయొక్క, కామాన్ - మనోరథములను, పుష్ణీయాత్ - పోషించుగాక.

మ॥ విరహావ్యాప్తన్ వ్రజభామినులరంగి యువ్విళ్లూ భాగ్యంబు
నం। దరళాపాంగతరంగసంతతుల సేదల్ దేర్పుచున్వచ్చిని। ర్భర
రోమాంచవిశేషభూషడగు గోపాలుండుపద్మాలయా। కరలీలోత్ప
లనీలవర్ణుడొసగుం గళ్యాణపారంపరన్॥ ౫౩

తా. అహోరాత్రియందుగంసునిపంపునం గృష్ణునిమధురకుందోడ్కొనిపోవ శ్రీకృష్ణవియోగంబున మన్మథబాణపీడితలైన గోపస్త్రీలకు ప్రేమచేతంజం చలంబులగు నపాంగదృష్టిసంతతులచే దైవయోగంబున మొగ్గలవంటిగగుర్పాటులనియెడి యలంకారవిశేషంబుగలుగునట్టుల గోపికలసద్ధ్యానంబున ప్రత్యక్షంబైనదానివలెనుండినదియై లక్ష్మీదేవికరంబున విలాసార్థంబుగధరియించిన

నల్లకలువ రేకులవలె నీలవర్ణంబైన తేజంబు- మీమనోరథంబులనిచ్చుఁగాక యను
ట- కృష్ణుఁడుమారంబునందియును గోపికలనిధిధ్యానవంబునఁ బ్రత్యక్షంబై
నకరణెనుండుననుట.

మూ॥ జయతిగుహశిఖీంద్రపింఛమౌళిస్సురగిరిగైరిక కల్పితాఙ్గరా
గః। సురయువతివికీర్ణసూనవర్ష స్నపితవిభూషితకున్తలఃకుమారః॥౫౨॥

టీక. గుహశిఖీంద్రపింఛమౌళిః- గుహ-షణ్ముఖస్వామియొక్క, శిఖీంద్ర- నెమలియొక్క, పింఛ- పురి, మౌళిః- సిగయందుఁగలవాఁడును, సురగిరిగైరికకల్పితాంగరాగః- సురగిరి-దేవస్థానమయిన మేరుపర్వతముయొక్క, గైరిక- గైరికాదిధాతువిశేషములచేత, కల్పిత-కల్పింపఁబడిన, అంగరాగః - అనులేపముగలవాఁడును, సురయువతివికీర్ణసూనవర్షస్నపితభూషితకుంతలః - సురయువతి - దేవస్త్రీలచేత, వికీర్ణ - వెదచల్లఁబడిన, సూనవర్షస్నపితవిభూషితకుంతలః- పుష్పవర్షముచేతఁదడుపబడినటువంటియు నలంకరింపఁబడినకేశములుగల, కుమారః - శ్రీకృష్ణస్వామి, జయతి-సర్వోత్కృష్టుఁడైవర్తించుచున్నాఁడు.

మ॥ సురకన్యాకర ముక్తకల్ప కుసుమస్తోమంబు లొయ్యారపుం
బురుచుం జెన్నెఱిగుంపుపైఁ బలిపి చెంతం దామెతుల్ సుట్టిని। జఁర ధా
త్రీధర ధాతుధారఁ జెలువారం బూని సేనాని పా। వురం పుం బింఛపు
తావళంబమరు దేవుండొప్పు బాల్యోన్నతిన్॥ ౫౨

తా. కుమారస్వామి వాహనంబయిన మయూర శ్రేష్ఠపింఛంబు సిగయందలంకరించి మేరుగిరియందలి ధాతువిశేషంబుగలిగి దేవస్త్రీలు గుప్పించు కల్పతరు ప్రసూనవర్షంబుచే స్నానంబు చేయించుట వలన నలంకరింపఁబడిన శిరోజంబులు గలిగి వెలుంగు శ్రీకృష్ణదేవుండు సర్వోత్కృష్టుఁడై యుండుననుట.

మూ॥ మధురమన్దశుచిస్మితమంజులం వదనపఙ్కజమఙ్గజవేల్లితమ్।
విజయతాం వ్రజబాలవధూజనస్తనతటీవిలుఠన్నయనం విభోః॥౫౩॥

టీక. మధురమందశుచిస్మితమంజులం - మధుర - మనోహరమైనయదియును, మంద-కొంచమైనదియు, శుచి - శుద్ధమైనదియునగు, స్మిత- నవ్వుచేత, మంజులం- సుందరమైనయదియు, అంగజవేల్లితం - అంగజ - మన్మథునిచేత, వేల్లిత- చలింపఁబడుచున్నదియును, వ్రజబాలవధూజనస్తనతటీవిలుఠన్నయనం - వ్రజ- వ్రేపల్లియందున్న, బాలవధూ- గోపబాలికలయొక్క,

స్తనతటీ- స్తనప్రదేశములయందు, విలుఠత్, తిరుగుచున్నటువంటి, నయనం నేత్రములుగలదియునగు, విభోః-శ్రీకృష్ణమూర్తియొక్క, వదనపంకజం-ముఖకమలము, విజయతామ్- సర్వోత్కర్ష ముగానుండుగాక.

మ॥ మురిపెంపుంజిఱునవ్వు నివ్వటిలు కెమ్మోవిక్ సుధాబిందువుల్। గురియం జొక్కఁపు మోముఁజిత్తజునిసొంపుల్ సక్కఁగాదీప్ప న। బ్బురపుంబ్రాయము గొల్లకల్లెసలుకుం బూఁబోండ్లపాలిండ్లపై। త్తరపుంగన్నులఁజూచుచూపుగల ధూర్తస్వామి సెల్వొందెడున్॥౨౨

తా.హృద్యంబైస్వల్పంబై పరిశుద్ధంబైనగవుచేసుందరంబై మన్మథాధిష్ఠంబై వ్రేపల్లియయందలిబాలికల కుచప్రదేశంబులం బరిభ్రమించుచున్న నయనంబులుగలిగి తేజరిల్లు శ్రీకృష్ణుని నెమ్మోముచాముర సర్వోత్కృష్టంబయి యుండుననుట.

మూ॥ అలసవిలసన్ముగ్ధస్మితం వ్రజసున్దరీమదనకదనస్విన్నంధన్యం మహద్వదనామ్బుజమ్ । తరుణ మరుణ జ్యోత్స్నాకృత్స్నస్మితస్నపితాధరంజయతివిజయశ్రేణీ మేణీదృశాంమదయన్మహః॥

టీక. అలసవిసన్ముగ్ధస్మితం - అలస-మందమయినయదియు, విలసత్-ప్రకాశించుచున్నయదియు, ముగ్ధ, సుందరమైనయదియునగు, స్మితం - చిఱునగవుగలయదియు, వ్రజసున్దరీమదనకదనస్విన్నం- వ్రజసున్దరీ- గోపికాస్త్రీలయొక్క, మదనకదన - మన్మథచేష్టచేత, స్విన్నం- చెమటతోఁగూడుకొన్న యదియు, తరుణం - నూతనమయినయట్టి, అరుణజ్యోత్స్నాకృత్స్నస్మితస్నపితాధరం - అరుణ-ఎఱ్ఱనైన, జ్యోత్స్నా- వెన్నెలయొక్క, కృత్స్నా- అంతయుఁగలెనున్న, స్మిత- నగవుచేత-, స్నపిత- వ్యాప్తమైన, అధరం-అధరోష్ఠము గలయదియు, ధన్యం- నిరుపాధికసుందరమయినయదియు, మహః- తేజోరూపమయినయదియునగు, మహద్వదనాంబుజం - మహత్ - శ్రీకృష్ణస్వామియొక్క, వదనాంబుజం- కమలమువంటిముఖము, ఏణీదృశాం- స్త్రీలయొక్క, శ్రేణీం- వరుసను, మదయత్ - మదింపఁజేయుచున్నదియై, జయతి-సర్వోత్కృష్టమయి వర్తించుచున్నది.

మ॥ పొగరుంగెంపుల సొంపునింపులతితంపుందేట కెమ్మోవిపై సొగసున్నిద్దవుదళ్కు లేనగవు మోముల్మెఱుప్పుంచావని । మృగనేత్రా సురతశ్రమాంబుకణికామృద్వాననాబ్జంబుతోఁ । జిగురుంబోండ్ల రాళిగొల్పురసికున్ సేవించిభావించెదన్॥

తా. అల్పంబై ప్రకాశించుచు సుందరంబై స్వచ్ఛంబై వెలయునగవు గలిగి గోపస్త్రీలతోడ సురతంబు సలిపిన కతంబునం బొడమిన శ్రమంబుచేతం జెమర్చినదియై క్రొత్తపులుగంట్లచెన్నగు జిగిం దొరసిన కారణంబునం బున్నమదోలి దెసందోంచు చందురునందలి నునుగెంపు వెన్నెలవిన్ననువు నెన్న నేదగింపంజాలు క్రొన్నగవుచేవన్నియ మించు మోవిచేతం జెజరిల్లుచు నెద్దియేనియుం గైసేయకయును సోయగంబై వెలుంగుచున్న శ్రీకృష్ణుని నెమ్మొగంబు లేడికన్నులుం బోనికన్నులుగల నెలంతలకు నేపుగతిగించుచు నన్నింటికన్న మిన్నయై వెలయుచున్నదియనుట.

శ్లో॥ రాధాకేళికటాక్ష వీక్షితమహావక్షస్స్థలీ మణ్డనాజీయ్యాసుః
పులకాఙ్కురా స్త్రిభువనస్వాదీయస స్తేజసః। క్రీడాన్తే ప్రతి సుప్త
దుగ్ధతనయా ముగ్ధావబోధక్షణ త్రాసారూఢదృఢోపగూహనఘనా
స్సామ్రాజ్యసాన్ద్రశ్రియః॥

టీక. రాధాకేళికటాక్ష వీక్షితమహావక్షస్స్థలీమణ్డనాః- రాధా-రాధయొక్క, కేళి- లీలాయుతమైన, కటాక్ష- క్రేగంటిచూపులచేత, వీక్షిత- చూడంబడుచున్న, మహావక్షస్స్థలి- విలాసమైనఱొమ్మును, మణ్డనాః- అలంకరించుచున్నవియు, క్రీడాంతే - సురతాంతమందు, ప్రతిసుప్తదుగ్ధతనయాముగ్ధావబోధక్షణత్రాసారూఢ దృఢోపగూహనఘనాః - ప్రతిసుప్త-మిక్కిలినిదురించుచున్న, దుగ్ధతనయా- లక్ష్మ్యంశసంభూతురాలైన రుక్మిణీదేవియొక్క, ముగ్ధ- సుందరమయిన, అవబోధక్షణ- నిద్రావస్థాక్షణంబువలననయిన, త్రాస- భీతివలన, ఆరూఢ - ఆవిర్భవించి, దృఢోపగూహన - గాఢమయినయాలింగనముచేత, ఘనాః- స్థూలములయినయవియు, సామ్రాజ్యసాంద్రశ్రియః- సామ్రాజ్య- మిక్కిలియుసతిశయమయిన యదియు, సాంద్ర- ఇనుమడించినయదియునగు, శ్రియః - కాంతులుగలయవియు, త్రిభువనస్వాదీయసః - త్రిభువన- మూఁడులోకములకు, స్వాదీయసః- ప్రీతివిషయములయినయవియునగు, తేజసః- శ్రీకృష్ణరూపతేజస్సుయొక్క, అంకురాః- మొలకలు, జీయ్యాసుః- జయశీలములయివర్తించుఁగావుత.

మ॥ రతికేళిందమి దీఱఁగా నలసి నిద్రం జెందిస్వప్నంబుచే । నతి
భీతిన్ రమగౌఁగిలింప నిబిడంబై రాధికాపాంగవీ । క్షితవక్షస్స్థలనిస్తులా
-భరణమై చెన్నొందు రోమాంచసం। తతిసామ్రాజ్యరమానుభూతి ప
-రమానందాకృతిన్ శౌరికిన్

తా. రాధయొక్క విలాసంబులతోడం గూడిన కడకన్నులచేఁ జూడఁబడుచున్న వక్షస్థలంబు నలంకరించుచు సురతాంతంబున నిదురించు రుక్మిణీదేవి స్వప్నంబు కాంచి భీతిం బొంది కౌఁగిలింప నిబిడంబులై నిరతిశయకాంతులచే దేజరిల్లుచుఁ ద్రిలోకప్రతివిషయికంబగు శ్రీకృష్ణుని పులకాంకురంబులు సర్వోత్కృష్టంబులై వర్తించును గాక.

శ్లో॥ స్మితస్నుతసుధాధరా మదశిఖండిబర్హాఙ్కితా విశాలనయనామ్బుజా వ్రజవిలాసినీవాసితాః । మనోజ్ఞముఖపఙ్కజా మధురవేణునాదద్రవా జయన్తి మమ చేతసశ్చిరముపాసితా వాసనాః॥ ౫౮

టీక. స్మితస్నుతసుధాధరాః- స్మిత- నవ్వునను దియే, స్నుత- జారుచున్న సుధా, అమృతము వలెనున్న, అధరాః- ఓష్ఠములుగలయవియు, మదశిఖండిబర్హాంకితాః- మదశిఖండి- మదించిన నెమలియొక్క, బర్హ- పింఛముచేత, అంకితాః - చిహ్నితములైనయవియు, విశాలనయనాంబుజాః - వెడల్పులైన నేత్రపంకజములుగలయవియు, వ్రజవిలాసినీవాసితాః - రేపల్లెయందలి స్త్రీల యందు నివాసము చేసియున్న యవియు, మనోజ్ఞముఖపంకజాః- మనోహరములైన ముఖకమలములు గలయవియు, మధురవేణునాదద్రవాః - మనోజ్ఞములైన వేణుగానగతులుగలయవియు, మమ- నాయొక్క, చేతసః- చిత్తమునకు చిరం- బహుకాలము, ఉపాసితాః- సేవ్యంబులగునవియునగు, వాసనాః- శ్రీకృష్ణరూపక సంస్కారములు, జయంతి- సర్వోత్కృష్టములై వర్తించుచున్నవి.

చ॥ చెలువగు మోముతోఁ దళుకు చెక్కులతో మధురాధరంబుతో। సులువగు నవ్వుతో సోలపుఁజూపులతో వ్రజబాలికాళితో। లలితకలాప భూషణవిలాసముతో మురళీరవంబుతోఁ । బలుమఱు మీఱఁగాక మధుభంజన వాసన లెల్ల జిక్కులన్॥ ౫౮

తా. చిఱునగవనియెడు నమృతంబుచేఁ జెలువగు కెమ్మోవియు, నేపారు నెమలిపురిచిన్నెయు విశాలంబులగు కనుదామరలుం గలిగి గోపికలతోడం గూడి వేణునాదగతులు విస్తరిల్ల నా చిత్తంబుచే సేవింపఁబడుచున్న శ్రీకృష్ణరూపసంస్కారంబులు సర్వోత్కృష్టములై యతిశయిల్లుచున్నవి

మా॥ జీయాదసౌ శిఖిశిఖణ్డకృతావతంసా సాంసిద్ధికీ సరసకాన్తిసుధాసమృద్ధిః । యస్బిన్దులేశకణికాపరిమాణభాగ్యసౌభాగ్యసీమపదమశ్నుతె పఞ్చబాణః॥ ౫౯

టీక. పంచబాణః- మదనుఁడు, యస్బిందులేశకణికాపరిమాణభాగ్యసౌ

భాగ్యసీమ, యత్ - ఏయతిశయముయొక్క, బిందు - బిందువులయొక్క, లే
శ-కణములయొక్క, కణికా - సూక్ష్మావయవముయొక్క, పరిమాణ- పరిమి
తియనియెడి, భాగ్య-భాగ్యమువలననైన, సౌభాగ్య- సౌందర్యముయొక్క, సీ
మ-స్థలమయిన, పదం-స్థానమును, అంచతి- పొందుచున్నాఁడో, అసౌ-ఈ, శి
ఖిశిఖండకృతావతంసః- శిఖి-మయూరముయొక్క, శిఖండ-పింఛముచేత, కృ
త-చేయఁబడిన, అవతంసః-శిరోభూషణముగలయదియు, సాంసిద్ధికీసరసకా
న్తిసుధాసమృద్ధిః- సాంసిద్ధికీ - స్వభావసిద్ధమయిన, సరస-రసయుక్తమయిన
కాంతిసుధాసమృద్ధిః - కాంతియను నమృతాతిశయము, జీయాత్- సర్వో
త్కృష్టమై వర్తించుగాక.

మ॥ అవతంసంబగు పింఛదామకము సెల్వొందం బ్రభాసంపదు
ద్భవలీలామృతధారలెల్ల దెసలన్ భాసిల్ల త్రైలోక్యమో। హవిహారా
స్పదరూపధేయ సుకుమారాంశ ప్రభావంబులో। లవమాత్రంబో దవ
న్మారుండు జగమెల్లం గెల్చు లీలాగతిన్॥ ౫౯

తా. మనసుం డేసమృద్ధియొక్క బిందుదేశంబులు నొకభాగంబు మా
త్రపు సౌందర్యపదంబు నొందెనో యట్టి యీయగుపడుచున్నయదియు నెమలి
పురిచేతం జేయఁబడిన శిరోభూషణంబుగలిగి స్వభావసిద్ధంబై వెలయునదియు
నగు కాంత్యమృతసమృద్ధి సర్వోత్కృష్టమై వర్తించుచున్నది.

శ్లో॥ ఆయామేన దృశోర్విశాలతరయో రక్షయ్యమార్ద్రస్మిత
చ్ఛాయావర్షితశారదేందులలితం చాపల్యమాత్రం శిశోః। ఆయాసాన
పరాన్విధూయ రసికై రాస్వాద్యమానం ముహుః జీయా దున్మదవ
ల్లవీకుచభారాధారం కిశోరం మహః॥ ౬౦

టీక. విశాలతరయోః- మిక్కిలి వెడల్పులైన, దృశోః, కన్నులయొక్క,
ఆయామేన-పొడవుచేత, అక్షయ్యం- క్షయరహితమయినయదియు, ఆర్ద్రస్మి
తచ్ఛాయావర్షితశారదేందులలితం- సరసమైన చిఱునగవుయొక్క కాంతిచే
తఁదిరస్కరింపఁబడిన శరత్కాలసంబంధచంద్రసౌందర్యముగల. శిశోః- బా
లునియొక్క, చాపల్యమాత్రం - చపలస్వభావమైనయదియు, అపరాన్-
అన్యములయిన, ఆయాసాన్-ప్రయాసములను, విధూయ-విడిచి, రసికైః- వి
ద్వాంసులచేత, ముహుః- మాటిమాటికిని, ఆస్వాద్యమానం- ఆస్వాదింపఁబ
డుచున్నయదియు, ఉన్మదవల్లవీకుచభరాధారం - ఉన్మద- అధికమదముగల,
వల్లవీ- గోపికలయొక్క, కుచభర- స్తనాతిశయమే, ఆధారం- ఆశ్రయము

గాఁగలయదియునగు, కిశోరంమహః - బాలతేజము, జీయాత్ - సర్వోత్కృ
ష్టమైవర్తించుఁగాక.

ఉ॥ క్రొన్ననఁబోండ్లు గబ్బివలిగుబ్బలనానుచు గారవింపఁగా । వె
న్నెలనవ్వునవ్వ లరవిందను చందముఁ గ్రిందుసేయువా । ల్గన్నులబా
ల్యచాపల విలాసముమీఱ రసజ్ఞలోకమీ। యన్నియు నుజ్జగింప హృద
యంగమమైన వెలుంగుఁగాంచెదన్॥ ౬౦

తా. విశాలంబులగు నేత్రంబుల దైర్ఘ్యంబుచే సుందరంబైనరసంబగచి
యునగు కాంతిచేతం దిరస్కరింపంబడిన శరత్కాలచంద్రసౌందర్యంబుగలిగి
చపల సర్వస్వంబై యన్యప్రియాసంబుమాని రసజ్ఞులచేత ధ్యానంబుచేయం
బడుచున్నదియై యతిశయమదంబుగల గోపికల కుచభారంబు నాశ్రయంబు
గఁగలిగి వెలుంగుబాలతేజంబు సర్వోత్కృష్టంబై వర్తించు ననుట.

మా॥ స్కన్ధావారసదం ప్రజాః కతిపయే గోపాఙ్గనాస్స్వాఙ్గ
నాస్స్కన్ధాలమ్బివత్సదామ్నిధనదా గోపాస్సహాయాదయః। శృఙ్గా
రాగిరిగైరికం శివశివశ్రీమన్తి బర్హాణివా శృఙ్గగ్రాహికయా తథాపిత
దిదం ప్రాహుస్త్రిలోకేశ్వరమ్॥ ౬౧

టీక. గోష్ఠం - గొల్లపల్లియు, స్కంధావారసదం - స్కంధావార-పా
ళెముయొక్క. సదం - ఆస్థానమండపము, (ఈకారణంబునమంచి యిల్లయిన
నులేదని సూచింపఁబడియెను) గోపాంగనాః - గోపస్త్రీలు - స్వాంగనాః -
స్వకీయలైన భార్యలు, (ఈహేతువువలన భార్యలైనను మంచివారలు లేరని
సూచింపఁబడియెను) ధనదాః - పన్నులిచ్చుచున్న, ప్రజాః - ప్రజలు, కతిప
యే - కొందఱు (దీనిచేనందఱుపన్నొసంగమినిధనసంపదనైననువిస్తారములే
దనిసూచింపఁబడియెను) వత్సదామ్ని - వత్సబంధనరజ్జు విశేషము, స్కంధా
లమ్బిని - భుజశిఖరమునాశ్రయించి యుండఁగా, గోపాః - గోపాలురు, సహా
యాదయః, భటులు మొదలయినవారలు (ఈహేతువుచేతఁ బరివార సంప
త్తియునులేదని సూచింపబడియెను) శృంగారాః - అలంకారములు, గిరిగైరి
కం - పర్వతమందలిగైరికాదిధాతువిశేషములు, శ్రీమంతిబర్హాణివా - శ్రీమంత-
కాంతిగలిగిన, బర్హాణివా - పింఛములేనియు (ఈహేతువువలన భూషణసం
పత్తియునులేదని సూచింపఁబడియెను) తథాపి - అటులయినప్పటికిని, శృంగ
గ్రాహికయా - చిన్నగ్రహణముచేత, తత్ - ఆప్రసిద్ధమయిన, ఇదం - ఈవస్తు
వు, త్రిలోకేశ్వరం - విష్ణుదేవునిగాను, వృద్ధాః - పెద్దలు, వదంతి - చెప్పుచున్నారు.

ఉ॥ బాలిశులైరి గోపకులు బంధులు పాశ్రయము గోల్లపల్లెము । త్యా
లసరాలు దామెనలు దారలు గోపికలంగ రాగముల్ । శైలపిటంకధా
తువులు చారు విభూషలు పింఛదామముల్ । పోలిన నైనవిష్ణుఁడని బుద్ధి
నెఱుంగుదు పెల్ల పెద్దలున్॥ ౬౧

తా. గోష్ఠంబు స్కంధావారంబు గోపకులు భటాదులు - గోపాం
గనలు భార్యలు- పస్చిమ్మవారలల్పజనంబులు- అలంకారంబు గైరికంబు-భూష
ణంబులు నెమలిపురిదండలు-ఇట్టివిగలవి నైనను-నీ తేజంబును సర్వలోకేశ్వరుండ
గు విష్ణుఁడుగా నోకానొక యభిజ్ఞానంబున బుధులెఱుంగుదురనుట.

మూ॥ శ్రీమద్బర్హిశిఖండమండనజుషే శ్యామాభిరామత్విషే లావ
ణ్యైకరసావసిక్తవపుషే లక్ష్మీసరః ప్రావృషే । లీలాకృష్టరసజ్ఞధర్మ
మనసే లీలామృతస్రోతసే కేవా నస్పృహయంతి హంత మహసే గో
పీజనప్రేయసే॥ ౬౨

టీక. శ్రీమద్బర్హిశిఖండమండనజుషే - కాంతిగలిగిన నెమలిపురియలం
కారమును బొందినటువంటిదియు, శ్యామాభిరామత్విషే-నల్లనైన మనోహరమ
యిన కాంతిగలయదియు, లావణ్యైకరసావసిక్త వపుషే - కాంతియనియెడి
ముఖ్యమైన రసముచేతఁ దడుపఁబడిన శరీరముగలయదియు, లక్ష్మీసరః ప్రా
వృషే- లక్ష్మియనియెడి సరస్సునకు వర్షర్తువైనయదియు, లీలాకృష్టరసజ్ఞధర్మ
మనసే- విలాసముచేత నాకర్షింపఁబడిన విద్వాంసులయొక్క ధర్మప్రధాన
ములయిన మనస్సులుగలయదియు, లీలామృతస్రోతసే- విలాసమనియెడి యమృ
తప్రవాహమయినయదియు, గోపీజనప్రేయసే - గోపికాజనులకుఁ బ్రియత
రమైనయదియునగు, మహసే- తేజముకొఱకు, కేవా - యెవ్వరు, నస్పృహ
యంతి - ఆసచేయరు, హంత - ఆశ్చర్యము-

శా॥ లావణ్యామృత సేవఁగుందళిత లీలారాము లక్ష్మీశరః। ప్రా
వృడ్ధాముని తాంతసంయమిత బర్హాగ్రశ్రీసముద్ధాము రా। ధావిర్భూతవ
యోభిరాము విలసద్ధారాధరశ్యామునిన్ । శేవింపన్మదిఁ గోరదేరసి
కులా సీమాఖిలప్రేమునిన్॥ ౬౩॥

తా. కాంతియుతంబగు నెమలిపురియలంకారంబుగ ధరియించి కాంద
విశేషంబను రసంబుచేతం దడుపంబడిన దివ్యమంగళవిగ్రహంబుగలిగి సిరియను
సరంబునకుఁ బ్రావృట్కాలంబై రసజ్ఞులమనంబుల నఖిలవిలాసంబులచే నాక
ర్షించు విలాససుధా ప్రవాహంబై గోపీజనప్రియతరంబై వెలయు తేజంబు

కొలకునెవ్వార లాసంజేయరు- అనంగానందఋనాసంజేయుదురనుట. ※

శ్లో॥ ఆపాటలాధరమధీరవిలోలనేత్ర మామోదనిర్భరిత మద్భుతకాంతిపూరమ్। ఆవిస్మితామృత మనుస్మృతిలోభనీయ మాముద్రితాననమహో మధురం మురారేః॥ ౬౩॥

టీక. ఆపాటలాధరం- అంతట నెఱ్ఱనైన మోవిగలదియు, అధీరవిలోలనేత్రం - చంచలములై తృష్ణాయుక్తములైన నేత్రములుగలదియు, ఆమోదనిర్భరితం - పరిమళముచేత సంజాతాతిశయముగలయదియు, అద్భుతకాంతిపూరం- ఆశ్చర్యకరమైన కాంతి ప్రవాహముగల యదియు, ఆవిస్మితామృతం- ప్రకాశించుచున్న యమృతమువంటి చిఱునగవుగలయదియునగు, మురారేః - శ్రీకృష్ణమూర్తియొక్క, మధురం-సుందరమగు, ఆముద్రితాననం- కొంచెము మోడ్పఁబడినకన్నుల్నులుగలముఖము,అనుస్మృతిలోభనీయం,నిరంతరస్మరణచేత నాసఁజేయఁదగినదిగా, భవతి=అగుచున్నది, అహో-ఆశ్చర్యము

మ॥ అతులానంద రసామృతార్ణవ మపాంగా భంగరంగత్తరం। స్మితతింబొంగుచుఁ గెంపుమోవినరిఁ దాకందత్సుధా బిందువుల్। స్మితలీలన్విలసిల్లనంచుజనముల్ చిత్తంబులన్ హెచ్చున। ద్భుతశంృగారరసైకముద్రిత ముఖాంభోజున్ హరింగొల్చెదన్॥ ౬

తా- ప్రకాశించుచున్న చిఱునగవను నమృతంబుఁజొబ్బిలంజేయు కెమ్మోవియు నతిచపలంబులై ప్రేఁతలంజూడ నాసంజేయుకన్నులు నతిశయంబైన పరిమళంబునచ్చెరువగు కాంతిప్రవాహంబు నొకొక్కకు పరియర మోడ్పుకన్నుగవయునుం గలిగి సుందరంబై వెలుఁగు వెన్నునినెమ్మొగంబెప్పుడను ధ్యానంబుచేయం దగినదియనుట.

సూ॥ జాగృహిజాగృహిచేతశ్చిరాయ చరితార్థతాభవతః। అనుభూయతామిదమిదంపురస్థితం పూర్ణనిర్వాణమ్॥

టీక. హేచేతః- ఓచిత్తమా, భవతః-నీయొక్క చరితార్థతా-కృతార్థత్వము, చిరాయ-తడవుగా, సంజాతా- అయినది, జాగృహిజాగృహి-మోహమునువిడువుము, ఇదమిదంపురస్థితమ్- ఈముందున్న, పూర్ణనిర్వాణమ్- శ్రీకృష్ణరూపనిరతిశయసుఖము, అనుభూయతాం- అనుభవింపఁదగినది.

చ॥ వెనుకటివేళలందనుభవించిన జన్మశతంబులట్లనేఁ। డనుభవమోసపోవకగడుం దెలివొందుము డెందమాచిరం। తనతపముల్

లించిపురతస్థితిసున్నదికృష్ణరూపమై । యనవరతానుచింతనసుధారవ వీచులనోలలాడ నీ॥

తా. ఓమనసా యనేకకాలంబునకు నీకృతార్థత్వంబుఫలియించెని కనజ్ఞానంబుఁబోవనడిచియీముందుగానంబడుచున్న శ్రీకృష్ణరూపనిరతిశయ సుఖంబనుభవింపుమా యనుట.

మూ॥ చరణయోరరుణం కరుణార్ద్రయోః కచభరేబహుళంవిపులందృశోః । వపుషిమంజుల మంజనమేచకేవయసీబాలమహోమధురంమహః॥

టీక. అహో-ఓజనులారా, చరణయోః- పాదములయందు, అరుణం ఎఱ్ఱనైనదియు, కచభారే - శిగయందు, బహుళం - విస్తారమయినయది యు, కరుణార్ద్రయోః-కరుణా-దయచేత,ఆర్ద్రయోః-తడిసిన, నయనయోః నేత్రములయందు, విపులం-విశాలమయినయదియు, అంజనమేచకే-కాటుక వలెనల్లనైన, వపుషి-శరీరమందు, మంజులం-సొగసైనయదియు, వయసిప్రా యంబున, బాలం- కిశోరమైనయదియునగు, మహః- శ్రీకృష్ణాఖ్యతేజము, మ ధురం-హృద్యము.

ఉ॥ మేనుఘనాఘన ప్రతిభమించియుఁ బాదపయోరుహంబు గెం। పూనెవిలోలమయ్యెను దయార్ద్రితమయ్యెను గన్నుఁదోయి తే। జోనిధియయ్యెహృత్సరసి శోభితుఁడయ్యెఁ బురాణుఁడయ్యెనా। రానె ఱులందునల్పునెలఁ బ్రాయముగాంచుట యింతయంతయుఁ॥

తా. పాదంబులనరుణంబై కృపారసంబుఁదొలుకు కన్నుంగవయం దువిశాలంబై సిగయందునధికంబై నీలమేఘంబుఁబోలుశరీరంబున సుందరం బయి ప్రాయంబునబాల్యంబై వెలయు, శ్రీకృష్ణునితేజం బతిమనోహరంబో జనులారాయనుట.

మూ॥ మాలాబర్హమనోజ్ఞకుంతలభరాం వన్యప్రసూనోక్షితాం శైలేయద్రవక్లప్తచిత్రతిలకాం శశ్వన్మనోహారిణీమ్ । లీలావేణురవామృతైకరసికాం లావణ్యలక్ష్మీమయీం బాలాంబాలతమాలనీలవపుషం వందేపరాందేవతామ్॥

టీక • మాలాబర్హమనోజ్ఞకుంతలభరాం, మాలా-వనమాలికలచేత ను, బర్హ- నెమలిపింఛములచేతను, మనోజ్ఞ- సొగసైన,కుంతలభరాం- కేశము లయొక్క-భారాతిశయముగలయదియు, వన్యప్రసూనోక్షితాం- వన్య - వన

మందుఁబుట్టిన, ప్రసూన- పుష్పములచేత, ఉక్షితాం- తడుపఁబడినయదియు- క్షైరేయద్రవక్లుప్తవిచిత్రతిలకాం- ధాతువిశేషములయొక్క ద్రవములచేతఁజే యఁబడిన చిత్రమయినతిలకముగలయదియు, శశ్వన్మనోహారిణీం - అంతటను మనోహరమయినయదియు; లీలావేణురవామృతైకరసికాం - విలాసార్థమైన వేణురవామృతముచేతముఖ్యముగారసికమైనయదియు, లావణ్యలక్ష్మీమయీం కాంతివిశేషసంపద్వికారమయినయదియు, బాలతమాలనీలవపుషం- లేతకానుగుపువ్వవలెనల్లనైన శరీరముగలయదియు, బాలాం - బాల్యముగలయదియును గు, పరాందేవతాం- పరదేవతనుగూర్చి, అహం- నేను, వన్దే, నమస్కరించెదను

ఉ॥ వింతలుగాఁగలాపములు వేనలిఁజుట్టియు వన్యమాలికా। సం-
తతిఁజుట్టిజేగురురసంబునఁ దొంతరబొట్లు పెట్టిచే। ల్వంతయురాశిచే
సినక్రియమ్మురళీ తరళీకృతామృతా। భ్యంతరసారమై పరఁగునావిభు
మేచకధామముఁ గొల్చెదన్॥

తా॰ వనంబునంబొడమిన పువ్వులదండలు నెమలిపురిదండలుం జుట్టిన సిగయును జేగురురసంబునం దొంతరలుగ నిడిన తిలకంబులునుంగలిగి వన్య ప్రసూనవర్షంబుచేతంగప్పఁబడి మిక్కిలియుమనోహరంబై వేణురవామృతం బునసరసంబయి లేతకానుగుంబోలె నల్లనైనశరీరంబుగలిగి సౌందర్యసంప దచేఁ దేజరిల్లుపరదైవంబుంగూర్చి మ్రొక్కుచున్నాను.

శ్లో॥ గురుమ్మృదుపదేగూఢం గుల్ఫేఘనంజఘనస్థలే నళినముదరేవి వరంబాహ్వోర్విశాలమురస్థలే। మధురమధురేముగ్ధం వక్త్రేవిశా లవిలోచనేబహుకచభరేవన్యంవేషే మనోజ్ఞమహోమహః॥ ౭॥

టీక॰ మృదుపదే- మృదు-కోమలమయిన, పదే- పాదమునందు- గురు దుర్భరమైనయదియు. గుల్ఫే-గుల్ఫమందు,- గూఢం-గూఢమయినయదియు, జ ఘనస్థలే- కటిపశ్చాద్భాగమందు, ఘనం-గొప్పనైనయదియు, ఉదరే-గర్భ మునందు, నళినం- కమలముగలయదియు, బాహ్వోః - భుజములయందు, ఆవివరం - ఆరంధ్రమయినయదియు, ఉరస్థలే - వక్షస్థలమందున, విశాలం, విస్తారమైనయదియు, అధరే - మోవియందు, మధురం- మనోహరమైనయది యు, వక్త్రే-ముఖమునందు, ముగ్ధం-సుందరమయినయదియు, విశాలవిలోచ నే- విశాల-వెడల్పైన, విలోచనే- కన్నులయందు, విపులం- విస్తృతములైన యదియు, కచభరే-సిగయందు, బహు- అధికమయినయదియు, వేషే- అలం కారమందు, వన్యం-నవపుష్పరూపమయిన యదియునగు, మహః- తేజము

నోజ్ఞం- మనోహరమైనది, (ఇతి- అని, అహమ్-నేను, వచ్మి-చెప్పుచున్నాఁడను)

చ॥ గురుపదముల్ నిగూఢతర గుల్ఫములుం బలుపొంపిఱుందులి। స్ఫురదురు నాభిదీర్ఘకరముల్ పృథువక్షముఁదావివోవిసుం। దరవదనంబుఁబద్మనయనంబులు నీలశిరోజముల్ మనో। హరసుకుమార వేషమొ ప్పైశగు తేజము నాత్మ నెంచెదన్ ॥ ❋

తా. దుర్భరంబులగు పదంబులును గూఢంబులగు గుల్ఫంబులును గొప్పలగు పిఱుందులును విశాలంబులగు నురంబును దీర్ఘంబులగు నయనంబులును గలిగి నాభీసరోజంబు చేతం దేజరిల్లు తేజంబతిమనోహరంబైయున్నది. ❋

శ్లో॥ జితహాసనంజితహాసనం సుజానేనమాధుర్యం దుహానందుహానం సుధాం వేణునాదైః। లిహానంలిహానంసుదీర్ఘైరపాంగైర్మహానందసర్వ స్వమేకంనమస్తాత్ ॥ ౬౦॥

టీక. సుజానేన-యౌవనముచేత, మాధుర్యం-సౌందర్యమును, జిహానం జిహానం- మిక్కిలియుం బొందుచున్నవాఁడును, వేణునాదైః - వేణుధ్వనిచేత, సుధాం- అమృతమును, దుహానందుహానం-మిక్కిలియువర్షించుచున్నవాఁడు ను, -సుదీర్ఘైః-పొడవులయిన, అపాంగైః-కడగంటిచూపులచేత,లిహానంలిహానం - మిక్కిలియుఁ జూచుచున్నవాఁడును, మహానందసర్వస్వం - మహానంద- మిక్కిలి సంతోషముయొక్క, సర్వస్వం - సర్వస్వరూపుఁడైనవాఁడునగు, ఏకం-ఒకఁడైనకృష్ణునిఁగూర్చి, నమస్తాత్- నమస్కరించుచున్నాను. ❋

ఉ॥ అందఱుఁగోరఁగాఁదగిన యౌవనసకాంతి నియూఢినందముం। జెందికటాక్షవీక్షణము చేనలిమించుచుఁ బిల్లఁగ్రోవిచే। డెందముసల్లగాసుధఁగడించి జడిన్ని గురించుచున్నహా। నందనిధానమై చెలఁగునందకుమారకుఁ గాంచి మ్రొక్కెదన్ ॥ ❋

తా. ఎల్లవారిచే నాశ్రయణీయంబగు యవ్వనంబుచే నధికంబగు సౌందర్యంబునొంది వేణునాదంబుచే సుధనతిశయంబుగ వర్షించుచుం బొడవులగు కడకన్నులచే నాశ్రితులంబూచుచు నిరతిశయానందస్వరూపుండై వెలయు శ్రీకృష్ణునింగూర్చి నమస్కరించుచున్నాను. ❋

శ్లో॥ లసద్బర్హాపీడం లలితలలిత స్మేరవదనం భ్రమత్క్రీడాపాఙ్గం ప్రణతజనతానిర్వృతిపదమ్। నవామ్భోదశ్యామంనిజమధురిమాభోగభరితం పరం దేవం వందేపరిమళిత కైశోరకరసమ్ ॥ ౬౧॥

టీ. లసద్బర్హాపీడం -ప్రకాశించుచున్న నెమలిపురిభూషణంబుగాఁ

కలిగినవాఁడును, లలితలలితస్మేరవదనం, మిక్కిలిసుందరమైన చిఱునగవుతో గూడినముఖంబుగలవాఁడును, భ్రమత్క్రీడాపాంగం - చలించుచున్నవిలాస ప్రధానములైన కడకంటిచూపులుగలవాఁడును, ప్రణతజనతానిర్వృతిపదం- నమ్రమయిన జనసమూహముయొక్క సుఖమునకుఁ గారణమయినవాఁడును, నవాంభోదశ్యామం - నూతనమయిన మేఘమువలె నల్లనైనవాఁడును, నిజమధురిమాభోగభరితం- స్వకీయమయిన సౌందర్యముయొక్క పరిపూర్ణతయొక్క సంజాతాతిశయముగలిగినవాఁడును, పరిమళితకైశోరకరసం- వ్యాప్తములైన కిశోరసంబంధములైన శృంగారాది రసములుగలవాఁడును, పరం-ఉత్కృష్టుఁడైనవాఁడనయిన, దేవం - శ్రీకృష్ణమూర్తినిఁగూర్చి, వందే - నమస్కరించుచున్నాను.

మ॥ పటుధారాధరశోభితాంగు విలసద్బర్హోత్తమాంగున్ సము।
త్కటమందస్మితసుందరున్ చలదపాంగశ్రేణికాడంబరున్ । స్ఫుటకై
శోరకలావ్యామోహనకళాభోగిస్వరూపున్ స్వశం। కటసంసేవకనిర్వృ
తిప్రమదాకారాస్పదుం గొల్చెదన్॥

తా. ప్రకాశించుచున్న నెమలిపురి సిగయందలంకరించి మిక్కిలిసుందరంబగు చిఱునగవుతోడంగూడిన మొగంబుగలిగి సంచలించుచున్న విలాసప్రధానంబులైన కడగన్నులుగలిగి నమ్రులగుజనంబులకు సుఖంబొసఁగఁ గారణండై వర్షాకాలమేఘంబుఁబోలె నీలవర్ణంబు మెఱయు స్వకీయంబయిన సౌందర్యపరిపూర్ణత్వంబున నతిశయిల్లి వ్యాపించుచున్న బాల్యంబుచేతం దేజరిల్లుచును త్కృష్టుండగు శ్రీకృష్ణమూర్తినిఁగూర్చి నమస్కరించుచున్నాను.

శ్లో॥ సారస్యసామగ్ర్యమివాననేన మాధుర్యచాతుర్యమివస్మితేన।
తారుణ్యకారుణ్యమివేక్షితేన చాపల్యసాఫల్యమిదం దృశోర్మే ౭౦॥

టీక. ఆననేన- ఈముఖముచేత, సారస్యసామగ్ర్యమివ-సారస్యసౌందర్యముయొక్క, సామగ్ర్యమివ- పూర్తివలెను, స్మితేన-చిఱునగవుచేత, మాధుర్యచాతుర్యమివ. మాధుర్య - మనోహరభావముయొక్క, చాతుర్యమివ- చమత్కారమువలెను, ఈక్షితేన- చూపుచేత, తారుణ్యకారుణ్యమివ-తరుణభావముగలదయవలెను, ఇదం- ఈకానంబడుచున్న శ్రీకృష్ణాఖ్యవస్తువు, మే-నాయొక్క, దృశోః-నేత్రములయొక్క, సాఫల్యం-ఫలసంబంధమయినది.

చ॥ మురిపెపునవ్వుగాదిది విమోహరసాస్పదరాశిగానిది। త్త
రమగుచూపుగాదిది నితాంతదయాంబుధిగాని మోముదా। మరయు

గాఢఖండరసమాధురిగాని ద్రాక్షాలయాంగణాంతరమిదిగాదు నాదు
నయనంబుల భాగ్యమకాని చూడఁగ ౬౯॥

తా. సౌందర్యసంపూర్తిఁ గల నెమ్మోమును మనోహరత్వంబుచేఁ జ
తురంబైన చిఱునగవును దరుణభావంబు గలదయచే వెలయు వీక్షితంబు గలిగి
యుపాసింపఁబడుచున్న శ్రీకృష్ణరూపంబగు వస్తువు నాకన్నుల చాపల్యంబునకు
ఫలంబైయున్నది.

మూ॥ యత్రవాతత్రవా దేవ యది విశ్వసిమస్త్వయి। నిర్వాణమపి
దుర్వారమర్వాచీనాని కింపునః॥ ౭౦

టీక. హేదేవ - ఓకృష్ణా, యత్రవా - బ్రాహ్మణజన్మమందైనను, మ
ఱియొకజన్మమందైనను - తత్రవా - ప్రసిద్ధంబగు గార్హస్థ్యాశ్రమంబున నయి
నను - మఱియొకయాశ్రమంబుననైనను (పక్షాంతరంబున - యత్రవా - శ్రీ
కృష్ణావతారవ్యతిరిక్తావతారమందైనను, తత్రవా - కృష్ణావతారమందైనను
అనియుంగలదు) త్వయి - నీయందు, విశ్వసిమోయది - విశ్వాసముఁ జేయువా
రలమైనట్టులయ్యేనేని, నిర్వాణమపి - ముక్తియును, దుర్వారం - వారింపనశక్య
మైనది, అర్వాచీనాని - మోక్షవ్యతిరిక్తధర్మాదిపురుషార్థములు, కింపునః - ఏ
మిచెప్పను.

మ॥ క్రతుహవ్యాదివిశిష్టభావనల ధారావాక్యసుజ్ఞానసం। తతి
నెన్నైనను విశ్వసించితినునాత్మం గొల్వ మోక్షంబునా। వృతమైవర్తిలు
నీకృపారసలసద్వీక్షాప్తి చేసట్టిసు। వ్రతముం గాంచు మహాత్మకోటి
కిల నర్వాచీనముల్ ప్రాంతియే॥

తా. ఏజన్మంబున నేయాశ్రమంబున నేని శ్రీకృష్ణావతారంబున మఱి
యొకయవతారంబుననేనియు నీయందవిశ్వసించితిమైనట్టులయ్యేనేని మోక్షం
బు స్వాధీనసిద్ధంబైతోఁచు ధర్మాదిపురుషార్థంబులు లభించుట కేమియాశ్చర్యమనుట.

మూ॥ రాగాంధగోపీజనవందితాభ్యాం యోగీంద్రభృంగేంద్రనిషే
వితాభ్యామ్। ఆతామ్రపంకేరుహవిభ్రమాభ్యాం స్వామిన్పదాభ్యా
మయమంజలిస్తే। ౭౧

టీక, హేస్వామిన్ - ఓకృష్ణా, రాగాంధగోపీజనవందితాభ్యాం - రా
గ - అనురాగముచేత, అంధ - అంధులైన, గోపీజన - గోపికస్త్రీజనులచేత,
వందితాభ్యాం - నమస్కరింపఁబడుచున్నవియు, యోగీంద్రభృంగేంద్రనిషే
వితాభ్యాం - యోగీశ్వరులనియెడి భ్రమరశ్రేష్ఠములచేత సేవింపఁబడుచున్న

యుదియు, ఆతామ్రిపంకేరుహవిభ్రమాభ్యామ్- ఆతామ్ర-అంతటనెఱ్ఱనైన, పంకేరుహా-కమలములయొక్క, విభ్రమాభ్యాం- విలాసములవంటివిలాసము లుగలవియునగు, తే-నీయొక్క, పదాభ్యాం-పాదములకొఱకు, అయంఅంజలిః- ఈనమస్కారము, కృతః-చేయఁబడియెను.

మ॥ అరుణాంభోజ విలాసమై ప్రబల మోహావేశగోపీమన । స్స రసీశోభితమై మునీంద్ర జనచంచచ్చంచరీక వ్రజా । కరమై హంసకనాద మేదురము నై కన్పట్టుపాదాబ్జముం । గరయుగ్మంబున నంటియంటి తుదసోకన్వీక నోలార్చెదన్॥

తా. ఓకృష్ణా యనురాగంబున నితరంబుమఱచి సేవించుగోపికాజనం బులచే నమస్కరింపఁబడుచు యోగీశ్వరులనుచంచరీక శ్రేష్ఠంబులచే సేవిం పఁబడుచు నేత్ర తామరలవిలాసంబులవంటి విలాసంబులుగలిగి మెఱయునీపదం బులకొఱకు నమస్కరించుచున్నాను.

మూ॥అర్థానులాపాన్వ్రజసున్దరీణామాకృత్రిమాణాంచసరస్వతీనామ్।ఆమ్రాశయేనశ్రవణాఞ్జలీతేనసమ్భావయన్తంతరుణంగృణీమః॥

టీక. వ్రజసుందరీణాం- గోపికా స్త్రీలయొక్క, అకృత్రిమాణాం-కపటరహితములైన, సరస్వతీనాం-వాక్యములయొక్క, అర్థానులాపాన్-అర్థములయొక్క యేకదేశపునరుచ్చారణములను, శ్రవణాంచితేన- శ్రోత్రముల యొక్క ప్రాంతములచేత, ఆమ్రాశయేనచ- సరసహృదయముచేతను, సంభావయంతం- బహూకరించుచున్న, తరుణం- యౌవనవంతుఁడైనకృష్ణమూర్తిని, గృణీమః- ఉచ్చరించుచున్నాను.

చ॥ చుళికితమైనచూపు లోకచోటనెఱుంగని పువ్వుబోండ్లమేల్। సొలపుమిటారిచూపులర సొక్కి సెలంగెడు తేఁటమాటలు । న్వలపులు తేపఁగా వినిమనంబున నువ్విళులూరుచెల్వునిన్ । లలితనయోవిలాసుని ననారతము న్మతియింపఁజెల్లఁడే॥ ౭౩

తా. గోపికలకుటిలంబులగు వాక్యంబుల పునఃపునరుచ్చారణంబులఁజెవిఁగింపుగను మనంబునకనుకూలంబుగనువినుచు బహూకరించుచున్న యౌవనవంతుండగు శ్రీకృష్ణుని స్మరించుచున్నాను.

శ్లో॥ మనసి మమసన్నిధత్తాం మధురముఖామందరాపాఙ్గా । కరకలితలలితవంశా కాపికిశోరాకృపాలహరీ॥ ౭౪

టీక. మధురముఖా- సుందరమయిన ముఖముగలయదియు, మందరా

పాంగా, మందర - అలసములైన, అపాంగ - క్రేగంటి చూపులుగలయది యు, కరకలితలలితవంశా-కర - హస్తము చేత, కలిత - కూడుకొన్నటువంటిది యు, లలిత-సుందరమైనట్టిదియునగు, వంశా - వేణువుగలయదియు, కాపి-వాచామగోచరమైనయదియు, కిశోరా - బాల్యముగలయదియునగు, కృపాలహరీ-దయాతిశయము, నను - నా యొక్క, మనసి - మనమునందు - సన్నిధత్తాం-సన్నిధి చేయుగాక.

ఉ॥ అందమునొందు నెమ్మొగము నందుఁగృపామృత వృష్టిపైప
యిం గ్రుమ్మకొనంగనొప్పు కడకన్నులు సన్నలరంగ వేణువం। దందఁ
గరంబులం జెలఁగనంగజమోహనమూర్తి నైనకరం। బుందనరారుబాల
కుఁడుపొల్చు మదీయహృదంతరంబునన్॥ ౨౪

తా. సౌందర్యంబుచేతం దేజరిల్లు నెమ్మొగంబుగలిగి యలసంబులగున పాంగంబుగలిగి కరంబుల వేణువలరం జెప్పనలవికానిదై బాల్యంబుచే మెలఁగుదయాతిశయము నా మనంబునందొప్పుఁగాక యనుట.

మూ॥ రక్షన్తు నశ్శిక్షితపాశుపాల్యా బాలావృతా బర్హిశిఖావతం
సాః। ప్రాణప్రియప్రస్తుతవేణుగీతా శ్శ్రీతా దృశోశ్శీతలగోపకన్యాః॥

టీక. శిక్షితపాశుపాల్యాః - అభ్యసింపఁబడిన గోరక్షణముగలయదియు, బాలావృతాః - బాలురచేతఁ బరివేష్టింపఁబడినయదియు, బర్హిశిఖావతంసాః - నెమలిపురి శిరోభూషణముగాఁ గలయదియు, ప్రాణప్రియప్రస్తుత వేణుగీతాః - ప్రాణములకు నిష్టమైన వేణుగానముగాఁగలయదియు, దృశోః - నేత్రములకు, శ్రితాః - గ్రహింపఁదగినదియు, శీతలగోపకన్యాః - సమీచీనలైన గోపకన్యలుగలయదియునగు, లీలాః - శ్రీకృష్ణవిలాసములు, నః - మమ్ము, రక్షంతు - రక్షించుఁగాక.

మ॥ పొలుపొందన్ వ్రజబాలకుల్ గొలువ శేపుల్ గ్రేపులన్ మేపి మా।
ర్పుల గుంజామణిపుంజరంజితకరాంభోజంబుతోఁ బింఛభూ। షలతోఁ
జల్లనిచూపుతో మధురవంశప్రౌఢితో వచ్చి కాం। తలు లాలించుచుఁ గాఁ
కఁదీర్చుహరి సౌఖ్యంబున్ మముం బ్రోవుతన్॥ ౨౫

తా. అభ్యసింపఁబడిన గోరక్షణంబుగలిగి బాలురచే నావృతంబులగుచు నెమలిపురి యవతంసంబుగలిగి ప్రాణంబులకన్నను ప్రియంబగు వేణుగానంబున వెల్లసిల్లుచు హృద్యంబులైన సమీచీనలగు గోపకన్యకలు వరియించుచుండ వెలయు శ్రీకృష్ణవిలాసంబులు మమ్ముఁ బ్రోచుఁగాక యనుట.

శ్లో॥ స్మిత స్తబకితాధరం శిశిర వేణునాదామృతం ముహు స్తరళ లోచనం మదకటాక్షమాలాకులమ్ ।  ఉరస్థలవిలీనయా కమలయా సమాలిఙ్గితం భువ స్తలము పాగతం భువనదైవతం పాతునః॥ ౭౭

టీక. స్మిత స్తబకితాధరం-స్మిత-నవ్వుచేత, స్తబకిత-సంజాతగుచ్ఛము లుగల, అధరం- అధరోష్ఠముగలయదియు, శిశిర వేణునాదామృతం-చల్లనైన వేణురవమనియెడి యమృతముగలయదియు, ముహుః- మాటిమాటికిని, తరళలోచనం- చలించుచున్న నేత్రములు గలయదియు, మదకటాక్షమాలాకులం- మదించిన క్రేగంటిచూపులయొక్క- పఙ్క్తులచేత వ్యాపింపఁబడుచున్న యది యు, ఉరస్థలవిలీనయా - వక్షస్థలమందునుండిన, కమలయా- లక్ష్మీదేవితోడ, సమాలింగితం- ఆలింగనముచేయఁ బడుచున్నయదియు, భువః- భూమియొ క్క-, తలం-ప్రదేశమునుగూర్చి, ఉపాగతం- పొందినయదియునగు, భువనదై వతం - లోకదైవతమైనశ్రీకృష్ణపరబ్రహ్మము, నః- మమ్ము, పాతు_ రక్షించుఁ గాక.

చ॥ ఉరమునసింధురాజసుతనుంచియుఁగౌగిట గారవించియుఁ। ధరణికేడ్గి యీభువన దైవతమెవ్వతవేడ్కఁగాంచెనో । తరళమదాల సేక్షణసుధార సమున్మధురాధరోష్ఠము । స్ఫురశిరవామృతంబుసుమ నోజ్జ్వదరస్మితబిందుబృందముఁ॥ ౭౮

తా॥ మొలకలెత్తుచిఱునగవుచే సుందరంబగునధరంబును జల్లనైన వేణు నాదామృతంబును సారెసారెకుఁ జంచలంబులగు లోచనంబులును మదప్రధా నంబులగు కడకన్నులుంగలిగి యురమ్మునమెఱయుకమలాదేవిచే నాలింగనంబు చేయంబడుచున్నదియై వెలుంగుచుఁబుడమికేందగిన లోకదైవతంబగు శ్రీకృష్ణా ఖ్యతేజంబు మమ్ముం బ్రోచుఁగాకయనుట.

శ్లో॥ నయనామ్బుజే భవతి కామదుఘం హృదయామ్బుజే కిమపి కారుణికమ్ । చరణామ్బుజే మునికులైకధనం వదనామ్బుజే వ్రజవధూ విభవమ్॥ ౭౯

టీక. నయనాంబుజే- కమలమువంటినేత్రమునందు, కామదుఘం-కోరికలను బిదుకుచున్నయదియు, హృదయాంబుజే - హృదయకమలమందు, కిమపి -చెప్పనలవిగాని, కారుణికం--దయావంతమైనయదియు, చరణాంబుజే- పాదపద్మమందు, మునికులైకధనం - మునిసమూహమునకు ముఖ్యమైన [illegible]

యదియు, వదనాంబుజే-ముఖపద్మమందు, వ్రజవధూవిభవమ్-వ్రజవధూ-గోపస్త్రీలయొక్క, విభవమ్ - ఐశ్వర్యమైనయదియునగు, మహః - తేజమును, భజత - సేవింపుఁడు. ❋

ఉ ॥ కన్నులె చాలుఁగోర్కులొసఁగన్ హృదయంబుచాలుఁజెల్మికిన్ । సన్నుతపాదపంకజముచాలుమునీంద్రజనానురూపసం । పన్నధనాప్తికిన్వదన పద్మముచాలువ్రజాంగనావిలా । సోన్నతికట్టిదివ్యవిభవోజ్జ్వలునామది నాశ్రయించెదన్ ॥ ౭౭

తా. ఓయింద్రియంబులారా యాశ్రయించిన వారలోక పరిశూచినం తనకన్నులు దయారసంబు ప్రతిలనఖిలకామంబుల నీఁజాలుహృదయంబెప్పుడు నుదయాకరంబగుచునుండుఁ బాదంబులు నెల్ల మునులకు మూలధనంబగుచు నుండునెమ్మొగంబు గోపికల కైశ్వర్యం బిచ్చుచునుండు నిట్టి శ్రీకృష్ణమూప తేజంబు నాశ్రయింపుఁడనుట. ❋

శ్లో ॥ నిర్వాసనంహ న్తరసా న్తరాణాం నిర్వాణసామ్రాజ్యమివావకీర్ణమ్ । అవ్యాజమాధుర్య మహానిధాన మవ్యాత్ప్రజానామధిదైవతంనః ॥ ౭౮

టీక. రసాంతరాణాం - రసవిశేషములయొక్క, నిర్వాసనం - తిరస్కారమైనవాఁడును, అవకీర్ణమ్ -వ్యాప్తమయిన, నిర్వాణసామ్రాజ్యమివ - నిర్వాణ - ముక్తియొక్క, సామ్రాజ్యమివ - సర్వస్వమువలెనున్న వాఁడును, అవ్యాజమాధుర్య మహానిధానం - నిరుపాధికమైన సౌందర్యనిక్షేప మయినవాఁడును, ప్రజానాం - ప్రజలకు, అధిదైవతం - దేవుఁడైన శ్రీకృష్ణుఁడు, నః - మమ్ము, అవ్యాత్ - రక్షించుఁగాక. ❋

ఉ ॥ ఇతరసంబులేమిటికినీనవమోహన మాధురీనిధిన్ । సతతముఁగాంచినందనివి చాలునెముక్తిసుఖానుభూతియా । కృతిియులరార గాదనువరించెన నందగుగోపరూపసం । గతమగుదైవతంబఖిలకాంక్షితముల్ జతగూర్చుఁగావుతన్ ॥ ౭౮

తా. రసవిశేషంబులం దిరస్కరించుచు ముక్తిసర్వస్వంబుంబోలె వెలుంగుచునిరుపాధికసౌందర్యంబునకు నిక్షేపంబయి యెల్లరకు నేలికయైవెలయు శ్రీకృష్ణాఖ్యదైవతంబు మమ్ముంబ్రోచుఁగావుతయనుట. ❋

శ్లో ॥ గోపీనామభి మతగీత వేషహాపాఽ దాక్షీన స్తన భరనిర్భరో

పగూఢమ్। కేళీనామవతురసైరుపాస్యమానం కాళిన్దీపులినచరంపరం మహోనః ॥

టీక. అభిమతగీతవేషహర్షాత్, అభిమత- అంగీకరింపఁబడిన, గీత-గానముచేతను, వేష- అలంకారముచేతను నైనయట్టి, హర్షాత్ - సంతోషమువలన, గోపీనాం- గోపికలచేత, ఆపీనస్తనభరనిర్భరోపగూఢం- ఆపీన-స్థూలములైన, స్తన- స్తనములయొక్క, భర-అతిశయముచేత, నిర్భర-గాఢముగా, ఉపగూఢం- ఆలింగనముచేయఁబడుచున్నయదియు, కేళీనాం- క్రీడలయొక్క, రసైః- రసాతిశయములచేత, ఉపాస్యమానం- సేవింపఁబడుచున్నయదియు, కాళిందీపులినచరం- కాళిందీ- యమునయొక్క. పులిన-ఇసుకదిబ్బలయందు, చరం- తిరుగుచున్నయదియు- పరం-ఉత్కృష్టమైనయదియునగు, మహః- తేజస్సు, నః- మమ్ము, అవతు-రక్షించుఁగాక.

మ॥ నవలావణ్యపయోవిలాసమురళీనాదంబులంజొక్కెవ । ల్లవకాంతల్ యమునాధునీ పులినలీలావేదికిందార్చిగా ।రవమొప్పంగుచకుంభసంభృత పరీరంభంబులన్ సంధిబం ।ధవిశేషంబులఁదెల్పమెచ్చు భువనాధారుండునన్ బ్రోవుతన్॥ ౭౯

తా. ఇష్టంబులగు గానవేషంబుల నైన సంతోషంబున గోపస్త్రీలు పలుచచన్నుంగవలెద నాటం బైకొనియాలింగనంబుఁజేయ సంతసిల్లుచు నెల్లవిలాసంబులచే సేవింపఁబడుచు యమునానదియందలి యిసుకతిన్నెలంజరియించుచున ధికంబై వెలుంగు తేజంబు నన్నుం బ్రోచుఁగాకయనుట.

స్రా॥ ఖేలతాంమనసి ఖేచరాఙ్గనామానసీయమృదువేణునిస్వనైః। కాననేకిమపినః కృపాస్పదంకాలమేఘకలహోద్వహంమహః॥౮౦

టీక. ఖేచరాంగనామానసీయమృదువేణునిస్వనైః- దేవతాస్త్రీలచేత గొనియాడఁబడుచున్న వేణుధ్వనులచేతను, కాననే- బృందావనమందు, కాలమేఘకలహోద్వహం - నీలమేఘముతోడఁ గలహముచేయుచున్న యట్టిదియు, కృపాస్పదం- దయాధారమైనయట్టిది యునగు, కిమపి, వాచామగోచరముయిన, మహః- శ్రీకృష్ణాఖ్యతేజస్సు, నః-మాయొక్క, మనసి - మనస్సునందు, ఖేలతాం- సంచరించుఁగాక.

మ॥ అమరీమానితవేణుగానమున బృందారణ్యమందారబ్బం । దముక్రిందన్ యమునాతరంగకణి కాంతర్వేదికామధ్యదే । శమునన్ ·

సాంద్ర ఘనాఘనప్రతిభట శ్యామద్యుతిం బిభ్రతీ । మమమనోమా
నసపీఠికం గరుణగ్రమ్మన్నిమ్ముంగా కెప్పుడున్ ... ౮౦

తా. దేవతాస్త్రీలచే సమ్మానింపఁబడిన వేణుగానంబున బృందార
ణ్యంబున నీలమేఘంబుతోడం గలహంబు చేయం గనుకొంచునెన్నే నిచాయందు
లకించుచు దయాధారంబై వాచామగోచరంబై తేజరిల్లు తేజంబు నామనంబు
నం జరియించుఁ గాకయనుట. ... ... ...

మూ॥ ఏణీశాబవిలోచనాభిరలసచ్ఛ్రోణీభరప్రౌఢిభిర్వేణీ భూత
రసక్రమాభి రభితశ్శ్రేణీకృతాభిర్వృతః । పాణీద్వౌచవినోదయన్
రతిపతే స్తూణీశయైస్సాయకైర్వాణీనామ పదంపరం వ్రజపతిః క్షో
ణీపతిః పాతునః ॥ ... ... ... ౮౧

టీక. అలసచ్ఛ్రోణీభరప్రౌఢిభిః - అలస-మందములయిన, శ్రోణీ-పిరుదు
లయొక్క, భర- అతిశయముయొక్క, ప్రౌఢిభిః - సామర్థ్యముగలయదియు,
వేణీభూతరసక్రమాభిః- వేణీభూత-ప్రవాహముగఁ జేయఁబడిన, రస - మా
ధుర్యాది రసముల యొక్క, క్రమాభిః - సంచారములు గలదియు, శ్రేణీ
కృతాభిః - పఙ్క్తిగాఁజేయఁబడిన, ఏణీశాబవిలోచనాభిః - లేడిపిల్లకన్నులవం
టికన్నులుగలగోపికలతోడ, ఆవృతః- పరివేష్టింపఁబడినయాఁడయు, రతిపతేః -
మన్మథునియొక్క, ద్వౌ - రెండయిన, పాణీ-హస్తములను, తూణీశయైః-దొన
లనున్న, సాయకైః - బాణములచేత, వినోదయన్ - వినోదములుగలవానిఁగా
జేయుచున్నయదియు, అభితః -అంతటను, వాణీనాం- వేదాంతవాక్యములకు,
పరం- మిక్కిలియును, అపదం -విషయముగానియదియు, వ్రజపతిః - వ్రజ-నం
దవ్రజమందని జనులకు, పతిః - విభుఁడైన, క్షోణీపతిః - భూపాలకుఁడైనశ్రీకృ
ష్ణుఁడు, నః - మమ్ము, పాతు - రక్షించుఁగాక.

మ॥ సోలపుంజూపులు గబ్బిగుబ్బలుఘనశ్రోణీ భరప్రౌఢని । స్తు
లశృంగార రసోన్మికల్ గలుగు నింతుల్బారులయికొల్వగం।ధిలతూణీశ
యబాణనుం గజుఁడుపాణిం బూనఁగాఁ జేయున । చ్చెలువున్వాఙ్మన
సా తీతుఁడు మిము నందాత్మజున్ ॥ ... ౮౧

తా. సోలపులగుచూపులును గొప్పలయియుగళంబులగు పిఱుందులుం
గలిగి ప్రవాహీకృతంబులగు మాధుర్యాది రసపరంపరలుం బోనిగోపయువ
తులు బారులయి కొల్వహారునికరంబుల బాణంబులచేతం గొనరొప్పం జే
యుచు ( అనఁగామన్మథున కవసరంబు సంపాదించుచుననుట ) వేదాంతవా

క్యంబులకుం బ్రతిపాదింపనలవిగాక ధరణీమండలంబునెల్లనేలుచునందవ్రజం
బునేలు వెన్నుండు నన్నుం బ్రోచుఁగాకయనుట.

✓ మూ॥ కాళిన్దీపులినే తమాలనిబిడచ్ఛాయే పురస్సఞ్చరత్తోయే తో
యజపత్రపాత్రనిహితం దధ్యన్నమశ్నాతియః । వామే పాణితలే ని
ధాయ మధురం వేణుం విషాణం కటిప్రాన్తే గాశ్చవిలోకయన్ ప్ర
తికలన్తం బాలమాలోకయే॥ ౮౨

టీక. యః- ఏబాలకృష్ణమూర్తి, వామే-డాపలిదైన, పాణితలే-హస్తమునందు, వేణుం- పిల్లనఁగ్రోవిని, కటిప్రాన్తే- నితంబప్రదేశమునందు, విషాణం- శృంగీభూతముఖ వాద్యవిశేషమును, విధాయ- ఉంచి, ప్రతికలం- ప్రతిక్షణమందును, గాశ్చ- గోవులను, విలోకయన్ - చూచుచున్న వాఁడగుచు, తమాలనిబిడాచ్ఛాయే - తమాల- చీఁకటిమ్రాఁకులయొక్క, నిబిడ-దట్టిమైన, ఛాయే-నీడగలయదియు, పురస్సఞ్చరత్తోయే- పురః ముందరను, సంచరత్- చరించుచున్న, తోయే-ఉదకముగల, కాళిన్దీపులినే- కాళిన్ది - యమునయొక్క, పులినే- ఇసుకదిన్నెలయందు, తోయజపత్రపాత్రనిహితం - తోయజపత్ర- తామరసదళముపయెడి, పాత్ర - పాత్రమందు, నిహితం-ఉంచఁబడిన, దధ్యన్నం-చల్దిని, అశ్నాతి-భుజించుచున్నాఁడో, తం-ఆప్రసిద్ధుఁడైన, బాలం- బాలకృష్ణమూర్తిని. ఆలోకయే- చూచుచున్నాను.

ఉ॥ చీకటిమ్రాని జొంపమునఁ జెన్నగు సైకతవేదినీలపు। న్వ్రేక
జలంబులో మురళి వామకరంబునఁ బట్టిదట్టిపై । దాకొనఁగొమ్ముఁ
జెక్కుకొని తామరపాకునఁ జల్దిమెక్కుచున్ । గోకులముం బ్రతిక్షణ
ముఁగూరిమిఁ గన్గొను బాలుఁగాంచెదన్ ౮౨

తా. డాపలికేలం బిల్లనఁగ్రోవియునుం బిఱుఁదుపొంతం గొమ్మునుమోపియుఁ జీకటిమ్రాఁకులనీడ ముంగలంజరియించు తోయంబుగల యమునానది యిసుకదిన్నెయందుఁ గూర్చుండి గోవులం జూచుచుఁ దామరపాకులోని చల్దిఁ దినుచుండు బాలకృష్ణునిం జూచుచున్నాను.

✓ మూ॥ యద్గోపీవదనేన్దుమణ్డనమభూత్కస్తూరికాపత్రకం యల్ల
క్ష్మీకుచశాతకుమ్భకలశవ్యాకోచమిన్దీవరమ్ । యన్నిర్వాణనిధాన
సాధనవిధౌ సిద్ధాఞ్జనం యోగినాం తం నశ్శ్యామలమావిరస్తు హృద
యే కృష్ణాభిధానం మహః॥ ౮౩

టీక. యత్ - ఏప్రసిద్ధమయిన - కృష్ణాభిధానం- శ్రీకృష్ణాఖ్యమైన, మ

హః- తేజము, గోపీవదనేందుమండలం- గోపస్త్రీలయొక్క ముఖచంద్రమండలమందు, కస్తూరికాపత్రకం- కస్తూరీతిలకము, అభూత్- అయ్యెనో,యత్ ఏ తేజము, లక్ష్మీకుచశాతకుంభకలశవ్యాకోచం - లక్ష్మీదేవియొక్క స్తనములనియెడిబంగారు కలశములయందువికసించిన, యిందీవరం - నల్లగలువ, అభూత్ - అయ్యెనో, యత్ - ఏ తేజము, యోగినాం - ఋషులకు, నిర్వాణనిధానసాధనవిధౌ- నిర్వాణ-ముక్తియనియెడి, నిధాన-నిక్షేపముయొక్క, సాధన- సాధించుటయొక్క, విధౌ-విధానమందు, సిద్ధాంజనం- నిక్షేపప్రదర్శకమైనకాటుక, అభూత్- ఆయెనో, తత్ - ఆప్రసిద్ధమైన, శ్యామం- శ్యామలవర్ణమైన, మహః - తేజము, నః- మాయొక్క, హృదయే- హృదయమందు; ఆవిరస్తు- ప్రకాశించుఁగాక.

ఉ॥ ఏహరివల్లవీజనముఖేందులకుఁ మృగనాభిచిత్రకం। బేహరికల్మికొమ్మకుచహేమ ఘటంబులనొప్పునుత్పలం। బేహరిముక్తిసేవధిమునీంద్రులకుంగనఁజేయనంజనం। బాహరినీలమూర్తిహృదయంబుననన్నిధిఁజేయుఁగావుతన్॥

తా. ఏ తేజంబుగోపికల నెమ్మోముచందురునకుఁ గస్తూరీతిలకంబయ్యెనే తేజంబు రమాదేవి కుచకనకకలశంబులందు నుత్పలంబయ్యెనే తేజంబుయోగులకు మోక్షనిక్షేపంబుఁగననంగనంబయ్యెనట్టిశ్యామలవర్ణంబైన శ్రీకృష్ణాఖ్యతేజంబునా యెదం బ్రకాశించుఁగాకయనుట.

మూ॥ ఫుల్లేన్దీవరకాన్తిమిన్దువదనం బర్హావతంసప్రియం శ్రీవత్సాఙ్కముదారకౌస్తుభధరంపీతామ్బరంసున్దరమ్ । గోపీనాంనయనోత్పలార్చితతనుంగోగోపసఙ్ఘావృతంగోవిన్దంకలవేణునాదనిరతందివ్యాఙ్గభూషంభజే॥

టీక. ఫుల్లేందీవరకాంతిం- వికసించిననల్లకలువలకాంతివంటికాంతిగలవాఁడును, ఇందువదనం - చంద్రునివంటిముఖముగలవాఁడును, బర్హావతంసప్రియం - నెమలిపింఛభూషణమే యిష్టముగాఁగలవాఁడును, శ్రీవత్సాంకం - శ్రీవత్సమను మచ్చచిహ్నముగాఁ గలవాఁడును, ఉదారకౌస్తుభం-దోషరహితమయినకౌస్తుభరత్నమునుధరించుచున్నవాఁడును, పీతాంబరం - పచ్చనైనవస్త్రముధరించినవాఁడును, సుందరం - సుందరుఁడైనవాఁడుగనుక, గోపీనాం- గోపికలయొక్క, నయనోత్పలార్చితతనుం - నేత్రములనియెడినల్లగలువలచేతఁబూజింపఁబడినశరీరముగలవాఁడును, గోగోపసంఘావృతం- గోవు

లయు గోపాలకులయొక్కసమూహముచేతఁబరివేష్టింపఁబడియున్నవాఁడును, కల వేణునాదనిరతం - అవ్యక్తమధురమైనవేణుధ్వనియందు నాసక్తుఁడైనవాఁడు ను, దివ్యాంగభూషం-శ్రేష్ఠములయినశరీరాలంకారభూషణములుగలవాఁడు నునగు, గోవిందం-గోవిందుని, భజే- సేవించుచున్నాను.

శా॥ శ్రీవత్సాంకితు గోపికానయన రాజీవార్చితుంగోపగో। సే
వాభావితుఁ గౌస్తుభోల్లసితువంశీనాదమోదాన్వితుఁ । గోవిందున్న
వపింఛయుక్త శశివక్త్రుఁ ఫుల్లనీలోత్పల। శ్రీపిభ్రాజితు హాటకాంబ
రయుతుఁ సేవింతుభూషాంచితుఁ॥ ౧౪

తా. శ్రీవత్సాంకుండును గోపికలనయనోత్పలంబులచేతం బూజింపఁ బడువాఁడును గోగోపాలసేవితుండును గౌస్తుభవక్షుండును వేణునాదవినో దుండును బర్హిబర్హావతంసుండును బూర్ణచంద్రాననుండును నీలోత్పలకాం తిశరీరుండును బీతాంబరుండును హారకేయూరాద్యలంకారశోభితుండునున గు గోవిందుని సేవించుచున్నాననుట.

మూ॥ యన్నాభీ సరసీరుహాన్తరపుటేభృఙ్గాయమాణో విధిర్య
ద్వక్షః కమలావిలాససదనం యచ్చక్షుషీచేన్దినౌ । యత్పాదాబ్జవి
నిస్సృతాసురనదీశమ్భోశ్శిరోభూషణంయన్నామ స్మరణంధునోతి
దురితం పాయాత్సనః కేశవః॥ ౧౫

టీక. యన్నాభిసరసీరుహాంతరపుటే ఎవ్వనిబొడ్డుదమ్మి మధ్యప్రదేశ మునందు, విధిః - బ్రహ్మదేవుఁడు, భృంగాయమాణః- తుమ్మెదవలెనాచరిం చుచున్నవాఁడగుచు (తిష్ఠతి-ఉన్నాఁడో) యద్వక్షః- ఎవనిభుజాంతరము, కమ లావిలాసదనం - లక్ష్మీదేవియొక్క విలాసార్థమయిన గృహమో, యచ్చక్షు షీచ - ఎవనియొక్క కన్నులును, ఇందినౌ- చంద్రసూర్యులో, యత్పాదాబ్జవి నిస్సృతా - ఎవనిపాద కమలమువల్ల బయలువెడలిన, సురనదీ - గంగానది, శంభోః- శివునియొక్క, శిరోభూషణం- అవతంసమో, యన్నామానుస్మరణం- ఎవనిపేరునుదలంచుట, దురితం- పాపమును, ధునోతి - కంపింపఁజేయుచున్న దియో, సః - ఆప్రసిద్ధుడైన, కేశవః - శ్రీకృష్ణమూర్తి, నః - మమ్ము, పా యాత్ - రక్షించుఁగాక.

మ॥ ఎవ్వనినాభికంజమునభృంగముభంగిఁజెలంగుఁబద్మజుం । డె
వ్వనికన్నులింపురవులెవ్వనివక్షములచ్చికాటప। బ్టెవ్వనిపాదపద్మజల

మీసుజటాటవిఁ బోల్చు భూషణం । బెవ్వనిఁ బేరోలనంగలుష మీఁగునా
యాహరి నిన్నుఁ బ్రోవుతన్॥ ౮౫

తా. ఎవ్వని బొడ్డుతామరయందు నలువ తేటివలెఁ జెలంగుచునుండు నెవ్వాని యురంబు కమలాదేవికి లీలామందిరంబై వెలయు నెవ్వని కన్నులనిండు రవులు వెలయును నెవ్వ పాదకమలంబునం బొడమిన గంగానది శివునకు శిరోభూషణంబై వెలయు నెవ్వని నామంబులు స్మరింప నఖిలదురితంబు లడంగునట్టి కేశవుండు నన్నుం బ్రోచుఁ గాక యనుట.

శ్లో॥ రక్షంతు త్వామసితజలజైరంజలిః పాదమూలే మీనా నాభీసరసి హృదయే మారబాణా మురారేః । హారాః కంఠే హరిమణిమయా వక్త్రపద్మే ద్విరేఫాః పింఛాచూడాశ్చికురనిచయే ఘోషయోషిత్కటాక్షాః॥

టీక. యః ఏ- ఘోషయోషిత్కటాక్షాః - గోపస్త్రీకడగంటి చూపులును, మురారేః-శ్రీకృష్ణునియొక్క, పాదమూలే- పాదమూలమున, అసితజలజైః-నల్లగలువలచేనైన, అంజలిః- దోయిలియును, నాభీసరసి- బొడ్డనెడుకొలఁకునందు, మీనాః- మీనములును, హృదయే - మనస్సునందు, మారబాణాః- మదనబాణములును, కంఠే- కంఠమందు, హరిమణిమయాః - ఇంద్రనీలవికారములైన, హారాః హారములును, వక్త్రపద్మే - ముఖకమలమునందు, ద్విరేఫాః - భ్రమరములును, చికురనిచయే - కేశసమూహమందు, పింఛాచూడాః-పింఛరూపక శిరోభూషణములును, అభూవన్- అయినవియో, తే-ఆగోపికలకడగంటిచూపులు, త్వాం-నిన్ను, రక్షంతు- రక్షించుఁగాక.

చ॥ కనుబడఁ గాళ్ళ నంఘ్రులకుఁ గల్వలదోయిలి నిమ్ననాభికిన్ ।
పనునకు మీలు పేరెదకు భావజువాలు శిరోధికింద్రర । త్నములసరా
లు మోము విరిదమ్మికిఁ దుమ్మెద చాలు మౌళికి । న్విమలపుఁ బీలిడాలు
దగు వ్రేతలచూపులు నిన్నుఁ బ్రోవుతన్॥

తా. ఏగోపికలకడగంటిచూపులు వెన్నుని పాదపద్మంబులకుఁ గలువల దోయిలియును బొడ్డుకొలఁకునందు మీనంబులు నురంబున మారుని బాణంబులును గళంబునందు నింద్రనీలంబుల సరంబులును మోముదామరయందు భ్రమరంబులును సిగయందు నెమలిపురిసొమ్ములు నయ్యెనో యట్టికడకన్నులు నిను రక్షించుఁగాక యనుట.

శ్లో॥ దధిమథననినాదైస్త్యక్తనిద్రః ప్రభాతే నిభృతపదమగా

రంవల్లవీనాం ప్రవిష్టః।ముఖకమలసమీరైరాశు నిర్వాప్య దీపాన్ కబళి
తనవనీతః పాతుగోపాలబాలః॥

టీక. ప్రభాతే-అపరరాత్రిమున, దధిమథననినాదైః- దధి - పెరుగు యొక్క, మథన- చిలుకుటవలనఁగలిగిన, నినాదైః-ధ్వనులచేత, త్యక్తనిద్రః-విడువఁబడిననిద్దురగలవాఁడగుచు, వల్లవీనాం- గోపికలయొక్క, అగారం- గృహమును, నిభృతపదం-నిభృత- మందమైన, పదం- పాదములు గలుగునట్టులుగా, ప్రవిష్టః-ప్రవేశించిన వాఁడగుచు, ముఖకమలసమీరైః - ముఖకమల - కమలమువంటిముఖముయొక్క, సమీరైః-వాతములచేత, దీపాన్ - దీపములను, ఆశు- శీఘ్రముగా, నిర్వాప్య, పోవనడచి, కబళితనవనీతః - మ్రింగఁబడిన వెన్నగలిగిన, గోపబాలః-బాలకృష్ణమూర్తి, నః-మమ్ము, పాతు-రక్షించుఁగాక.

ఉ॥ ప్రొద్దునఁజల్లఁ జిల్కుఱవముల్ చెవిసోఁకిన యంతలోపల ।
న్నిద్దురలేచి గోపరమణీ సదనంబులఁజొచ్చియొయ్యన । న్సద్దుమణంచియాస్యపవనంబున నాళముఁబూనిదీపము। ల్పెద్దయొనర్చి వెన్నగబళించినగోపకుమారుఁ గాంచెదన్॥

తా. ప్రభాతంబునం బెరుగుచిలుకుఱవంబులవిని నిద్దురమేలుకాంచి గోపికాసదనంబులం జొచ్చి సద్దుగాకుండఁ బాదంబులూనుచుంబోయి ముఖమారుతంబున దీపంబులార్చి వెన్న మ్రింగుబాలకృష్ణుఁడు నన్ను బ్రోచుఁగాక యనుట.

శ్లో॥ ప్రాతస్స్మరామి దధిఘోషవినీతనిద్రం నిద్రావసానరమణీయముఖారవిన్దమ్ । హృద్యానవద్యవపుషం నయనాభిరామ మున్నిద్రపద్మనయనంనవనీతచోరమ్॥

టీక. దధిఘోషవినీతనిద్రం-దధిఘోష- దధిమథనజన్యధ్వనిచేత, వినీత-పోఁగొట్టబడిన, నిద్రం- నిద్రగలవాఁడును, నిద్రావసానరమణీయముఖారవిందం- నిద్రాంతమునందుసుందరమయిన ముఖకమలముగలవాఁడును, హృద్యానవద్యవపుషం - మనోహరమై దోషరహితమైన శరీరముగలవాఁడును, నయనాభిరామం-నేత్రములకునుత్సవస్వరూపుఁడైనవాఁడును, ఉన్నిద్రపద్మనయనం వికసించిన తామరరేకులవంటి నేత్రములు గలవాఁడునునగు, నవనీతచోరం - వెన్నదొంగయైన బాలకృష్ణుని, ప్రాతః - రేపడ, స్మరామి - స్మరించుచున్నాను.

చ॥ పెరుగుమథించువేళఁ గనిపెట్టుక లేచిననిద్రమబ్బుతో । నరుణిమఁజెందు కన్నుఁగవయుం దమఁ జారుముఖారవిందముల్ ! సరసత

సూవిలాసముల చందముఁ జూడ్కికి వేడ్కఁ జేయఁగాఁ । బరఁగెడు వె
న్నదొంగను బ్రీతమున నుతియింతు నామదిన్ ॥ ... ౭౭

తా. పెరుగుచిలుకు రవంబులచే మేల్కొంచి నిదురమబ్బుచేతఁ జె
న్నలరు నెమ్మోము తామరవిలసిల్ల మనోహరంబులయిన శరీర విలాసంబుల
చేఁ దేజరిల్లు నయనాభిరాముండై వెన్నలుదొంగలించు పుండరీకాక్షుని రే
పకడం గొలుచుచు నుతియించుచున్నాననుట. *

శ్లో ॥ ఫుల్లహల్లకవతంసకోల్లసద్వల్లమాగమగవీగవేషితమ్ । వల్ల
వీచికుర వాసితాఙ్గుళీపల్లవం కమపివల్లవంభజే ॥ ...

టీక. ఫుల్లహల్లకవతం సకోల్లసద్దల్లం- వికసించినయెఱ్ఱదామరలని
మొడి కర్ణావతంసముచేతఁ బ్రకాశించుచున్న చెక్కిళ్లుగలవాఁడును, ఆగమగ
వీగవేషితం - వేదాంతవాక్యములచేత వెదుకఁబడుచున్నవాఁడును, వల్లవీచికు
ర వాసితాంగుళీపల్లవం - గోపికలయొక్క కుంతలములచేతఁ బరిమళముగల
విగాఁ జేయఁబడిన చిగుళ్ళవంటి వ్రేళ్ళుగలవాఁడును, కమపీ - వాచామగోచ
రుఁడైనవాఁడునగు, వల్లవం - గోపాలకృష్ణుని, భజే- సేవించుచున్నాను. *

ఉ ॥ హల్లకతల్లజశ్రుతి పుటాభరణోజ్జ్వల గల్లభాగుని । వల్ల
వకామినీచికుర బంధసుమోత్కర వాసితాంగుళీ । పల్లవమౌనిమాన
సవి భాసితు వేఁడగ వీగవేషితున్ । సల్లలితారుణాంబుజ విశాలవిలో
చనుఁగొల్తు నుదిన్ ॥ ... ... ... ౭౮

తా. చెవిసందుల విలాసంబుకొఱకు నిడిన యెఱ్ఱతామరలచేతం దే
జరిల్లు చెక్కిళ్ళుగలిగి గోపికల కొప్పు లలంకరించుకతంబునం బరిమళించు ప
ల్లవంబులంబోని వ్రేళ్ళుగలిగి వేదాంత వాక్యంబులచే నన్వేషింపంబడుచు వా
చామగోచరుండై వెలయు గోపాలకృష్ణుని సేవించుచున్నాను. ... *

శ్లో ॥ స్తేయం హరేర్హ్రరతి యన్నవనీత చౌర్యం జారత్వమస్యగు
రుతల్పకృతాపరాధమ్ । హత్యాంద శాననహతి ర్మధుపాన దోషం
యత్పూతనా స్తన పయస్సపునాతుకృష్ణః ॥ ... ౭౯

టీక. హరేః - శ్రీకృష్ణమూర్తియొక్క, నవనీతచౌర్యం- వెన్నదొంగ
తనము, యత్- ఏది, అస్తి- కలదో, తత్- అది, స్తేయం- చౌర్యమును, హరతి-
హరియించుచున్నదియో, అస్య - ఈశ్రీకృష్ణమూర్తియొక్క, యత్ - ఏ, జా
రత్వం - విటభావము, భణితంసత్ - చెప్పఁబడుచున్నదియై, గురుతల్పకృతా
పరాధం - తండ్రియొక్కభార్యయందుఁ జేయఁబడినయపరాధమును, హరతి-

హరించుచున్నదియో, హరేః-శ్రీకృష్ణమూర్తియొక్క, యా-ఏ, దశాననహతిః, రావణసంహారము, వర్ణితా సతి - వర్ణింపఁబడినదియై, హత్యాం - హత్యను-హరతి-హరియించుచున్నదియో, యత్పూతనాస్తనపయః-ఏకృష్ణమూర్తియొక్క- పూతనాస్తనపానము, వర్ణితంసత్ - వర్ణింపఁబడినదై, మధుపానదోషం-మద్యపానదురితమును, హరతి-హరించుచున్నదియో, సః- ఆప్రసిద్ధుఁడైన, కృష్ణః-కృష్ణమూర్తి, అస్మాన్-మమ్ము, పునాతు-పవిత్రులఁ జేయునుఁగాక.

చ॥ గురుసతిఁ గూడినట్టి యఘకోటిజనున్ వ్రజజారతారతం ।
బొరయువుమద్యదోషములు పూతనచన్నులు చేపుటెంచినఁ । దొరలు
నుహత్య రావణహతిన్వినఁ జౌర్యము వాయు వెన్నదొం । గరికము లెన్న
నట్టి కథగల్గిన శౌరి పవిత్రుఁ జేయుతన్ ॥ ౯౦

తా. శ్రీకృష్ణుని వెన్నదొంగరికము స్మరియింపఁ జౌర్యదోషంబులడంగు వెన్నునిజారత్వంబు వర్ణింపఁ జారత్వంబు వలనం బొడమిన పాపంబులు మాపుమాయు - శ్రీమన్నారాయణుం డొనరించిన రావణ సంహారంబుఁ దలంప బ్రహ్మహత్యయైనం బోవు నందసూనుండు సేసిన పూతనాస్తన్యపానంబు చింతించిన మద్యపానంబులనైన కలుషంబులు మాపు నేమ నట్టి శ్రీకృష్ణుండు మనఁ బవిత్రుం జేయుఁగాక యనుట.

శ్రీకృష్ణునిపై విరహంబుచే మదనాతురయగు నొక
గోపిక మన్మథునిను పాలంభించు రీతిం జెప్పుచున్నాఁడు.

మా॥ మారమావసమదీయమానసే మాధవైకనిలయే యదృచ్ఛ
యా! శ్రీరమాపతిరిహాగమేదసౌ కం సహేత నిజవేశ్మలంఘనమ్॥ ౯౧

టీక. హేమార - ఓయిమన్మథుఁడా, మాధవైకనిలయే - విష్ణువునకు ముఖ్యస్థానమైన, ఇహ- ఈ, మదీయమానసే - నాసంబంధమైన మనస్సునందు, యదృచ్ఛయా- విచ్చలవిడిగా, మావస - ఉండకుము, అసౌ- ఈ- శ్రీరమాపతిః-లక్ష్మీనాయకుఁడు, ఆగమేత్-వచ్చెను, నిజవేశ్మలంఘనం- నిజ-స్వకీయమైన, వేశ్మ-గృహమునందు, లంఘనం - ప్రవేశించినను, కమ్ - ఎవ్వని, సహేత- సహించును.

చ॥ అనుపమదివ్యధామము మురారికి నామనసస్సు కాపున । స్మర
నిజనిల్వ వద్దు చనుమా విను మాయనుమాన మేటికిఁ । న్వసరుహలోచనుం
డిటు వచ్చిన నేరము వచ్చు నెవ్వనికిం । దనగృహసీమ నొంటఁ జాటఁడు

పారిపోక నెవ్వఁడున్నైనఁ జెప్పుమా॥ ✻ ✻ ✻

తా. ఓయిమదనుఁడా నామనంబు శ్రీనాయకుండగు విష్ణుదేవునకు నా లయంబు గావున నికఁ గడనిల్వకుమా శ్రీపతివచ్చిన నీకు నేరంబు దొరకొనుఁ దన యింటఁ జొచ్చిన నెవ్వని నెవ్వండున్నైనను నింకన్నైన వెడలిపొమ్మనుట.

శ్లో॥ ఆకుఞ్చితం జానుకరంచవామం న్యస్యక్షితౌ దక్షిణహస్తప ద్మే। ఆలోకయన్తం నవనీతఖణ్డం బాలం ముకున్దం మనసా స్మరామి॥ ౭

టీక- ఆకుంచితం- ముడువఁబడినయట్టియు, వామం - డాపలిదైనట్టి యునగు. జాను - మోకాలిని, కరంచ- హస్తమును, క్షితౌ- భూమియందు, న్యస్య- ఉంచి, దక్షిణహస్తపద్మే- వలపలిదగు కరకమలమందు, నవనీతఖండం- వెన్న ముద్దను, ఆలోకయంతం- చూచుచున్నవాఁడును, బాలం- బాలుఁడైనవాఁడు నైన, ముకుందం - శ్రీకృష్ణమూర్తిని, మనసా- మనస్సుచేత, స్మరామి- స్మరించుచున్నాను.

చ॥ డాపలికేలు జానువును వారగ తేర్ ధరణీతలంబున। న్వ్యాపి
యుఁ బానతాంగమున నూల్కొని దక్షిణహస్తపంకజ। స్థాపితమైన వె
న్నఁ బ్రియమందంబునఁ జూచి చెలంగు చెల్వుని। న్గోపకుమారు దంతి గమనున్
సతతంబు మదిందలంచెదన్॥

తా. ముడువంబడిన డాపలి మోకాలిని గరంబుఁ బుడమిపై నిడి వల పలికేలనుంచు వెన్నముద్దం గనుంగొనుచుండు బాలకృష్ణమూర్తిని నామనం బున సంస్మరించుచున్నాననుట.

శ్లో॥ జానుభ్యామభిధావంతం పాదాభ్యామపిసుందరమ్। సకుం డలాలకం కృష్ణం ధ్యాయామ్యుషసి బాలకమ్॥

టీక. జానుభ్యాం- మోకాళ్ళచేతను, పాదాభ్యామపి- పాదములచేత ను, అభిధావంతం- పరువులిడుచున్నవాఁడును, సుందరం- సొగసైనవాఁడును, సకుండలాలకం- కుండలములతోఁగూడిన ముంగురులు గలవాఁడును, బాలకం- బాలుఁడునైన, కృష్ణం- శ్రీకృష్ణమూర్తిని, ఉషసి- ప్రాతఃకాలమున, ధ్యాయా మి- ధ్యానముచేయుచున్నాను.

ఉ॥ నిద్దపుమద్దికాయలట నిక్కఁబడంబును జానుయానము। న్ము
ద్దుమొగంబునం జెలఁగు ముంగురులందపు రావిరేకయుం। గద్దరి బె
ళ్కుచూపులుఁ జోకాటపునవ్వులుఁ గల్గుబాలకుం బ్రొద్దున మేలుకాం

చినీనము స్మరినేంచెద నందనందనుక్॥ ౬౩॥

తా. మోకాళ్ళచేతం బాదంబులచేతం బరువు లిడుచు మనోహరుం డై కుండలంబులపై వ్రాలినముంగురులు మెఱయ బాలకుండై మెలంగెడు శ్రీకృష్ణదేవుని రేపకడ ధ్యానించెదననుట.

భగవంతుండగు లీలాశుకయోగికిం గలయవతారాంతరభక్తిని శోధింపఁగోరి తానుగోదండరాముండై యావిర్భవించి వర్ణన మీయఁగా లీలాశుకయోగీంద్రుండు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ విహాయకోదండశరౌ ముహూర్తం గృహాణ పాణౌ మణిచారువేణుమ్। మయూరబర్హంచనిజోత్తమాంగే సీతాపతేత్వాం ప్రణమామి పశ్చాత్॥

టీక. హేసీతాపతే- ఓశ్రీరామస్వామీ, కోదండశరౌ - ధనుర్బాణములను, విహాయ-విడిచి, పాణౌ-హస్తమునందు, ముహూర్తం-ముహూర్తమాత్రము, మణిచారువేణుమ్ - మణివికారమగుటచే సుందరమైన పిల్లనగ్రోవిని, నిజోత్తమాంగే- స్వకీయమైనశిరమునందు, మయూరబర్హంచ-నెమలిపురిని, గృహాణ- గ్రహింపుము. పశ్చాత్- అనంతరము, అహమ్ - నేను, త్వాం నినుఁజూచి, ప్రణమామి-నమస్కరించుచున్నాను.

మ॥ శరచాపంబులు మానిమానికపు వంశంబు న్మణింగేలందా। మరలంబూని కిరీటమందమగు నీమౌళిం గలాపంబుదా। ల్చిరవాణిం బుగనిల్చి నన్ముజితగతి సేవించిసీతామహా। హరనామచ్చటదీపనమ్మ పుగ దా యాత్మం బ్రశంసించెదన్॥

తా. ఓశ్రీరామస్వామీ ధనుర్బాణంబులువిడిచి హస్తంబున మణివికారంబై సుందరంబైన వేణువుఁబూని శిరంబునఁ గిరీటంబుమాని నెమలిపురియును ముహూర్తమాత్రకాలంబు ధరియించినఁబిదప నేను నిన్ను సేవించి నుతియించుచున్నాననుట.

ఈశ్లోకంబు గోపాలబాలక వాక్యంబుగాఁ జెప్పంబడుచున్నది.

శ్లో॥ అయంక్షీరాంభోధేః పతిరితి గవాంపాలకఇతి శ్రితోస్మాభిః క్షీగోపనయనధియా గోపతనయః। అనేన ప్రత్యూహోవ్యరచి సతతంయేనజననీ స్తనాదప్యస్మాకం సకృదపిన యోదుర్లభమభూత్॥

టీక. అయం- ఈ, గోపతనయః- శ్రీకృష్ణమూర్తి, క్షీరాంభోధేః- పా

లకడలికి, పతిరితి- దొరయనియును, గవాం-గోవులకు, పాలక ఇతి-పాలకుఁడ నియును, క్షీరోపనయనధియా-క్షీర-పాలయొక్క, ఉపనయనధియా- సంపాదించుకొనియెడిబుద్ధిగల, అస్మాభిః-మాచేత, శ్రితః - ఆశ్రయింపఁబడియెను, యేన- ఏహేతువుచేత, సతతం-ఎల్లప్పుడును, అస్మాకం-మాకు, జననీ స్తనాదపి-జననీ-తల్లియొక్క, స్తనాదపి- కుచమువల్లనైనను, సకృదపి- ఒకానొకప్పుడైనను, పయః-పాలు, దుర్లభం-పొందనశక్యమైనది, అభూత్- ఆయెనో, అనేన-ఈశ్రీకృష్ణునిచేత, ప్రత్యూహః-విఘ్నము, వ్యరచి-చేయఁబడియెను.

చ॥ చెలువుఁడు గోగణాధిపతి క్షీరపయోధివిహారియీతనిం। గొ
లిచినఁబాలుగల్గునను కోరికతోఁ గడుభక్తిసేయఁగాఁ । భళిభళిమా
నుతల్లి చనుబాలకునైతము విఘ్నకర్తనై । యలవడ నెట్లుఁగొల్తుని
కనకరుఁడు తాఁడని సన్నిగోపకుల్ ॥ ౯౫

తా. ఈశ్రీకృష్ణుఁడు పాలకడలికి దొరయనియు గోగణంబులకుఁబాలకుండనియును బాలుదొరుకునను నాసంజేసి యాశ్రయించితిమి- ఇతండు మాతల్లిపాలును మాకు లేకుండునట్లు విఘ్నంబుచేసె నింకనేమని యీతనిఁగొల్తుమని గోపతనయులు వాక్రుచ్చుదురనుట - అనఁగాఁ బాలింతలతోడనైను మదనకదనం బొనర్చుననుట.

(ఈశ్లోకార్థంబొకగోపికయొక్క విరహవచనంబుగాఁజెప్పంబడుచున్నది.)

మూ॥ హస్తమాక్షిప్య యాతోసి బలాత్కృష్ణ కిమద్భుతమ్। హృదయాదపి నిర్యాసి పౌరుషం గణయామి తే॥ ౯౬

టీక. హేకృష్ణ- ఓయీకృష్ణుఁడా, బలాత్-బలాత్కారముగా, హస్తం-కరమును, ఆక్షిప్య - విదలించి, యాతోసి - పోయినవాఁడవైతివి, కిమద్భుతం - ఏమి - యాశ్చర్యము॥ హృదయాదపి - హృదయమునుండియును, నిర్యాసి- బయలువెళ్ళితివి, తే- నీయొక్క, పౌరుషం- పౌరుషమును, గణయామి-లెక్కించుచున్నాను.

చ ॥ వలచితిరాయటంచుఁ జెయిపట్టినఁ గౌఁగిటఁ గారవించిచే ।
కొలికొనగోటనొక్క కరగింపక చిమ్ముక పోయెదిక్రియం । దలఁపు
ననిల్పఁజికర కకటాచనఁగల్గిన పౌరుషంబుసీ। కలపడెనంచుఁబలుక
చెనకుమన్న జెప్పినశౌరిఁగాంచెదన్ ॥ ౯౬

తా. ఓకృష్ణా నాచేతంబట్టిన చెయివిదిలించి చిమ్మిపోయెద విదియేమి యచ్చెరువెదనిల్పి నన్నిలువకపోయెద విట్లుచేయ నీకేమిపౌరుషంబువచ్చె నని యొకనెలత యనెననుట.

మూ ॥ తమసిరవిరివోద్యన్మజ్జతామంబురాశౌ ప్లవఇవ తృషితానాంస్వాదువర్షీవమేఘః । నిధిరివవిధనానాం దీర్ఘతీవ్రామయానాం భిషగివకుశలం నోదాతుమాయాతు శౌరిః॥ ... ... ౯౭॥

టీక. తమసి- చీకటియందు, ఉద్యత్- ఉదయించిన, రవిరివ-సూర్యునివలెను, అంబురాశౌ - సముద్రమునందు, మజ్జతాం - మునుంగుచున్నవారలకు, ప్లవఇవ - తెప్పవలెను, తృషితానాం - పిపాసార్తితులగువారలకు, స్వాదువర్షీ - సుగంధయుక్తవర్షమునువర్షించుచున్న, మేఘఇవ - మేఘమువలెను, విధనానాం - ధనములేనివారలకు, నిధిరివ - నిక్షేపమువలెను, దీర్ఘతీవ్రామయానాం - యెడతెగనితీవ్రములైన రోగములుగలవారలకు, భిషగివ - వైద్యునివలెను, శౌరిః-శ్రీకృష్ణుడు, నః - మాకు, కుశలమ్-కుశలమును, దాతుం - ఇచ్చుటకొఱకు, ఆయాతు - వచ్చుంగాక. ... ... ... ... ... *

మ ॥ అడవింజీకటంబోవువానికుదయంబైనట్టి సూర్యాకృతిన్ । జలధింగ్రుంగఁగనావడగ్గరినయోజం బేదకున్ లిచ్చిచో । ప్పడురీతెంద్రుపదీర్ఘఁగాజడిమొగుల్ పైకొన్నచందాననో । వ్వడరన్మాన్పెడు వైద్యునట్ల హరిడాయన్వచ్చినన్ బ్రోవుతన్ ॥ ౯౭

తా. కటిక చీకటిలోఁబడి దుఃఖించువానికి సూర్యోదయించినట్టులనంబురాశింబడి మునుంగువానికి నావ సమీపించినట్లైవడి నీరుపట్టు నదయ్యెవానికిజడిమొగులుపైకొన్న వడువునం బేదకులిచ్చియిచ్చిన చందంబున రోగంబులచే నొవ్వడరిన వానికివైద్యుండు డాయుకరణి శ్రీకృష్ణమూర్తి నాకుఁగుశలంబొసంగ వచ్చుంగాకయనుట.

శ్లో ॥ కోదణ్డంమసృణం సుగన్ధవిశిఖం చక్రాబ్జపాశాఙ్కుశాన్ । హైమీంవేణులతాంకరైశ్చదధతం సిన్ధూరపుఞ్జారుణమ్ । కందర్పాధికసుందరం స్మితముఖం గోపాఙ్గనావేష్టితం గోపాలం సతతం భజామివరదం త్రైలోక్యరక్షామణిమ్ ॥ ౯౮

టీక. మసృణం -చిత్రవర్ణమైన, కోదండం-ధనువును, సుగన్ధవిశిఖం-పరిమళించుచున్న బాణమును, చక్రాబ్జపాశాంకుశాన్ - చక్రశంఖ పాశాంకుశ

మురళిను, హైమాసాం - స్వర్ణవికారమయిన, వేణులతాం - తీఁగవంటి పిల్లనఁ గ్రోవిని, కరైః-హస్తములచేత, దధతం - ధరించుచున్నవాఁడును, సింధూర పుంజారుణం- సింధూరపు రాశివలె నెఱ్ఱనైనవాఁడును, కందర్పాధిక సుందరం మన్మథునికన్న సుందరుఁడైనవాఁడును, స్మితముఖం - చిఱునగవుతోఁగూడిన ముఖముగలవాఁడును, గోపాంగనావేష్టితం - గోపస్త్రీలచేతఁ బరివేష్టింపఁబడినవాఁడును, త్రైలోక్యరక్షామణిం - లోకత్రయరక్షకుఁడైనవాఁడును, వరదం- వరములిచ్చుచున్నవాఁడునునగు, గోపాలం-శ్రీకృష్ణమూర్తిని, సతతం ఎల్లప్పుడును, భజామి- సేవించెదను.

చ॥ అలరులకోరియించు విలునంకుశపాశరథాంగశంఖమం । శల
తలుబాహులన్వెలయఁ జక్కనిగోపకుమారమన్మథుఁ । లలితదరస్మి
తాననుఁ ద్రిలోకజనావనుఁ గుంకుమారుణో । జ్జ్వలతరగాత్రుఁ గోప
జలజాతముఖీ సుఖపాత్రుఁ గొల్చెదన్ ॥ ౯౮

తా. చిత్రవర్ణంబై మెఱయుచెఱకు విలునలరుటమ్ము శంఖంబుఁజక్రంబు నంకుశంబుఁ బాశంబునుగాఁ గరంబుల ధరియించి మదనునికన్న సుందరుండై చిఱునగవు నెమ్మొగంబునందొలుకాడ గోపయువతులు చుట్టును బరిసికొలువ ముల్లోకంబులం బ్రోచుచు వరదుండై వెలయు గోపాలదేవుని సేవించుచున్నాననుట.

మ॥ సాయంకాలేవనాన్తే కుసుమితసమయే సైకతే చన్ద్రికా
యాం। త్రైలోక్యాకర్షణాఙ్గం సురనరగణికామోహనాపాఙ్గమూ
ర్తిమ్ । సేవ్యం శృఙ్గారభావై ర్నవరసభరితైర్గోపకన్యాసహస్రైః ।
ర్వన్దేహం రాసకేళీరతమతిసుభగం వశ్యగోపాలకృష్ణమ్॥ ౯౯

టీక • కుసుమితసమయే- వసంతకాలమందు, వనాంతే-వనమందు, సాయంకాలే- సాయంకాలమందు, చంద్రికాయాం- వెన్నెలగాయుచుండఁగా సైకతే- ఇసుకతిన్నెయందు, త్రైలోక్యాకర్షణాంగం - ముల్లోకములవశపఱచుకొను నవయవములనుగలవాఁడును, సురనరగణికామోహనాపాంగమూర్తిం- దేవతలయొక్కయును మనుష్యులయొక్కయును వేశ్యాస్త్రీలకును మోహజనకమైన కటాక్షవిక్షేపములుగలవాఁడును, నవరసభరితైః- నూతనశృంగారాదిరసభరితములైన, గోపకన్యాసహస్రైః-గోపస్త్రీసహస్రముల

చేత, శృంగారభావైః - శృంగారచేష్టలతోడ, సేవ్యం - సేవింపఁబడినవాఁడును, రాసకేళీరతం, రాసక్రీడయందాసక్తుఁడైనవాఁడును, అతిసుభగం - మిక్కిలి సుందరుఁడైనవాఁడునయిన, వన్యగోపాలకృష్ణం - సర్వజనకామవిషయుఁడైనకృష్ణునిఁగూర్చి, అహం - నేను, వందే - నమస్కరించుచున్నాను.

మ॥ పటుశృంగార తరంగితాంగులగు గోపాలాంగన ల్గొల్వను॥
తిరుటబృందావన సైకతంబులవసంతజ్యోత్స్నలన్ రోదసీ। తటవేళ్ళ
తతిదృగ్విలాసములచేతన్నాకరా రాసక్రియా। నటనాటోప వశీకృత
త్రిభువను న్నంజన్నుడింగొల్చెదన్॥ ౯౯

తా. వసంతకాలమందు బృందావనంబులో రాత్రియందు వెన్నెలగాయుచుండగా నిసుక దిన్నెయందుపైఁ జేరి ముజ్జగంబుల వలపించెడు సొగసుగలవాఁడై స్వర్గలోక భూలోకముల వెలయాండ్రు మరులుకొలిపెడు క్రీగంటిచూపులందగి యప్పటికప్పటి కుప్పతిల్లు శృంగారరసంబులం బొంగారెడు వేవేలగోపకన్యలు శృంగారచేష్టలతోడం దనచుట్టుం జేరి సేవించుచుండఁగా రాసక్రీడసలుపుచు సకలజనంబుల కోరికలుదీర్చుచుండెడుశ్రీకృష్ణునింగూర్చినమస్కరించుచున్నాననుట.

శ్లో॥ కదమ్బమూలే క్రీడన్తం బృన్దావననివేశితమ్। పద్మాసనస్థితం
దేవం వేణుం గాయన్తమచ్యుతమ్॥ ౧౦౨

టీక. బృందావననివేశితం - బృందావనమందు ప్రవేశించినవాఁడును, కదంబమూలే - కడిమిచెట్టుమొదటియందు, క్రీడంతం - క్రీడించుచున్నవాఁడును, పద్మాసనస్థితం - పద్మాకారపీఠమునందున్నవాఁడును, వేణుం - పిల్లనగ్రోవిని, గాయంతం - గానముచేయుచున్నవాఁడును, అచ్యుతం - నాశరహితుఁడైనవాఁడునైన శ్రీకృష్ణునిఁగూర్చి - వందే - నమస్కరించుచున్నాను.

ఉ॥ పావనయామునాంబు కణభావితశీతల వాతధూతబృం। దా
వనపాళిపుష్పిత కదంబకదంబకమూలకేళిరా। జీవనపీనపీఠిక వసించు
చు వేణువినోదనాదియౌ। నావనజాయతేక్షణు నహర్నిశ మెన్నెద
నిష్టసిద్ధికిన్॥ ౧౦౩

తా. బృందావనమందుఁజేరి కడిమిచెట్టు మొదలం గ్రీడసలుపుచుఁ దిన్నెగద్దియపైఁ గూర్చుండి వేణుగానముసేయుచుండెడు శ్రీకృష్ణునిం గూర్చి నమస్కరించెదననుట.

శ్లో॥ బాలం నీలామ్బుదాభం నవమణివిలసత్కింకిణీ జాలబద్ధ
శ్రోణీజఙ్ఘాన్తయుగ్మం విపులగురునఖ ప్రోల్లసత్కణ్ఠభూషమ్। ఫుల్లా
మ్భోజాభవక్త్రం హతశకట మరుత్పూత నాద్యం ప్రసన్నం గోవి
న్దంవన్దితేన్ద్రాద్యమరవరమజంపూజయేద్వాసరాదౌ ॥ ౧౦౧

టీక. నీలాంబుదాభం- నల్లనిమేఘముయొక్క కాంతివంటికాంతిగలిగినవాఁడును, నవమణివిలసత్కింకిణి జాలబద్ధశ్రోణీజంఘాంతయుగ్మం-నవ-తొమ్మిదివిధములైన, మణి- వజ్రాదిమణులచేత, విలసత్, ప్రకాశించుచున్న, కింకిణీ-చిఱుగంటలయొక్క, జాల - సమూహముచేత, బద్ధ-కూర్పఁబడిన, శ్రోణీజంఘాంతయుగ్మం - పిఱుదులయొక్కయుఁ పాదములయొక్కయు ద్వంద్వముగలవాఁడును, విపులగురునఖప్రోల్లసత్కంఠభూషమ్-మిక్కిలి ప్రకాశించుచున్న పులిగోరుకంఠభూషణముగాఁగలవాఁడును, ఫుల్లాంభోజాభవక్త్రం-వికసించినకమలముయొక్క కాంతివంటికాంతి గలముఖముఁగలిగిన వాఁడునుఁ హతశకటమరుత్పూతనాద్యం-నశింపజేయఁబడినతృణావర్తశకటాసురపూతనాదులుగలవాఁడును, ప్రసన్నం- నిర్మలుండైనవాఁడును, వందితేంద్రాద్యమరవరం - నమ్రులైనఇంద్రాదిదేవశ్రేష్ఠులుగలవాఁడును, అజం - ఉత్పత్తిరహితుఁడైనవాఁడునైన, బాలం - బాలుఁడైన, గోవిందం - శ్రీకృష్ణుని, వాసరాదౌ- ప్రాతఃకాలమందు, పూజయేత్ - పూజింపవలయును.

ఉ॥ బాలుఁబయోదనీలు సురపాలకవర్ణిత శీలుఘంటికా। లోలక
టీతటీపదతలుౕ హతచక్రసమీరశాంబరీ। జాలుఁబ్రఫుల్లపద్మ విలస
న్ముఖువ్యాఘ్రనఖాభిరాము గో। పాలుఁబ్రసన్ను నచ్యుతుఁ బ్రభాతస
మర్చితుఁ జేయఁగాఁదగుౕ॥ ౧౦౧

తా. నీలమేఘంబులుఁబోలు నైల్యచ్ఛాయందగి కటితట పాదంబులను గజ్జాలుమొదలగు తొమ్మిదిజతరత్నంబుల వెలిగెడి చిఱుగజ్జెగుమిచిందులాడవెడఁదయగు పులిగోటంజెలువొందు కంఠభూషణంబున మెఱసి వికసించిన నెత్తమ్మియనందగిమొహనమ్మోముగలిగిబండిరక్కసునిం దృణావర్తునిఁబూతనను మొదలగు రక్కసులంజిదిమి యింద్రాది సురసన్నుతుండై పుట్టువులేని శ్రీకృష్ణుని వేకువం బూజింపఁవలయుననుట.

శ్లో॥ వన్ద్యం దేవైర్ముకున్దం వికసితకురువిన్దాభ మిన్దీవరాక్షం గో
గోపీబృందవీతంజితరిపునిహంకుందమందారహాసమ్। నీలగ్రీవాగ్ర్యపి

పిఞ్ఛాకలనసువిలసత్కుంతలం భానుమన్తం దేవం పీతామ్బరాఢ్యం జయ
జయదినశో మధ్యమాహ్నే రమాయై॥ ౧౦౨

టీక. దేవైః- వేల్పులచేత, వంద్యం- కొనియాడఁదగినవాఁడును, వికసి
తకురువిందాభం- ప్రకాశింపుచున్న కెంపులయొక్క కాంతివంటికాంతిగలిగిన
వాఁడును, ఇందీవరాక్షం - నల్లకలువలవంటి నేత్రములుగలవాఁడును, గోగో
పీబృందవీతం - గో - గోవులయొక్కయు, గోపీ- గోపస్త్రీలయొక్కయు,
బృంద- సమూహములచేత, వీతం - చుట్టఁబడినవాఁడును, జితరిపునిచయం- జ
యింపఁబడ్డశత్రుసమూహముగలిగినవాఁడును, కుందమందారహాసం - కుంద-
మల్లెపువ్వులవంటియు, మందార-మందారపుష్పములవంటియు, హాసం-చిఱు
నగవుగలవాఁడును, నీలగ్రీవాగ్ర్యపింఛాకలనసువిలసత్కుంతలం - నీలగ్రీవ-
మయూరముయొక్క, అగ్ర్యపింఛ- శ్రేష్ఠమైనబర్హముయొక్క, ఆకలన-కట్టు
టచేత, సువిలసత్ - మిక్కిలి ప్రకాశించుచున్న, కుంతలం - కుఱులుగలవాఁడు
ను, భానుమంతం- సకలాభరణభూషితాంగుఁడైనవాఁడును, పీతాంబరాఢ్యం
కనకాంబరముచేతఁ బ్రకాశించుచున్నవాఁడునునగు, ముకుందదేవం - శ్రీకృ
ష్ణదేవుని, దినశః - ప్రతిదినమందును, మధ్యమాహ్నే- మధ్యాహ్నకాలమం
దు, రమాయై-సంపదకొఱకు, జయజయ-పూజింపుము పూజింపుము.

మ॥ కురువిందప్రతిమానమోహనతనున్ గోగోపికాసంవృతున్
స్మరసంమోహమునిందిరావందితు ముకుందుం గుందమందారసుం। దర
మందస్మితుఁ బింఛభూషణు రిపుధ్వంసిన్ సుపీతాంబరున్ । సరసీజా
క్షుని మధ్యమాహ్నమునఁ బూజల్సేసి శ్రీలొందెదన్ ॥ ౧౦౨

తా॥ వేల్పులచేతం గొనియాడందగి ప్రకాశించుచున్న కెంపులజిగిం
బోలెడు నెమ్మేనిచాయగలిగి కలువలనందగియెడు కన్నుగవం దేజరిల్లి గోవు
లును గోపికలును దనచుట్టునుం జేరి సేవించుచుండ శత్రుసమూహంబుల హ
గరడఁచి మల్లపూలవలెను మందారపువ్వులవలెనుం జెల్లునై చిఱునవ్వుగలి
గి నెమ్మిపురింగట్టిన నెఱికురులం బ్రకాశించి సకలభూషణభూషితుండై సువ
ర్ణవస్త్రముగలిగిన శ్రీకృష్ణదేవునిఁ బ్రతిదినమును మధ్యాహ్నకాలంబున సం
పదకొఱకుఁ బూజింపుమనుట.

శ్లో॥ చక్రాన్తస్యాస్త్రవైరి ప్రజవజిత మహాస్త్రాపనీభారమూర్త్యై

రావీతం నారదాద్యైర్మునిభిరభినుతంతత్త్వనిర్ణీతహేతోః। సాయాహ్నేనిర్మలాఙ్గంనిరుపమరుచిరంచిన్తయేన్నీలభాసంమన్త్రీవిశ్వోదయస్థిత్యపహరణపదంముక్తిదం వాసుదేవమ్॥

టీక. మంత్రీ- గోపాలమంత్రజపశీలుఁడు, చక్రాంతధ్వస్తవైరివ్రజం- చక్రాంత - సుదర్శనాగ్రముచేత, ధ్వస్త- ధ్వంసముచేయఁబడిన, వైరివ్రజం శత్రువులయొక్క- సమూహము గలవాఁడగుటచే, అజితం - శత్రువులచేత జయింపనశక్యుఁడయినవాఁడును, అపాస్తావనిభారం అపాస్త- పోఁగొట్టబడిన, అవనీభారం - భూభారముగలవాఁడును, ఆద్యైః-బ్రహ్మాదులచేత, ఆవీతం- పరివేష్టింపఁబడినవాఁడును, నారదాద్యైః-నారదుఁడుమొదలయిన-మునిభిః- మునులచేత, తత్త్వనిర్ణీతహేతోః-తత్త్వముయొక్క-నిర్ణయహేతువువలన, అభినుతం - స్తోత్రముచేయఁబడుచున్నవాఁడును, నిరుపమరుచిరం- సరిలేనియట్లు ప్రకాశించుచున్నవాఁడును, నీలభాసం - ఇంద్రనీలవర్ణుఁడైనవాఁడును, విశ్వోదయస్థిత్యపహరణపదం- విశ్వ- జగత్తుయొక్క, ఉదయ-ఉత్పత్తికిని, స్థితి-ఉనికికిని, అపహరణ- లయమునకును, పదం - కారణుఁడైనవాఁడును, ముక్తిదం - మోక్షప్రదాయకుఁడైనవాఁడును, వాసుదేవం - వసుదేవకుమారుఁడునైనశ్రీకృష్ణుని, సాయాహ్నే- సాయంకాలమందు. చింతయేత్-ధ్యానము చేయవలయును.

మ॥ క్షితిభారాపహు నారదాదిమునిరాజీసేవ్యువిశ్వోదయ। స్థితిసంహారవిశారదున్నిరుపమశ్రీనిర్మలాంగుఁ గసము। న్నతచక్రాయుధఖండితారిజనజితున్సాయంబునన్గోల్వసం। తతవిజ్ఞానముఘుక్తిముక్తుల మరుందన్మంత్రసంసిద్ధిచేఁ॥

తా. సుదర్శనాగ్రముచేత సకలశత్రులసమయఁజేసినవాఁడుగావున నెవ్వారిచేతనుజయింపనలవిగాక భూభారఁబుడిపి బ్రహ్మాదులచేనావరింపంబడి నారదాదిమునులకుఁబరతత్త్వంబిట్టిదియని తెలుపుచు వారిచే నుతింపఁబడుచుసరిలేనిసొగసుగలిగి యింద్రనీలంబులఁబోలు మేనిచాయలం దేజరిల్లి యెల్లజగంబులం బుట్టింపను రక్షింపను లయంబునొందింపను దానకారణంబై మోక్షప్రదాయకుఁడైవసుదేవునకుమరుఁడైన శ్రీకృష్ణుని గోపాలమంత్రజపశీలుఁడైన పురుషుఁడుసాయంకాలమందుధ్యానముసేయవలయుననుట.

తిః- ఏప్రీతిగలిగెనో, కుంత్యర్పితే- కుంతీదేవిచేతసమర్పితంబైనయన్నంబునం దు, యాప్రీతిః - ఏప్రీతిగలిగెనో, గోవర్ధనమూర్ధ్ని - గోవర్ధనపర్వతశిఖ రంబున, యా - ఏప్రీతిగలిగెనో, పృథుకే - అటుకులయందు, యాచ- ఏప్రీ తియో, యశోదార్పితే - యశోదాదేవిచేతనివ్వఁబడిన, స్తన్యే- చనుబాలయం దు, యాచ- ఏప్రీతిగలిగెనో, భారద్వాజసమర్పితే - భారద్వాజమహర్షిచే తనివ్వఁబడినయాహారమందును, శబరికాదత్తే- శబరిచేతనివ్వఁబడినఫలాదుల యందును, యోషితాం-గోపస్త్రీలయొక్క, అధరే-మోవియందును, మునిప త్నీభక్తిరచితేపి - మునిపత్నులచేతభక్తితోసమర్పింపఁబడినయన్నాదులయం దును, యాప్రీతిః- ఏప్రీతిగలిగెనో, అత్రాపి-ఈకర్ణామృతమందును, తాంతాం- ఆయాప్రీతిని, కురు చేయుము.

మ॥ శ్రీయశోదావన్యమురాధికాధరముభారద్వాజువిందుఃకాముని ।
ప్రియదాభక్తయు మాతృదత్తకుచధారల్ విప్రముంగొంగుభ । త్య్య
ముగోవర్ధనపూజయుక్ విదురున్నృష్టాన్నంబుకుంతీసప । ర్యమదింగ్రా
సౌనునట్లునాకవిత్తఁ గృష్ణాప్రీతిఁ జేకోగదే॥ ౧౦౬
వినతి

తా. శ్రీలీలాశుక కవీశ్వరుండింత పర్యంతము భగవంతునియొక్క నానావిధ స్వరూపంబులను మంత్రాధిష్ఠానస్వరూపంబులనుభక్తిపారవశ్యం బునస్తుతించియిప్పుడు తానుబూర్వోక్తవిధంబుగాఁజేసిన స్తోత్రరూపంబైనకర్ణా మృతమును నీవుప్రబంధంబునుప్రీతితోడనంగీకరింపవలయునని భగవంతునివేఁడు చున్నాఁడు - ఓయికృష్ణదేవా ఈయవతారమందు విదురుఁడునీకుఁ జేసిన విందునందును నాకాలమందకుంతిచేసిన విందునందును నీబోధనచేనిగోపా లకులు గోవర్ధనంబునకుఁ బూజచేసిపర్వతదేవతారూపుండవైన నీకుదానిశి ఖరంబున నిడినయన్నంబునందును కుచేలుముని తెచ్చి ఇచ్చినయటుకులయం దును యశోద చంటిపాలయందును రామావతారమందు భరద్వాజముని యిచ్చినకందమూలాదుల యందును శబరియిచ్చిన ఫలములయందును నీయ వతారములచేఁ బ్రేమనొంది పరవశులైన వేంతలయధరరసమందును యాగమందు మునిపత్నులుభక్తితోడనిచ్చిన పాయసాదులయందును నీకెట్టిసంతోషంబుగలి గెనో యట్టిసంతోషంబు నాచేతరచించి సమర్పింపఁబడినయీకర్ణామృత ప్ర బంధమందును నీకుఁగలిగి నీవినంగీ కరించినన్ను రక్షింపవలయుననుట.

క॥ వనజాక్షుండగు కర్ణామృత । మునుజదివిన వ్రాయవినినఁ బురుషులకును గో। ధనకనకవస్తువాహన । తనయాదిసమృద్ధి శాశ్వతంబు నొసంగున్॥

మాలినీ వృత్తము.

జలరుహదళనేత్రా సర్వరాడ్వైరిపత్రా । ఖలజనఘనవాతా కంజసంజాతతాతా। సలలితగుణభూషా సత్యనిత్యైకభాషా । విలసితసితహాసా వేంకటాహార్యవాసా॥

మ॥ ఇదికృష్ణాశ్రయ యోగపుంగవ కృపావీక్షా త్తసారస్వతా । భ్యుదయశ్రీవిభవ ప్రసిద్ధచిదచిద్భోధుక
మాశాంతస। త్యదయాభూష ణవెల్లపూ
డిమణి పెద్దామాత్య వెంగాగ్రణీ ।
గదితాశ్వాసము వొల్చుమూఁ
డవదిన్మైకర్ణామృత
శ్రీకృతిన్.

శ్రీ కృ ష్ణ క ర్ణా మృ త ము.

స ర్వ ం బు ను.

తృ తీ యా శ్వా స ము.

స ం పూ ర్ణ ము.





శ్రీ

# అల్లాడి * వీరాస్వామి శాస్త్రి అండు సన్సు.
# నె 10 * కొల్లావారి అగ్రహారము.
# చాకలపేటపోస్టు * మదరాసు.

## అష్టోత్తర శత సహస్ర నామ కదంబము

దీనియందు విష్ణుసహస్రనామము, కృష్ణాష్టోత్తరము. రామసహస్రనామము, రామాష్టోత్రము, ఆంజనేయ సహస్రనామము ఆంజనేయాష్టోత్తరము. శివసహస్రనామము, శివాష్టోత్తరము, గణపతిసహస్రనామము, గణపత్యష్టోత్తరము, సుబ్రహ్మణ్యసహస్రనామము, సుబ్రహ్మణ్యాష్టోత్తరము, శ్రీకాళహస్తీశ్వరాష్టోత్తరము, రుద్రకవచము, లలితాసహస్రనామము, లలితాష్టోత్తరము లలితాత్రిశతి, దేవీఖడ్గమాల, ఉమాష్టోత్తరము, లక్ష్మీసహస్రనామము, లక్ష్మ్యష్టోత్తరము, అన్నపూర్ణ సహస్రనామము, అన్నపూర్ణాష్టోత్తరము, మరికొన్ని విషయములను చేర్చి, వీటి మూలమును, నామావళులతో తప్పులులేక సుస్పష్టముగా కొత్తాయ బైండు చేసినది.

| | |
|---|---|
| రేషుకాగితములు | ౦ ౧౨ ౦ |
| డెమీ సైజు | ౧ ౦ ౦ |
| త్రిశతిభాష్యము. | ౧ ౦ ౦ |

## విష్ణుసహస్రనామము సాంధ్ర తాత్పర్యము.

దీనియందు, పారాయణమునకు మూలము, ప్రతినామావళికిన్ని అర్థము ఫలశ్రుతికి తాత్పర్యము. పూజకు నుపయోగమగు నటుల నామావళి.

| | |
|---|---|
| చిన్నసైజుది | ౦ ౮ |
| విష్ణుసహస్రనామము | ౦ ౨ |

## నవగ్రహస్తోత్రము.

దీనియందు, ప్రతిగ్రహముయొక్క చక్రము బింబము, మంత్రము, స్తోత్రాష్టోత్తర శ్లోక నామావళి, మంగళాష్టకాదిస్తుతి వీనితో గూడినవి.

| | |
|---|---|
| | ౦ ౮ |
| మాఘపురాణము | ౦ ౬ |
| వ్రతచూడామణి | ౧ ౦ |
| శ్రావణ వ్రతములు | ౦ ౮ |
| మహాన్యాసము | ౦ ౩ |
| పంచోపనిషత్తు | ౦ ౮ |
| శరన్నవరాత్రపూజాకల్పం | ౦ ౮ |
| మంత్రపుష్పము టీక | ౦ ౧ |
| పురుషసూక్తము టీక | ౦ ౧ |
| పురశ్చరణదీపిక | ౦ ౪ |